దేశీ ప్రచురణ

ప్రథమముద్రణ ఫిబ్రివరి 47 వెల: రెండున్నర రూపాయలు.

కిసాన్ ప్రెస్, బెజవాడ.

1947

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ



"భారత దేశంలో సోషలిజాన్ని అర్ధంచేసుకున్న,
భాష్యంచెప్పగల ఒకే ఒక వ్యక్తి, జయప్రకాశ్"

— గాంధీజీ

# ముందుమాట

నేడు భారతదేశంలో వేళ్లమీద లెక్కించగల నాయకులలో శ్రీ జయప్రకాశనారాయణ్ ఒకడు. అంతేకాదు భారతకాంగ్రెసు సోషలిస్టుపార్టీ నిర్మాతకూడాను. అందుచేత అతనిభావాలు తెలుసుకోవాలన్న జిజ్ఞాస, అతనిపార్టీ కార్యక్రమము తెలుసుకోవాలన్న కుతూహలం ప్రజల్లో సహజంగా వుంటుంది. వాటిని నివారించా లన్న ప్రయత్నమే ఈపుస్తకము.

నేను వీటిని సంకలనం చేసిన మొదట్లో శ్రీ జయప్రకాశ్ నారాయణగారు డిటెన్షనులో వున్నారు. అందుచేత విభజించటం లోనూ, అధ్యాయాలుగా ఎన్నుకోవడంలోనూ లోపాలేమైనావుంటే అవన్నీ నావి.

ఈపుస్తకము '42 ఆగస్టు విప్లవ' నాలుగవ వార్షికోత్సవ పవిత్రసమయాన ప్రచురించబడ్డది. ఈ పుస్తకము మన రాజకీయ సాహిత్యంలో అమూల్యస్థానం వహిస్తుందని భావిస్తున్నాను.

'ఆగస్టు' 46.
బొంబాయి.

ఇట్లు.
యూసఫ్ మెహరాలీ.

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | స్వాతంత్ర్యయోధులకు మొదటిలేఖ | 7 |
| 2. | స్వాతంత్రయోధులకు రెండవలేఖ | 17 |
| 3. | స్వాతంత్రయోధులకు మూడవలేఖ | 47 |
| 4. | భారతదేశంలో అమెరికన్ సోల్జర్లకు నాలుగవలేఖ | 69 |
| 5. | సోషలిజం-ఎందుకు? | 80 |
| 6. | భారతదేశం సోషలిజం | 94 |
| 7. | భారతదేశం-సామ్యవాదం | 107 |
| 8. | భారతదేశంలో సోషలిస్టు ఐక్యతాప్రయత్నాలు | 161 |
| 9. | వ్యాసాలు ప్రకటనలు | |


# వినతి

ఒక్క 'సోషలిజం' అన్న భాగం తప్ప ఇందులో ఏభాగాన్ని పుస్తకంగా వ్రాయలేదు. శ్రీ జయప్రకాశనారాయణ్ గారు యిచ్చిన ఉపన్యాసాలు వ్రాసిన లేఖలు చేసిన ప్రకటనల సంకలనమే ఈపుస్తక స్వరూపం.

ఇది తెలుగులోకానికి అందించాలనే కుతూహలంతో అనువాదానికి అనుమతి అడిగినంతనే అంగీకరించిన శ్రీ జయప్రకాశనారాయణ గారికీ, Padma Publications వారికీ ధన్యవాదాలు.

162 పేజీ తర్వాత పొరపాటున 149 పడింది. కాని విషయం మాత్రం సరిగానేవుంది. పాఠకులు సరిచేసుకొన ప్రార్థన.

ఇట్లు,

ప్రకాశకుడు.

•

# 1

# 1942 విప్లవం

[ శ్రీ జయప్రకాష్ నారాయణ్ 1942 అక్టోబరులో హజారిబాగ్ సెంట్రల్‌జైలునుంచి తప్పించుకుని పారిపోయి దేశమంతా సంచారము చేశాడు. పరిస్థితులు చక్కగా అవగాహన చేసుకుని 1943 ఆరంభంలో స్వాతంత్ర్య యోధులకు ఈ లేఖ అందజేశాడు. ]

మిత్రులారా ।

## విప్లవాభివందనాలు

మీకు, యుద్ధఖైదీలుగా పట్టుబడిన మన మిత్రులకు నా హృదయపూర్వకాభివందనాలు! శత్రువును అమోఘంగా ఎదుర్కొన్నారు మీరంతా. కష్టాలతో నిండియున్న ఈ మన విశాలదేశంలో ఇంతగొప్ప సంఘటనము ఇదివరకెన్నడూ జరుగలేదు, ఇక ముందు జరుగగలదన్న ఆశ లేదు. అది నిజంగా ఒక బహిరంగమైన తిరుగుబాటు. అప్రతిమానుడు మన నాయకుడు మహాత్మ గాంధి దాన్ని లేవదీశాడు.

ఈ తిరుగుబాటు ప్రస్తుతం తాత్కాలికంగా అణచివేయబడినదివలె కనిపిస్తుంది. కాని తాత్కాలికంగానే. అందులో ఆశ్చర్యమేమీ లేదు. నిజానికి మన మొదటి దూకుడే విజయవంతంగా పర్యవసించి, సామ్రాజ్యతత్వాన్ని పూర్తిగా అణచివేసియున్నట్టయితే — అదే ఆశ్చర్యకరమనిపించేది. ఈ తిరుగుబాటు తన అధికారాన్ని కొంచెంలో నాశనం చేసివేసేదే అని శత్రువే అంగీకరిస్తున్నాడంటే మన జాతీయ విప్లవపు మొదటి జ్వాలికయే ఎంత విజయోపేతంగా ప్రజ్వలించిందో తెలియగలదు.

ఈ మొదటిజ్వాలిక ఎలా ఆర్పివేయబడ్డది? శత్రువుయొక్క మిలటరీ బలం, గూండాచర్యలు, విషవాయువులు, హత్యాకాండ ఆపని చేశాయా? ఊహూ, కాదు. తిరుగుబాటు అణచివేయబడినదని భావించుట తప్పు. విప్లవమనేది ఒక సంఘటన మాత్రమే కాదు అని ప్రపంచంలోని విప్లవాల చరిత్ర చెబుతోంది. అదొక సాంఘిక పరిణామం. విప్లవ పరిణామ దశలలో ఆటుపోటులు సహజంగా ఉంటాయి. ప్రస్తుతం మన విప్లవం అంత ఉరవడిగా ప్రవహించలేదు, ఎత్తుగా కెరటాలు లేవలేదు. విజయంవెంట విజయం చూరగొనలేకపోయాం. అందుకు కారణం సామ్రాజ్యవాదులకు మనకన్నా అధికమైన బాహుబలం ఉండటంచేత కాదు, మరొకందువల్లనంటే — ముఖ్యంగా రెండు కారణాలున్నాయి:

ఒకటి: జాతీయ విప్లవశక్తులు సక్రమంగా సమీకృతం కాలేదు. అందుచేత ఉత్పన్నమైన విప్లవశక్తులను సరిగ్గా నాయకత్వం చేయలేకపోయింది. అవి స్వతంత్రంగా పని చేయలేకపోయాయి. కాంగ్రెస్ ఒక బలిష్ఠమైనసంస్థే అయినా విప్లవం [illegible] గొప్పగా ముందుకు సాగినప్పటికీ [illegible] కొందరు కాంగ్రెస్ నాయకులు ఊహించియుండలేదు. అందుచేతకూడా విప్లవశక్తి సమీకరణము జరుగలేదు. తీరా ఈ తిరుగుబాటు తీవ్రతరమౌతూఉంటే "అది కాంగ్రెస్ కార్యక్రమానికి ఎంతవరకు అనుగుణ్యంగా ఉన్నది?" అన్న చర్చ వచ్చిందేగాని చాలమంది పలుకుబడిగల కాంగ్రెస్ పెద్దలు "ఇది అంతిమ స్వాతంత్ర్య సమరం" అని నిర్ణయించుకోలేకపోయారు. మహాత్మా గాంధి, డాక్టర్ రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయ్ పటేల్ వంటి ధీరోదాత్తులలో ప్రజ్వలించిన ఆ పట్టుదల, ఆవేశం, దీక్ష అందరు కాంగ్రెస్ వాదులలో ప్రతిబింబించలేదు.

రెండు: విప్లవపు మొదటి ఉధృతం ముగియగానే ప్రబలమైన ఒక కార్యక్రమమేమీ లేదు. తమ తమ ప్రాంతాల్లో బ్రిటిష్‌రాజ్యాన్ని పూర్తిగా నిర్మూలించారు; అంతటితో తమపని ముగిసినట్లుగా ప్రజలు భావించారు

త్రోసివెయ్యాలి; ఆర్జించిన విజయానికి సంతోషపడాలి; ఇంకా ముమ్ముందు అధిక విజయం ఆర్జించగలమని ఆశావహులమై ఉండాలి.

విప్లవస్వరూపాన్ని సర్వదా మనదృక్పథంలో ఉంచుకోవాలి. అది మన అంతిమ స్వాతంత్ర్యసమరం. విజయమే మనలక్ష్యం. అంతకు తక్కువ మనకేమీ అక్కర్లేదు. రాజగోపాలాచారివంటి పెద్దలు జాతీయ ప్రభుత్వ స్థాపనకోసం చేస్తూన్న ప్రయత్నాలు ప్రయోజనకరములు కావు; పైగా అపాయకరములు కూడాను; అసలుసమస్యలనించి ప్రజల మనస్సును త్రిప్పివేస్తాయి. 'క్విట్ ఇండియా' నినాదానికి 'జాతీయప్రభుత్వం రావాలి' అన్న నినాదానికీ సంబంధమేలేదు. కాంగ్రెసు-లీగ్ ఐక్యత కావాలి అని కేకలు వేస్తూన్నవారంతా సామ్రాజ్యవాద ప్రచారానికే ఉపయోగపడుతున్నారు. జాతీయ ప్రభుత్వ స్థాపనకు ఆటంకమౌతున్నది ఐక్యత లేకపోవటం కాదు; సామ్రాజ్యవాదులు అధికారం వొదులుకోటానికి ఇష్టపడకపోవటమే. ఆ సంగతే చర్చిల్ విడమరిచి చెప్పలేదూ? "బ్రిటిష్ సామ్రాజ్యవిచ్ఛిత్తికోసంగాను నేను రాజుగారి ప్రధానమంత్రిని కాలేదు" అన్నాడుగా! సామ్రాజ్యాలు వాటంతట అవే విచ్ఛిన్నపోతాయని అనుకోటం. అవివేకంమై.

ప్రస్తుతం మనకు కావలసింది వివిధ ప్రముఖభారత వర్గాలసంఘీభావం కాదు; జాతీయ విప్లవశక్తుల సమైక్యత కావాలి. అవన్నీ ఈ వరకే కాంగ్రెస్ జండాక్రింద ఐక్యమైనాయి. కాంగ్రెస్-లీగుల ఐక్యత ఈ శక్తుల అభివృద్ధికి దోహదం కాజాలదు; లీగు స్వాతంత్ర్య మార్గాన్ని, విప్లవపంథాను అనుసరించదు, మనకు తెలిసిన విషయమే

సంపూర్ణంగా సామ్రాజ్యవాదాన్ని ఓడించటం- అదీ మన లక్ష్యం. ఆలక్ష్యాన్ని సర్వదామనం గుర్తించాలి. అందును గురించి వివాదమేమీలేదు. గెలుస్తేగెలుస్తాం, ఓడిపోతే ఓడిపోతాం. కాని ఓడిపోము మనం. ఎందువల్లనంటే- విజయంకోసం అవిరామంగా కృషిచేయటానికి నిశ్చయించుకున్నాం. అదీగాక ప్రపంచ శక్తులన్నీ సామ్రాజ్య-ఫాసిస్టు తత్వాలు నశించి పోయేట్టు

ముందుకు వస్తున్నాయి. శాంతి సమావేశాల తాత్కాలిక నిర్ణయాలే యుద్ధానంతర ప్రపంచ వ్యవస్థను నిర్మించి వేయగలదని మీరు నమ్మకండి. యుద్ధం అనేది ఇత్తడిని బంగారు చేసే ఒక ఐంద్రజాలికుడు. దానిలో కొన్ని రహస్య శక్తులు, సామర్థ్యాలు అంతర్గర్భితమై ఉంటాయి అవి ఓడిన వారినీ, గెల్చిన వారినీ, కూడా తారుమారు చేస్తాయి. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం రష్యా - జర్మనీ - ఆస్ట్రియా - ఆట్టోమన్ - ఆశియా యూరప్ ఖండాలలోని ఈ నాలుగు సామ్రాజ్యాలూ మట్టిపాలు కావలెనని ఏ శాంతి సమావేశమూ నిశ్చయించినది కాదు. లాయడ్ జార్జి గాని, క్లెమన్సో గాని విల్సన్ గాని ఎవరూ కూడా రష్యా - జర్మనీ - టర్కీ దేశాలలో విప్లవాలను ఆజ్ఞాపించి యుండలేదు.

ప్రపంచమంతటా... ప్రజలు యుద్ధాలు చేసి, చస్తూ, అవస్థలు పడుతోన్న అన్నిచోట్లా, నేను పైన సూచించిన ఐంద్రజాలికుడు పని చేస్తూనే ఉన్నాడు. ఇండియాలోనూ చేస్తున్నాడు; అప్పుడే ఒక సామూహిక ఉగ్రతల లేవదీశాడు ఈ సంగ్రామం ముగిసిన తరువాత కూడా చర్చిల్ - రూజ్వెల్టు - హిట్లర్ - టోజో - వీరు కాదు యుద్ధానంతర వ్యవస్థను నిర్ణయించేది. మనం ప్రదర్శిస్తున్న శక్తులాంటివే చారిత్రక కృత్యాన్ని నిర్వహిస్తుంది. అన్నిచోట్లా విప్లవ శక్తులు సంచలిస్తున్నాయి; అందులో ఈ లేశమాత్రమూ సందేహం లేదు, ఇలాగ లక్షలాది ప్రజల భవిష్యత్తును గురించి ఆలోచించుకోకుండానే నుడువరాని ఇన్ని బాధలు అవస్థలు అనుభవిస్తున్నారా? లక్షలాది ప్రజలు తమ పాలకులు చెబుతున్న అబద్ధాలే నమ్మి సంతృప్తులై ఉన్నారా? ఊహూం.

కనుక సంపూర్ణ విజయమే లక్ష్యంగా పెట్టుకుని మనం ముందుకు సాగిపోవాలి. మనం ముఖ్యంగా చేయవలసిన దేమిటి? యుద్ధం ఓడిపోయినప్పుడు గాని, గెల్చినప్పుడు గాని సేనాపతి ఏమి చేస్తాడు? సైనికులను సమీకరించుకుని మరో యుద్ధానికి ఉద్యుక్తుడౌతాడు. ఎల్ అలామిన్ వద్ద గొప్ప విజయం సంపాదించి రోమెల్ అక్కడ ఆగినాడు - సమీకరించుకుని సిద్ధం కావ

టానికి, అలెగ్జాండరుకూడా బాగా సిద్ధపడి ఓటమినికూడా విజయంగా మార్చుకోగలిగినాడు. మనది అసలు ఓటమికానే కాదు. తిరుగుబాటు మొదటి భాగంలో మనం నిజంగా గెల్చాం; దేశంలోని విశాలప్రాంతాలలో బ్రిటిష్ నిరంకుశదారుని సివిల్ పరిపాలనమును పూర్తిగా నిర్మూలించాం. ఈ పోలీసు దళం, ఈ మెజస్ట్రేటులూ, ఈ 'లా కోర్టు'లూ ఈజైళ్లు బ్రిటిష్ రాజ్యమునే పేరుతో వ్యవహృతమాతూన్న ఈ సమస్తమూ వట్టి పేకతో గట్టిన మేడవలె ప్రజాబలంముందు ఒరిగిపోతుందని ప్రజలు అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు. ఈ నేర్చుకున్నది వారు మరచిపోరు; ఇది మరొక ఉద్యమానికి ప్రోత్సాహకరము కాగలదు.

ప్రస్తుతము మనం చేయవలసిన మూడవ ముఖ్యమైన కార్యము: మరొక సారి ఘాటుగా దెబ్బతీయటానికి అయత్తులము కావాలి. సమీకరణము, క్రమశిక్షణ – ఇవీ ప్రస్తుతం మనకు కావలసినవి.

మరొక ఘాటైనదెబ్బ! ఎప్పుడు కొడదామని? అయిదారు సంవత్సరాలదాకా మళ్లీ ప్రజలు లేవరని కొందరు అభిప్రాయపడుతున్నారు. శాంతి పరిస్థితులలో అభిప్రాయం నిజమే కావచ్చు కాని ప్రపంచం యుద్ధంమూలాన ఛిన్నాభిన్నమైపోయింది; ఏవేవో మార్పులు త్వరత్వరగా వస్తున్నాయి; ఇటువంటప్పుడుకూడా ఆమాట వర్తించదు. బ్రిటిష్ ఫాసిస్టుల అనాగరిక క్రూరకృత్యాలు – లిన్‌లిత్‌గోలు, హాలెట్‌లు, స్టూవార్టులు, ఇంకా అలాంటి వాళ్లే లక్షలమంది, భారతీయులై వుండి వారికి తాబేదార్లుగా వ్యవహరిస్తోన్న నీచులు – ప్రజల్ని ప్రస్తుతం అణచిపెట్టివుంచారు; అంతేగాని అంతమాత్రాన ప్రజలా నిరంకుశపాలకులకు మిత్రులుగా మారిపోలేదు. బ్రిటిష్‌వారి జాతీ నరకం వికటాట్టహాసం చేస్తూన్న పల్లెప్రాంతాలలో ప్రజలహృదయాలు నిండు అసంతృప్తిని, కోపాన్ని ప్రదర్శిస్తున్నవి: కక్షతీర్చుకోవాలన్న ఉత్కంఠతో ఉన్నవి. ఇప్పుడు ప్రజలకు తెలియవలసిందల్లా: మళ్లీ దాడికి బ్రహ్మాండమైన సన్నాహాలు జరుగుతున్నాయని మాత్రమే. దానితో వారికి తిరిగి ధైర్యం వచ్చేస్తుంది చురుగ్గా, అందరూ కలిసి, క్రమశిక్షణతో మళ్లీ

దాడికి సిద్ధమై మన ప్లానులు, పన్నాగాలు అనుసరిస్తారు. మరొకదానికి పరిస్థితులు సుముఖంగా ఉన్నాయన్నమాటే. అంతర్జాతీయ రాజకీయ పరిణామాలు మనకుసాయపడవచ్చు. ఇక పోతే గాంధీజీ ఆమరణ ఉపవాసదీక్ష ఎప్పుడు పూననున్నాడో తెలియదు. కాని అదిఅనుక్షణమూ మనకుజ్ఞాపకం చేస్తున్నది: 'వెనుకంజవేయకండి, తటపటాయించకండి, ఆగిపోకండి' అని.

మళ్లీ దాడి సాగించటంతో...విప్లవంలోని నిర్మాణ కార్యక్రమం కూడా – అంటే విప్లవ ప్రభుత్వ కేంద్రాలను నెలకొల్పటంకూడా జరుగవలసి ఉంది. అలా నెలకొల్పటంలో సాయుధ దళాలను ఉపయోగించవలసి వుంటుంది, హింసావిధానంకూడా అవలంబించవలసివుంటుంది. ఈవిషయం మన విప్లవభవిష్యత్తుకు సంబంధించినది. మన విప్లవభవిష్యత్తు చాలవరకు దానిపైఆధారపడివున్నది. కనుక అందునుగూర్చి నాయభిప్రాయం వివరిస్తాను.

ఈ విప్లవ సందర్భంలో మనం హింసాత్మకంగా ప్రవర్తించామని బ్రిటిష్ అధికారులు గోలపెడుతున్నారు. వాళ్లు మన కోపాన్ని అంతగా రెచ్చగొట్టినప్పుడు కొంతవరకు హింసాత్మకంగా ప్రవర్తించాం; నిజమే. కాని ఆ చేసిన హింస...వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ మనం ప్రదర్శించిన అపార అహింసా నిష్ఠలో సహస్రాంశము మాత్రమే వేలకొలది బ్రిటిష్‌వారు, వారి భారత తాబేదార్లూ కొన్నిరోజులవరకూ ప్రజల చేతుల్లో ఉన్నారు. ప్రజలు వారిని ఏమిచేసినా చేసియుండవచ్చు. కాని వారు శత్రువులయెడ దయతో ప్రవర్తించారు; వారి ప్రాణాలకు, ఆస్తులకు అపాయం కలుగనీయ లేదు. చిన్నలు, పెద్దలు, వేలమంది ప్రజలు శత్రువుల తుపాకిగుండ్లకు గుండె లిచ్చి, చేతుల్లో విప్లవ పతాకం పుచ్చుకుని, 'ఇన్‌క్విలాబ్ జిందాబాద్' అని అరుస్తూ ధైర్యంగా ముందుకు తోసుకుపోయారు. వారి అనన్య ధైర్యసాహసాలను బ్రిటిష్‌వారు ప్రశంసిస్తున్నారా?

ఏమైనాగానీ, హింసాకాండలోనే మునిగితేలుతూ, హింసావిధానం మీదే ఆధారపడివుండి, రోజూ అనేకరకాల హింసాకృత్యాలను చేస్తూ,

చెయ్యండని ఆజ్ఞాపించి, ఆ తరువాత 'వద్దు, వద్దు; ఆయుధాలు క్రింద బెట్టేసి బ్రిటిష్‌వారి తుపాకిగుండ్లకు కవచాలులేని గుండెలు ఒప్పజెప్పండి' అని సలహా యివ్వటం ఏమంత సమంజసంగా ఉంటుంది?

ధైర్యవంతులైన వారి అహింసాతత్వం చాలా మందికలసి సమిష్టిగా ఆచరణలో పెట్టగలిగితే హింసావిధానాలు అవలంభించవలసిన అవసరం ఉండదు అనేమాట నేనూ ఒప్పుకుంటాను. అటువంటి అహింసాతత్వంలేనినాడు, శాస్త్రసూత్రాల ముసుగులో పిరికితనం బయలుదేరి విప్లవాభివృద్ధికి ఆటంకమై, అవిప్లవాన్ని విఫలం చేయటం నేను ఒప్పుకోను.

కనుక విప్లవం యొక్క అంతిమ సంరంభాన్ని మన దృష్టిపథంలో ఉంచుకుని మనంసర్వశక్తులనూ సమీకరించుకోవాలి; ఆయత్తపడాలి; తర్ఫీదు పొందాలి. క్రమశిక్షణ అలవరచుకోవాలి. మనం ఏమి చేస్తున్నా సరే... కేవలం ఒకవ్యాసంగం మాత్రమే నిర్వహిస్తున్నా మనుకోరాదు. సాంకేతిక (టెక్నికల్) కార్యక్రమంతోపాటు మనం ప్రజల్లో కావలసినంత ప్రచారం చేయవలసి ఉన్నది. గ్రామరైతులలో, ఫ్యాక్టరీ కార్మికులలో, రైల్వేపని వాళ్లలో గనుల కూలీలలో ఎంతో ప్రచారం చేయ్యాలి; ప్రస్తుతపు ఇబ్బందులలో వారికి సాయపడాలి; వారందరినీ చేరదీయాలి; తమతమ హక్కుల కోసం పోరాడగల సామర్థ్యం చేకూర్చిపెట్టాలి; మన వివిధ కార్యక్రమాలను నిర్వహించగల యోధులను వారిలోనించి ఎన్నుకుని సాంకేతిక రాజకీయ పరిజ్ఞానం వారికి ప్రసాదించి తర్ఫీదు చెయ్యాలి. మంచి తర్ఫీదు పొందినవారు కొద్దిమందియైనా విజయంలభిస్తుంది. ప్రతిపల్లెలో, ప్రతితాలూకాలో ప్రతి ఫ్యాక్టరీలో, ప్రతి కార్ఖానాలో, ప్రతిపారిశ్రామికకేంద్రంలో శారీరకమానసిక వికాసంగల యోధులను మనం సంపాదించాలి. రాబోయె విప్లవవ్యతి కొరకు.

ఇక భారత సైనికులలోనూ, ఉద్యోగులలోనూ మనం చెయ్యవలసిన పనికూడా ఉంది. ఆందోళన లేవదీయాలి; [illegible] నిర్మించాలి. స్కూళ్లలో, కాలేజీలలో కూడా చాల పనిఉంది. సరిహద్దుప్రాంతాలలోనూ, స్వదేశసంస్థానాలలోనుకూడా కొంత కార్యక్రమం [illegible]

ఇక్కడ ఇదమిద్ధంగా, సమగ్రంగా నిర్వచించటం సాధ్యం కాదు. ఇంతకూ నేను చెప్పదలచిన దేమంటే - ప్రతివ్యక్తీ పూనుకుని నిర్వహించవలసిన పనులు చాలా ఉన్నాయి. చాలవరకు నిర్వహిస్తున్నామనుకోండి; అయినా ఇంకా నిర్వహించవలసినది చాల ఉంది.

అదంతా యువకులే కాకపోతే మరెవరు నిర్వహిస్తారు? విద్యార్థులు ఇంతవరకు వీరోచితంగా ప్రవర్తించి కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించుకున్నారు. వారి ఉత్సాహశక్తులను ఇంకా మేము ఆశించతగదా? అందుకు విద్యార్థులే జవాబు చెప్పాలి.

ఇంకా మనం శక్తులు సమకూర్చుకోవాలి; ఆయత్తపడాలి - అని చెబుతున్నాను. గనుక యుద్ధం ఇప్పటికి తాత్కాలికంగా ఆగిపోయినట్టు భావించకండి ఉద్యమం. ఆగిపోలేదు. మన విప్లవచర్యలు యథాపూర్వంగా సాగిపోతుండవలసినదే. ఆయత్తపడటానికి అవికూడా సాధనాలే.

ప్రజల్లో విశ్వాసం ఉంచి; దీక్షాబద్ధ కంకణులమై ప్రస్థానించుదాం. ధైర్యంగా, గుండె నిబ్బరంతో, నిశ్చలమైన మాపుర్గో ముందడుగు వేద్దాం భారత స్వాతంత్ర్య భానూదయం అయింది. మన సంశయాలు, పరస్పరకలహాలు, అకర్మణ్యత్వము, అవిశ్వాసము - ఇవన్నీ నల్లమబ్బులై ఆ సూర్యుని కప్పివేయకూడదు అలా జరిగిందంటే మనమంతట మనమే సృష్టించుకున్న అంధకారంలో నిమగ్నులమై పోతాం.

కామ్రేడ్స్! మరోకసారి మిమ్మల్ని సేవించగల అవకాశం లభించినందుకు నేను అధికంగా సంతోషిస్తున్నాను; గర్విస్తున్నాను. మిమ్మల్ని సేవించుటలో... మన నాయకుని అంతిమవచనం 'మృత్యుర్వా మోక్షోవా' — ఆదే నాకు ధ్రువతార, మీ ఆజ్ఞ, నా ఆనందం.

ఇండియాలో
ఎక్కడో.... } జయప్రకాష్ నారాయణ్

# II

[మనవిరోధి అయిన బ్రిటిషువారి కారాగృహంనుంచి తప్పించుకొని బైటపడిన తర్వాత, కొన్ని నెలలకితం. మన జాతీయ విప్లవాన్ని గురించిన నా అభిప్రాయాలను, నా సూచనలను మీకు తెలియజేసుకో గలిగాను. తర్వాత ఆరు నెలలు గడచినయ్. ఈసమయంలో ఎన్నో సంగతులు జరిగినయ్. కాబట్టి గతమాసాల్లోని ఘటనలను సమగ్రంగా సమీక్ష చేసి, మన ప్రస్తుతపోరాట స్థితిని పరిశీలించటం మంచిదని నా ఊహ — జయప్రకాశ్]

గడచిన ఆరునెలల విప్లవపు పరిణామంతో సన్నిహిత సంబంధం కలిగిన తర్వాత, మొదట్లో నాకు కలిగిన అభిప్రాయాల నిప్పుడు మార్చుకో వలసిన కారణమేమీ నాకు గోచరించటంలేదు. ఒక్క విషయంలో మట్టుకు తప్ప, కితంలేఖలో చేసిన పరిశీలనను కూడా మార్చుకోవలసిన అవసరంలేదు. అదంత ప్రధానమైన విషయం కానప్పటికీ, కొంచెం ముఖ్యం మట్టుకు అవును.

క్రిందటి డిసెంబరులోనే, కొలది నెలల్లో మళ్లీ ప్రజావిప్లవం సంభవించగలదని నాకు తోచింది. కాని ఆ విప్లవం ఇంకా జరుగలేదు. వెంటనే జరిగేట్టుగా కూడా లేదని చెప్పాలి. ఇందుకు ఫలితంగా మన ప్రస్తుత విధానం, పోరాటం ఎలా మార్పు చెందుతయ్? అనే ప్రశ్నలు పుట్టుతయ్. ఈ ప్రశ్నకు సరైన సమాధానం ఇవ్వాలంటే, ప్రజలెందుకు [illegible] తిరుగుబాటు చెయ్యలేక పోయారో ఒకింత పరిశీలించాలి.

అయితే ఇందువలన ప్రజల సంకల్పబలం క్రుంగి పో[illegible] శక్తి తగ్గిపోయిందని గాని భావన చేయటం పొరపాటని నాకు [illegible] స్తోంది. బ్రిటిషు పరిపాలన [illegible] ఇప్పుడు ప్రజా[illegible] ద్వేషం [illegible] ఎక్కువైంది. ఆ బంధాలను త్రోసిపుచ్చాలనే నిశ్చయం ఇప్పుడు ఉన్నంత

స్థిరంగా ఇదివరలో లేదు అయినా, కొంత దౌర్బల్యమీనాడు ఉందన్నమాట నిజం. కాని ఈ దౌర్బల్యం చాలావరకు - పూర్తిగా కాదు - పట్టణాల్లోనూ, సంఘంయొక్క పై వర్గాల్లోనూ ఉన్నట్లు నాకు తోస్తోంది. బ్రిటిషు ప్రభుత్వపు నిరంకుశత్వం విచ్చలవిడిగా వ్యాపించిన పల్లెప్రాంతాలు తలొగ్గకపోగా ప్రతీకారంకోసం తహతహలాడుతున్నయ్. మళ్లీ సందుదొరకితే చాలు, ఆ ప్రాంతాలు నిలువునా లేచి, బ్రిటిషు అధికారాన్ని తుండె తుండాలుగా చీల్చి వేస్తయ్. బ్రిటిషువారి దుర్మార్గానికి గురికాని గ్రామస్థులో మాత్రం, తనను ఎలాగైనాసరే రక్షించుకోవాలనే కోరిక, పిరికితనం ఉన్నట్లు కన్పిస్తుంది కాని సమయం వచ్చినప్పుడు, తోటివారితో కలసి ముందడుగు వేసేట్టుగా వీరినికూడా తయారు చెయ్యగలమని నా నమ్మకం. మొన్నటి తిరుగుబాటులో ప్రముఖపాత్రవహించిన విద్యార్థులు మళ్లీ తమ స్కూళ్లలో, కాలేజీల్లో చేరినమాట వాస్తవం. కాని వాళ్లలో ఉత్సాహమేమాత్రం తగ్గలేదని, మళ్లీ తిరుగుబాటువస్తే, దాని నాయకత్వం వహించటానికి సిద్ధంగా ఉన్నారని నాకు తెలియవస్తోంది. నానాటికీ విషమిస్తున్న ఆహారపరిస్థితులబట్టి, జీవితంలో అత్యధికమవుతున్న కష్టాలబట్టి, తగ్గిపోతున్న కూలీలబట్టి, యుద్ధప్రయత్నాలంటే కార్మికులకు మోజుగా ఉండట్లేదు. మళ్లీ బహిరంగనిరసన వస్తే, గడచిన ఆగస్టు - డిసెంబరులో కంటె ఇంకెక్కువగా కార్మికులుపాల్గొంటారు. బ్రిటిషు ప్రభుత్వానికి విధేయులుగా ఉన్నట్లు పైకి కనుపించినా, పోలీసు శాఖల్లో, కిందివారిలో ఎక్కువగా అసంతృప్తి వ్యాపించివుంది. మళ్లీ తిరుగుబాటువస్తే, 1942లో చూపినంత విధేయతకూడా ఈసారి చూపరు, యుద్ధాభివృద్ధినిబట్టి భారతీయ సైన్యాల్లో తగ్గటానికి బదులు అసంతృప్తి హెచ్చింది. జీతాలు, మొదలయిన విషయాలను గురించి సేనాని చేసినసూచనలు ఈ అసంతృప్తిని పోగొట్టలేవు.

ఇలాంటి పరిస్థితులే ఇప్పుడూ నిజంగా వుంటె, మరి రెండవ తిరుగుబాటు ఎందుకు జరగలేదని, అది వెంటనే అయినా ఎందుకు సాధ్యంకాదని అడగవచ్చును. ఇలా జరక్క పోవటానికి ఎన్నో ముఖ్యమైన కారణా

లున్నయ్. ఈ విషయాలనూ సరిగా కనిపెట్టటం నాయకత్వపు పని అయినా, ఇవెక్కువగా ఊహాక్రిందవున్నట్టివి. అధికారం చెలాయిస్తున్న సర్కారువారి ఆటకట్టిందని, వారికి పోయేకాలం రానేవచ్చిందని ప్రజల్లో ఒకనమ్మకం తలెత్తింది. ఇదీ అసలు కారణం కాకపోయినా, ముఖ్యకారణాల్లో ఒకటి. గడచిన ఆగష్టుకు క్రితం నెలలో యుద్ధం నడుస్తున్న ధోరణిని బట్టి, బ్రిటిష్ సామ్రాజ్యం కూలిపోతోందని, దాన్ని ఒక్క దెబ్బతో నేలమట్టం చేసివేయవచ్చునని మన ప్రజలు నమ్మారు. ప్రస్తుతంగాని, గడచిన కొంతకాలం నుంచిగాని ప్రజల్లో ఈ మానసిక వాతావరణం లేను ఉత్సాహ ప్రోత్సాహకరం బదులు ప్రతిబంధకంగా పరిణమించింది. మనకు కనుపించింది ఇంతవరకు బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రక్షించటం, దాని శిథిల భాగాలను పునర్నిర్మించటం అమెరికన్లకు విధిగా గోచరిస్తోంది. సామ్రాజ్యం యొక్క సర్వనాశనం ఎలాగో జరిగితీరుతుంది, జరుగుతూనూవుంది. ఈ సర్వనాశనం దాని ముఖాన వ్రాసిపెట్టేవుంది. చిత్రంగా కనపడినప్పటికీ, ఈ బ్రిటిష్ సామ్రాజ్య వినాశనానికి అమెరికన్లు కూడా కొంతవరకు బాధ్యులే. ఎందుకంటే తాము విడిపించే ప్రాంతాలపై తమ స్వహక్కులను వాళ్ళు స్థాపించుకోకుండా ఉండలేరు. కానీ ఈ రహస్యం పైకి స్పష్టంగా అగపడదు. అందువలన ప్రజల్లో మాంద్యం బాగా ఏర్పడింది.

ప్రజల్లో ఈ స్తబ్ధత్వాన్ని, మాంద్యాన్ని తొలగించటానికి రెండు పరిస్థితులవసరం. ఒకటి, అంతర్జాతీయ పరిస్థితి సానుకూలంగా ఉండటం. అంటే బ్రిటిషు సామ్రాజ్యానికి చుక్కఎదురు కావాలి. లేదా, సుశిక్షితమైన విప్లవసంస్థ అయినా అవసరం. ఇది శత్రువుమీద దెబ్బమీద దెబ్బతీస్తూ, ఎంత సేనాబలం ఉన్నప్పటికీ తమ విప్లవాన్ని బ్రిటిషు ప్రభుత్వం ఎదుర్కొనలేదనే విశ్వాసాన్ని ప్రజలహృదయాల్లో పురికొల్పాలి. అటువంటి విప్లవానికి సమర్థులైన నాయకులు లభించి, విజయం తప్పక చేకూరుతుందనే విశ్వాసాన్ని ప్రజల్లో రేకెత్తించాలి.

గడచిన ఆగస్టులో తగిన మానసిక వాతావరణం ఏర్పడింది. దీనికి యుద్ధపరిస్థితి ఒక్కటే కారణంకాదు. తన అపరిమితశక్తితో కాంగ్రెసు ప్రజలకు నాయకత్వం వహించటంకూడా ఇందుకు కారణం. ప్రజలకు తమ నాయకులపై అచంచల విశ్వాసముంచి అందుకనే, పిలుపు వినబడగానే, నమ్మకంతోనూ, ఉత్సాహంతోనూ ముందుకురికారు ఇవ్వాళ ఈ నాయకులు జైలులో వున్నారు ఉండటంవల్ల ప్రజలకు వీరి అశక్తత కనబడుతోంది. అందువల్ల ప్రజల్లో విప్లవావేశాన్ని ప్రేరేపించగలిగిన ఈ రెండవశక్తి (కాంగ్రెసు నాయకత్వం) ఈనాడు లోపించింది

యుద్ధపరిస్థితిని మన విప్లవానికి అనుగుణంగా ఉండేట్టు చేయగలిగిన శక్తిమనచేతుల్లో లేదు. కాని కాంగ్రెసు నాయకులు ప్రజలమధ్య లేని లోటును మనం తీర్చగలం తీర్చుకోగలగాలి. ప్రజలు స్వస్థులుగా ఉన్నారని, వారు సామాన్యులుగా లేరని [illegible], తామేమీ చేయకుండా కూర్చొనే వైఖరి స్వాతంత్ర్య యోధుల్లో పొడగట్టుతోంది ఇది నిరాశావాదం ప్రజను ముందుకు నడిపేశక్తి మనలో ఉండాలి. అది వుంటేనే వారు కష్టాలు కాని మన కార్యకలాపాలవల్ల, మనశక్తి, నైపుణ్యముల వలన వారి విశ్వాసమును సంపాదించగలిగితే గాని, వారు మన పిలుపుకు పలుకరు అప్పుడు గాని వారు మనవెంటరారు. ప్రజలు తమవిధిని నిర్వర్తించారు. కాని వెనకడుగు వేసింది మనమే. ఇప్పుడు మనం మనవిధిని నిర్వర్తించాలి. అప్పుడే వాళ్లు తమ విధిని నిర్వర్తిస్తారు. గత ఆగస్టులో కాంగ్రెసు ప్రచండశక్తి, గాంధీకి నాయకత్వమూ ఇవి ప్రజలముందు ప్రత్యక్షంగా కనుపించినయ్. ఈనాడు నాయకులు లేక అవి, ఓడిపోకుండా, పోరాటాన్ని సాగించే బలిష్టమైన వ్యవస్థ లేదే అని, వారను కొట్టేట్టుగా మనం చెప్తే, వారు నిరాశతో క్రుంగి పోయి విధి మీదే భారం వేసి, కూలబడతారు

కాబట్టి ఇది అకుంఠిత విప్లవయోధులకు అచంచల, స్వాతంత్ర్య యోధులకు ముందుకు రావలసిన తరుణం తమశక్తిని పెంపొందించుకొని, శత్రువుతో ఎడతెగని పోరాటాన్ని సాగించాలి. ఎంతటిబాధనైనా, ఎంతటి త్యాగాని

కైనా తెగించాలి. ఏవివాదము, ఏప్రలోభము, ఏభ్రాంతీ మనను పెడదారి పట్టించరాదు. పోరాటాన్ని సాగించటానికి ఎన్నో దారులున్నయ్. మన మత విశ్వాసాలేమైనప్పటికీ, మనసాధన విధానాలేమైనప్పటికీ, మనకైక్యము ఒక్కటే. మనం పోరాటాన్ని నిరాటంకంగా సాగిస్తూనే ఉండాలి. పోరాటం ఏడాది పట్టినా, పదేళ్లుపట్టినా మనం లెక్కచేయరాదు. పదేళ్లు పోరాడితేగాని అమెరికన్లకు స్వాతంత్ర్యం సిద్ధించలేదు. ఇప్పటికి ఏడేళ్లనుంచిచైనా వాళ్లు తమస్వాతంత్ర్యం కోసం హోరాహోరి పోరాడుతున్నారు. మన పోరాటంలో ఒక్కసంవత్సరమేగదా గడచింది. అమెరికను యుద్ధంలోనూ చైనా యుద్ధంలోనూ, కొన్నికొన్ని సమయాల్లో సర్వనాశనమై ఓటమి తప్పదేమోననిపించింది. కాని నాయకులు ప్రజలు పట్టువిడలేదు. చివరికి విజయం అమెరికన్లనే వరించింది. చైనావారినీ వరించి తీరుతుంది. పోరాటంలో దెబ్బతింటామని నిస్పృహ చెందవలసిన సమయం ఇది కానేకాదు. అయినా, చపటలు పిరికిపందలు గొంతెత్తటానికి సాహసించారు. వారు మన దేశానికి ద్రోహులు. వారిని పక్కకునెట్టేసి మనం మన దారిన ముందుకు సాగిపోవాలి. ఇంతకంటె చెడురోజులు మనకు ముందు దాపురించవచ్చు. కాని మనం కష్టాలను, బాధలను చలించక గుండె రాయిచేసుకోవాలి. అప్పుడే మనం ప్రజల విశ్వాసానికి అర్హులమవుతాం. అప్పుడే మన పిలుపుకు వారు పలుకగలుగుతారు.

గడచిన కొద్దినెలలనుంచీ, ముఖ్యంగా గాంధీజీ - వైస్రాయి ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రకటితమైనప్పటినుంచీ హింసా హింసల సమస్యను గురించిన వాదప్రతివాదం స్వాతంత్ర్య యోధుల్లో రేకెత్తింది. ఈ విషయం గురించినా అభిప్రాయాలను మొదటి లేఖలోనే చెప్పాను. ఇప్పటికీ అవే నా అభిప్రాయాలు. ఇదివరలో చెప్పిన దానినే పునరుద్ఘాటించవలసిన అవసరం లేదు. కాని ఈ వివాదం గురించి ఒకటి రెండు మాటలు చెప్పదలచుకున్నాను. ఇప్పటి పరిస్థితుల్లో ఈ విషయాన్ని గురించి చర్చించటం నా ఉద్దేశ్యంలో అర్థంలేని పని. స్వాతంత్ర్య యోధులకు తమ మార్గాలను తాము నిర్ణ

యించుకొనే స్వేచ్ఛవుంది ఒకే మార్గాన్నవలంబించ దలచుకొన్న వారందరు సుశిక్షితమైన ఒక వర్గంగా కలసి పనిచేయాలి. భిన్న విధానాన్ని అనుసరించే వారు కనీసం చెయ్యవలసిందేమంటే, ఇంకొకరి దారికడ్డు రాకుండాను, పరస్పర దూషణల్లో తమ శక్తిని వ్యర్థపరచుకోకుండాను ఉండగలగటమే. కరేంగే యా మరేంగే, అనేది మంత్రంగా స్వీకరించిన వారిలో పరస్పర దూషణకు తావులేదు. హింసా వాదులవలన గాంధీజీ సిద్ధాంతం దెబ్బతిన వచ్చునని అహింసా వాదులు భయపడవచ్చు అభియానికేమీ ఆధారంలేదు. అహింసపై గాంధీజీకి సంపూర్ణమైన విశ్వాసము; దాని యెడల గాంధీజీ వైఖరి సుస్పష్టము ఇక లక్ష చర్చిలులు గాని, అమెరీలు గాని తలకిందులైనా గాంధీజీ మీద హింసనేమాత్రము ఆరోపించలేరు మనమేమి చేసినా, ఎలా సాధించినా, వాళ్లు 'టోరీ' అననీ, లేబరు అననీ బ్రిటిషు రాజకీయ వేత్తలను అసత్య ప్రలాపం చేయకుండా మనం ఆపలేమనే సంగతి గుర్తుంచుకోవాలి ఎందుకంటె, అబద్ధాలనే స్తంభాల మీదనే సామ్రాజ్యసౌధం ఎక్కువగా ఆధారపడివుంది. భారతదేశంలో హింసజరుగుతున్నదంటె దానికింకెవరు బాధ్యులుకారు బ్రిటిషువారే!

గాంధీజీ - వైస్రాయి ఉత్తరప్రత్యుత్తరాలు ప్రకటన ఐనప్పటినుంచీ ఆరంభమైన ఇంకొక వివాదం ఇది: ఈ ఇప్పటి పోరాటాన్ని కాంగ్రెసు ఆరంభించిందా? దీన్ని ఒక కాంగ్రెసు ఉద్యమంగా ఎంచవచ్చునా? అని గాంధీజీ, ఇతర కాంగ్రెసు నాయకులూ, అధికారికొన్న సమరప్రకటన చేయక పూర్వమే నిర్బంధితు లయినందు వలన, ఈపోరాటం కానే కాదని కొంతమంది వక్కాణిస్తున్నారు వీరి ధోరణి ఎందాకా వెళ్లిందంటె, ఓపచ్చు ఏ. ఐ సి సి సమావేశమై, బొంబాయి తీర్మానాన్ని ఉపసంహరించుకోవలెనని సూచించారుకూడా. వీరు వాదించే ధోరణినిబట్టి నాయకులను నకాలంలో బ్రిటిషువారు నిర్బంధిస్తే, ఏఉద్యమమూ కాంగ్రెసు ఆమోదాన్ని, అధికారాన్ని పొందజాలదు. ఈపోరాటం కాంగ్రెసుది కాదని చెప్పేవారికి, ఆగస్టు 9వ తేదీన దొంగచాటుగా నాయకులను ప్రభుత్వం నిర్బంధించి న్యాయ

ప్రజలేవిధంగా ప్రవర్తించివుంటే బాగుండేదో! తమను నిర్బంధించినప్పుడు, ప్రజలేవిధంగా ప్రవర్తించివుండవలసింది అనే విషయంగురించి గాంధీజీ అభిప్రాయం, వర్కింగ్ కమిటీ అభిప్రాయం ఏమైవుండగలదని వీరి ఉద్దేశ్యము? నాయకులను నిర్బంధించినప్పుడు ప్రజలేవిధమైన ప్రతిక్రియ చేయకుండా, బ్రిటిషువారికి పాదాక్రాంతులైవుంటే, ఈ ఉద్యమాన్ని విమర్శించినవారికి సంతృప్తికరంగా ఉండేదా? లేక కమ్యూనిస్టుల (ఒకప్పటి విప్లవవాదులు) మాదిరిగా, సభలుజరిపి, నాయకులను విడుదలచేయాలనే నినాదాలతో తృప్తిపడి ఊరుకోవాలా? నాయకులను విడుదల చేయకపోతే మరికొన్ని సభలుజరపాలా? చివరకు ఈ సభలవల్ల ఏమీ లాభంలేదని సభికులు రావటం మానుకుంటే, విసుగుపుట్టి, చేసేదేంలేక చీకు చింత లేకుండా నిద్రపోవాలా? ఉద్యమాన్ని విమర్శించేవారికి కావలసిందదేనా? బొంబాయి ఎ. ఐ. సి. సి. సమావేశంలో వేదికలమీద మన మహానాయకులు చేసిన వీరగర్జనలకిదేనా వ్యాఖ్యానం? ఇదేనా మహావిప్లవము? ఇలా కాకుండా బ్రిటిషువారి దాడిని ప్రజలు ఎదుర్కోవాలనుకుంటేనూ, నాయకుల నిర్బంధం ప్రజావిజృంభణకు నాంది అనుకుంటేనూ, ఈపోరాటాన్ని కాంగ్రెసు పోరాటంకాదని, ఇది అధికారప్రేరితంకాదని తెగడటంలో ఏమి మర్యాద, ఔచిత్యము ఉన్నాయో? మనం సంఘర్షణకు దిగదలచుకున్నప్పుడు, శాంతి సమయంలోవుండే లాంఛనాలను జరపటానికి తగినంత వ్యవధిని శత్రువు ఇస్తాడనుకోటం పొరబాటు కాబట్టి 1942 ఆగస్టు 9 వ తేదీన ఆరంభమైన జాతీయపోరాటానికి కాంగ్రెసు అధికారము, అనుమతి లేవని ఎత్తిచూపటం నాబుద్ధికి హేయంగాను పిరికితనంగానూ గోచరిస్తుంది

ప్రస్తుత పోరాట విధానాన్ని గాంధీజీగాని, వర్కింగ్ కమిటీగాని ఆదేశించారా అనే విషయం వేఱు. ఇక్కడ మనకు రాజకీయ సిద్ధాంతాలతోనూ, ఆదర్శాలతోనూ ప్రసక్తిలేదు. మనం వాస్తవ విషయాలను పరిశీలించాలి. ఈ వాస్తవాలను గురించి చర్చకు తావులేదు. వర్కింగ్ కమిటీగాని కార్యక్రమాన్ని ఏర్పరచలేదని, ఉద్యమానికి నాయకత్వం వహించవలసిం

దిగా గాంధీజీని మాత్రము కోరిందని అందరకు తెలుసు. గాంధీజీకి కూడా ఏ కార్యక్రమమూ లేదు. ఎ. ఐ. సి. సి. సమావేశంలో చూచాయగా మాత్రం వర్ణించాడు ఆ ఛాయామాత్రమైన సూచన, ఆయన హరిజన్ - వ్యాసాలు ఇవే ప్రజల అందుబాటులో ఉన్నవి. ఈ ప్రాతిపదికమీదనే, నిర్బంధితులు కాని కాంగ్రెసు వారు బొంబాయిలో హడావిడిగా సమావేశమై, అప్పటి నుంచి నడిచినట్టి అశాస్త్రీయ కాంగ్రెసు సంస్థకు పునాదులువేసి, తమ కార్యక్రమాన్ని ఏర్పరచుకొన్నారు. ఇంకా ఆ కార్యక్రమమే జాతీయ పోరాటానికాధారము. అందులో హత్యలుగాని, ప్రాణహాని కలిగించే హింసకు గాని తావులేదు. మన దేశంలో ఖూనీలు జరుగుతున్నాయంటే, వాటిలో నూటికి 99 బ్రిటిషు ఫాసిస్టులే, రౌడీలే చేస్తున్నారు. ఆగ్రహావేశులై, విసిగి వేసారిన ప్రజలు చేసినవి నూటికి ఒకటికంటె కూడా ఎక్కువలేవు. ప్రతిష్టంభన కలిగించటం, అన్ని అహింసా సాధనాలవలన బ్రిటిషు పరిపాలనను నిర్వీర్యం చేసి, పడగొట్టటం, ఇవి కార్యక్రమానికి మూలసూత్రం - ఇదివరకూ, ఇప్పుడూనూ అహింసాయుతంగా చేయగలిగినదంతా చేయుటమనే ఆదర్శమే ఈ ఉద్యమానికి ధృవతార. కార్యక్రమంలోని కొన్ని అంశాలను అహింసపేరిట జారవిడవటానికి కొంతమంది ప్రయత్నిస్తున్నారు, కాని వీటిని వారే ఇదివరలో ఒప్పుకున్నారు. అంతేకాదు మష్రూవాలా అంతటి దిట్టకూడా ఆ అంశాలను నిరసించనూలేదు, అలా చెయ్యవద్దని ప్రజలను వారించనూలేదు. అయినా ఆగస్టు 1942 నుంచి కాంగ్రెసు సంస్థలు తమపోరాటానికి బుద్ధిపూర్వకంగా అహింసనే ప్రాతిపదికగా ఏర్పరచుకున్నాయి. అహింస అంటే, అప్పుడు కారాగారంలో వున్నవారు నిర్ణయించిన ప్రకారం కార్యక్రమాన్ని ఏర్పరచిన వారుమాత్రం తమ జవాబుదారీని ఎప్పుడూ కద్దనలేదు. సమయం వచ్చినప్పుడు, కాంగ్రెసు ముందు నిలబడి, అత్యంత వినయావస్థలో తమ విధిని తాము సక్రమంగా నిర్వర్తించినందుకుగాను మన్నన కూడా పొందుతారు.

అదలా వుండనివ్వండి. ఆగస్టు కార్యక్రమానికి గాంధీజీ బాధ్యుడవటం అసత్య ప్రచారం. ఇటువంటి దానికి బ్రిటిషు పరిపాలకులే సమర్థులు.

ఈ వాద వివాదాలకంటె ఎక్కువ అపకారం చేయగల లక్షణమొకటి గత రెండు మాసాలనుంచి కన్పడుతోంది. పోరాటం ఆరంభమైందో లేదో, అప్పుడే ఆయా విధంగా ప్రతిష్టంభనను పరిష్కరించాలని పరితపిస్తూ, బొంబాయి తీర్మానాన్ని ఖండిస్తూ కొంతమంది బృందంగా తయారయారు. వారి నెప్పుడూ కాంగ్రెసువారు లక్ష్యపెట్టలేదు. ఇప్పుడునూ పెట్టనక్కర లేదు. భారతదేశం ఎప్పుడు స్వాతంత్ర్య సమరము నారంభించినా, ఈ పెద్దలు పరిష్కారంకోసం మాత్రం తహతహలాడుతూనే వుంటారు. స్వాతంత్ర్య యోధులతో కలసిపోరాడవలసిపోయి; ఉద్యమ ప్రతిబంధకులుగా పరిణమించిన శ్రీ రాజగోపాలచారి, భులాభాయ్ దేశాయ్, కె. యం. మున్షీ గార్లనుబట్టి మనం గాభరాపడి, ఉద్యమవిధానాన్ని మార్చుకోవలసిన అవసరమేమీ లేదు.

కాని కాలక్రమాన చెరసాలల్లోంచి స్వాతంత్ర్యయోధులు బైటికి వస్తున్నకొద్దీ వారిలో చాలా కొద్దిమందిలో మాత్రమే నిస్పృహా, నిర్వీర్యతా కన్పట్టుతున్నయ్. ప్రతిష్టంభనా పరిష్కారం, అనే పొలికేక వారూ వేస్తున్నారు. ఇందుకై తమకుతోచినరీతిగా సూచనలనుకూడా చేస్తున్నారు.

అసలు, నాయకులు బరిలో నిలబడివుండగా కాంగ్రెసువారు పలాయన మంత్రం పఠించటం స్వామిద్రోహం. సరైన శిక్షణకు కార్యాచరణమే అసలు పరీక్ష. పర్వ్యలసమయంలో విమర్శించటం, అభిప్రాయభేదాలుండటం ప్రజాస్వామిక జీవితవిధానం. కాని కార్యవుపట్ల, ముఖ్యంగా యుద్ధపుసమయంలో, కచ్చితమైన శిక్షణ అత్యవసరం. ఇక ప్రస్తుతసందర్భంలో శిక్షణప్రకారం ప్రతి కాంగ్రెసువాది రణరంగంలో నిలబడితీరాలి. లొంగిపోవాలనిగాని, వెనుకకు మరలిపోవాలనిగాని ఏమాత్రమూ అనుకోగూడదు. ఈ విషయాలను గురించి యోచనచెయ్యవలసినవారు — నాయకులు. మహాత్మాజీ, మౌలానా అజాద్ ఇంకా జైలులో ఉన్నారు. అయినా, శాంతివిషయంలోగాని, సమర విషయంలోగాని అధికారం ఇంకా వారిదే. యుద్ధంలో ఎప్పుడూ. ఇంతే కాను లొంగిపోవటంవల్ల మహాత్మాజీ ఈ ప్రతిష్టంభనను ఎప్పుడైనా

ఈ రాజీలోని చిక్కులను గురించి పరిశీలిద్దాం. యుద్ధం యెడల కాంగ్రెసువైఖరి ఎలా ఉంటుంది? మన ప్రజల మంచికోసం, మనపక్షాన యుద్ధం సాగించగలిగిన అవకాశం ఏర్పడితే తప్ప, కాంగ్రెసు యుద్ధం యెడల తన దృష్టిని మార్చుకోటానికిగాని, యుద్ధంలో పాల్గొనటానికిగాని వీలులేదు అలాంటి అవకాశాన్ని ఏర్పరచగలిగిన సంఘటన ఏమీ గత ఆగస్టునుంచీ జరుగలేదు. పైగా, గతసంవత్సరం ఎంతో ఘోరం జరిగింది, ప్రజలచుట్టూ నరకద్వారాలు తెరచి- ఈ నరకజ్వాలలింకా చల్లారలేదు-, భారతదేశంపై అధికారం చెలాయిస్తున్న గూండాలతో ద్రోహులతో, అధికారులతో గాని ఇంకెలాగైనా గాని, ఆత్మగౌరవమున్న ఏ కాంగ్రెసువాదీ కలసిపని చెయ్యటం అసంభవం. ప్రజలను చంపి, ఇళ్లను కొల్లగొట్టి, దగ్ధంచేసి, ఇంకెన్నో అత్యాచారాలు చేసి, కారాగృహాల్లో పసికూనలను చిత్రవధ చేసినట్టి 'మనుష్యు'లను కాంగ్రెసువారు బహిష్కారసూచనలను ఎలా సూచించగలరో నాకు బోధపడదు. ఈ కారణంబట్టి ప్రస్తుత పరిస్థితుల్లో తగినంత అధికారం లేకుండా కాంగ్రెసు మళ్లీ 1935 రాజ్యాంగచట్టం ప్రకారం పని చేయటానికి ఒప్పుకోదని నేను భావిస్తాను ఆ చట్టాన్ని భగ్నం చెయ్యాలనే సంకల్పం పెట్టుకొని, దాని ప్రకారం పనిచెయ్యటానికింకొకసారి ఇదివరలో కాంగ్రెసు ఒప్పుకుంది. కాని ఆ ప్రయత్నంలో ఇంచుమించు తానే బాగా దెబ్బతింది ఎలాగైతేం నీచమైన ఆ కుతంత్రాన్ని (చట్టాన్ని) యుద్ధమే భగ్నం చేసింది. బెంగాలు శాసనసభలో మౌల్వీఫజులుల్ హక్ చేసిన ప్రకటన బట్టి, రాష్ట్రంలోకేమీ స్వతంత్రాధికారం లేదని, బ్యూరాక్రటిక్ ప్రభుత్వము సర్వాధికారియని స్పష్టంగా తెలిసింది రాష్ట్రీయ స్వపరిపాలనలోని శూన్యత్వాన్ని అంత చక్కగా బహిరంగ పరచిన తర్వాతకూడ మౌల్వీఫజులుల్ హక్, బెంగాలు శాసనసభలోని ఇతర జాతీయ సభ్యులు, అంతేకాదు కాంగ్రెసు [illegible] అనుసరించే ఇతరులూ వీరంతా ఇంకా, ఇప్పుడు కూడా నిష్ఫలమైన శాసనసభా రాజకీయాల్లో పాల్గొంటూ వుండటం చూస్తున్నాం. [illegible] ప్రకటన చేసిన తర్వాత, నాబుద్ధినిబట్టి, వారవలంబించవలసిన ఒకేఒక [illegible] [illegible]

ఈ రాజీలోని చిక్కులను గురించి పరిశీలిద్దాం. యుద్ధం మొదల కాంగ్రెసువైఖరి ఎలా ఉంటుంది? మన ప్రజల మంచికోసం, మనకిష్టమైన యుద్ధం సాగింపగలిగిన అవకాశం ఏర్పడితే తప్ప, కాంగ్రెసు యుద్ధం మొదల తన దృష్టిని మార్చుకోటానికిగాని, యుద్ధంలో పాల్గొనటానికిగాని వీలులేదు అలాంటి అవకాశాన్ని ఏర్పరచగలిగిన సంఘటన ఏమీ గతఆగస్టునుంచీ జరుగలేదు. పైగా, గతసంవత్సరం ఎంతో ఘోరం జరిగింది, ప్రజలచుట్టూ నరకద్వారాలు తెరచి- ఈ నరకజ్వాలలింకా చల్లారలేదు-, భారతదేశంపై అధికారం చెలాయిస్తున్న గూండాలతో ద్రోహులతో, అధికారరీత్యాగాని ఇంకెలాగైనాగాని, ఆత్మగౌరవమున్న ఏకాంగ్రెసువాదీ కలిసిపనిచెయ్యటం అసంభవం. ప్రజలను చంపి, ఇళ్లనుకొల్లగొట్టి, దగ్ధంచేసి, ఇంకెన్నో అత్యాచారాలు చేసి, కారాగృహాల్లో పసికూనలను చిత్రవధచేసినట్టి 'మనుష్యులను' కాంగ్రెసువారు బహిష్కారసూచనలను ఎలాసూచించగలరో నాకు బోధపడదు. ఈకారణంబట్టి ప్రస్తుతపరిస్థితుల్లో తగినంత అధికారంలేకుండా కాంగ్రెసు మళ్లీ 1935 రాజ్యాంగచట్టం ప్రకారం పనిచేయటానికి ఒప్పుకోదని నేను భావిస్తాను. ఆ చట్టాన్ని భగ్నంచేయాలనే సంకల్పం పెట్టుకొని, దాని ప్రకారం పనిచెయ్యటానికింకొకసారి ఇదివరలో కాంగ్రెసు ఒప్పుకుంది. కాని ఆ ప్రయత్నంలో ఇంచుమించు తానే బాగా దెబ్బతింది ఎలాగైతేం నీచమైన ఆ కుతంత్రాన్ని (చట్టాన్ని) యుద్ధమే భగ్నం చేసింది. బెంగాలు శాసనసభలో మౌల్వీఫజులుల్ హక్ చేసిన ప్రకటన బట్టి, రాష్ట్రంలో ఏమీ స్వతంత్రాధికారం లేదని, బ్యూరాక్రటిక్ ప్రభుత్వము సర్వాధికారియని స్పష్టంగా తెలిసింది రాష్ట్రీయ స్వపరిపాలనలోని శూన్యత్వాన్ని అంత చక్కగా బహిరంగ పరచిన తర్వాతకూడ మౌల్వీఫజులుల్ హక్, బెంగాలు శాసనసభలోని ఇతర జాతీయ సభ్యులు, అంతేకాదు కాంగ్రెసు నీతో విధంగా అనుసరించే ఇతరులూ వీరంతా ఇంకా, ఇప్పుడుకూడా నిష్ప్రయోజనమైన శాసనసభా రాజకీయాల్లో పాల్గొంటూ వుండటం శోచనీయం. ఆ రోజు, ఫజ్లు ప్రకటన చేసిన తర్వాత, నాబుద్ధినిబట్టి, వారవలంభించవలసిన ఒకేఒక పౌరుషమైన బాటయు

పంథా ఇది: ప్రస్తుత శాసన సభలోంచి పూర్తిగా నిష్క్రమించటం; దారుణమైన గవర్నరు పరిపాలనను కూలదోసేందుకుగాను శాసనసభా రాజకీయాలకు మించిన విధానాలను అవలంభించటం ఇక మళ్లీ అసలు విషయానికొద్దాం ఇటువంటి శూన్య - అధికారంతో, మళ్లీ రాష్ట్రాల్లో తన మంత్రిత్వాలను స్థాపించి, అపాదు చట్టానికి తిరిగి కాంగ్రెసు ప్రాణప్రతిష్ఠ చేయాలనుకోటం అత్యంత రాజకీయ దౌర్బల్యం 1935 చట్టం నశించిపోయింది మళ్లీ దాని జోలికి పోవటమంటూ లేదు ఈ విషయాన్ని బాగా గ్రహించాలి. అంతేకాదు ఎన్నో చెప్పరాని ఘోరాలు రాక్షసకృత్యాలు జరిపిన వారితో కలసి భారతదేశం ప్రశాంతంగా వుండటం అసంభవం. ఈ విషయాన్ని కూడా బాగా గ్రహించాలి.

ఇలాంటి ప్రతిబంధకాల్లో రాజీవల్ల కాంగ్రెసు చాలా క్లిష్టమైన పరిస్థితుల్లో చిక్కుకొంటుంది కాంగ్రెసుకు స్వేచ్ఛ ప్రాప్తిస్తుందని గాని, బ్రిటిషు పెట్టుబడిదారీవిధానానికి ఉపకరించేట్టుగా యుద్ధాన్ని నడపటంకోసం ఈ అన్యాయప్రభుత్వం అవలంభించే ఆర్థిక, రాజకీయవిధానాలను, సామ్రాజ్య యుద్ధాన్ని కాంగ్రెసు ప్రతిఘటిస్తూనే ఉండవలసివుంటుంది. దేశపరిపాలనలో చెయ్యిచేసుకోటానికి గాని; ఈ ఆర్డినెన్సు, ఫాసిస్టుపరిపాలనను ప్రజాహితంగా చెయ్యటానికి గాని కాంగ్రెసుకు వీలుండదు ప్రజల ఇబ్బందుల తీర్చటానికీ, క్షుదార్తులకు ఆహారం, బట్టలులేనివారికి బట్ట, ఇళ్లులేనివారికాశ్రయం ఏర్పరచటానికి తగిన అవకాశం ఉండదు క్లుప్తంగా చెప్పాలంటే, కాంగ్రెసు తన ఆదర్శాన్ని దీక్షగా పాలించదలచుకుంటే, ఈ అక్రమప్రభుత్వాన్ని కాంగ్రెసు ప్రతిసందర్భంలోనూ ఎదుర్కొనవలసివస్తుంది. అంటే, ప్రతిష్ఠంభనను తొలగించినందువలన దేశానికి కలిగేమేలు ఏమీ ఉండదు.

కాంగ్రెసుకు ఇంకో పెద్దనష్టం కలుగుతుంది. మహాత్మాగాంధీజీ, రాష్ట్రపతి ఆజాద్, పండిట్ నెహ్రూ, ఇతరులు జైళ్లలోంచి విడుదల అవగానే ప్రపంచం భారతదేశాన్ని మరచిపోతుంది. ప్రపంచానికి భాగ్యవిధాతలైనవారిపైన (అంటే రూజువెల్టు వగైరా) ప్రతిష్ఠంభన కలుగజేసే ఒత్తిడి అమాంతం సడలిపోతుంది. ప్రస్తుతం భారతదేశసమస్య ప్రపంచా[illegible]

గదా అని; ఉన్మత్తుడైన గాంధీజీ మళ్లీ తన పరివారాన్ని జైలుకు లాక్కు పోవాలనుకొనేదాకా ఈ సమస్యకు తొందరఉండదుగదా అని చర్చిలులు, అమెరీలు హాయిగా కునికిపాట్లు తీస్తారు. జైలునుంచి విడుదలయి పండిట్ నెహ్రూ పత్రికా ప్రకటనలను చెయ్యవచ్చు వాటినాతురతగా అమెరికను విలేఖరులు అందుకోవచ్చు, కాని భావాలెంత తీవ్రంగా, చక్కగా ఉన్నా, ప్రకటనల్లో శక్తి ఉండదు ఉదాత్తమైన పదజాలాలను ప్రకటనల్లో గుప్పుతూ, పెద్దరాజ్యాల రాయబారులను మంత్రముగ్ధుల చేస్తూ వుండటం కన్న, కారాగృహంలోనే నెహ్రూ బందీగా వుండటం రూజువెల్టు, చర్చిలుల కెక్కువ గండంగా ఉంటుంది.

పైన చెప్పినదానికంటె ఎక్కువ లాభం కాంగ్రెసుకు రాజీవల్ల కలుగ వచ్చునని సూచించవచ్చు ఈ రాజీ ప్రాతిపదిక ఏమై ఉండగలదో చూద్దాం. క్రిప్సు ప్రణాళిక మినహా, ఇంకే ప్రణాళికను బ్రిటను సూచించదు. ఇక క్రిప్సు ప్రణాళిక యొక్క సారాంశమేమిటి? యుద్ధకాలంలో మనకే అధికారమూ ఇవ్వకపోవటం; యుద్ధానంతరం అధికారం మనపరం చేస్తామనే కృత్రిమ వాగ్దానం ఇదే బ్రిటిషు ప్రణాళికను కాంగ్రెసు తిరస్కరించటం సమంజసం, ఆ ప్రణాళిక నీకాదు ఒప్పుకోమని మతివున్నవాడెవడూ అనడు. అప్పుడు కాంగ్రెసు పేరిట కొన్ని కనీసకోర్కెలను సూచించారు వాటినీ బ్రిటిషు ప్రభుత్వం తిరస్కరించింది. ఆకోర్కెలను నాకుమాత్రం 'నేను ఒప్పుకోలేను ఇవ్వాళ వర్కింగుకమిటీ అయినా వాటిని ఒప్పుకుంటుందని నేననుకోను. ఒకవేళ కాంగ్రెసుఇందుకు తృప్తిపడ్డా ఆకోర్కెలను ఈ ప్రతిష్టంభ పరిష్కారములు ఎలా నెరవేర్చుకోగలుగుతారు? పోరాటంతప్ప ఇంకే విధానమైనా నెగ్గగలదా? అట్టే మళ్లీ ప్రతిష్టంభన వద్దకే వచ్చాం.

కాబట్టి ప్రతిష్టంభన తప్పదు. కాంగ్రెసుషరతుల ప్రకారం కాకుండా వేరే పరిష్కారంవలన దేశానికి ముప్పు కలుగుతుంది. ప్రతిష్టంభన ఉన్నంత మాత్రాన మనం స్తబ్ధంగా వున్నట్టు కాదు. మనం పోరాడుతూనే వుంటాము. ప్రతిఘటిస్తూనే వుంటాము జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్లో కలిగే ప్రతిసదవకాశాన్ని వినియోగించుకుంటాము. బ్రిటిషు ప్రభుత్వాన్ని ప్రతిఘటి

స్తూవుండటం; మన దేశంలో అగ్రగణ్యులైనవారు జైళ్ళలో ఉండటం, భారతదేశం మాత్రం కాలేదనటానికి, ప్రతిఘటనా నిశ్చయం సడలలేదనటానికి ఇదే నిదర్శనాలు. అంతేకాదు. భారతదేశ సమస్య జరుగుతున్న ప్రపంచ సమస్యగా ఉంటుంది. ఏషియా, ఆఫ్రికాలలోని పరాధీన ప్రజలు మన పోరాటాన్ని చూసి, ఉత్సాహం తెచ్చుకుంటారు. తామెటువంటి 'ప్రజాస్వామిక' వ్యవస్థ కోసం పోరాడుతున్నదీ, బ్రిటనులోని, మిత్రమండలి దేశాల్లోని కార్మికులు, కష్టజీవులు అవగాహన చేసుకోగలుగుతారు. ఇప్పటికంటె మంచి ప్రపంచ వ్యవస్థ ఏర్పడే అవకాశం త్వరలో లభించగలదు. మిత్రమండలి విజయం వలన గాని, అక్షరాజ్యాల విజయం వలన గాని విమోచన, సౌఖ్యము పొందజాలని ప్రపంచ సామాన్య ప్రజలకు నాయకత్వం ఉన్నానాను ఇష్టమే. యుద్ధమెంత కాలం నడుస్తుందో, దానిగతి ఎలావుంటుందో, దానివలన ఏ కొత్త శక్తులు ఉద్భవించ గలవో ఎవరూ చెప్పలేరు. యుద్ధమెంతకాలం ఎక్కువగా నడిస్తే, ఒక్క భారతదేశంలోనే కాదు, అన్ని దేశాల్లోనూ, అంతరపరిస్థితి అంత ఎక్కువగా విషమిస్తుంది. యుద్ధంలో ఏదైనా మార్పు కలిగితేగాని; సంఘంలో ఏ సూత్రశక్తి ఉన్నది స్థితిగాని మనదేశంలోని పరిస్థితి పూర్తిగా మార్పు చెందదు. ప్రతిష్ఠంభనే తీవ్రమైన పురోగమనానికి తొలి మెట్టు కావచ్చు. అలా కాకుండా దాని పరిపాకంవల్ల మనము పూర్వపు పరిస్థితులనే సంప్రాప్తించుకుంటే, ఆ పరిస్థితులే మనపాలిట దుస్తరమైన ప్రతిబంధకాలు కావచ్చు. మన ఉద్యమానికి ముందరి రోజుల్లో విజయం లభించేందుకు, ఈ ప్రతిష్ఠంభనే ఉత్తమ అభయహస్తం.

బ్రిటనుకూ రాజకీయ ప్రతిష్ఠంభన, ఇష్టమే కాబట్టి ఈ ప్రతిష్ఠంభనను మనం తొలగించకుండావుంటే మనం బ్రిటను మాయలో పడిపోతున్నామని వాదించవచ్చును. ఇలా అనటం బ్రిటిషురాజనీతిని అపార్థం చేసుకోటం. బ్రిటనుకు కావలసింది రాజకీయ - ప్రతిష్టంభన కాదు కాంగ్రెసును కూలార్చి, దాని గొంతుకను నొక్కివేసి, ప్రజల ప్రతిఘటనాబలాన్ని, స్వాతంత్ర్య సంకల్పాన్ని నాశనం చెయ్యటమే బ్రిటనుకు కావలసింది. కాంగ్రెసు శక్తిని వృద్ధిపర చేటటువంటి ప్రతిఘటనాశక్తిని అవిచ్ఛిన్నంగా దృఢపరచగలిగినటు

వాదులిప్పుడే కాంగ్రెసు - లీగు ఒడంబడిక అనే చిట్కాను చేపట్టారు. ఇక ఈవిషయం గురించి ఇంతకంటె ఎక్కువగా చెప్పనక్కర్లేదు.

బుద్ధిమంతులు కొందరు బ్రిటిషు ప్రచారపు వలలో ఎలా పడిపోతున్నారో చూస్తే, ఆ ప్రచారనైపుణ్యాన్ని ఎవరైనా మెచ్చుకోక తప్పదు. ఈ పరిస్థితికి ఆ ప్రచారనైపుణ్యమైనా కారణం అవ్వాలి లేదా మనం అధమాధమస్థితిలో ఉన్నామని ఒప్పుకోవాలి. అమాయకులైన అమెరికన్లను బ్రిటిష్ ప్రచారం ఆకర్షిస్తోందంటే, అర్థం చేసుకోవచ్చు (వారిలో కూడా ఈ వ్యవహారాన్ని తెలుసుకోగలిగేవారు ఏకొద్దిమంది మాత్రం లేకపోలేదు) కాని ఆ ప్రచార ప్రకటనకట్టుకు భారతీయులు కూడా భ్రమచెందుతున్నారంటే, ఆ ప్రచారాన్ని ప్రపంచ విచిత్రాల్లో ఒకటిగా ఎంచవలసివస్తుంది. భారత దేశంలో ఇటీవల జరిగిన సంగతులతో బ్రిటను వేషాలన్నీ బైటపడ్డాయి. బ్రిటిషు సామ్రాజ్యంయొక్క నిజస్వరూపాన్ని, ఉద్దేశాన్ని ఇక ఏదీకూడా కప్పిపుచ్చలేదు. ఇటువంటి పరిస్థితుల్లోకూడా భారతదేశానికి స్వాతంత్ర్యం కలిగేందుకు కాంగ్రెసు - లీగూ ఒడంబడిక లేకపోవటమే అంతరాయమని నమ్మే భారతీయులు ఇంకా ఉన్నారు. తమ దేశస్థులకూడా ఇలా భావించమని వారి ఉద్దేశ్యం.

గడచిన కొలది మాసాల్లోనూ బ్రిటిషు రాజనీతి ఫలితంగా ఏమైనా సంభవించిందంటే, అది ఇది: భారత దేశంలో తమ సామ్రాజ్యాన్నిలాగే గానకే నిలబెట్టుకోవాలనే ఏకైక నిశ్చయం, క్రిప్సు రాయబారాల్లో విషయమైనా సుస్పష్టంగా వ్యక్తమైనదంటే అది ఈ దేశంలో ఐక్యత ఎంతఉన్నా యుద్ధం జరుగుతున్నంతవరకు, నిజమైన అధికారాన్ని భారతీయుల చేతుల కందనీయకుండా చేయాలనే దృఢనిశ్చయం. ప్రజల ననువర్తిగా ఉండే జాతీయ ప్రభుత్వం కావలసిందిగా కాంగ్రెసు, లీగు కలసి అడిగినా, యుద్ధకాలంలో అందుకొప్పుకోమని క్రిప్సు స్పష్టంగా చెప్పారు. (ఇక భవిష్యత్తు గురించి బ్రిటిషువారు చేసే వాగ్దానాలంటే ఇంతవరలో ఎవరికి నమ్మకముంది? ఇక ముందు మాత్రం ఎవరికి ఉండగలదు?) బ్రిటిషువారి ఈసుళ్ళస్ట ప్రకటనల వల్లకూడా కాంగ్రెసు, లీగు ఒడంబడిక లేనందువల్లనే చెయ్య

టం వల్ల కలసివచ్చేదేమీ లేదు. పైగా ఈ ఆందోళనవల్ల, చర్చలు, ఆ[illegible] ధీలు ప్రచురించ కుండా అహోరాత్రులు వ్యాపకం చేసే అసత్యాలను ఇంటు వలన బలమిచ్చినట్లు అవుతుంది కాంగ్రెసు - లీగు ఒడంబడిక కోసం ఆందోళన చెయ్యటం ఈ పరిస్థితుల్లో బ్రిటిషువారి సామ్రాజ్య పన్నాగాల్లో ఒక ఎత్తుమాత్రమే కాగలదు.

అయితే ఇలా అనవచ్చు కాంగ్రెసు లీగు ఒడంబడిక కుదిరినంత మాత్రాన బ్రిటన్ జాతీయ ప్రభుత్వానికి ఒప్పుకోక పోయినప్పటికీ ఆ ఒడంబడిక వలన స్వాతంత్ర్య శక్తులు బలపడవా అని. అలాంటప్పుడు అది వాంఛనీయమే గదా అని. కాబట్టి అందుకై ప్రయత్నించ వలసిందేగదా అని సిద్ధాంతం సక్రమమైతే, సారాంశం కూడా సరిగానే ఉండాలి. కాని సిద్ధాంతం పూర్తిగా తప్పు. స్వాతంత్ర్యం కోసం పోరాడి, కష్టాలు సహించటానికి సిద్ధంగా ఉన్న శక్తులే స్వాతంత్ర్యాన్ని సాధించగలవు. దాని యావత్తు చరిత్రలో ముస్లింలీగు ఇంతవరకు ఒక్కసారికూడా పోరాటానికి దిగలేదు ఇవ్వాళైనా అందుకు సిద్ధంగా లేదు. పోరాడకుండా భారత దేశం స్వాతంత్ర్యాన్ని సిద్ధించుకోలేదు కాబట్టి పోరాటంలో పాల్గొనటానికి ముస్లింలీగు సిద్ధంగా లేనప్పుడు, దానితో కుదుర్చుకునే ఒడంబడిక వలన స్వాతంత్ర్య శక్తు లేవిధంగానూ బలపడవు, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనటానికి లీగు సిద్ధపడివుంటే, దానితో అప్పుడు అంగీకారానికి రావటం సులభమే అని నెహ్రూ అన్నాడు అది అర్థంలేని మాటకాదు.

కాంగ్రెసు - లీగు ఐక్యతను గురించి ఇకచాలు. లీగుయొక్క నిజతత్వం గురించి ఒకమాట. లీగు బ్రిటనుకు నేస్తం అని స్పష్టంగా గ్రహించటం అవసరం. జిన్నా బుద్ధిపూర్వకంగా దేశానికి ద్రోహం చేస్తున్నాడు. ఇతగాడు మీర్ జాఫర్ అన్నమాట! తనకు కావలసింది బ్రిటను వలన లభిస్తుందని అతని విశ్వాసం. కాని సామ్రాజ్య ఖండాలను తన తాబేదార్ల పరంచేసే ఆచారం బ్రిటనుకు లేదు. మీర్ జాఫరును, అతని పూర్వీకులను తమ పబ్బం గడుపుకొని విసర్జించినట్టే, జిన్నానుకూడా పూర్తిగా ఉపయోగించుకొని

బ్రిటను విసర్జించి తీరుతుంది. ఇందులో 'సందేహంలేదు బెంగాలు నిర్వాకం పరిపాలిస్తోంది మీర్ జాఫర్ సంతానం కాదని; క్లయివు చుట్టాలని నూహమ్మ దీయులు జ్ఞప్తిపుంచుకోవాలి తాను చాలా మేధావి అని జిన్నా అనుకుంటాడు. తానెంత అహంభావంతో విర్రవీగినా, తానెంత పేట్లరు క్రినిని అలవర్చుకున్నా, చరిత్రమటుకు జిన్నాను శుద్ధ తెలివితక్కువవానిగా, వంచకునిగా నిరూపిస్తుంది.

జిన్నాకు పాకిస్థాన్ కావాలి. నిజంగా కావాలనుకుంటే, అందుకోసం త్యాగాలు చేయాలి. ప్రాణం సైతం అర్పించవలసివుంటుంది. కాని అక్కడే వస్తుంది చిక్కు. జిన్నాగాని, అతని అనుచరులుగాని ఈపనిమాత్రం చెయ్యరు. అందుకనే పాపం మహాత్మాజీ చెవుల్లో పాకిస్తాన్, పాకిస్తాన్ అని జిన్నా గొంతుమటుకు చీల్చుకుంటాడు అయితే జిన్నా పవిత్ర పాకిస్తాన్ పాపం గాంధీజీ చేతుల్లోలేదు. దాన్ని స్వాధీనం చేసుకొని, అణచి పట్టి, దాన్ని కళంకపరుస్తున్నది— రక్తసిక్తమైన బ్రిటిష్ సామ్రాజ్య పాదాలు. జిన్నా బ్రిటిషు వారి చేతుల్లోంచి పాకిస్తానును లాక్కొనగలిగితే కాంగ్రెసు కభ్యంతరముండదు. అప్పుడు భారత దేశంలో చివరకు ఒక భాగమైనా స్వాతంత్ర్యం పొందినదవుతుంది. కాని అతను లాక్కోలేడు, ఎందుకంటే, అందుకు కావలసిన త్యాగానికి అతను సిద్ధంగా లేడు కాబట్టి కాంగ్రెసును వంచన చేస్తూ [illegible] గడపాలని అని గుద్రోహి కాని పాపం చు[illegible] చర్చిలే జిన్నాను [illegible] వవలసివస్తున్నా, ఎప్పుడైనా [illegible] నొకప్పుడు పార్లమెంటు అఖ్యర్యంకిద భారత దేశాన్ని రెండు భాగాలుగా పంపించినా, ముస్లిం జాతికి ప్రత్యేకంగా స్వాతంత్ర్యం బ్రిటిషు వారిస్తారనుకోటం భ్రాంతి ఎందుకంటే అది సామ్రాజ్యానికి శ్రేయస్కరం కాదు. అల్పసరువల్ల బిరిషువారికి కలిగే మంచి ఏమీలేదు నిజానికి అందువల్ల, అల్పసరును ప్రత్యేకంగా విడదీసినందువల్ల, బ్రిటిషువారు బర్లండు హృదయంలో కి తమ కత్తిని గుచ్చిన వారయారు.

సామ్రాజ్య తంత్రానికి, జాతీయ ద్రోహానికి ఫలితంగా లీగు నిజతత్వం ఏర్పడ్డది.

షోనాన్ (సింగపూరు)లో స్వతంత్ర తాత్కాలిక భారత జాతీయ ప్రభుత్వాన్ని శ్రీ సుభాస్ చంద్రబోస్ స్థాపించినట్లు మీకూ తెలిసి ఉంటుంది. దాన్ని జపాను ప్రభుత్వం అధికారరీత్యా గుర్తించింది. జాతీయ సైన్యాన్ని ఒకదాన్ని కూడా అతను నిర్మించాడు. అప్పుడు బాగా వృద్ధి చెందుతోందని తెలుస్తోంది. ఇవి మనకు ముఖ్యమైన సంగతులు. ఇక్కడింకో సంగతి కూడా మీకు చెప్పవచ్చు, బెంగాలులో మలమల మాడుతున్న ప్రజలను పోషించేందుకై ఎంత బియ్యం కావాలో అంత పంపిస్తానని సుభాసు ప్రభుత్వం ప్రకటించింది. అతని ప్రభుత్వం ఏర్పడగానే చేసిన మొదటిపనే ఇది. కాని మన దేశస్థులు, పురుగులవలె మలమలమాడి నశించిపోవటమేనయ్యో బ్రిటనుకు కావలసింది!

సుభాసును క్విస్లింగుగా ఖండించటం తేలిక, తామే బ్రిటను క్విస్లింగులయిన వారికి మరీ తేలిక. కాని అతను అత్యంత దేశభక్తుడని, స్వాతంత్ర్య పోరాటంలో ఎప్పుడూ ముందుకు దూకేవాడని జాతీయవాదులకు తెలుసు. తన దేశాన్ని అమ్మి చూస్తాడనటంలో అర్థంలేదు. అతనికి కావలసిన ధన, ఆయుధ సంపత్తి నంతా అక్షరాజ్యాలే ఇచ్చివయునటంలో సందేహంలేదు. కాని మనం చూడవలసిన మొదటి విషయం ఇది: అతను నిర్మించిన ప్రభుత్వంలోనూ, జాతీయ సైన్యంలోనూ ఉన్న మనుష్యులకు బ్రిటను అంటే కోత. తమ మాతృదేశాన్ని చెరవిడిపించు కోవాలనే కోరికతో తనా శ్రమ లాడుచున్నారు. ఇక రెండో విషయం, మిత్రమండలి దేశాల ప్రాపకంలో ఉంటున్న పరారైన యూరపు ప్రభుత్వాలన్నీ ఆదేశాలనుంచే ఉపాదిని పొందుతున్నయ్. మూడో సంగతి: ప్రపంచ యుద్ధంలో చెయ్యవలసే ఎత్తులను బట్టి బలీయమైన దేశ మొకటి దుర్బలమై, పతనమైన ఇంకో దేశానికేమి పనులుం కల్పించ వలసి వస్తుందో ఎవరూ చెప్పలేరు. బర్మాకు జపాను 'స్వాతంత్ర్యం' ఇచ్చింది. ఈ విషయానికి బాగా పేరు వచ్చింది ఇందుకు సంతోషించి, సోవియటు ప్రభు[illegible] జ[illegible]వారి జెండాలా[illegible] మెచ్చుకుంటూ, టోజో ప్రభుత్వా మెచ్చుకుంటూ, టోజో ప్రభుత్వాన్ని అభినందించినట్లు ఓ వార్త తెలుస్తోంది. అదేమైనప్పటికీ, బ్రిటిషు 'ప్రజాస్వామిక

ఆధిపత్యంలో కంటె, జపాను 'ఫాసిస్టు' పెత్తనంలోనే బర్మాదేశస్థులు ఎక్కువ స్వాతంత్ర్యం పొందగలుగుతున్నారు. ఇది నిస్సందేహం. ఇక సుభాను సంగతి: శత్రువుల శత్రువునుంచి సాయం పొందటమనే నీతి యుగయుగాల నాటిది. మేకెవెల్లీ, కౌటిల్యుల కంటె కూడా పూర్వం నుంచే వస్తోంది ఈనీతి. దీని ప్రకారం శత్రు సహాయం పొందటానికి అతను ఒప్పుకున్నాడు. ఇది స్పష్టం. అలా మూడో వానినుంచి సహాయం పొందటం వలన అతను చివరకు మోసపోవచ్చు. కాని అతని సంకల్ప శుద్ధిని గురించి, కార్యదక్షత గురించి శంక ఏమాత్రమూ ఉండరాదు. తన దేశ స్వాతంత్ర్యం కోసం అతను చేసే సహాయం ఫలిస్తుందో, ఫలించదో జరిగిపోయే ఘటనల మీద ఆధారపడి వుంటుంది. ఇవి మన నాయకులు చెప్పినట్టు జరుగవు. ఇతర దేశాల్లోని నాయకులు చెప్పినట్టు జరుగవు. అవెలా జరుగనున్నవో ఎవరూ చెప్పలేరు.

షోనానులో భారత దేశ ప్రభుత్వమూ, జాతీయ సైన్యమూ ఏర్పడటం ముఖ్యమైన విషయాలే. అయినా మన స్వాతంత్ర్యం చాలామటుకు మనశక్తి, సంఘటనమీదనే ఆధారపడివుంటుందనే నొక్కి చెప్పాలి. పరసహాయంమీద ఆపేక్ష పెట్టుకొని, తామేమీ చేయకుండా వుండటం ఆత్మహత్యకు దారితీసే రాజనీతి. బైట సహాయం ఉన్నంత మాత్రాన మన స్వాతంత్ర్యం చేకూరదు. సుభాను సైన్యం ఎంత పెద్దదైనప్పటికీ, మన దేశంలోని మిత్రమండలి సైన్యాలను ఓడించగల దనుకోవటం భ్రాంతి. ఏ సైన్యమైనా వాటిని ఓడించ గలిగితే అది జపాను సైన్యం కావచ్చు. కాని జపానువారు భారతదేశంలో బ్రిటిషు వారిని ఓడిస్తే టోజో సుభానుల మధ్య ఏ వరాలున్నప్పటికీ, వాళ్లు చూస్తూ చూస్తూ మన దేశాన్ని మన పరం చెయ్యరు. మన దేశంలో మిత్రమండలి సైన్యాలు, అక్షరాజ్య సైన్యాలు తలపడే సందర్భంలో అధికారాన్ని మన పరం చేసుకోటానికి మనం సిద్ధంగా ఉండాలి. అలాంటి విధానం మనమవలంభించ దలచుకున్నప్పుడే సుభాను సైన్యం లాంటి బైట సహాయం మనకు ఉపయోగపడుతుంది. భారత దేశాన్ని ఆక్రమించటం టోజో నిరాకరించవచ్చును. అయితే, జాతీయ

శ్రేయస్సును గురించిన ఈ విషయం గురించి సుభాస్ ఎంత మెలకువగా ఉన్నాడో చెప్పటం కష్టం.

దీన్నిబట్టి, యుద్ధం మనగడపవద్దకే వచ్చినప్పుడు, మనమేమి చేయాలి అనే ప్రశ్న వస్తుంది. బ్రిటిషు రాజనీతి ఫలితంగా, ప్రతి సామాన్య భారతీయుడు బ్రిటనుకు ఎంత ప్రతికూలంగా పరిణమించాడంటె, తనకుతానై జపానును స్వాగతించకపోయినా, బ్రిటను – జపాను సంఘర్షణ మన దేశంలో సంభవిస్తే, తటస్థంగా మటుకు ఉండిపోతాడు. ఈ తాటస్థ్యమంటె మనకు చావు అన్నమాట ఈ తాటస్థ్యాన్ని నిర్మూలించి, దానిస్థానే స్థిరమైన కార్యక్రమాన్ని నిర్వర్తించేందుకై మనం పాటుపడాలి. యుద్ధంజరిగే ప్రాంతాల్లోనూ, జపాను ఆక్రమించే ప్రాంతాల్లోనూ, లేక జపానువాళ్లు చాటుగా చొరబడి ప్రవేశించే ప్రాంతాల్లోనూ విదేశ పరిపాలన నిర్వీర్యమవుతుంది లేదా అంతమవుతుంది ఈ ప్రాంతాల్లో మనం స్వరాజ్య ప్రభుత్వాలను స్థాపించుకోవాలి. అప్పుడు, విరోధి తాకిడికాగలేక వెనుకకు మళ్లిపోయే భారత సైన్యాన్ని (అంటె బ్రిటిషువారేర్పరచిన సైన్యాన్ని) పలాయనం చేయవద్దనీ, కదనరంగంలో నిలదొక్కుకోవాలని, భారత ప్రజాసేవగా వ్యవహరించవలసిందని మనమీ స్వరాజ్య ప్రభుత్వం పేరిట విజ్ఞప్తి చేయవచ్చు. అలాంటి ప్రభుత్వాన్ని తూర్పురాష్ట్రంలో స్థాపించేందుకై ఇవ్వాళనుంచే మనం సన్నాహం చేయాలి. కాలక్రమేణ అది దేశమంతా వ్యాపించవచ్చు. ఈ సన్నాహకార్యం గురించి అనేక ప్రశ్నలు తట్టుతయ్. చూచాయగా మటుకు ఆ కార్యవిధానాన్ని సూచించి, దాన్ని స్వాతంత్ర్యయోధుల దృష్టికి తెస్తే చాలు.

ముగించే ముందు, యుద్ధం గురించి ఒకమాటో, రెండు మాటలో చెప్తాను మనదేశంలో అక్కడక్కడ ఇంకా యుద్ధస్వభావాన్ని గురించిన (అంటే ఇది ప్రజాయుద్ధం అవునా కాదా అని) నిష్ఫలవాద వివాదాలు జోరుగానే సాగుతున్నయ్. దేశ విధ్వంసకులు (Fifth columnists) ఇది ప్రజాయుద్ధమని ఇంకా నొక్కి చెప్తూనే ఉన్నారు. వాళ్లలా చెప్ప

టం సహజమే. ఇక ఈవాద వివాదాలే రాజకీయాల్లో ఇహమూ, పరమూ, అనుకునే వాళ్లు ఇందు గురించి ఉద్రిక్తులై వాదోపవాదాలతోనూ, ఒక్కొక్కప్పుడు గుద్దులతోనూ చర్చిస్తూవుంటారు. కాని బ్రిటను సాగించే యుద్ధపు స్వభావమూ, దానికి సహాయం చేసే తమ దేశస్థుల స్వభావమూ ఎట్టివో మన ప్రజలకు పూర్తిగా తెలుసు ఆవిషయంలో వారి కేమీ అనుమానాలు లేవు. ఫాసిజంను గురించిగాని, ఈయుద్ధం తమదే అనిగాని మనప్రజలకు ఇంకా బోధచెయ్యటం అనవసరం. గత సంవత్సరం బ్రిటిషుఫాసిజం యొక్క భయంకర రాక్షసత్వాన్ని ప్రజలు ప్రత్యక్షంగా చూడగలిగారు. కారాగృహాల్లో కృశించి పోతున్నవారికీ; "శాంతి భద్రత"లను తిరిగి స్థాపించేందుకై బ్రిటిషువారు దేశమంతటా చేస్తున్న ఖూనీలఫలితంగా తమఆప్తులను కోల్పోయిన వారికీ; తమ ఇళ్లు దగ్ధమై, కొల్లగొట్టబడిన వారికీ; తమ స్త్రీలు అవమానితులైన వారికీ; తిండిలేక మలమల మాడి వీధుల్లో నల్లుల్లా చచ్చిపోతున్న వారికీ వీరందరకు ఇది ఎలాంటి ప్రజాయుద్ధమో, బాగా తెలుసు. బాబర్ వంశంలోని నవాబులను శిరచ్ఛేదం చేసి, వారి మొండి తలలను బ్రిటిషు సైన్యాధిపతి ఒకడు ఆఖరి మొగలు సామ్రాట్టుకు విక్టోరియారాణి — కానుకగా అర్పించాడు. అది జరిగిన ఓ నూటయేభయ్యేళ్ల తర్వాత, గాంధీజీ చనిపోతాడనే ఆశతో ఆయన బొందిని దహనం చేసేందుకుగాను కావలసినంత గంధపుచెక్కను కొనివుంచానని టోటెన్‌హాం (.........) అమెరికను పత్రికా విలేఖరులముందు డంబాలుకొట్టాడు. బ్రిటిషు పరిపాలన ఆరంభమైననాటినుంచి అంతమైనదాకా (అంతం ఎలాగో దగ్గరలో పడనేవున్నది గదా) జరిగిన ఈ సంఘటనలు, ఇతర దారుణకృత్యాలను భారతదేశం మరచిపోలేదు. ఫాసిజంను గురించి మనప్రజలు మార్క్సిస్టులమని నటిస్తున్న దేశద్రోహులనుంచి నేర్చుకోవలసిన అవసరమేమీ లేదు.

యుద్ధం మొదలై ఆయిదేళ్లయింది. తత్ఫలితంగా జీవితానికీ, సుఖానికి కలిగే నష్టాన్ని మళ్లీ ఎప్పటికీ తీర్చలేం. యుద్ధం తక్షణం అంతమవటం, ఉభయ పక్షాల్లోని జనసామాన్యానికి క్షేమకరం. [illegible] యూరో

వెల్టులు, హిట్లర్లు, టోజోలు యుద్ధాన్ని ఆపలేరు ప్రస్తుతం ఈ చిత్రవధను ఆపమని వాళ్ళొకవేళ అన్నా, భవిష్యత్తులో ఇంతకంటె దారుణమైన చిత్రవధ సాగించేందుకై నవీన, భయంకర మారణాస్త్రాలను తయారుచేసుకునే టందుకు మాత్రము మటుకే. యుద్ధానంతర ప్రపంచం గురించి మిత్రమండలివారు చేస్తున్న సూచనలబట్టి, మనకు తెలిసినంతవరకు, ఇదివరకటి అధికవర్గాలూ, జాతీయ అహంకారమూ, పెట్టుబడిదారీపోటీ, అల్లకల్లోలమూవుండే పూర్వ ప్రపంచమే మళ్లీ ద్యోతకమవుతోంది. ఇలాంటి ప్రపంచం వల్లనే. ఒకే తరంలో ఘోరయుద్ధాలు రెండుసార్లు సంభవించినయ్. మూడోది కూడా తప్పక సంభవిస్తుంది

ప్రపంచంలోని జనసామాన్యం ఈ యుద్ధాన్ని నిజంగా అంతం చెయ్య వచ్చు. కాని వారిది క్షతగాత్రం. జనసామాన్యం తరఫున నడుంకట్టి, పూను కొగలిగిన రష్యాయే, బ్రిటన్ - అమెరికాల సామ్రాజ్యవాదులతోనూ, బ్రిటన్ అమెరికాల పెట్టుబడిదారులతోనూ కుబేరులతోనూ ఏకమై, తన దేశంలోని ప్రజలను అణచిపెట్టి, బైటదేశాల్లోని ప్రజలను విసర్జించినది. ప్రపంచమంతటా కార్మికవర్గం ధనికవర్గపు అడుగుజాడలననుసరించింది. అందువలన కొత్త ప్రపంచంలో తనకు లభించే నాయకత్వాన్ని కోల్పోయి, తనను తా అమ్ము కున్నదయింది.

ఈ పరిస్థితుల్లో ప్రపంచంలోని అగ్ర ప్రాణుల ఆశయాలకు, సంకల్పా లకు భారతదేశం మటుకే సరైన, స్థిర చిహ్నంగా ఉండగలదు. భారత దేశపు స్వాతంత్ర్యపోరాటమంటే, సామ్రాజ్యతత్వంతో ఢీకొనటం మాత్రమే కాదు. సామ్రాజ్యతత్వం ఫాసిజానికి మూలకారణం (కాబట్టి ఫాసిజాన్నికూడా ఢీకొన్నట్లే) జనసామాన్యంచే యుద్ధాన్నాపు గలిగించే మహోద్యమంకూడా అన్నమాట. మనకు లక్ష్యము మిత్రమండలి విజయమూ కాదు. అక్షరాజ్యాల విజయమూ కాదు. ఈ రెంటిలో దేనిపైనా మనం ఆశపెట్టుకొనిలేము ప్రపంచ జన సామాన్యం సామ్రాజ్యతత్వాన్ని, ఫాసిజాన్ని రెంటినీ కూడా నేలమట్టం చేసేట్టు మనంపాటుపడతాం. మనపోరాటం ద్వారా, యుద్ధా

హితాన్యానికీ; నల్ల, తెల్ల రంగుజాతుల ప్రజలందరి దాస్య విమోచనానికి దారి చూపించగలం.

మీకు చాలా కాలహరణం చేశాను. ఇక ముగించాలి. పోరాటాన్ని మనకు లాభకరమని చూపటానికి ప్రయత్నించాను. అయితే, మనమేవిధంగా పోరాడాలి?

ప్రస్తుతం, అసంతృప్తులైన స్వాతంత్ర్యయోధులే కార్యరంగంలో ముందుకు రావాలని ఇదివరలోనే చెప్పాను.

తమ పోరాటపు సంస్థను నిలబెట్టుకొని, బలపరచి, విస్తరించుకోనటమే ఈ యోధులు చెయ్యవలసిన మొదటిపని. మంచి కట్టుదిట్టమైన నాయకులేకుండా, ఏ సైన్యంకూడా, అహింసా - సైన్యమైనప్పటికీ పోరుసల్పలేదు. ప్రజా సంఘటనలు అప్రయత్నంగానూ, సాంఘిక కారణాల ఫలితంగానూ మామూలుగా సంభవిస్తాయి. కాని వాటికో స్వరూపాన్ని నిర్ధారణను ఏర్పరిచేందుకై విప్లవాత్మకులైన బుద్ధిశాలురు ఉండాలి. ఎందుకంటే, అలాంటి ప్రతిభావంతులు చేసే కృషిఫలితంగా కూడా ప్రజాఉద్యమాలు సంభవించగలవు. సంఘటనా విషయాలను గురించి ఉద్యమనాయకులు నిర్లిప్తంగా ఉంటున్నట్లు ఇటీవల కన్పట్టుతోంది. నిర్బంధితులయేంతవరకు, నాయకులు ప్రజలకేమీ ఆదేశమివ్వకుండా, కర్తవ్యాన్ని వారియథేచ్ఛకే వదిలేశారు. అహింసా విధానానికీ, రహస్యవిధానానికి మధ్యవున్న ప్రతిబంధకమే ఈ నిర్లిప్తతకు మూలకారణమనటం నిస్సందేహం. రహస్యవ్యవహారానికి అహింస ఒప్పుకోదు. కాని పోరాడుతూవుండే సమయంలో దాన్ని నడిపే సంస్థ ఉదాత్తంగా ఉండాలి. ఈ ప్రతిబంధకాన్ని తీర్చగలనని నేను భ్రమపెట్టను. కాని నేను చెప్పగలిగిందల్లా ఇది: అహింసా శాస్త్రజ్ఞులు ఈ ప్రతిబంధకాన్ని తీర్చగలిగేదాకా, అహింసను కచ్చితంగా పాటించేవారు కూడా, తమ ఆదర్శాన్ని కొంచెం సడలించుకొని, రహస్య విధానాని కొప్పుకోటం కార్యదక్షతకు అవసరం, అని గాంధీకే కూడా ఇలా సమాధానం చెప్పగలను. రహస్య విధా

నాన్ని ఊరికే ఖండిస్తూ, బూటకపు విధానాన్ని పొగడినంత మాత్రాన, మన సంకల్పాన్ని ఇనుమడింప చేసుకోలేము.

కాబట్టి పోరాటపు కార్యక్రమంలో, కట్టుదిట్టమైన సంస్థ నేర్పరుచుకోవటం మొదటి అంశం. మన ఉద్యమానికదే మొదటి రక్ష. అశాస్త్రీయంగా ఉన్న ఇప్పటి కాంగ్రెసు సంఘాలను బలిష్ఠంగానూ, జీవంతోనూ నిలబెట్టుకోటం అత్యవసరమని నేనిక్కడ నొక్కి చెప్పాలి. మన పోరాటాన్ని సమగ్రం చేయగలిగింది ఈసంఘటనే. ఈ సంఘాలు అధికార బద్ధమైనవి కావనే మాట నిజం. కాని కాంగ్రెసు ఈనాడు వాటిద్వారానే వ్యవహరించ గలదు. వాటి ద్వారానే ప్రజల సంపర్కంలో ఉండగలదు. వాటి ద్వారానే శత్రువుతో పోరు సల్పగలదు కొన్ని రాష్ట్రాల్లో ఈసంస్థలు సరిగా పనిచేయట్లేదు పని చేసేవారు లేకపోవటమే ఈదౌర్భల్యానికి అసలు కారణంకాదు. తగినంత ధనవసతి లేకపోవటం, సమర్థులు లేకపోవటం ఎక్కువగా ఇవే కారణాలు.

(అశాస్త్రీయంగాఉన్న) భారతజాతీయకాంగ్రెసు I. N. C. యొక్క కేంద్రసంస్థ వివిధరాష్ట్రాలలోనూ కనీసపువసతులనైన ఏర్పరిచేందుకు ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నాలు ఫలిస్తున్నయి మన దేశంలోని ధనికవర్గం ఈ విప్లవంలో ఎంతవరకు పాల్గొన్నారనే విషయాన్ని చర్చించటానికిది తగిన సందర్భమూ కాదు తగినసమయమూ కాదు వివేకము, దూరదృష్టి వారిలో పూర్తిగా లోపించిందనే దీన్ని గురించి క్లుప్తంగా వ్యాఖ్యానిస్తేచాలు. మన జాతీయ ఉద్యమం అణగారిపోతే వాళ్లకేమైనా కొంచెం దూరదృష్టిఉంటే మనఉద్యమం అణగారి పోయినందువల్ల బ్రిటిషుపెట్టుబడిదారీ యుద్ధానంతర ప్రపంచంలో తమకేమాత్రం చోటివ్వదని గ్రహించగలిగేవారు. ఎందుకంటే యుద్ధానంతర సమయంలో బ్రిటిషు వారిననే స్తంభింపస్తుంది. ఇందుబట్టైనా, జాతీయ విప్లవానికి స్వార్థంకోసమైనా హృదయ పూర్వకంగా వారు సహాయపడవలసింది అలా చేయక పోవటంబట్టి, వీరు అత్యంత స్వార్థపరులు మాత్రమే కాక చాలా అల్పులని, నికృష్టులని కూడా తేలింది.

డబ్బు ఇబ్బందులెలాగైనా తీర్చుకోవాలి. శక్తివున్న వారంతా సహాయం చెయ్యాలి. సంయుక్త రాష్ట్రంలోవలె, ఇతర రాష్ట్రాల్లోను కొన్నిట్లో మాజీ కాంగ్రెసు మంత్రులు జైళ్ళబైట వున్నారు. వీరూ, వివిధ రాష్ట్రాల్లో విడుదలయిన కాంగ్రెసు వారూ ఇంకేమీ చేయకపోయినా, కనీసం తమ రాష్ట్రాల్లో డబ్బుఇబ్బంది అయినా తీరేట్టు చూడాలి. కేంద్రసంస్థకు సంబంధించినంతవరకు, రాష్ట్రాలకు డబ్బు అందజేయుటయే దాని అత్యంత ముఖ్యమైన పని. కార్యక్రమాలను, ఆదేశాలను ఊరికే పంపిస్తూవుంటే చాలదు. వాటి ఆచరణలో పెట్టేందుకు కావలసిన వీల్లను కలిగించాలి. ఇలా చేయకపోవటం ఉపేక్షకిందకు వస్తుంది. అంటే విధిని సరిగా నిర్వర్తించినట్టు అవదు.

గడచిన ఆరునెల్ల విప్లవపు పరిణామంతో సన్నిహిత సంబంధం కలిగిన తరువాత మొదట్లో నాకు కలిగిన అభిప్రాయాలను ఇప్పుడు మార్చుకోవలసిన కారణం ఏమీ కనపడటంలేదు ఒక్క విషయంలో మినహా తప్ప క్రితం లేఖలో నేను చేసిన పరిశీలనకూడా ఏమీ మార్చుకోవలసిన అవసరంలేదు అదంత ప్రధానం కాకపోయినా ముఖ్యమైన విషయం.

క్రిందటి డిశంబరులోనే కొలది నెలల్లో మళ్ళీ ప్రజావిప్లవం సంభవిస్తుందని తోచింది. కాని ఆ విప్లవం ఇంకా రాలేదు అంత వెంటనే వచ్చేట్టుగా కూడా లేదని చెప్పాలి. ఇందువల్ల, మన ప్రస్తుతవిధానం పోరాటం ఎలా మార్పు చెందుతయ్? అనే ప్రశ్న తట్టుతుంది. ఈ ప్రశ్నకు సమాధానమివ్వ గలిగేందుకుగాను, సమర్థులైన కార్యదక్షులు, నాయకులు లేకపోవటం ఇంకా ఎక్కువ కఠినమైన సమస్యయినా సమస్యనిలా కొంతవరకైనా పరిష్కరించుకో వచ్చు. బైటవున్న కొద్దిమందీ సంచారం చేసి, ఇతరులను కలుసుకొని, వారి సమస్యలగురించి, సంప్రదించి వారికి వీలైన సలహాలను, శిక్షణను ఇవ్వాలి. ఎక్కడైనా దైవికంగా అవసరమైన వారికంటె ఎక్కువమంది సమర్థులుంటే వారిలో కొంతమందిని, అసలెవరూ లేనటువంటిగాని లేక బహుకొద్దిమంది వున్నటువంటిగాని ప్రాంతాలకు పంపేయవచ్చును. కొత్తవారిని తర్ఫీదు

చేయాలి. ముఖ్యంగా విద్యార్థులను; జైళ్ళలోంచి విడుదలైనవారిని మళ్లీ ఉద్యమంలోకి రప్పించాలి.

డబ్బుతోనూ, కొత్తయోధులను భర్తీ చేయటంవలన సరైన శిక్షణ వలన, నైపుణ్యంతోనూ, అనుభవంతోనూ మన సంఘటనా సమస్యలను పరిష్కరించుకోగలగాలి.

శత్రుఘాతుకు లొంగకుండా మన బలాన్ని కూడదీసి ఉంచుకోటం పోరాటంలో ఒకభాగం – ఓ భాగం మాత్రమే. మన సంస్థయొక్క ప్రతి శాఖ ప్రజలతో సంపర్కం ఏర్పరచుకొని ఉండాలి. స్వాతంత్ర్యయోధులకు ప్రజలకు మధ్య సంబంధాన్ని తెగిపోనీయకూడదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆ సంబంధం ప్రచారమన్నమాట – ఉపన్యాసంద్వారానూ, రచన ద్వారానూ కరపత్రాలు. పోస్టర్లు రేడియోద్వారాను స్వాతంత్ర్యయోధుల దళాలు దేశంలో సంచారంచేస్తూ, ప్రజలను కలుసుకుంటూ, వారితో చర్చిస్తూవుండాలి వ్రాయటం, ప్రకటించటం ఎంత ముఖ్యమో ప్రచార సాహిత్యాన్ని వ్యాప్తిచేయటం అంత ముఖ్యం ప్రతి పని గురించి ముందుగా శ్రద్ధ తీసుకోవాలి. ప్రచార రంగాలను జాగ్రత్తగా పరిశీలించాలి. విద్యార్థులు, కార్మికులు రైతులు వీరికేగాక, ముఖ్యంగా పోలీసు, సైన్యశాఖల్లో క్రింది వర్గాల వారికి కూడా మ మాటలు అందేట్టు చూడాలి విదేశప్రచారం కూడా మన కర్తవ్యంలో ఓ భాగం

ప్రచారమంటే వట్టి ప్రచారం మటుకే కాదు. మన పోరాట విధానాల్లో అది ఒకటి. ఎందుకంటే రేడియో కేంద్రాన్ని సాగించటం, ఆశాస్త్రీయ కరపత్రాలను పంచి పెట్టటం, నిషిద్ధమైనచోట సమావేశాలు ఏర్పాటు చేయటం, శాసనవిరుద్ధమైన విషయాల బోధించటం, ఇదంతా అక్రమమైన బ్రిటిషు ప్రభుత్వంలో మనం సాగించే పోరాటంలో ఒక భాగం అన్నమాట.

ఇంతకంటె ఎక్కువ ఏమి చేయగలం? అంతర్జాతీయ పరిస్థితుల్లో మార్పు కలిగించితే తప్ప — అంటె, రష్యా జర్మనీలమధ్య ఒడంబడిక, చైనా జపానుల మధ్య శాంతి, బ్రిటిషు సైన్యానికి మంచి దెబ్బ, మన దేశంలో యుద్ధము సంభవిస్తే తప్ప మన మేమీ పెద్ద పని చేయలేమని చెప్పటానికి నేను సందేహించను. స్వాతంత్ర్య యోధులు ఏనాటికైనా ధైర్యాన్నూ చిక్కు కోకూడదని నా అభిప్రాయం. వెంటనే విజయం వచ్చి తీరాలి అనే పేరాశ లేకుండా పోరాడే వారే చివరికి గెలిచి తీరుతారు. ఇతరులు బరి విడిచి పెట్టి పారి పోతారు సూక్తుల నుపదేశిస్తారు. రాజకీయ ధురంధరులవలె నటిస్తారు. కాని వారిని స్వామిద్రోహులని, క్షుద్రులని, అంతకంటె క్షుద్రులైన పిరికిపందలని, కష్టాలుచూసి బాధ్యతను విస్మరించిన వారని చరిత్ర నిరూపిస్తుంది. ఇవ్వాళ మన మవలంభిస్తున్న ప్రతిఘటనా విధానం, సత్యాగ్రహం కానీ, సమ్మెలు గానీ, లేక విధ్వంసక కృత్యాలు గానీ, ఇవి నిష్ప్రయోజకమని చాలామంది మిత్రులు నిస్పృహ చెందుతారు. బ్రిటిషు పరిపాలనను స్తంభింపజేయగలిగినంతటి బాహుళ్యంగా మన ప్రతిఘటన లేదనే మాట నిజం. కాని ఇంకో దృష్ట్యా మంచి లాభకారి. ప్రచారంగా ఉపయోగిస్తుంది ప్రజల్లో నిబ్బరం సడలకుండా బిగపట్టివుంచుతుంది. ఇంతకంటె ఉద్ధృతమైన పోరాటం తప్పక జరిగితీరగలదనే నమ్మకాన్ని ప్రజల్లో దృఢపరుస్తుంది. స్వాతంత్ర్యయోధులను సుశిక్షితులగా తర్ఫీదు చేస్తుంది. పోరాటాన్ని సమసిపోకుండా సాగిస్తుంది తన నిరంకుశత్వమంతా శుష్కదండగ అని విరోధికి నచ్చచెప్పుతుంది ఇవంతా తక్కువవిషయం కాదు. అంత్యపోరాటానికిది సన్నాహమనే భావంతో ఇది లాభకారి కాబట్టి మన నమ్మకాలకు, మతాలకు, కార్యక్రమానికి అనుగుణమైన మార్గాలన్నిటిద్వారా బ్రిటిషు అధికారాన్ని మనం ప్రతిఘటిస్తూనే ఉండాలి.

కట్టుదిట్టమైనసంస్థ, ప్రచారం, బాహాటమైన ప్రతిఘటన ఇవే మనకనీస కార్యక్రమము. ఇదికాక సన్నాహరంగమెంతో ఉంది. విద్యార్థుల మధ్య, కార్మికుల మధ్య మనం పని చేస్తూవుండాలి సైనికులతోనూ ఇతర [illegible]

తోనూ మన సంఘర్షణాన్ని నిలబెట్టుకొని, పెంపొందించుకోవాలి, విధ్వంసక సన్నాహాలకు సిద్ధపరచాలి. ఆగస్టు 9 తేదీ నాటికంటె ఎక్కువ విస్తారమైన, కట్టుదిట్టమైన, ఉద్ధృతమైన విజృంభణే మాకు లక్ష్యం మన ప్రతిపని వలన ఆలక్ష్యానికి మనం చేరువ అవుతూ వుండాలి.

ఆహార పరిస్థితిని గురించి ఒకమాట దానితీవ్రతగురించి నేనేమీ చెప్పనవసరంలేదు. ఎందుకంటె అదిబాగా తెలిసిన విషయమూ; బోధపడిన విషయమూ కాని బాగా స్పష్టంగా కాని విషయం ఇది: ఆహారసమస్యకు నిజమైన పరిష్కారం స్వరాజ్య ప్రభుత్వమే అని. కొంతవరకు బ్రిటిషువారి అసమర్థత ఫలితంగానూ కొంతవరకు వారి పన్నాగం ఫలితంగానూ ఈసమస్య ఏర్పడ్డది. వారిక్కడ వున్నంతవరకు, పస్తుంటూ మలమలమాడటం తప్పగత్యంతరంలేదు. కాబట్టి స్వాతంత్ర్యం కోసం పోరాటమంటె నిజానికి ఆహారంకోసం పోరాడటమన్నమాట, కాని ఇలాఅన్నంత మాత్రాన లాభంలేదు. ఆహారంకోసం పోరుసల్పటం మన స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగంగా ఎంచుకోవాలి. ప్రస్తుత ఆహార పరిస్థితుల్లో మన ప్రజలు చేస్తున్నదల్లా దాన ధర్మం మటుకే. వర్గశ్రేణీకృతమైన సంఘంలో దానధర్మాలకు చోటువుంది. సామ్యవాదిగా వ్యవస్థను నేనెంతో గర్హించినా, క్షుధార్తులను మృత్యువాత బడకుండా కాపాడటానికి ఉద్యుక్తులయ్యేవారి దయాశీలాన్ని నే నభినందిస్తాను; ప్రజలు చేస్తున్న ఈ పని స్తవనీయం. కాని దాన ధర్మాలు చాలవు. వాటి వలన సమస్య పరిష్కారం కాదు. కాబట్టి స్వాతంత్ర్య యోధులూ చెయ్యవలసిన పని వుంది ఈ పరిస్థితుల్లో ఇదే అత్యంత ముఖ్యమైనది. ఈ దైన్యమంతటకు మూలకారణమైన విదేశ ప్రభుత్వంపై క్షుధార్తులలో ఆగ్రహావేశాలను రేకెత్తించి చెయ్యటం మామూలు బ్రిటిషు పరిపాలనను దుస్సాధ్యం చెయ్యటం క్షుధార్తుల కర్తవ్యం లభించిన ప్రతిచోట ఆహారాన్ని బలాత్కారంగా స్వాధీనపరచుకోమని మనం వాళ్లను ప్రోత్సహించాలి. ఉపదేశించటమే కాదు, ఆపని చెయ్యటానికి మనం తోడ్పడాలి. పల్లెప్రాంతాలల్లో ధాన్యాలను బైటికి పోనీయకుండా అరకట్టి పంచాయితీల ద్వారానో, లేక అలాంటి ఇతర సంఘాల ద్వారానో నియమబద్ధంగా పంపకం చెయ్యాలి. (ప్రభుత్వ సంఘాలను, వాటికి అనుబంధ సంఘాలకు ఎడంగా మటుకు ఉండాలి.) [illegible]

(కొండపనారు) విప్పడి, స్వాతంత్ర్య యోధులు ప్రభుత్వపు కొట్లల్లోని ఇలాంటి ఇతర ప్రదేశాల్లోని ధాన్యాన్ని బలాత్కారంగా స్వాధీనం చేసుకుని, క్షుధార్తులకందజేయాలి బలాత్కారంగా ప్రభుత్వం పంటలను చేజిక్కించుకోకుండా ప్రతిఘటించాలి బస్తీలలో, పట్టణాల్లో కూడా క్షుధార్తులలోని స్తబ్ధత్వాన్ని, నిస్పృహను తొలగించి, వాటిస్థానే ఆగ్రహావేశాలను రెచ్చగొట్టి, తత్ఫలితంగా ప్రభుత్వ ప్రతికూల ప్రదర్శనాలను ప్రత్యక్ష సంఘర్షణను ఏర్పాటు చేయాలి స్వాతంత్ర్య యోధులు నన్ను తరచు కార్యక్రమమేమిటని అడుగుతూ ఉన్నారు ఇదిగో ఇదే జీవకళలు ఉట్టిపడుతూన్న కార్యక్రమం దీన్ని మనఃపూర్వకంగా, ధైర్యంగా కొనసాగించేట్టయితే త్వరలోనే ఈదేశమంతా విప్లవజ్వాలలతో వెలిగిపోతుంది ఆజ్వాలలలో సామ్రాజ్యం పరగ కాగి ఇగిరిపోతుంది.

స్వాతంత్ర్య యోధుల సమీకరణమును గూర్చి చెబుతూ కాంగ్రెసును పేర్కొన్నాను. కాంగ్రెసు ఏర్పరచుకున్న హద్దులను అతిక్రమించి తమ ప్రత్యేక కార్యకలాపాలను నిర్వహించదలచిన వారికి ఒక వేరే సంస్థ అవసరమే అందుకు సేనో గోరిల్లా సంఘమువంటి దాన్ని సూచించాను గోరిల్లా ఉద్యమాన్ని విస్తరించు విషయంలో కొంత కృషి జరిగినదికూడ ప్రస్తుత పరిస్థితులలో ఈవిషయాన్ని గూర్చి ఇక్కడ ఇంతకన్నా ఎక్కువ ప్రసంగించలేను. ఈఉద్యమాన్ని గూర్చిన నాయభిప్రాయాలు, సలహాలు చేరవలసిన చోటులకు లక్షణంగా చేరగలవు, అభిరుచిగలవారు ఆ ఉద్యమంలో చేరటానికి కష్టపడవలసిన పనిలేదు అభ్యంతరాలేమీ ఉండవు

మిత్రులారా! ఇక నేను విరమిస్తున్నాను. మనసులో ఏమీ క్రోధం పెట్టుకోకుండా ప్రస్తుత పరిస్థితిని విశదం చేశాను. శ్లేషాద్యలంకారాలు, అన్వయ క్లిష్టత లేకుండా నాయభిప్రాయాలు మీకు తెలియ చెప్పాను నామాటలు ఎంతవరకు స్వీకారార్హములో నిశ్చయించుకోవలసిన వారు మీరు. సర్వదా నేను మీ ఆజ్ఞాబద్ధుడను 'మృత్యుర్వా యశోవా' అన్న పదమొక్కటే మనకు ధ్రువతార. కర్మవీరుల మౌదాము; లేదా మృత్యువును ఆశ్లేషిద్దాము.

—జయప్రకాశ్ నారాయణ్

# III

మిత్రులారా!

నేను జైలునించి రాగానే 'జనతా' పత్రికద్వారా మీకు నా అభివాదాలు చెప్పుతున్నాను ప్రస్తుత పరిస్థితులను గూర్చి నా యభిప్రాయాలు సూచిస్తూ మన సత్వర బాధ్యతలను వివరిస్తానని వాగ్దానము చేశాను. కాని అన్ని విషయాలూ నా సహాయాయులతో సంప్రతించి, కూడబలుకుకొనవలె కదా! అందు చేత తప్పనిసరిగ ఆలస్యమైనది; విచారకరము. ఇప్పటికి మా సంప్రదింపులు ముగిసినవి; ఒకవిధముగ రూపొందిన నాయుద్దేశములను మీముందు వివరింపగలుగుతున్నాను

ఇతఃపూర్వము నేనూ, నా అనుయాయులూ, ప్రత్యేకంగాను, సమిష్టిగానూ అప్పుడప్పుడు కొన్ని ప్రకటనలద్వారా కాలపరిణామంలో పొటమరిస్తూ వచ్చిన ప్రముఖ సమస్యలపట్ల మా దృక్పథాన్ని వెల్లడించాము. గత అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభాదేశంలో ప్రదర్శితమైన మా ఆశయాలు మీరు గమనించే ఉన్నారు. ఇప్పుడిక్కడ ప్రస్తుత పరిస్థితులనుగూర్చి మా అభిప్రాయాలను క్రమబద్ధంగా, దాపరికంలేకండా తెలుపుడు చేస్తాను; మన కర్తవ్యము నిరూపిస్తాను; ఆ కర్తవ్య నిర్వహణకు వలసిన మార్గాలను సూచిస్తాను.

ఇది సంధికాలము. అతిత్వరితంగా వస్తున్నాయి మార్పులు. బ్రిటిష్ వారు సృష్టించే ప్రజాపరిషత్తులో కాంగ్రెసువారు అడుగుపెట్టుటకు అఖిల భారత కాంగ్రెసు కమిటీ అంగీకరించింది. బ్రిటిష్ వైస్రాయికింద ఒక తాత్కాలిక ప్రభుత్వము ఏర్పడవచ్చును. కాని అట్టి ప్రభుత్వము ఎప్పుడేర్పడినా,.. వైస్రాయి, బ్రిటిష్ సేన, ఇతర బ్రిటిష్ ఉద్యోగులు భారతదేశం విడిచి పోనంతవరకూ,...అది 'స్వాతంత్ర భారత ప్రభుత్వం' అనిపించుకోదు

ఈ ప్రభుత్వమే స్వతంత్రప్రభుత్వంగా వ్యవహరించనీయటం లేదని వారిని యాచించటం స్వాతంత్ర్యాన్ని అను కోల్పోవటమన్నమాటే. తమ యిష్ట ప్రకారం అధికారాన్ని మనకు వొప్పజెప్పేవారు ఆ అధికారాన్ని వళ్లీ వారి యిష్టంవచ్చినప్పుడు తిరుగ లాక్కోవటానికికూడా అధికారులే. కాబట్టి తాత్కాలిక ప్రభుత్వమునేది స్వతంత్రభారత ప్రభుత్వమని భ్రమింప రాదుసుమీ!

అయితే మరి ఆ ప్రజాపరిషత్తు అనబడేది మనకు స్వాతంత్ర్యం తెస్తుందా? భారతదేశం స్వతంత్రదేశమని ప్రకటించి స్నగ్గగలదా? ఒక స్వతంత్ర రాజ్యాంగాన్ని ఏర్పరచి, వైస్రాయిచేత అధికారాలన్నీ దానికి ఒప్పగింత పెట్టించి, ఆయనకు సెలవు ఇప్పిస్తుందా? ఆ ట్రిబ్యునల్ గవర్నమెంటు బ్రిటిష్ సైనికులను, సివిల్ – మిలిటరీ ఆఫీసర్లనూ బ్రిటన్ కు టిక్కెట్టులిచ్చి పంపించగలదా? ఈ దేశపు ఆర్థిక క్షేత్రంలో పాతుకుపోయిన ప్రాబల్యాన్ని ఊడబెరికివేయగలదా? బ్రిటిషువారు భారతదేశం విడిచి వెళ్లిన తరువాత ఆ ప్రజాపరిషత్తు తాను అంతరిస్తూ ఆ ట్రిబ్యునల్ గవర్నమెంటుకు మరో ప్రజాపరిషత్తును – వయోజన వోటింగుహక్కు ననుసరించి ప్రజలెన్నుకొన్న ఒక నిజమైన మరో ప్రజాపరిషత్తును – సమావేశపరచగల అధికారాన్ని ప్రసాదించగలదా? భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధికి, ప్రజాస్వామ్యలబ్ధికి ఈ పైకార్యాలన్నీ నెరవేర్పవలెను. ఈ ప్రజాపరిషత్తు మరి ఈ పనులన్నీ చేయగలదా? కాని ప్రస్తుత పరిస్థితులు అవలోకిస్తే, దేశంలోని వివిధశక్తుల అనైక్యత మాస్తే ప్రజాపరిషత్తు పై కర్యములను ఒక్కటియైన ఫలవంతముగ కొనసాగించగలదనుకొనుట పెద్ద పొరపాటు. పోనీ, ప్రజాపరిషత్తు ఆమార్గాన కృషి చేయటానికి పూనుకుంటుందే అనుకుందాం; బ్రిటిష్‌వారు ఊరుకుంటారా? అడ్డుతగులుతారు. అప్పుడు ప్రజాపరిషత్తు త్రికరణశుద్ధికలది, సత్యబద్ధము అయినట్లయితే ప్రజాబలమును కూడ్చుకుని, బ్రిటిష్‌వారి నెదుర్కొని, తన సంకల్పాలు ఈ దేశప్ప మగెందు అవశ్యం ప్రయత్నిస్తుంది. ఆలా చేసిన నాడు ప్రజాపరిషత్తుకు పునాది వేసిన వైస్రాయే దానికి భరతవాక్యం పలుకుతాడు. అప్పుడు తత్ఫలితంగా సర్వపక్ష స్వాతం

త్ర్యసమరం చేస్తుంది. అప్పుడు గాని స్వతంత్రత ప్రజాసామ్యపద్ధతిపై ఒక నిజమైన ప్రజాపరిషన్నిర్మాణము జరుగనేరదు.

రేపు ఏర్పడబోయే ప్రజాపరిషత్తు ఈ కార్య కలాపమంతా నెత్తిపై వేసుకోగలదని తోచదు. సార్వభౌమత్వపు పద్దులు, దాని దౌర్బల్యాలు గుర్తించి స్వాతంత్ర్య నిరోధకులైన బ్రిటిష్ జోహుకుందారులపై ఒక కన్ను ఉంచుతూ బ్రిటిష్ ఫైనాన్సునీ, బ్రిటిష్ వైస్రాయినీ ఒకవంక లక్షిస్తూ — ఇలాగే రాష్ట్రపు సైన్యాలూ అన్నిట్లో అనేక ఇతర పరిస్థితులను లొంగి ఈ ప్రజా పరిషత్తు ఒక నిర్దిష్టమైన 'వాస్తవిక పంథా' అనుసరిస్తుందని నా నమ్మకం. అంటే ఒకటి రెండు ఒకటిగా ఏవేవో ఒడంబడికలు చేస్తూంటుంటే తప్ప, స్వాతంత్ర్యాన్ని, ప్రజాసామ్యాన్ని, జాతీయైక్యతను ఆర్జించలేము. అంతా జరిగినమీదట మాయల్లోపడి, తప్పుదారిబట్టి, వెనుకడుగు వేశామే అని పశ్చాత్తాపపడి — అసలు దారికి తిరుగుతుంది మనజాతి అసలు దారి అంటే — విప్లవపంథా — జాతీయ సమరము — స్వాతంత్ర్యమునకు దగ్గర మార్గము.

కాబట్టి ప్రజాపరిషత్తు నెగ్గినా, కలగుబడి ఓడిపోయినా — ఎలాగూ స్వాతంత్ర్యసమరం తప్పదు. ప్రస్తుతం దేశంలోని వివిధ శక్తుల స్వరూపాన్ని సూక్ష్మంగా పరిశీలించి నట్టయితే వైరుధ్యము తేలికగా గోచరిస్తుంది. పరిస్థితుల బలం మీద ఇంకా బ్రిటిష్ సామ్రాజ్య తత్వం మనల్ని తర్జించేటందుకు అవకాశాలు ఉన్నది కాని విప్లవమార్గాన ఆ పరిస్థితుల బలాన్ని నిర్మూలం చేయనంతవరకూ మనకు స్వారాజ్యం గగన కుసుమమే. వాక్చతుర్య ప్రతిభతోను తర్కాంతరంతోను అదిఇస్తాం ఇది ఇస్తాం అన్న అంగలార్పుతోను రాజనీతి దౌత్యం దర్బ్యాల వల్లను మాత్రం అది సాధ్యం కాదు.

కాబట్టి పర్యవసానం ఏమంటే — ఇదివరకే చెప్పాను. అయినా మళ్లీ చెబుతాను — బ్రిటిష్‌వారి రాజకీయ ప్రతిపాదనలు మనం అంగీకరించినంత మాత్రాన స్వాతంత్ర్య సమరం ఆగేదిలేదు. అది అవశ్యం సాగుతుంది.

పైగా తీవ్రరూపంలోనే వ్యాపిస్తుంది. స్వాతంత్ర్యం కోసమైన సమరంతో పాటే జాతీయైక్యత కోసమూ, ఆహారం కోసముకూడా సమరాలు లేస్తాయి.

## ప్రజా సమరం

బ్రిటిష్ ప్రతిపాదనలను అంగీకరిస్తే జాతీయ అనైక్యతకు దారితీస్తుంది. "బ్రిటిష్‌వారు దేశంలో ఐక్యత పోషించారు; కాని ఈనాడు తాము నిర్మించిన ఆ ఐక్యతా సౌధాన్ని తామే ధ్వంసం చేస్తున్నారు" అని సాధారణంగా కొందరు భావిస్తున్నారు. ఇదొక తప్పుటూహ. భారత దేశంలో ఐక్యతను నెలకొల్పుటకు బదులుగా బ్రిటిష్‌వారు ఆపని చేకూడా మనలో మనకు విభేదాలు పెంపొందించటానికే కృషి చేశారు. హిందూ ముస్లింల మధ్య హరిజనుల — సవర్ణ హిందువుల మధ్య పచ్చగడ్డి వేసి భగ్గుమనిపించారు; ఒక సిక్కు అల్పసంఖ్యాక వర్గాన్ని సృష్టించారు; సంస్థానాలనగా, బ్రిటిష్ ఇండియాను వేరు చేశారు; సంస్థానాధీశ్వరులను ప్రజల మీదికి రెచ్చగొట్టారు; జమీందారులను బ్రిటిష్ ప్రభుత్వానికి ఆధారస్తంభాలనుగా చేశారు. ధనస్వాములనూ, మధ్యతరగతి వారినీ లంచాలిచ్చి దేశశత్రువులనుగా తయారు చేశారు. బ్రిటిష్ పాలన దుర్బలం కావటమంటే దేశంలో అరాజకమూ, అల్లకల్లోలమే — అనేట్టుగా ఈ వంద సంవత్సరాల పరిపాలనలో వారు చేయదగినదంతా చేశారు. బ్రిటిష్ ప్రభుత్వము దేశంలో ప్రజల సంఘీభావమును గాని, జాతీయ యైక్యతను గాని పెంపొందించలేదు. నిరంకుశత్వాన్ని మాత్రం చలాయించింది. నిజమైన ఐక్యతను సృష్టించినది కాంగ్రెసు సంస్థ. కాని నేడా ఐక్యత నిలుస్తుందా, నిలువదా అన్న సందిగ్ధావస్థలో పడ్డది. కనుక బ్రిటిష్ ప్రతిపాదనలనంగీకరించటంతో భారతీయైక్యతా సమస్య కూడా ప్రాధాన్యత వహిస్తుంది.

ఇక రెండవ విషయము: రాజకీయంగా రానున్న మార్పులు ఆర్థిక వర్గీయ సమస్యలను ముందుకు తెస్తాయి. ఇన్నాళ్లూ చర్చనీయాంశాలుగ మాత్రమే ఉండిన ఎటువంటి స్వరాజ్యం? స్వరాజ్యం ఎవరికి? — అన్న సమస్యలు అత్య

వసరంగా నిర్ణయింపబడ వలసినవి ఔతాయి. వాటికి జవాబులు అప్పటి కప్పుడు తేలిపోవాలి. ఈయంశాలు మన రాజకీయాలను అవశ్యం స్పృశించ కండా విడువవు. అంటే — ఆహారం కోసమైన సమరం కూడా ప్రాధాన్యం వహించి స్వాతంత్ర్య సమరంలో అంతర్భూతమై ఉంటుంది.

ఈమూడున్నూ మూడు ప్రత్యేక సమరాలు కావు. ఒకే ప్రజాసమరంలో మూడు అంతర్భాగాలన్నమాట. వివిధదశల లో ఒక్కొక్క దానికి ప్రాధాన్యం వస్తూ ఉంటుంది. కాని ప్రస్తుత రాజ్యాంగ సంస్కరణలు ముదురు తూన్న కొద్దీ ఈమూడింటికీ సమాన ప్రాముఖ్యత వస్తూ ఉంటుంది.

ప్రస్తుత పరిస్థితులలో ఈత్రివిధసమరము ప్రజాపరిషత్తును పురస్కరించుకొని గాని, లేదా సంభవతః తాత్కాలిక ప్రభుత్వాన్ని పురస్కరించుకుని గాని ఆరంభంకావచ్చు తరువాత అది యూనియన్ గ్రూప్ — రాష్ట్రీయ - ప్రభుత్వాలను పురస్కరించుకొని వ్యాపిస్తుంది.

ఈపైపరిణామ సంఘటనలతో కాంగ్రెసుకు జోక్యంఉండి తీరుతుంది మన మంతా కాంగ్రెసు వారమే. కనుక కాంగ్రెసు ఈ ఆహార జాతీయైక్యత — స్వాతంత్ర్య సమరాలకు ప్రభుత్వ యంత్రసాహాయ్యాన సాగిస్తున్నమాట తధ్యము. అప్పుడే కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీగా మారిపోతున్నది. కాబట్టి ఈత్రివిధ సమరంలో కాంగ్రెసుకు విజయం లభించదన్న మాట యధార్థము ప్రభుత్వ యంత్రం కొన్ని పరిస్థితులలో ఉపయోగకారి కావచ్చును. కాని ప్రజాసమరమెప్పుడూ శాసన సభలలో కాదు, ప్రభుత్వ శాఖలలో కాదు జరుగ వలసినది. బైటబహిరంగాలి.

మైన సరిహద్దుయొక్క అవశ్యకత, సర్వప్రజా శ్రేయోదాయక మైన ఆర్థిక పునిర్మాణ ప్రణాళికావశ్యకత; ఏకరాష్ట్రభాషా ప్రచారము, ఇత్యాదయాః ముఖ్యముగా ప్రతిస్వాతంత్ర్య యోధునకూ కులమత వైషమ్యాలు ఉండరాదు; మానవులలో హెచ్చు తగ్గులు లేవు; అంతా సమానమే అన్న సూత్రాన్ని ప్రతివాడు తన జీవితంలో అనుష్ఠించాలి. ఈవిషయము నేనంతగా నొక్కి చెప్పనవసరములేదనుకుంటాను.

ప్రస్తుతము భారతీయైక్యతకు వలసినంత చైతన్యము ప్రజలలో అంతగా లేదు. దాన్ని పెంపొందించటము మన ప్రథమకర్తవ్యము.
మీరు అపార్థము చేసుకోనకుండ నుండగలందులకు ఒకమాట చెప్పాలి: వివిధ రంగాలలోని ఈ ప్రజాశక్తులను పృథక్కరించటానికి వీల్లేదు. రాజకీయ ఆర్థిక సాంఘిక శక్తులు ఒకదానినొకటి ఒరసికొని, ఒకటొకటి కలసిపోయి, ఒకదానికొకటి అనుబంధమై — అన్నీ ఒక్కటియై విశాల ప్రజాఉద్యమంలో ఒక భాగం అవుతాయి.

# 3

## నిర్మాణ సమస్య

మనభావి కార్యక్రమాన్ని నిర్ణయించే ముందు... స్వాతంత్ర్య యోధులందరూ ఏ విధముగ సమీకరించుకొన వలెను? అన్న సమస్యను గూర్చి నా అభిప్రాయాలను (నా అనుయాయుల అభిప్రాయాలు కూడ అవే) ముందుగా మీకు తెలియజేయుటం అవసరం. ఆగస్టు విప్లవంలో మనమంతా కాంగ్రెసు పేర వ్యవహరించాము. పోను మరి సమరం సాగించటమే ఆనాటి కాంగ్రెసు విధానము. ఆసమరంలో పాల్గొనని వాడు, ఆ పంథాను వ్యతిరేకించినవాడు కాంగ్రెసు విద్రోహి అనిపించుకుంటాడు. కాని నేటి పరిస్థితి వేరు. ఉద్యోగాలు స్వీకరించిన కాంగ్రెసు విధానము సమరం కాదు సమరానికి ప్రజలను తయారు చేయుటమూ కాదు; బ్రిటిష్ వారితో సంప్రదిం

పుటు సాగించటమూ, ఒడంబడికలు కావించుకోటమున్నూ. అంతే. కనుక సమరోన్ముఖులమై, విప్లవ మార్గగాములమైన మనము ఈనాడు కూడా కాంగ్రెసు ముద్రతోనే వ్యవహరించటం అసంభవం.

కాని మనము కాంగ్రెసును త్యజించి దానికి పోటీగా మరొక ప్రజా సంస్థను నిర్మించటంతో స్వాతంత్ర్య కృషికి తీరని అపచారము చేసిన వారమౌతాము; నాకు తెలుసు. కాంగ్రెసు నాయకుల కార్యక్రమానికీ మన కార్యక్రమానికి పెద్ద అంతరమే ఏర్పడి ఉన్నది; సందేహంలేదు కాని కాంగ్రెసు నాయకులే కాంగ్రెసు సంస్థ కాదు కదా! కాంగ్రెసును ఇంతవరకు తెచ్చినది వారి నాయకత్వమే కాదు; అన్ని వర్గాలవారి కృషి, త్యాగాలు కలిసి కాంగ్రెసు ప్రతిష్ఠకు కారణములైనవి వారందరికీ కాంగ్రెసు ముద్రధరించి మాటాడగల అధికారం ఉంది. జాతీయంగా, సాంఘికంగా కాంగ్రెసు ఒక గొప్ప శక్తివంతమైన సంస్థ. ప్రజా హృదయాలపై దాని ప్రభావము అగ్గలము కనుక ప్రజాసమరానికి అదే ఉత్కృష్టమైన సాధనము మన విప్లవబంధాలలో దాన్ని ఉపయోగించుకోటానికి అవకాశాలు లేవని నోచే వరకూ విడనాడరాదు. కనుక మనం కాంగ్రెసులో నే ఉండవలె దాన్నే బలవత్తరం చేయవలె. శ్రమించి, ప్రజలను సేవించి కాంగ్రెసును మన ఆశయాలపై పు ప్రిప్పుకోవలె. కాని ప్రస్తుత కాంగ్రెసు నాయకులు కాంగ్రెసును సరయైన నిర్మాణ కార్యక్రమమేమీ లేక, గవర్నమెంటు యంత్రంపై ఆధారపడి వుండే ఒక పార్లమెంటరీ సంస్థనుగా మాత్రమే తయారు చేసే యత్నంలో - తత్ఫలితంగా బ్రిటిష్ రాజనీతి మరింత నిరంకుశమై కాంగ్రెసును ఉద్యోగాలిచ్చి, బిరుదు లిచ్చి ఉద్యోగస్తులలో ఇముడ్చుటకే యత్నంలో - మనం కాంగ్రెసుతో వ్యతిరేకించక తప్పదు. అయినా మనం మన కార్యక్రమాన్ని ప్రజా క్షేమంకరంగా ఉత్సాహంతో, దీక్షతో కొనసాగించామంటే నిస్సందేహంగా కాంగ్రెసును మన వైపుకు త్రిప్పుకో గలుగుతాము; అప్పుడు కాంగ్రెసు ఈ పార్లమెంటరీ విధానాలు వీడి మన వైపు చేయుతుంది

ఇప్పుడు మనము రెండు ప్రధాన నిర్ణయాలకు వచ్చినాము (1) అన్ని విప్లవ సందర్భంలోనవలె ఈనాడు మనం కాంగ్రెసు పేర వ్యవహరించ

టానికి వీల్లేదు (2) కాంగ్రెసులోనే ఉంటూ మనం కృషి చెయ్యాలి అయితే మరి స్వాతంత్ర్య యోధు లందరికి ఒక రాజకీయ గమ్యము ప్రబోధి తమయేలాగు మనం ఎలాగ సమీకరించుకొని, ఒకేమాట మీదనడుస్తాం. ఎలాగ కార్యోన్ముఖులం కావాలి? అన్న సమస్య ఉత్పన్న మౌతున్నది మనం కృషి ఒక్క కాంగ్రెసులోనే కాదు. ఈ విషయము గమనిస్తే ఆ సమస్య చాల ప్రముఖమైన దని తెలుసు కుంటాము. కాంగ్రెసుకు బాహ్యంగా వున్న ట్రేడ్ యూనియనులు, కిసాన్ సభలు మొదలగు అనేక ఇతర సంస్థలలో మనం వ్యవహరించ వలసి ఉన్నది. కాంగ్రెసులో అజాగళ స్తనాల వలె మాత్రమే ఉండి లాభంలేదు. మన కార్యభారం సమర్థతతో నిర్వహించుకో వలెనంటే, మన ఆశయాలు ఫలించవలెనంటే పైని ఉదహరించిన రీతిని దిట్టముగా సమీకరించుకోవాలి.

నేనీ సమస్యపై తీవ్రముగా ఆలోచించాను నాసహచరులతో సంప్రదించాను మనకిప్పుడు వలసిన నిర్మాణమునకు పునాదులు కాంగ్రెసుసోషలిస్టు పార్టీలో అమరి యున్నవని మేము నిశ్చయించినాము. కొంచెం సంస్కరించి పునర్నిర్మాణం చేస్తే కాంగ్రెసు సోషలిస్టు పార్టీయే మన ఆశయసిద్ధికి లక్షణంగా పనికి వస్తుంది. ఇతః పూర్వం అది రాజకీయంగా చాలకృషి చేసి యున్నది. మొన్నటి ఆగస్టు విప్లవంలో అది గైకొన్నపాలు పార్టీ వ్యతిరేకులకు కూడా శ్లాఘాపాత్రమైనది. పాతపార్టీలో కొన్ని లోపాలు ఉన్నాకీ సోషలిస్టు — వామపక్షీయు ఐక్యతకు అది చేసిన ప్రయత్నాల మూలాన్న కొంతవరకు ఆలోటుపాట్లు సంఘటిల్లినవి వాటిని మనం సంస్కరించుకోవచ్చు. నేను ఆగస్టు యోధులను చాలమందిని కలుసుకున్నాను. కొద్దిమంది. మాత్రమే పూర్వ సాంప్రదాయాలను వదల లేకున్నారు. కాని అధిక సంఖ్యాకులు సోషలిస్టు పార్టీపై అభిమానం కలిగియున్నారు దానికేసి ఆశావహంగా చూస్తూ ఉన్నారు. కనుక కాంగ్రెసు సోషలిస్టు పార్టీయే స్వాతంత్ర్య యోధుల సంస్థ కావలెనని నానిర్ణయం.

ఈ నానిర్ణయాన్ని బలపరచే మరొక అంశం కూడా చెబుతాను కాంగ్రెసు సోషలిస్టు పక్షలక్ష్యం జాతీయ స్వాతంత్ర్యమే కాదు, సోషలిజం

కూడ స్వాతంత్ర్య యోధులలో నూటికి తొంభై అయిదు మంది సోషలిజం వైపు మొగ్గియున్నారని నా నమ్మిక. సోషలిజంలేని జాతీయ స్వాతంత్ర్యం వారిని తృప్తి పరచలేదు. కనుక వారికి కాంగ్రెసు సోషలిస్టు పక్షమే అత్యంత స్వీకారయోగ్యము.

## వా మ ప క్ష ఐ క్య త

వామపక్ష ఐక్యతా సమస్య నిర్మాణ సమస్యకు సన్నిహితమైనది. ఈ సమస్య విషయమై చాల తికమకలు ఏర్పడినవి. ప్రపంచంలో కెల్లా ఇదొక చిక్కు సమస్య. ఇప్పుడున్న స్థితిలో దీన్ని పరిష్కరించలేము. వామ పక్షం లోని వర్గాలన్నీ ఏకం కావటం అసంభవం. అట్టి ఐక్యత కావలెనని వాదించే వారు... అసలు ఆనైక్యత ఎందుకు ఏర్పడిందో తమనుతామే మొదట ప్రశ్నించుకోవాలి. అనగా- అసలీ వామ పక్షాలు ఎందుకు ఉద్భవించాయి? ఈ ప్రశ్న మనం సరిగ్గా తర్కించుకున్నట్టయితే... అసలు ఆరంభంలో ఈ ప్రత్యేక- వర్గీయ శక్తులు ఉత్పన్నం కావటానికి గల కారణాలే వాటి యైక్యతను భంగించే హేతువులు కూడా నని మనకు తెలుస్తుంది.

ప్రపంచ మంతటా ఈ వామ పక్షాలు ఉన్నాయి. చరిత్ర పరిశీలిస్తే ఈ వివిధ వామ పక్షాలు ఎప్పుడో కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప- అదిన్నీ కొద్ది కాలం వరకే- ఎన్నడూ ఐక్యమై ఒక్క త్రాటిమీద నడువ లేదన్న సంగతి అనుభవైక వేద్యము. ఈ చరిత్రాత్మక సాక్ష్యము మన కొక గుణపాఠము.

మన దేశంలో కూడా అంతే. అందుకు భిన్నంగా ఏమీ జరగటం లేదు. వామపక్ష ఐక్యతకు మనం రెండుసార్లు తీవ్రంగా ప్రయత్నించాము. మన ప్రయత్నాలు ఫలించకపోగా- మంచికిపోతే చెడు ఎదురైంది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ చేతులు చాచి వామ పక్షాలను సోషలిస్టు వర్గాలను ఆహ్వానించింది. వారందరను పుచ్చుకుని తమతమ పక్షాలలోనికి కొత్త సభ్యులను 'రిక్రూటు' చేసుకున్నారు; జట్టును చీల్చినారు; కష్టాలు తెచ్చారు.

వామపక్ష ఐక్యత అంటూ ప్రపంచ మంతటా ఇలాంటి పనులే జరుగుతూ ఉంటాయి.

కాబట్టి నా మట్టుకు నేను వామపక్ష ఐక్యతా నినాదాన్ని విశ్వసించను. అట్టి అసంభవమైన ఐక్యత కోసం ఇంకా ప్రయత్నించ వలెనన్న కోరిక నాకు లేదు. వామపక్షీయులంతా తాము పట్టిన కుందేలికి మూడే కాళ్లన్న పిడివాదాలు, తాము చెప్పినదే వేదమన్న అహంభావమూ విడిచి పెట్టి ఒకేఒక జాతీయ సోషలిస్టు పార్టీగా సమీకరించుకొనుట ఉచితము. అట్టిదే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ. రంధ్రాన్వేషణ పరులకు అందులో లోటు పాట్లు కనిపించ వచ్చును. కాని మన మందరమూ మన మన సంకుచిత విభిన్న దృక్పథాలను విడిచి ఒకే ఒక విశాల సంస్థగా కలిసి యుండుట శ్రేయము కాదా? చిన్న చిన్న విభేధాలు విస్మరించి సమాన ఆశయాలతో ఒకే కార్యక్రమముతో, ఒకే పంథాపై నడుచుట విజయ సాధనము కాదా! వామపక్షీయులు సోషలిస్టుల సామ్యవాదం భారత దేశంలో వ్యాపించ వలెనంటే- ఆయా వివిధ వర్గాల అస్థిరమైన, సుసంఘటితము కాని ఐక్యత వలన ఏమీ ప్రయోజనం లేదు. కలుస్తున్నామని చెపుతూ తమతమ ప్రత్యేక ఆశయాలనే సమర్థించు కుంటూ, ప్రచారం చేసుకుంటూ, వీలైనంత వరకు కొత్త సభ్యులను రాబట్టుకుంటూ - ఇలా ప్రవర్తిస్తూంటే లాభం లేదు. అందరూ ఒకే ఒక పెద్ద సంస్థగా కలిసిపోయి నప్పుడే సోషలిస్టు ఉద్యమము వృద్ధి చెందుతుంది. అట్టి ప్రధానపాత్ర నిర్వహించగల సంస్థ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తప్ప భారత దేశంలో మరొకటి లేదు. కాబట్టి స్వాతంత్ర్య యోధులందరూ ఆ సంస్థను తమదిగా భావించెదరు గాక! ఇప్పటికే చాలమంది అందులో చేరినారు. మిగిలినవారు కూడ త్వరలో చేరవలెనని నా కోరిక.

స్థానికములూ, వ్యక్తిగతములూ అయిన కష్టాలు, కొన్ని పూర్వాచారాలు కొందరు మిత్రులకు ఆటంకములు కావచ్చు. అట్టి ఆటంకాలను మా చేతనైనంత వరకు తొలగించి వారికి మార్గము సుగమము చేయగలమని హామీ యిస్తున్నాను. వారందరూ మాతో సహకరించి ఒక శక్తివంతమైన సంస్థను నిర్మించుటకు తోడ్పడెదరు గాక!

# 4

## మన ప్రస్తుత కార్యక్రమం

ఇక్కడ నేనొక ఆమూలాగ్రమైన రాజకీయ కార్యక్రమాన్ని రచించ దలుచుకోలేదు. అందుకు ముందున్నది అవకాశం. బహుశః పార్టీయే తన విధానాన్ని ప్రకటించవచ్చును. మనం ఇప్పుడు వెంటనే వహించవలసిన కార్యభారం మాత్రం నేనిక్కడ సూచిస్తాను.

రానున్న స్వాతంత్ర్య సమరస్వరూపాన్ని భావించుకుంటే మన ప్రస్తుత కర్తవ్యం మనకు బోధపడవచ్చును నేను భావిస్తున్న సమరస్వరూపం ఇది: మొదట సమర్థులు శక్తివంతములు ఐన ఉపకరణాలతో సామ్రాజ్యతత్వాన్ని పిండికొట్టి, నాశనం చెయ్యటం. ఆ తరువాత — అంటే — మరుక్షణమే స్వపరిపాలన సంస్థలను పట్నాల్లో ప్రతిష్ఠించి, వాటిపై దాడులు జరక్కుండా కాపాడటం. ఇట్లు ఏర్పడిన ఈ స్వరాజ్య సంస్థలే చివరకు అన్నీ కలిసి స్వతంత్ర భారత ప్రభుత్వ యంత్రం ఔతాయి. బ్రిటిష్ వారితో అన్ని విధములా సహాయ నిరాకరణమే పరిపాలనా చక్రంలో కాంగ్రెసు మంత్రివర్గాలు లోపలనుంచి విజృంభించి యుద్ధం చేస్తాయి యావత్పరిశ్రమలు స్తంభించిపోతాయి. రైతులు జమీందారీ భూములను స్వాధీనం చేసుకుంటారు. సంస్థాన ప్రజా మండలి సంస్థానాధీశ్వరుల క్రూర పరిపాలనపై తిరుగుబాటు చేస్తారు ఇతః పూర్వం జరిగిన స్వాతంత్ర్య సమరాలలో లేని — మొన్నటి 1942 విప్లవంలో కూడా కనిపించని — ఒక ప్రధానవిశేషం రానున్న స్వాతంత్ర్య సమరంలో గోచరమౌతుంది అది ఏమంటే — బాధ్యతగల స్థానిక — ప్రాంతీయ — స్వపరిపాలన సంస్థలు నెలకొంటాయి, అవికూడ సమర కార్య నిర్వహణానికి దోహదములౌతాయి సమర స్వరూపాన్ని పైపైన చిత్రించినాను. ఇంకా వివరాలు కలంపులో వచ్చును.

ఈ సమర స్వరూపాన్ని దృష్టియందుంచుకుని మన ప్రస్తుత కార్యక్రమాన్ని సంక్షిప్తంగా తెలుపుతాను.

స్వాతంత్ర్య సమరానికి దోహదక్రియలు సాగించటమే మన అవశ్య కర్తవ్యము. ఈ దోహదక్రియలు చాలరకాలు ఉన్నవి. కొన్నిరకాలు నే నిక్కడ చర్చించలేను.

## కర్మవీరుడు

అసలు మనం చేయవలసిన కార్యం ఏమిటో చెప్పేముందు దాన్ని నిర్వహించ వలసిన కర్మవీరుని గురించి ఒకమాట చెబుతాను. ముఖ్యంగా ఈనాడు, ఈ స్థితిలో ప్రప్రథమంగా మనం చెయ్యవలసిన పని యేమంటే — కర్మవీరులను వెదకి పట్టుకురావాలి. వారికి తర్ఫీదు ఇవ్వాలి. వాచా ప్రచారము చేయవలసిన రోజులు ఎప్పుడో దాటి పోయినవి ఇప్పటికి మనం విప్లవ మార్గంలోకి వచ్చేశాం. ఇక అధికారం వొప్పగింత పెట్టుకోవటమే తరువాయి. ఇప్పుడు మనకు కావలసినది. యుద్ధాత్ పూర్వము వలెగాక ఒక కొత్తరకపు కాంగ్రెసు వ్యక్తి, ఒక కొత్తరకపు పార్టీ కామ్రేడ్ నేటి విప్లవ యోధుడు వాక్ప్రచారధీరుడుగా, నిర్మాణ కార్య నిర్వహణదక్షుడుగా తయారు కావాలి. నిర్మాణ కార్యమూ, ఇంకా ఇతరములైన పనులూ, అతనికి తెలిసి వుండాలి. తన విప్లవ సంస్థకూ ప్రజాళికీ మధ్య అతడొక వంతెన వంటివాడు అంటే– అతడు ప్రజల్లో విప్లవ జ్వాలలు విరియించాలి, విప్లవ సమరంలో వారి స్థానాన్ని, వారి కార్య కలాపాన్ని వారికి ఎరుక పరచాలి. అతడు త్రికరణశుద్ధి కలవాడై, నిర్భయుడై, క్రమశిక్షణయెరిగి, కష్టించి పనిచెయ్యాలి, అన్ని కార్యాలకూ ఒకేకర్మవీరుడు చాలడు కనుక అభిరుచులను బట్టి, శక్తి సామర్థ్యాలను బట్టి ట్రేడ్ యూనియన్ పని, గ్రామపునర్నిర్మాణ కార్యము ప్రచార కార్యముపర్యవేక్షణ చేయుపని — ఈ మొదలగుపనులను తగురీతిని పంచి పెట్టవలసి యుండును.

మన దేశము చాల పెద్దది. దేశంలోని వివిధ ప్రాంతాలలో ఉండే స్వాతంత్ర్య యోధులకు అత్యవసర పరిస్థితులలో కేంద్రసంస్థ తగు ఉత్తరువులను జారీ చేయుటకు సాధ్యము కాదు. కనుక [illegible] తెలివితేటలతో జాగ్రత్తగా వ్యవహరించ గల స్థానిక నాయకులు తయారు కావలసిన ఆవశ్యకత కలదు.

గ్రంథ పఠనము ద్వారా, చర్చలవల్ల, ప్రత్యక్షంగా పని చేయించుట చేత అట్టి కర్మవీరులను తయారు చెయ్యాలి. గ్రంథ పఠనమునకు, చర్చలకు కొన్ని క్యాంపులు, పాఠశాలలు తాత్కాలిక [illegible], శాశ్వతము లైనవి నెలకొల్పాలి. అందుకు ఉపాధ్యాయులు, గ్రంథాలయాలుండవలె

## ప్రత్యేక కృషి

ఇక మన కార్యక్రమం ఇక్కడ నేను చర్చించదలచిన కార్యకలాపాన్ని రెండు ఖండాలుగా విభజిస్తాను. సాధారణ కృషి, ప్రత్యేక కృషి. ట్రేడ్ యూనియనులు, విద్యార్థి సంఘాలు, కిసాన్ సభలు, వాలంటీరు దళాలు, చేనేత పారిశ్రామికులు, చెరకు పంటదారులు సమిష్టి వ్యవసాయ రైతులు — ఇత్యాది ఉత్పత్తి దారుల సహకార సంఘాలు — వీటికి సంబంధించిన కార్యకలాపమంతా ప్రత్యేక కృషి క్రిందికి వస్తుంది. ఈరకమైన ప్రత్యేక కృషిలో మనకు ఇంతో అంతో అనుభవము ఉంది. ఇకముందు మనం ఈపనులన్నీ క్రమబద్ధంగా, ఇది వరకన్న అధికంగా కొనసాగించాలి. అందుకు శిక్షణ, విజ్ఞానము, గ్రంథపఠనము అవసరం. మన విప్లవ కార్యక్రమాల సాంఘిక సిద్ధాంతాలు ఆయా సంస్థలకు జీవం పొయ్యాలి. కేవలం ఆర్థికంగా లాభం పొందేందుకు గాను ఏర్పడే ప్రత్యేక ప్రత్యేక ఉద్యమాలుగా తయారై లాభంలేదు. కో ఆపరేటివ్ యూనియన్ గాని ట్రేడ్ యూనియన్ గాని, రైతు ఉద్యమం గానీ, ద్రవ్యలాభ దృష్టితో వ్యవహరించే అవకాశాలున్నవి అట్టి వ్యవహారాలు అరుచేయాలి. ఇక వాలంటీరు, దళము, విద్యార్థి సంఘాలు ఉన్నవి. డ్రిల్లు, శారీరక వ్యాయామము [illegible]

వాన్ని అదుపుచేయుట: ప్రదర్శనాలు — ఇత్యాది పనులు మాత్రమే వాలంటీరుకు చాలవు. ప్రతి వాలంటీరుకు తన సంఘాన్ని నడిపించటం తెలిసి వుండాలి. రానున్న విప్లవములో వారి వారి స్థానం, విధ్యుక్త కార్యక్రమం ఎరిగి వుండాలి విద్యార్థి కాంగ్రెసు చాలవరకు ఉద్రేకవంతంగా తయారైంది. అది చాలదు. విద్యార్థులలో, విద్యార్థులు నివసిస్తూన్న సంఘంలోనూ కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించాలి. బీదపిల్లలకు విద్యగరపటం, వయోజన విద్యను పెంపొందించటం, హిందూస్తానీ ప్రచారము — చర్చలు, ఉపన్యాసాలు, నాటకాలు, కళాప్రదర్శనాలు మొదలైనవాటి ద్వారా సాంస్కృతిక చైతన్యాన్ని వృద్ధిచేయటం — ఆరోగ్య ప్రచారము. పర్యవేక్షణ, ట్రేడ్‌యూనియనులు మొదలైన సంస్థలకు సహాయము. బహు ప్రదేశాలకు పర్యటనము, సెలవుదినాల్లో గ్రామసేవ, విద్యార్థి సహాయ సంస్థలు, స్వయంసేవక సంఘాలు నెలకొల్పటం — ఇవన్నీ నిర్మాణ కార్యక్రమాంశాలు.

## ట్రే డ్ యూ ని య న్ కా ం గ్రె సు

ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు రాజకీయంగా వెనుకబడియున్న సంస్థ. A. I. T. U. C. భారత కార్మికులకు రాజకీయ నాయకత్వము వహించలేక పోయిన యుద్ధకాలంలో అది మరింత వెనుకబడి పోయినది. దేశమంతా విప్లవ జ్వాలలలో దుమికిననాడు, కార్మిక వర్గాలు కూడ చాలవరకు అందులో పాల్గొనిననాడు — A. I. T. U. C. దిగ్భ్రాంతినొంది తాను విప్లవాన్ని అభిమానిస్తున్నట్లో, సామ్రాజ్య శక్తి పక్షాన ఉన్నట్లో నిర్ణయించుకోలేక పోయింది. ఆ కాలంలో కమ్యూనిస్టు పార్టీ భారత దేశానికి చేసిన ద్రోహమే అందుకు ముఖ్యకారణం. ఈ విధంగా T. U. C. కి సంక్రమించిన పక్షవాత జాడ్యాన్ని ముందు నయంచేయ్యాలి. దాన్ని విప్లవ సమరోన్ముఖంగా తీసుకురావాలి. ఆ విప్లవ సమరంలో కార్మికులంతా తమ విధ్యుక్తాలను నిర్వహించేట్టు శక్తివంతులను చేయ్యాలి.

## సాధారణ కృషి

ఇక సాధారణ కృషిని గూర్చి చెబుతాను. కాంగ్రెసును బలవంతమైన శక్తివంతము చేయుట, ప్రజాయత్తము చేయుట – ఈ పనులన్నీ ప్రధానంగా సాధారణకృషి క్రిందికి వస్తాయి. ప్రజలపై కాంగ్రెసు ప్రభావము పూర్వము కన్నా ఇప్పుడు హెచ్చింది. కాని కాంగ్రెసు సంస్థలో స్తబ్ధత ఏర్పడినది. పార్లమెంటరీ కార్యక్రమాన్ని స్వీకరించినందువల్ల చాల అప్రశస్తపు కుళ్లు కూడా పెరిగింది. కనుక మనం ప్రప్రథమంగా కాంగ్రెసు కమిటీలలో జీవం పొయ్యాలి. వాటికీ ప్రజలకూ మధ్య సన్నిహిత సహకార బాంధవ్యాలను పునరుద్ధరించాలి. తరువాత మనం చాల జాగరూకతతో మెలగుతూ కాంగ్రెసులోని కుళ్లును తొలగించేందుకు సిద్ధం కావాలి.

"కాంగ్రెసు కమిటీలలో జీవం పొయ్యాలి" అన్నాను. ఆ మాటలోని అర్థం ఇంకా విపులీకరించి చెబుతాను. అఖిలభారత కాంగ్రెసు కమిటీ, రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలు పూనుకుంటే నేగాని అది జరుగదు. అవి ఎప్పుడవి స్థానిక కాంగ్రెసు కమిటీలకు కొన్ని సలహాలిస్తూ ఉండాలి; కొంత కాలపరిమితి నియమించి ఆ కాలంలో ఫలానా పనిని నిర్వహించవలసినదిగా ఉత్తరువులు జారీ చేస్తూ ఉండాలి; మతఐక్యత, అస్పృశ్యతా నివారణ, వయోజన విద్య, ధాన్యపు బ్యాంకులు, గ్రామ వలంటీర్ల దళము — ఇత్యాదులకు సంబంధించిన పనులను పురమాయిస్తూ, పైనుంచి పర్యవేక్షణ చేస్తూ ఉంటే కొత్త జీవం వస్తుంది. ఈ పెద్ద కమిటీలు కార్యకర్తలకు కొన్ని చర్చనీయాంశములు తెలుపుతూ ఉండాలి; వాళ్ల కార్యనిర్వహణకు ఉపయోగించే గ్రంథజాలం ఇస్తూ ఉండాలి; వాళ్ల సమస్యలను గ్రహించి పరిష్కరిస్తూ ఉండాలి. ఈ కమిటీలు పరిశోధన కార్యము పొలిటికల్ ప్లానింగ్ కూడా నిర్వహించవలెను. నేను ఈ పైని సూచించిన – ఇంకా ముందు సూచింపనున్న కార్యక్రమాలన్నీ కాంగ్రెసే మొత్తంగా ఎందుకు నిర్వహించటానికి పూనుకోకూడదు? నేను చెప్పినట్లు ఈ కమిటీలు ఎప్పటినించి పని ఆరంభిస్తాయో నాకు తెలియదు. ఈ లోగా కాంగ్రెసు కమిటీల ద్వారా

మనం పని చేయటానికి అవకాశాలు ఉన్నంతవరకు వినియోగించుకుందాం. ఈ కార్యక్రమాన్ని వాటి ద్వారా నిర్వహిద్దాం. అది సాధ్యంకాని ప్రదేశాల్లో మన పార్టీ శాఖలద్వారా మన కార్యక్రమంనిర్వహిద్దాం. స్వాతంత్ర్య యోధులందరికీ ఈ పార్టీలో స్థానం ఉంది

ఇక ఈ 'సాధారణ'కృషి క్రిందికివచ్చే యితర పనులు వివరించే ముందు అసలు ఆ పదానికి అర్థం చెబుతాను. మన ప్రత్యేక కృషి వివిధవర్గాలకు చెందిన ప్రజాళికి సంబంధించినది. కాని ఒక గ్రామాన్ని గాని, పట్నాన్ని గాని పట్నంలోని వార్డును గాని మొత్తంగా తీసుకొని విచారించేటప్పుడు అదే సామాన్య కృషి అనిపించుకుంటుంది. ఉదాహరణంగా మనం ఒక పల్లెటూళ్లో ఒక కిసాన్ సభ స్థాపిస్తాం; లేదా ఒక పట్నంలో లేబరు యూనియన్ స్థాపిస్తాం. అది వక కృషి యన్నమాట. కాని ఆ గ్రామాన్ని గాని, పట్నాన్ని గాని మొత్తంగా తీసుకొనేట్టయితే దాన్ని సాధారణ కృషి అంటా

## గ్రామ పునర్నిర్మాణం

ఇక గ్రామ పునర్నిర్మాణం తీసుకుందాం. అరునెలలు కృషి చేసిన తరువాత మనం చివరకు సాధించవలసింది. గ్రామ స్వారాజ్యం, గ్రామ స్వారాజ్యం అంటే ఒక గ్రామ పంచాయితీ మాత్రమే కాదు, గ్రామమే స్వపాలన బాధ్యత వహిస్తుంది. ఈ స్వపరిపాలన సంస్థలు గ్రామాల్లోని గ్రామప్రజలే స్వయంగా నిర్మించుకోవాలి ప్రభుత్వపు ఏజన్సీలద్వారా జరుగ రాదు. ఈ గ్రామరాజ్యాలు పరాయి ప్రభుత్వ అనావశ్యకతను రూపిస్తాయి. విప్లవ సమరంలో కేంద్రాలు ఔతాయి. స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణానికి ఆధారశిలలు ఔతాయి.

ఈ గ్రామ రాజ్యాలు ఏర్పడేముందు మనం కొనసాగించ వలసిన నిర్మాణకార్యక్రమం చాలా ఉంది. అందుకని ఈ క్రింద కొన్ని విధులు ఉదహరిస్తున్నాను—

1 కాంగ్రెసు సభ్యులను చేర్పించుట గ్రామాల్లోని వయోజనులందరినీ కాంగ్రెసు సభ్యులనుగా చేర్పించాలి. అలా చేరిన సభ్యులందరను సమావేశపరుస్తూ ఉండాలి. పతాకాభి వందనము.

2 ఆత్మసంస్కారానికి దోహదమిచ్చే సాంస్కృతి కేంద్రాలను పాదుకొల్పాలి. అక్కడ వార్తా పత్రికా పఠనము, వయోజన విద్యాభ్యాసము నాటక ప్రదర్శనాలు, జానపద గేయ గానము, విద్యావ్యాసంగము జరుగుతూ ఉండవలె ఒక గ్రంథాలయముకూడ ఉండవలె. రైతులకు సలహాలు ఇస్తూ ఉండవలె.

3. సేవాదళముల నిర్మాణము.

4 ఆరోగ్య సమస్య, రోడ్లనిర్మాణం ఇత్యాదులన్నీ సక్రమంగా పర్యవేక్షిస్తూ ఉండవలె సంఘ శ్రేయస్సు కోసం వ్యవసాయాది కాలంలో సమిష్టి కృషిని ప్రోత్సహించాలి.

5. అస్పృశ్యతా నివారణ

6. మతసామరస్య సంపాదన

7. మద్యపాన నిషేధము

8 పరిస్థితి పర్యవేక్షణ

9 గ్రామస్థుల యిబ్బందులు తొలగించుట

10. ధాన్యపు బ్యాంకుల స్థాపన

11. చుట్టుపట్టు గ్రామాల్లో ప్రచారము

12 కో ఆపరేటివ్ మార్కెటింగ్

13 మహిళాభ్యుదయము, శిశుపోషణ

కర్మవీరులు గ్రామస్థుల స్నేహ సౌహార్ద్రాలు సంపాదించి, త్రికరణ శుద్ధిగా, దీక్షగా పై కార్యక్రమాన్ని నిర్వహిస్తే గ్రామరాజ్యం కొలదికాలల

లోనే స్థాపించవచ్చు. సమిష్టివ్యవసాయము, తక్కువగల కో-ఆపరేటివ్ పరిశ్రమలు నెలకొల్పవచ్చు.

అందుకు చక్కని తర్ఫీదు పడసిన ఉత్తమ కర్మవీరులు అసంఖ్యాకులుగ కావాలి. ఈ కార్యక్రమము భారతీయ ఆర్థిక-సాంఘిక-రాజకీయ పరిస్థితులు వ్రేళ్లు మొదలుకొని పునర్జీవితములై విప్లవాత్మక పరిణామము నందగలవు.

పట్నాలలో కూడ ఇట్టే ఒక్కొక్క వార్డును ఒక్కొక్క యూనిట్‌గా తీసుకుని పనిచేయాలి. ప్రతివార్డులోనూ గ్రామానికి సూచించిన నిర్మాణ కార్యక్రమాన్నే పట్టణ పరిస్థితుల ననుసరించిన మార్పులతో అనుష్ఠించాలి. ఒకటిగాని, ఒకటికంటె మించిగాని కేంద్రాలు ఉండవచ్చును. పట్నాల్లో వివిధవర్గాలవారు ఉంటారు. వారికి తగిన, సేవ, విజ్ఞానము, ప్రచారము, సంఘనిర్మాణము చెయ్యాలి. విద్యార్థి కాంగ్రెస్‌లోని ఉత్సాహులైన యువకులను ఈ పనులకు ఆహ్వానించవచ్చును.

ఈ కార్యక్రమాన్ని ఇంకా విపులీకరించవచ్చును. ఉదాహరణ మాత్రంగా ఇంతవరకు చాలు. జోరబడి, పూనుకొని, నిర్వహిస్తూంటే అనుభవం మీద మరికొన్ని యంశాలు స్ఫురిస్తూంటాయి; ఈ కార్యక్రమాన్ని మీకిప్పుడు సూచించాను. అది మీకు ఉపయోగకరము కాగలదని నా ఆశ.

ఈ లేఖ ముగించేముందు మన ప్రధాన ఆశయము విప్లవభావ్యాల యని మరొకపారి జ్ఞాపకం చేస్తున్నాను. ఒకే పనిని అనేక విధాలుగా, అనేక ఉద్దేశాలతో చేయవచ్చును. మన ప్రధానోద్దేశము మన కార్యక్రమాన్ని సూచిస్తుంది; ఒక విప్లవాత్మక ఉపకరణంగా సంస్కరిస్తుంది.

మీ సోదరుడు,

జయప్రకాశ్.



# IV

## భారత దేశంలోని అమెరికన్ ఆఫీసర్లకు, సైనికులకు—

మిత్రులారా!

అమెరికా అంటే ఒక అభిమానంకల వ్యక్తిగా మీకు నేనీ లేఖ వ్రాస్తున్నాను. నా మాతృదేశము తరువాత మీ దేశముపై నాకు ప్రేమ. ఏడుసంవత్సరాలు నేను మీ దేశములో నా విద్యార్థిదశ సుఖముగా గడిపినాను. అచ్చటి విశ్వవిద్యాలయము లందే గాక, ఫ్యాక్టరీలలోంచి, పొలాలనించి, నేను చాల అభ్యసించినాను. మామూలు కూలిపని చేసి కాలేజి జీవితము వెళ్లబుచ్చినాను. కాలిఫోర్నియా, అయోవా, విస్కాన్‌సిన్ విద్యాలయాలలో చదువుకున్నాను. చివరకు ఓహియో విశ్వవిద్యాలయములో పట్టభద్రుడనై వచ్చినాను. ఆయా విశ్వవిద్యాలయములనించి వచ్చిన వారు మీలో కొందరుండవచ్చును. వారందరకు నా అభివాదము లంపినాను.

మీకు వలెనే స్వాతంత్ర్యము కోసము తన ప్రాణాలు బలిపెట్టుటకు సిద్ధముగానున్న ఒక స్వాతంత్ర్య ప్రియునిగా నేను మీకీ లేఖ వ్రాస్తున్నాను. సోషలిజం ద్వారా నే ప్రపంచమునుండి యుద్ధభూతము మాయమైపోయి స్వాతంత్ర్యము సుస్థిరము కాగలదని విశ్వసించు ఒక సోషలిస్టుగా నేను మీకీ లేఖ వ్రాస్తున్నాను. మరల యుద్ధము రాకుండ చేయుట, స్వాతంత్ర్యమును సుస్థిరము చేయుట — ఇవియేకదా మీ యధ్యక్షులు ప్రకటించిన యుద్ధానంతర ఆశయాలు!

శత్రువు కన్నుకప్పి పారిపోయి వచ్చు హక్కును వినియోగించుకున్న ఒక యుద్ధఖైదీగా నేను మీకీ లేఖ వ్రాస్తున్నాను. హజారీబాగ్ సెంట్రల్

జైలునించి మొన్న మొన్ననే నేను తప్పించుకు పారిపోయి వచ్చాను. చురుకుగా మా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనవలెనని నా కోరిక. నా శత్రువు, సామ్రాజ్యవాద బ్రిటిష్ ప్రభుత్వము నన్ను పట్టుకున్న వారికి బహుమానమిస్తామని ప్రకటించి, నేనేమీ న్యాయ విచారణ ఋజువించి తప్పించుకుని పారిపోయిన క్రిమినల్ అపరాధిగా? మీలో ఎవరైనా యుద్ధఖైదీగా పట్టుబడవచ్చును. కాని అవకాశము దొరికితే శత్రు శిబిరమునించి పారిపోయి వస్తారు కాదా! అప్పుడు మీ మిత్రులు, మీ దేశీయులు మిమ్మల్ని వీరులని ప్రశంసిస్తారు. నేను వీరుడనేమీ కాదు; అయినా క్రిమినల్ అపరాధిని కాను. నా ప్రజా స్వాతంత్ర్యం కొరకు కృషిచేయ గోరుతున్నాను.

ఈనాడు ప్రపంచములో చాల మంది స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారు ప్రాణాలర్పిస్తున్నారు. కాని ఈ 'స్వాతంత్ర్య' మన్న పదం మరీ అడవిగోడై పోతున్నాది అర్థరహితము, ఇది ఫలానా అని చెప్పటానికి వీలులేనిదిగా తయారైంది. నా ఉద్దేశంలో అది 'కేవలం ఆకాశవాణిలో వినిపించే ఒక ఆచరణయోగ్యం కాని ఆశయం' కాదు. అది ఒక ప్రబలసత్యం. మొట్టమొదట, అన్నిటి కన్నా ముందు నా దేశానికి స్వాతంత్ర్యం కావాలి — బ్రిటిష్ పాలననుంచి మా నలభైనాలుగు కోట్లమంది ప్రజలకు స్వాతంత్ర్యం!

మీరంతా స్వాతంత్ర్య యోధులు మా దేశంవచ్చారు: పరిస్థితులు చూస్తున్నారు. మా స్వాతంత్ర్య సమరాన్ని మీరు సహృదయంతో అర్థము చేసుకోవటం, ఆమోదించుట అవసరము.

నాజీలు చెప్పే అబద్ధాలన్నీ మీరు ఎరిగి వున్నారు. డాక్టరు గోబెల్సు ఒక పెద్ద అబద్ధాలకోరు. కాని అంతకన్నా నాగరికమైన, నాజూకైన అబద్ధాలు కూడ ఉన్నాయని మీరెరుగరేమో. అవే సామ్రాజ్యవాదులు చెప్పేవి. చర్చిల్, హాలిఫాక్సు, అమెరీ అండ్ కో వారు అందులో ప్రవీణులు. ఇండియాను గురించి మీరు రెండు పెద్ద అబద్ధాలు వినివుంటారు. మొదటిది: స్వపరిపాలనా విధానంలో భారతీయులకు తర్ఫీదు ఇవ్వాలి

తీసుకు వచ్చామన్న ఉద్దేశంతోనే పాపం బ్రిటిష్ వారు ఇండియాను నొక్కి పెట్టి ఉంచుకున్నారట! తన్ను తాను సంబాళించుకొనే సామర్థ్యం అలవడేంత వరకూ అలాగే నొక్కి పెట్టి ఉంచుతారట! ఇక రెండవది: భారతీయులంతా ఐక్యమైన నాడు తాము ఇండియాకు స్వరాజ్యం ప్రసాదిస్తారట!

ప్రపంచ చరిత్రలో వీటిని మించిన అబద్ధాలెక్కడా కనిపించవు. అయినా అవి, గోబెల్స్ పలికినవి కావాయెను దుష్టనాజీహంతకులు పలికినవి కావుగా! కాబట్టి చెల్లిపోతూ ఉన్నాయి. మీ చెవులకు అసత్యములుగా ధ్వనించటం లేదు. అనాదినుంచీ వస్తూన్న ఒక సాంప్రదాయ సిద్ధమైన మర్యాద ఉన్నది వాటికి. బ్రిటిష్ సంస్కృతి వాటికి మెరుగు పెట్టింది. పైగా కులీనులు, ధనవంతులు, ప్రభువులు ఉచ్ఛరించిన వారాయెను! కవిత్వము సారస్వతము, విజ్ఞానము, శాస్త్రము వాటిని పునీతము చేసినవి అనేకమంది బుద్ధిమంతులైన ఆంగ్లేయులు కూడా ఈ సంకుచిత భావాలు వీడలేకున్నారు; చిత్రము.

'వెనుకబడియున్న' జాతులకు స్వపరిపాలనా శిక్షణ గరపుటకే సామ్రాజ్యవాదములు పుట్టినవని చెప్పుట హాస్యాస్పదము, మానవ విజ్ఞానానికి చెంపపెట్టు లూటీచేయటానికి దోపిడిచేయుటానికి, ఉన్నదంతా హరించుకు పోవటానికి మాత్రమే నిజంగా సామ్రాజ్యాలు స్థాపితములైనాయి; మీకు తెలుసు ఆవిషయం మీ జాతీయాదాయం పెద్దది మా యిండియానుంచి బ్రిటిష్ వారు దోచుకుపోతూన్న మొత్తం వింటే మీరే గుండె బాదుకుంటారు.

బ్రిటిష్‌వారు దాస్యశృంఖలాలు తగిలించకముందు మాది స్వతంత్ర దేశం ఎవరిదగ్గిరనించో స్వపరిపాలనా విధానము నేర్చుకోనవలసిన యావశ్యకత భారత దేశానికి లేదు. ఆరోజుల్లో దేశంలో యుద్ధాలు రేగుతూ ఉండవచ్చు అంతమాత్రాన ప్రజలకు స్వపరిపాలనా సామర్థ్యం లేదని అర్థమా? అయితే అంతకన్నా భయంకర సంగ్రామాలు యూరోప్‌లో లేస్తున్నాయే. వివిధద్వీపాలతో సహా యూరప్ ఖండమంతా స్వపరిపాలనా పాఠాలు అమెరికావద్ద

నేర్చుకోవలసిందన్న మాటేనా? మొదట ఒక దేశము స్వాతంత్ర్యాన్ని హరించటం; మళ్లీ స్వాతంత్ర్యం పొందేట్టుగా మేము తయారు చేస్తామనటం— ఈ నాటకం, ఈ తంతు ఎవరికి చేతనౌతుంది? సామ్రాజ్య నిర్మాతలకు తప్ప.

ఇక బ్రిటిష్‌వారు స్వపరిపాలనా విధానంలో మాకు ఇచ్చిన శిక్షణ ఎటువంటిది? వారిక్కడ నూటయాభై సంవత్సరాలుగా శిక్షణనిస్తూ ఉండి మాకు పాఠాలు బోధిస్తున్నారు. ఒకప్పుడు వీరే మీకున్నూ ఉపాధ్యాయత్వం వహించి వ్యవహరించారు కాని ఏలాగైతేనేం వారి బారినుంచి విముక్తులైనారు. అతి స్వల్పకాలంలోనే... అప్పుడు చాల వెనకబడియుండి సంఘీభావంలేని కాలనీలన్నింటినీ కలుపుకుని ఒక మహాబలిష్ఠమైన, అత్యంత పురోగామియైన జాతిగా సమీకరించుకో గలిగినారు. అందుకు మీకు పట్టినదాని కంటె ఎక్కువకాలం పుచ్చుకుని కూడా బ్రిటిష్‌వారు మమ్మల్ని ఎలా తర్ఫీదు చేశారో మీరూ చూస్తూనే ఉన్నారు. మీలో చదువుకున్నవాళ్లు నూటికి పదిమందికన్నా లేరు. ఆర్థికోత్పత్తి శక్తులను పిసరంతైనా వృద్ధి గావించలేదు. మూడుసంవత్సరాలనించీ ఈ ప్రపంచ యుద్ధం సాగుతోంది కదా! బ్రిటిష్ వారి యాజమాన్యంలో ఈ దేశానికి యుద్ధసామగ్రి ఉత్పత్తియందునూ అభ్యుదయం లేకపోయినది. మీకీ సంగతి తెలిసియే ఉన్నది. డాక్టర్ గ్రాడీ అధ్యక్షతను అమెరికన్ టెక్నికల్ మిషన్ భారత పారిశ్రామికోత్పత్తి సమస్యను గూర్చి కొన్ని విషయాలను పరిశోధించినది. కాని ఇండియా ప్రభుత్వము ఆ పరిశోధన ఫలితాలను ప్రచురించటానికి సాహసించ లేకపోయింది. ఎంత గర్హ్యమైన ప్రవర్తనమో చూడండి. ఆహా! మా అభ్యుదయం కోసం బ్రిటిష్ పాలకులు ఎంతైనా ఆతృతగా ఉన్నారు అందుకనే రాజకీయంగా గాని, ఆర్థికంగా గాని, వైజ్ఞానికంగా గాని, ఏమాత్రం స్వల్ప అభ్యుదయం జరిగినా అది వారు వద్దంటూన్నకొద్దీ, ప్రజలు పట్టుదలమీద, ఆందోళనమీద పోట్లాడి ఆర్జించుకున్నటువంటిదే. ఇప్పుడు తీవ్రమైన ఆఖరు పోరాటం బ్రిటిష్ దాస్యంనించి విముక్తికోసం సాగుతూ ఉన్నది.

ముతో వైస్రాయి అంగీకరించక పోయినప్పుడు... నిరాక్షేపణగా రాజీనామా లీయవచ్చును — అని సర్ స్టాఫర్డ్ క్రిప్స్ విశదంగా చెప్పివేశాడు. అంటే — సామ్రాజ్యవాదాన్ని ప్రతిబింబించే వైస్రాయి ఉద్దేశమూ ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే జాతీయప్రభుత్వ ప్రజాప్రతినిధి సభ్యుల ఉద్దేశముతో వ్యతిరేకించినప్పుడు ఆ ప్రజా ప్రతినిధులే తమ పదవులు విడిచి వచ్చేయాలన్నమాట! ఇదీ బ్రిటిష్ ప్రభుత్వం మాకు వాగ్దానం చేస్తున్న స్వాతంత్ర్యం! ఈ వాగ్దానం ఇంకా వారు రద్దు చేసుకోలేదట!! ఏమి ఔదార్యం! ఏమి మహాగొప్ప స్వాతంత్ర్యం!

భారతీయ ఐక్యతా సమస్యకూ అసలు విషయానికీ సంబంధం లేదు. అసలు విషయాన్ని మభ్యపెట్టేందుకే ఆ సమస్యను ఎత్తుకొస్తారు! "నిజానికి బ్రిటన్ తన సామ్రాజ్యాన్ని విచ్ఛిత్తి చేసుకుంటుందా?" అదీ అసలు తేల వలసిన సమస్య 'ఊహు' అని క్రిప్స్ రాయబారం జవాబు తెల్పి చెప్పింది. అదే జవాబు చర్చిల్ కూడా చెప్పినాడు ఇటీవల — "నేను చక్రవర్తి ప్రధాన మంత్రి పదవి స్వీకరించినది బ్రిటిష్ సామ్రాజ్య విచ్ఛిత్తికి కాదు సుమా!" అని.

నిజంగా ఇండియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలన్న ఉద్దేశం బ్రిటన్‌కు ఉన్నట్టయితే అందుకుగాను తక్షణం ఏమైనా చేయ తగినది చెయ్యాలి. అంతేగాని మహా ఉదారంగా వాగ్దానాలు మాత్రం విసిరితే ఏం ప్రయోజనం? వాగ్దానాలు చెయ్యటం తేలికే. యుద్ధం సాగుతూన్నంత కాలం పాలక మహాశయులు పాలితజాతుల వారికి చాలాచాలా ఉదారంగా ఏవేవో వాగ్దానాలు వర్షిస్తూనే ఉంటారు. గత సంగ్రామంలో చేసిన వాగ్దానాల గతి ఏమయిందో మీకు తెలియదూ? ప్రస్తుత యుద్ధావసరంలో చేస్తూన్న వాగ్దానాల గతి కూడా అంతే అవుతుంది. ఈ యుద్ధానంతరం ఒక ఉత్కృష్టమైన ప్రపంచ వ్యవస్థ నిర్మితి మయ్యేట్లయితే అది ఈ పాలక జాతుల కాకి వాగ్దానాల ఫలితమని భ్రమించకండి; అది మీ—మా—ప్రపంచ ప్రజల ఉమ్మడి కృషిఫలితమే సుమా!

బ్రిటిష్‌వారి పచ్చిఅబద్ధాలకు ఇంకా రెండు ఉదాహరణాలు చెబుతాను. ఇండియా ప్రభుత్వాన్ని విడిచి రాష్ట్రీయ ప్రభుత్వాలకు వద్దాం. భారత దేశంలోని చాలా రాష్ట్రాలు స్వపరిపాలన కలిగి వున్నాయని బ్రిటిష్ రాజకీయవేత్తలు ఏమేమో చెబుతారు. కాని ఆస్వపరిపాలన ఎట్టిదో మీకు తెలుసునా? సింధుప్రధాని అల్లాబక్షును ఆరాష్ట్ర గవర్నరు ఇటీవలనే బర్తరఫ్ చేశాడు. అతని తప్పేమిటి? ఏముంది? ఖాన్‌బహదూర్ బిరుదును వొదులుకున్నాడు; ఇండియాలో బ్రిటిషువారి ప్రస్తుత విధానాన్ని నిరసిస్తూ వైస్రాయికి లేఖరాశాడు. అసెంబ్లీ విశ్వాసాన్ని, ప్రజల ఆదరాన్ని పొందిన ప్రధాన మంత్రిని బర్తరఫ్ చేయటానికి ఆ కారణం చాలునన్నమాట! బెంగాల్ రాష్ట్రంచాల పెద్దది. శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ సమర్థుడైనమంత్రి; ప్రజాదరణ పాత్రుడు; గవర్నరు అనవసరంగా రాష్ట్ర పరిపాలనలో మంత్రుల పరిపాలనా విధానానికీ కూడా అడ్డువస్తున్నాడని నిరసన సూచకంగా ముఖర్జీ తన మంత్రిత్వానికి రాజీనామా ఇచ్చివేశాడు బైటకివచ్చి "రాష్ట్రీయ స్వపరిపాలన ఒక పెద్దతమాషా" అని ప్రకటించినాడు

ఇప్పుడిక ఇండియాలో ఐక్యతగనక ఏర్పడితే స్వాతంత్ర్యం ఇస్తారట, బ్రిటిష్‌వారు అంటారు బాగానే ఉంది; బెంగాలులో, సింధులో ఐక్యత ఉంది. అన్నిపార్టీలవారూ మంత్రివర్గాలను సమర్థిస్తూనే ఉన్నారు. వ్యతిరేక పక్షాలు (opposition parties) ఉన్నాయిగదా అంటే__ ప్రజాస్వామ్య విధానంలో ఉండాలి కాబట్టి ఉన్నాయి. మరి కనీసం ఈ రాష్ట్ర ప్రభుత్వాల్లో కూడా స్వపరిపాలనకు వారు అనుమతించరేం? కాబట్టి బ్రిటిష్ తన సామ్రాజ్యాన్ని వదులుకొనేందుకు సిద్ధంగా లేదనటానికి ఇంతకన్నా వేరే నిదర్శనాలు చూపనక్కర్లేదనుకుంటాను.

ఇటువంటి పరిస్థితులలో మేము చేయవలసినదేమిటిమరి? నాజీజం ఫాసిజములను యావద్భారత దేశము నిరసిస్తున్నది. ఈ ఆమానుష ఉద్యమాలను మేము సర్వదా నిరసిస్తున్నాము, అని భారతజాతీయ కాంగ్రెసు, నా పార్టీ అయిన అఖిలభారత కాంగ్రెసు సోషలిష్టుపార్టీ రెండు పక్షాలును పలు

సార్లు ప్రకటించినవి యుద్ధానికి పూర్వమే - ఈ ప్రజాస్వామ్య దేశాలనబడేవి ఫాసిజాన్ని ప్రతిఘటించేందుకు నడుములు బిగించకముందే భారత దేశంలోని జాతీయ - సోషలిస్టువర్గాలు రిపబ్లికన్ స్పెయిన్ - ఛియాంగ్ రిపబ్లికన్ చైనాలతోను సానుభూతిని ప్రకటించినవి. జర్మనీ - ఇటలీ - జపానుల అహంకారాన్ని గర్హించినవి ఆనాడు ఇండియా స్వతంత్ర దేశమై యున్నట్లయితే అప్పటి అంతర్జాతీయ క్లిష్ట పరిస్థితులలో ఒక ప్రముఖపాత్ర నిర్వహించి ఉండేది మా దేశం అట్లు కలుగ జేసుకొనటం మూలాన్ని ఈ ప్రపంచయుద్ధమే రాకుండా ఆగిపోయేది; కనీసం ఇది ఆసియాఖండానికి వ్యాపించకుండా నయినా అడ్డగించబడేది స్వతంత్ర భారతం, స్వతంత్ర చైనా — ఈ రెండూ దురాక్రమణదారులకు గుండెబెదురుగా ఉండగలవు. ఈ రెండు ప్రాచీన దేశాలు స్వతంత్రంగా, మైత్రితో కలసి వ్యవహరించగల అవకాశాలే ఉంటే ప్రపంచ చరిత్ర మరోవిధంగా ఉండేది.

మేము ఫాసిజానికి వ్యతిరేకులమైనట్టే సామ్రాజ్యవాదానికి కూడా వ్యతిరేకులమే ఇంకా మేము దానికి దాస్యం చేస్తూ ఉండలేము. దాన్ని సమూలంగా నాశనంచేసి విడిచి పెడతాం. ఈ ప్రపంచయుద్ధం పీడితజాతుల విమోచనానికి సాగిస్తున్నట్లు ఉద్ఘాటిత మౌతున్నప్పుడు, మేము మా మోక్షం కోసం పోరాడకుండా ఉంటామా? స్వాతంత్ర్యాన్ని వాంఛిస్తున్నందుకు దాని కోసం పోరాడుతూన్నందుకు మే మెవరికీ క్షమాపణ చెప్పుకో నక్కర్లేదు

కాని మేమిప్పుడు బ్రిటిష్ వారితో యుద్ధానికిదిగితే అందువల్ల అక్షరాజ్యాల వారితో దెబ్బలాడుతోన్న మిత్రరాజ్యాల వారి యుద్ధకృషి బలహీనమై పోతుందేమోనని మీకు బహుశః కష్టంగా ఉంటే ఉండవచ్చు. కాని ఆ విషయమై ఆలోచించవలసిన బాధ్యత మా ఒక్కరిమీదనే లేదు. సంయుక్త రాజ్యాల వారుకూడా ఈ విషయమై తీవ్రంగా ఆలోచించాలి, వారి యుద్ధకృషిని భంగపరచవలెననిగాని, ఆటంకాలు కల్పించాలని గాని మాకేమీ అట్టి కోరిక లేదు, కాని మా స్వాతంత్ర్య సమరం వారికట్టి

యిబ్బందులే కలిగించేట్టయితే, మేము చేయతగిందేమీ లేదుమరి! అది మా తప్పు కాదు, వారిదే. మానవజాతికి స్వాతంత్ర్యం పునరుద్ధరించేందుకే యుద్ధం చేస్తున్నామని ఉద్ఘాటించుకుంటున్నారే! ప్రపంచంలో అయిదోవంతు ప్రజల స్వాతంత్ర్యం వారికి కంటకమౌతున్నదా? మిత్రరాజ్యాల వారు ప్రకటిస్తున్న యుద్ధాశయాలు సత్యములే అయితే భారతీయుల స్వాతంత్ర్య సమరం వారికి ఇబ్బందులు కల్పించనేరదు, పైగా వారికి సహాయభూతమే ఔతుంది. అది వారికి ఇబ్బంది కలిగించేట్టయితే వారి యుద్ధాశయాలు శుద్ధ అబద్ధాలన్నమాట! వారి మాటలకు చేతలకూ మహాదంతరం ఉన్నదన్నమాట! ఆశయాలకూ చేతలకూ పొంతనే లేదన్నమాట! కనుక మా స్వాతంత్ర్య సమరం వారి మాటలకు, చేతలకు సామరస్యము కూర్చి, తద్వారా న్యాయబద్ధమగు ప్రపంచ శాంతికి దోహదమై, మిత్రరాజ్యాలకు మేలే చేకూర్చగలదు.

మీరంతా స్వాతంత్ర్య యోధులు మా స్వాతంత్ర్య సమరానికి తోడ్పడండని మిమ్ముల్ని అర్థిస్తున్నాను, మీరు ఈ మూడు విధములుగా సాయపడగలరు.

(1) బ్రిటన్ మాపై సాగించే ఫాసిస్టు యుద్ధంలో మీరు కలిగించుకోవద్దు. బహుశః మీ ప్రభుత్వము కూడ మీకు అట్టి సలహానే జారీచేసియుండవచ్చును

(2) మీ దేశీయులకు, మీ నాయకులకు, మీ ప్రభుత్వానికి మా భారతదేశాన్ని గురించిన యదార్థ విషయాలను తెలియచెప్పండి. మీరిక్కడ వచ్చి మాతోపాటు ఉంటూ ఉన్నారు. నిజపరిస్థితులు మీకు బాగా అవగాహన అయి ఉంటాయి. మా దేశీయుల సానుభూతిని మీరు మాకు అర్జించి పెట్టుటద్వారా... మీరిప్పుడు ప్రాణత్యాగము కూడ చేయుటకు సిద్ధమై యుండిన ఆశయమునకు మరింత బలము చేకూర్చిన వారౌతారు

(3) బ్రిటిష్ సైనికులకు, ఉద్యోగులకు భారతదేశ యథార్థ పరిస్థితులు తెలియచెప్పండి. బ్రిటిష్ సైనికుల ధైర్య శౌర్యాలు సత్యప్రేరితముండదు. యథార్థ

స్థితిగతులు తెలిసికొని యాతడు మా ఆశయము న్యాయబద్ధమని గుర్తించ గలడు. ప్రస్తుతం అతనికి ఇండియా గురించి ఏమీ తెలియదు కాబట్టి ఏదో దురభిప్రాయాలతో, జాతి విద్వేషంతో ఉంటాడు అలా ఉండటం అతనికి, మాకు కూడా హానికరమే బ్రిటిష్ సైనికులు చాలమంది. మామూలు కార్మిక తరగతిలోని వారే, కాగా వారున్నూ సామ్రాజ్యవాదులకు బలియౌతూన్న వారే, మా ఆశయమే వారి యాశయముకూడా. ఈ సంగతి వారు గమనించటం అవసరం. సామ్రాజ్యం విచ్ఛిన్నమై, నశించి పోతేనేగాని బ్రిటిష్ ప్రజలకు ధనస్వాముల పీడా వదలిపోదు, దారిద్ర్యం తొలగదు. యుద్ధానంతరం ఇంగ్లండులో 'సోషల్ విధానం' ... అంటూ ఏదో చాల ప్రచారం చేదిం. బ్రిటిష్ సైనికుడు ఆ భవిష్యత్ నూతన విధానంలో ఆశలుఅల్లు కుంటున్నాడు కామోలు! కాని పాతబడి పోయిన సామ్రాజ్య తత్వపు పునాదులమీద నూతన వ్యవస్థా నిర్మాణము అసంభవం.

కాబట్టి బ్రిటిష్ వారితో చెప్పండి — నిజంగా వారు ఒక నవ్య ప్రపంచ నిర్మాణం కోసమే ఈ యుద్ధం చేస్తూవున్నట్లయితే — ధనం, అవకాశాలు, అధికారం, గౌరవం, విద్య, సంస్కృతి, అన్ని జీవితావసరాలూ సక్రమంగా, సమంగా ప్రజలందరికీ అందగల ఒక నవ్య ప్రపంచ వ్యవస్థా సముద్ధరణ కోసమే తామీ యుద్ధం చేస్తున్నట్లయితే — అమాయిక స్త్రీలను, పిల్లలను తుపాకులతో పీల్చి... ఇళ్లు తగులబెట్టి లూటీలు చేసి... ఇలాంటి ఫాసిస్టు పద్ధతులతో మా స్వాతంత్ర్య పిపాసను — ఈ పురాతన ఆసియాఖండంలో పొడసూపిన యీ స్వాతంత్ర్య పిపాసను — అణగ ద్రొక్కేందుకు ప్రయత్నించటంలో తప్పుదారిన ప్రవర్తిస్తూన్నారని తెలియ చెప్పండి వారితో దెబ్బలాడాలని గాని, వారిని హింసించాలని గాని మా ఉద్దేశ్యం కాదని చెప్పండి. బ్రిటిష్ వారి చెడుకోరటంలేదు. మేము. వారి సామ్రాజ్యం మా స్వేచ్ఛకూ, సౌఖ్యానికి, సంపత్తుకూ పరమశత్రువు. ఆ సామ్రాజ్యంతో యుద్ధంచేసి, దాన్ని నాశనం చెయ్యటమే మా ఉద్దేశం. మేము స్వాతంత్ర్యం సంపాదించుకున్న తర్వాత వారితో పాటు బుజాలు ఒరసి నిలుస్తాం. తన

స్వాముల, సామ్రాజ్య వాదుల, నాజీల — ఎటువంటి దురాక్రమణలైనా సరే ఎదుర్కోటానికి వారితో పాటు ఏకీభవించి నిలుస్తాం. అప్పుడే మన మొక నవ్య ప్రపంచ వ్యవస్థను నిర్మించగలం. ఈ విషయాలన్నీ నిష్కల్మష హృదయాలతో ఆలోచించుకోమని చెప్పండి. వారి పాలక మహాశయులు నూరి పోస్తూఉండే ప్రచారమే కన్నులు మూసుకుని నమ్మి వ్యవహరించారంటే మాత్రం ఈ తమయుద్ధ నిర్వహణము, ఈ ప్రాణత్యాగాలు — అన్నీ నిరర్థకమై పోయినట్లే. క్రౌర్యము, అసమత్వము, పేదరికము, దుఃఖము, యుద్ధాలు, మారణయంత్రాలు — ఇత్యాదులతో కలుషమైన, ఇదివరకులాంటి దుష్టప్రపంచములోనే వారి బిడ్డలు కూడా అవస్థలు పడవలసివుంటుంది.

మిత్రులారా! సంక్షిప్తంగా మీకు నావిజ్ఞప్తి ఇదీ. అది మీహృదయాలకెక్కగలదని నా విశ్వాసం.

**Long live the cause of freedom!**
**Long live indian revolution!**

ఇండియాలో
ఎక్కడో

జయప్రకాశ్ నారాయణ్.

•

## సోషలిజం ఎందుకు ?

### సోషలిజం : సాంఘిక పునర్నిర్మాణ విధానం

'సోషలిజం'ను గూర్చి మనం ముఖ్యంగా గుర్తుంచుకో వలసిన విషయం. అదొక సాంఘిక పునర్నిర్మాణ విధానం. మువ్వు, నేను వ్యక్తిగతంగా అనుష్ఠించగల ఒకానొక నీతినియమావళి కాదు. కృత్రిమ దోహదక్రియలతో పెరిగే వృక్షంవంటిదికాదు. సామ్యవాదం ఇండియాలో ఫలించవలెనంటే దేశ ఆర్థిక- సాంఘిక జీవనము యావత్తు పునర్నిర్మాణము నందవలె. పొలాలు, ఫ్యాక్టరీలు, స్కూళ్లు, కళాసంస్థలు పునర్నిర్మితాలు కావలె. ఒకేఒక గ్రామంలో గాని, ఒకేఒక ఫ్యాక్టరీలో గాని. అన్ని వ్యవహారాలూ సామ్యవాద సిద్ధాంతములకు అనుగుణ్యముగా నడుపవచ్చును; నిజమే. కాని అంత మాత్రాన అది సామ్యవాద మనిపించుకోదు. 'ప్రిజం' ద్వారా సూర్యకిరణాలు గోడమీద ప్రతిబింబించి సప్తవర్ణ కూడ ఏడురంగులూ కనిపిస్తాయి అయితే మాత్రం? అది ఇంద్రధనుస్సు ఔతుందా ?

కనుక సామ్యవాద బద్ధమైన సాంఘిక నిర్మాణము సాగింపదలచిన వారికి అందుకు అవసరమైన అధికారం ప్రజాంగీకారము ఉండవలె. అదిలేనిదే కేవలము ఆదర్శాలతో మాత్రమే సామ్యవాద సంస్థాపనము దుస్సాధ్యము.

అధికారం అంటే యేమిటి ? ప్రస్తుత ప్రపంచ వ్యవహారాలు తిలకించండి. వ్యక్తులుగాని' పార్టీలుగాని, సంస్థలుగాని, తమతమ ఆశయాలను సాంఘికంగా, జాతీయంగా ప్రభుత్వము ద్వారా అమలు జరుపుకో గలుగుతున్నవి. ఆ ప్రభుత్వమే మన చేతుల్లో ఉంటే మన ఆశయాలకు అనుగుణ్యంగా చట్టాలు నిర్మించుకుంటాం; ఆధునికశాస్త్ర పరిశోధనల ఫలితంగా లభించిన ప్రచారక యంత్రాలను, విద్యాశిక్షణ విధానాలను వినియోగించు

కుంటాం; మన సంకల్పాలు సిద్ధింప జేసుకుంటాం. తిరుగుబాటు లేస్తే మన చేతిక్రింద ఉన్న పోలీసులను, సైన్యాన్ని ఉసిగొల్పి అణచివేస్తాం. ప్రభుత్వానికీ వెనుక నిగ్రహానుగ్రహ సమర్థమైన ప్రభుత్వాధికారము ఉన్నది

ప్రపంచంలో ఏ పార్టీ యైనా ప్రభుత్వాధికారం హస్తగతం చేసుకుంటేనే గాని సామ్యవాద సౌధం నిర్మించదు. ఆ యాధికారం ఎన్నికలలో గెల్చి స్వాధీనం చేసుకోవటమా? పూర్వ ప్రభుత్వాన్ని కూలద్రోసి ఆక్రమించుకోవటమా? అన్న ప్రశ్నలు అప్రస్తుతాలు.

పై యంశాలను బట్టి మనమొక సిద్ధాంతానికి రాగలము: అధికారంలో ఉన్న ఒకపార్టీ, అంటే — ప్రభుత్వ యంత్రాన్ని హస్తగతం చేసుకున్న ఒకపార్టీ సామ్యవాదాన్ని స్థాపించగలదు; కాని దానికి వ్యతిరేక శక్తులను అణచగల అధికారం ఉండాలి; లేదా ప్రతికక్షులతో తగురీతిని వ్యవహరించ గలుగుటకు ప్రజలతోడ్పాటైనా ఉండాలి. ఈ రెంటికీ తేడా లేదు. సామ్యవాద ప్రభుత్వంలో వ్యతిరేక శక్తులను అణచగల అధికారము ప్రజలతోడ్పాటు వల్లనే లభిస్తుంది, ధనస్వామిక వర్గాలన్నీ ప్రతిపక్షంలో ఉండిపోతాయి.

సుస్థిరమైన ప్రభుత్వాధికారం పార్టీ ఒక సామ్యవాద స్వర్గాన్ని సృష్టించ గలదని చెప్పాను. అందుకది తన కార్యకలాపంఎలా ఆరంభించాలి? బొర్రలు పెంచుకొనియున్న ధనస్వాము లందరినీ పట్టేసి తుపాకీ గుళ్లకు ఎర చేయవలెనా? బహుశః భారత సామ్యవాద ప్రభుత్వానికి అధ్యక్షుడో, ప్రధాన మంత్రియో కానున్న జవహర్ పండితుడు సంయుక్త రాష్ట్రాలలోని తాలూకా దారులందరినీ వరుసగా నిలవబెట్టి కాల్చి వేయవలెనా? రాజుల, మహారాజుల బొక్కసాలను స్వాధీనం చేసుకుని ప్రజలందరికీ సమానంగా పంచి పెట్టవలెనా? టాటా ఐరన్ కంపెనీ యావత్తూ అందులోని కార్మికుల పరం చేసి, వాళ్ళయిష్టం వచ్చినట్టు పాడు చెయ్యమనో, బాగు చెయ్యమనో, వొప్పచెప్పి వేయాలా? దేశంలో భూమినంతా ఖండికలుగా విభజించి — ఒక్కొక్క చిన్న ఖండిక ఒక్కొక్కనికిగా ప్రజలందరికీ పంచిపెట్టవలెనా? ఈ పనులన్నీ చేస్తే — అది సామ్యవాద మనిపించు కుంటుందా?

ఊహా ఆదికాదు సామ్యవాదమంటే – అంతకన్నా వివేకవంతముగా శాస్త్రబద్ధముగా, నాగరికముగా, ఉంటుంది.

మరి, జవహర్ పండితుని కర్తవ్యం ఏమిటి?

మన దేశంలోను, విదేశాల్లోను మానవ సాంఘిక స్థితిగతులు పరిశీలిస్తే ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరం లభిస్తుంది.

## ప్రముఖ సాంఘిక సమస్య - అసమత.

మానవ జీవితంలో మనకు బాధాకరంగా కనిపిస్తున్నది అసమత — ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ తీవ్రతమమైన అసమత కొందరికి ఉచ్చ పదవులు, మరికొందరికి నీచపదవులు వ్యక్తి అభ్యుదయానికి వలసిన అవకాశాలు అందరికీ సమంగా లభించటంలేదు. జీవన సౌకర్యాలు కూడా హెచ్చు తగ్గులుగానే విభాజితములైనవి. దారిద్ర్యము, క్షుద, జాడ్యము, అజ్ఞానము, విషాదము అధికసంఖ్యాకులను పీడిస్తున్నవి. సుఖము, భోగము, విజ్ఞానము, పదవి, అధికారము ఏ అదృష్ట వంతులకో మాత్రం లభిస్తున్నవి. ఈతరతమ విభేదాలు అన్నిదేశాల్లో ఉన్నవి; కానిఇండియాలో మరీజాస్తి. ధనిక–దరిద్ర విభేదాలు, అన్నిదేశాల్లో వున్నవి; కాని యిండియాలో మరీజాస్తి, ధనిక దరిద్రవిభేదాలు, ఉచ్చ – నీచ వ్యత్యాసాలు మన అభాగ్య భారతదేశంలో ఉన్నంత తీవ్రంగా మరేదేశంలోనూ లేవు.

ఈ తరతమ విభేదాలు, సాంఘికంగా వాటి దుష్ఫలితాలు కలసి ఒక ప్రధాన సాంఘిక సమస్య ఐనవి ఈసమస్యా పరిష్కారానికే అన్ని యుగాలలోనూ – ప్రధానంగా ఆధునిక యుగంలో – ఉదాత్త వ్యక్తులందరూ తమ శక్తి సామర్థ్యాలను వినియోగించారు, వినియోగిస్తున్నారు. దాన ధర్మాలు, సాంఘిక సేవ. ధనస్వాములకు విజ్ఞప్తులకు. బీదల స్థితిగతులను చూచి జాలిపడి సాయము చేయుట—ఇవియన్నియు సాంఘిక తరతమ విభేదాలను సర్దుబాటు చేయునిమిత్తమే ఆచరణలోనికి వచ్చినవి.

కాని సామ్యవాదుల విధానము అది కాదు. వ్యాధిని చికిత్స చేయవలసిన వైద్యునివలె సామ్యవాది ఈ సమస్య పరిష్కరణకు పూనుకుంటాడు. ఈ సాంఘిక వ్యత్యాసాలు సృష్టిజన్యములేనని అతని విశ్వాసం కాదు. కనుక ఉన్న విభేదాలను సర్దుబాటు చేయుట కాదు అతని కర్తవ్యం. అవి ఉత్పన్నము కావటానికి మూలహేతువు కనిపెట్టి దాన్ని మొదట నిర్మూలిస్తే అవి మళ్ళీ పెరుగవు

## సృష్టిగత వ్యత్యాసాలు

ఈ హెచ్చుతగ్గుల వ్యత్యాసాల మూలకారణాన్ని అన్వేషించటంలో సామ్యవాది మొట్టమొదట సృష్టిశాస్త్రజ్ఞుని (Biologist) ఎదుర్కొనవలసివున్నది. మానవులంతా ఒకే మోస్తరుగా పుట్టరు. శారీరిక మానసిక శక్తులలోని వ్యత్యాసాలు జన్మతః వచ్చేవే అంటాడు సృష్టిశాస్త్రజ్ఞుడు. ఔను, నిజమే, మనముగాని, పరిశ్రమవాది గాని (behaviourist) కాదనేదిలేదు.

సాంఘిక వ్యత్యాసాలను పరిశీలించటంలో ఈ సృష్టిగత వ్యత్యాసాలు సామ్యవాదికి ఎంతవరకు అడ్డువస్తాయో చూదాం. అన్ని విషయాలలో వలనే మానవుల శక్తిసామర్థ్యాలలో కూడా తేడాలు ఉన్న మాట వాస్తవమే. సంఘంలో బహుకొద్దిమంది మేధావులొకవైపు! అల్లే బహుకొద్దిమంది శుద్ధ మొద్దు స్వరూపాలు మరొకవైపు, ఈ మధ్యలో చాలామంది ఇంచుమించు సమానమైన మధ్యరకపు ప్రతిభావిశేషాలు కలవారు.

ఈ సృష్టిగత వ్యత్యాసాలు సంఘంలో పలుముఖంగా గోచరమౌతూంటాయి. విద్యలో, కళలలో, శాస్త్రవిజ్ఞానములలో—ఇలాగ. అంతేకాక పదవులలో, సంపత్తులో, అధికారంలో, అవకాశాలలో కూడా వ్యత్యాసాలు ఉన్నాయి. టాగూర్—రామన్—లవంటి విజ్ఞానమూర్తులు ఉంటారు; సామ్యవాది కాదనటంలేదే! వారు ఉండటము అతనికీ సంతోషప్రదమే. కాని అతని విచారం—టాగూర్—రామన్‌ల వంటి మేధావులు కాగల ఇంకా అనేకమంది వందలకొలది మానవులు అవకాశాలు దొరక్క అభ్యుదయంలేక, స్వయం వ్యక్తులు కాలేక పరపదించిపోతున్నారే అని. ప్రకృతిమాత ఏ కొద్దిమందినో మహాకవులనుగా, విజ్ఞాన నిధులనుగా తయారు చేస్తేచేస్తుంది. అందులో అనర్థమేమీలేదు. అసలు అనర్థం ఎక్క—

టున్నదంటే- పైన సూచించిన రెండవరకపు వ్యత్యాసాలలో – పదవులలో, సంపత్తులో etc. ఆధునిక యుగంలో దేశాదాయము దేశప్రజలందరిదీ అని తేలిపోయింది. కనుక ఆస్తిపాస్తుల అసమవిభజనమే సాంఘిక సమస్యను క్లిష్ట తరం చేసిపెట్టింది.

## ఆర్థిక తరతమవిభేదాలు సృష్టిగత వ్యత్యాసాల ఫలితము కాదు

మరి ఆర్థిక తరతమ విభేదాలు ఎలా ఏర్పడ్డాయి ? "మనలో తెలివి తేటలు గల వాళ్ళు చురుగ్గా వ్యాపారచాకచక్యం అలవరచుకున్నారు; ఇతర్లకంటే ఎక్కువగా ధనం ఆర్జించారు" అంటుంది సృష్టిశాస్త్రం. సరే, నిజమే ననుకుందాం కాసేపు. అయితే మరి పిత్రియమైన ధనం సంక్రమించిన వాడి మాటేమిటి ? జన్మతః వచ్చినశక్తి సామర్థ్యాలతో ఇక్కడ ప్రమేయం లేదుగా ! లక్షాధికారి ఔరసుడు దిప్పకాయి గానీ, పండితశ్రేష్ఠుడు గానీ వాడికి లక్షలు వచ్చి పడతాయిగా ! కనుక ఈ ఔరసుల అదృష్టానికి కారణభూతమైనది ఒకానొక సాంఘికఆచారం, సాంప్రదాయం అంతే. ఆ సాంప్రదాయం మార్చి వెయ్యండి; ఇవాళ ధనవంతు లనిపించుకుంటూన్న లక్షలాది జనం మరుక్షణంలో బీదవాళ్ళైపోతారు.

ఇక స్వయముగా ఆస్తిపాస్తు లార్జించుకున్న వారి సంగతి చూదాం. వారు ఇతర్లకన్నా అధికశక్తిమంతులు కావటంచేత ధనవంతులైనారుకదూ!

వ్యాపారం చేసి లాభం సంపాదించవలెనంటే ఒకప్రత్యేక ప్రజ్ఞ అవ సరమే కాదనలేం. కాని ఆట్టిప్రత్యేక ప్రజ్ఞ కలవారే ధనార్జన పరులు కావటమూ–మిగిలిన వారంతా ఆ ధనవంతులనుఆశ్రయించుకుని బ్రతకటమూ– ఈ భగవదిచ్ఛ అసమంజసంకాదా ? ఒక గొప్ప గణితశాస్త్రవేత్త ఉంటాడు. అతని పరిశోధనలు శాశ్వతకీర్తిని ఆర్జించి పెడతాయి. కాని అవే అతనికి ధనం కాదు. ఏవో కొన్ని నిర్ణీతపద్ధతులను అనుసరించినంత మాత్రాన ధన సంచయం చేయగలుగుతూన్న మామూలు వ్యాపారస్థునికున్న విలువకూడా ఆ గణితశాస్త్రజ్ఞుని ప్రతిభావిశేషాలకు లేనే లేదా? ఒక శాస్త్ర పరిశోధకుడు ఎంతప్రతిభావంతుడైనా...ఒక వ్యాపారస్థుడుగా మారి పోతే తప్ప... ఈ పరిశోధనాగారంలో కూచుని విత్తవంతుడుగా లేడు. ఒక వ్యాపారస్థుని చురుకుతనమే ధనార్జన సాధనంగా కనిపిస్తున్నది.

ఈ దుకాణం ఎలాంటిదో...అందులో ధనం ఎలా ఉత్పన్నమై, సంచితమాతున్నదో పరిశీలిద్దాం.

## ధనార్జనము, సంచయము

ప్రపంచంలో మానవులున్నారు; ప్రకృతి ఉన్నది. సంపద యావత్తూ ప్రకృతి గర్భంలో ఉంది. ప్రకృతిలో కృషిచేసి మానవుడు తనకు వలసినది సమకూర్చుకోవలె. తి ఉపయోగార్థము మానవుడు సమకూర్చుకున్న దంతయూ అతని సొత్తు. కనుక సంపదకు ఆధారము ప్రకృతి; దాన్ని ఉత్పన్నము చేసింది మానవుని కృషి.అర్థశాస్త్ర మూలసూత్రమే ఇది.

మరి సంపద ఎలా సంచితమాతున్నది? మానవులు ప్రకృతి నుంచి తమకు వలసినంతవరకే సంగ్రహించి సరిపెట్టుకుంటూ వుంటే మిగిలే దేముంది? అప్పుడు సంచయానికి అవకాశం లేదు. ప్రకృతినుంచి మానవుడు సంగ్రహించగల మొత్తము అతని ఉత్పత్తి శక్తిమీద-అంటే అతనిపనిముట్లు పదును మీద, పనితనంమీద-ఆధారపడి వుంటుంది. కనుక తన జీవితావసరాలకు చాలినంతకన్న అధికంగా సంపత్తిని ఉత్పన్నంచేయగల నిశితశక్తి మానవునికి ఉన్నప్పుడే సంచయం సాధ్యమౌతుం దన్నమాట. వేట, చేపలు పట్టుట, వ్యవసాయము-ఇత్యాదికళలు కనీస జీవితావసరాలకు మించిన ఫలసాయాన్ని సమకూర్చుటకు తగినంతగా అభివృద్ధి చెందినప్పుడే కూడబెట్టుట సాధ్యమౌతుంది.

ఆవిధంగా ఉత్పత్తి సాధనలైన కళలు అభివృద్ధి చెందిననాడు ప్రతి వాడూ-స్వంతంగా పనిచేసుకోగల స్వేచ్ఛఉంటే-సొంతపనిముట్లు ఉంటే-ప్రకృతిలో అడుగు పెట్టటానికి అభ్యంతరాలు లేకపోతే- తానుఉత్పత్తి చేసిన దంతా తానే ఉంచుకోగలిగితే- ప్రతివాడూ కొంత సంపదను కూడబెట్టుకోగలడు. ఉత్పత్తి హెచ్చి, అవసరాలు తగ్గినప్పుడు ఎక్కువగాకూడ బెట్టుకోవచ్చును. కనీసపు అవసరాలతో తృప్తిపడక కొన్నికుటుంబాలవారు తాముఉత్పత్తి చేసినదంతా ఖర్చుపెట్టేస్తారు. అట్టివారు కూడబెట్టుకోగలిగినది ఉండదు. అయినా వారు తిండిలేక మాడవలసిన అవసరంలేదు. ఎందువల్లనంటే-ఉత్పత్తిశక్తి కనీసపు అవసరాలకు వలసినంతకన్న మించియున్నప్పటి సంగతికదా మన మిప్పుడు విచారించినది!

ఇకపోతే, అసాధారణమైన తెలివితేటలుగలవాళ్ళు కొందరుంటారు

సంఘంలో. వస్తుతః వాళ్ళు ఇతర్లకన్నా ఎక్కువ ఉత్పత్తి చేస్తారు. మిత వ్యయము కలవారు కూడా అయితే ఎక్కువే మిగుల్చుకుంటారు. తెలివి తేటలు లేనివారైతే ఎక్కువ మిగుల్చుకోలేరు; అసలే మిగుల్చుకోలేక పోవచ్చును. కాని శరీరదార్ఢ్యంగల ప్రతివాడూ... పైని చెప్పినట్లు ఉత్పత్తి శక్తులు అధికంగాగల సంఘంలో... ఏ కొంచెమైనా మిగిల్చుకోటానికి ఆస్కారముంది; లేదా కనీసం తన్ను తాను పోషించుకోగలుగుతాడు... తనకుతాను పనిచేసుకోగల అవకాశాలు ఉంటే– సొంతపనిముట్లు ఉంటే– ప్రకృతిలో అడుగు పెట్టటానికి అభ్యంతరాలు లేకపోతే–తాను ఉత్పత్తి చేసినది యావత్తూ తన అధీనంలోనే ఉంచుకోగలిగితే.

ఇక మన సంఘంలోని యథార్థ పరిస్థితులు చూద్దాం. వ్యావసాయిక పారిశ్రామిక ఉత్పత్తి విధానాలు బాగానే వృద్ధిచెందినవి. మానవుడు తనకు వలసిన దానికన్న మిన్నగానే తేలిగ్గా ఉత్పత్తి చేసుకోగలడు. భారతీయ కర్షకుడు తన ఇక్ష్వాకులకాలంనాటి పనిముట్లతోనే తన పోషణకు కావలసిన దానికన్న అధికంగానే పండిస్తాడు. కాని లక్షలాది ప్రజలు ఒక్కపూటైనా సుష్టుగా భోజనం చేయలేకపోతున్నారే! కొంతమందేమో అన్ని అవసరాలూ గడుపుకోగలుగుతూ భోగవిలాసాలు కూడా అనుభవిస్తున్నారే ఒకవంక కటిక దారిద్ర్యము – మరొక వంక భోగవిలాసాలు – ఇంత తారతమ్యం ఎలా ఏర్పడ్డది?

మొదట 'దారిద్ర్యాన్ని' తీసుకుందాం. అభివృద్ధిగాంచిన ఉత్పత్తిశక్తుల సహాయంతో ప్రతివాడూ తన పోషణకు సరిపోగా ఇంకా మిగుల్చుకోటానికికూడా ఫలసాయం పొందగలిగియున్నాడు. కాని చాలమంది భారతీయులు తమ్ముతామే పోషించుకోలేకుండా ఉన్నారు. ఎందువల్ల? పైని ఉదహరించిన సౌకర్యాలన్నీ లుప్తములైనవి. ప్రజలంతా తమకుతామే పని చెయ్యటంలేదు; ప్రకృతిలో అడుగు పెట్టటానికి అభ్యంతరాలు ఉన్నవి; సొంత పనిముట్లు లేవు; ఫలసాయమంతా తామే ఉంచుకోలేకపోతున్నారు. ఈ అడ్డంకులన్నీ ఎలా వచ్చాయో-అదంతా ఒక పెద్ద కథ. ఈ అడ్డంకులన్నీ ఉన్నమాట మాత్రం యథార్థమే; కనిపిస్తూనేఉంది.

కనుక ఉత్పత్తి సాధనలైన పనిముట్లు, పదార్థాలు, భూమి మొదలైనవి ప్రజల అందుబాటులో లేకపోవుటయే దారిద్ర్యానికి కారణం. అవి

డబ్బిచ్చి సంపాదించాలి. వాటికోసమయ్యే ఖర్చు ఎంత ఎక్కువైతే...ఫల సాయంలో వారికి మిగిలేభాగం అంత తక్కువ. కాగా వారిదారిద్ర్యం కూడా ఎక్కువౌతుంది. ఉత్పత్తిసాధనలను కొనుక్కుండే సామర్థ్యం చాల మందికి లేదు. అందుచేత అవి కలవారిదగ్గిర కూలిచేయవలసి వస్తున్నది. ఉత్పత్తి సాధనలు ప్రతివారికీ అందుబాటులో వుంటే దారిద్ర్యం ఉండదు. జనసంఖ్య అమితంగా పెరిగిపోయి, అందరికీ చాలినంత సంపత్తి ఉత్పత్తి కాని పక్షంలో దారిద్ర్యం రావచ్చు. భారతదేశంలో జనసంఖ్య ఎక్కువే. అయినా తగినంత ఉత్పత్తిలేకపోలేదు.

ఇక ధనవంతుల సంగతి చూదాం: బీదవారి సంగదకు లక్షలరెట్లు అధికంగా కొందరి వద్ద ధనం మూలుగుతున్నది ఎందుచేత? అందరూ ఒకే రకమైన ఉత్పత్తిసాధనలను ఉపయోగిస్తూన్నప్పుడు.. ఎవరో ఒక్క పెద్ద మనిషి...ఎంత తెలివిగలవాడైతేమాత్రం–ఇతర్లకన్నా వేలరెట్లు ఫలసాయం ఉత్పత్తి చేయగలడా? ధనస్వాముల ధనమంతా వారు స్వయముగా ఆర్జించినది కాదు. ఒకే సంఘములో నివసిస్తోన్న వ్యక్తుల ఉత్పత్తి పరిమాణములలో ఇంత వ్యత్యాసం అసంభవం. ప్రకృతిలో పనిచేసికదా ధనార్జన చేయాలి? స్వకీయపోషణకుమించి ఆర్జన చేసినప్పుడుకదా నిలువచేయగలుగుట? ఉత్పత్తి కళలు ఒక అభివృద్ధి దశకు వచ్చేసరికి ఉత్పత్తి పరిమాణమునకు ఒక పరిమితి నియమితమౌతుంది. యంత్రాలద్వారా ఉత్పత్తిసాగులోని పశ్చిమీయ సంఘాలలోకూడా అంతే. వారి ఉత్పత్తి సాధనములు – ముఖ్యంగా పారిశ్రామిక ఉత్పత్తిసాధనలు ఎంతో ఎక్కువగా అభివృద్ధిచెందుటచేత వ్యక్తులెవరూ స్వతంత్రంగా వాటిని ఉపయోగించరాదు. అట్లని నావాద మునకు వచ్చిన భంగంలేదు. నలుగురూకలిసి ఉత్పత్తిచేసిన దానిలో నలుగు రికీ పాలు ఉంటుందిగదా! అటువంటప్పుడు సంఘములో ప్రతివాడూ బాగానే నిలువచేసుకోగలుగుతాడు; దారిద్ర్యం ఉండదు; కొద్దిమంది దగ్గిరే ధనం అధికంగా నిలువయుండిపోవటం జరుగదు.

మరి ప్రస్తుతం మన సంఘములో ఈపెద్ద ఆస్తులన్నీ ఎలాఏర్పడ్డాయి? రాత్రింబగళ్లు ఓపిగ్గా పరిశ్రమించి సంపాదించారని వాదించవచ్చు. కాని, మితవ్యయం, పరిశ్రమ ఒకే వంశంలో తరతరాలుగా అవ్యాహతంగా సాగి రావు. అదీగాక ఆ రెండింటివల్లనే అపారంగా ధనం వచ్చిపడదు. నేటి ధన స్వాముల విస్తారమైన ఆస్తిపాస్తులకు వంశపారంపర్యంగా వచ్చిన తెలివితేట

లేమీ కారణము కాదు. ధనం సంపాదించే కీలకం ఇప్పుడు ధనస్వాములై యున్న వారి ప్రత్యేక తెలివితేటలలో ఉన్నది కాదు; అది వారి రక్తనాడుల్లో జన్మతః వచ్చినది కాదు.

## ధనము - దోపిడి

ఆ రహస్యం ఎక్కడ ఉన్నదంటే - కనీస అవసరాలకు మించిన ఉత్పత్తి జరుగుతోన్న సంఘంలో... ఒక వ్యక్తి పదిమందినో అంతకన్నా అధికంగానో తనక్రింద పనిచేయటానికి అట్టి పెట్టుకుని... వారి పోషణకు సరిపడినంత మాత్రమే వారికిచ్చి తక్కినదంతా తానే ఉంచుకుంటాడు. అలాగ ఒక్కడే సొంతంగా పనిచేసుకునేవాడు సంపాదించగలిగిన దానికన్నా, పదిమంది కూలీలను పెట్టుకుని పనిచేయించుకునేవాడు పదిరెట్లు ఎక్కువగా కూడబెడుతున్నాడు; త్వరలోనే పెద్ద ధనవంతుడై పోతున్నాడు. అతని దగ్గర పనిచేసే కూలీలసంఖ్య పెరుగుతూన్న కొద్దీ, అతని సొంత ఆస్తికూడా పెరుగుతూ ఉంటుంది.

మరొక వ్యక్తి ఏదోవిధంగా ప్రకృతిని (భూమిని) గుత్తగొన్నాడనుకుందాం. అట్టి వాడ్ని పురస్కరించుకుని మరెవరినీ ఆభూమిలో అడుగు పెట్టనీయడు, సాగుచేయనీయడు. ఎవరైనా సాగుచేసి పండిస్తానని వస్తే ఫలసాయంలో తనకుకూడా భాగం పెట్టమంటాడు. తద్వారా తానూ క్రమేణా ఒక భాగ్యవంతుడై పోతాడు. సొంతభూమి ఎంత ఎక్కువగా ఉంటే - ఆభూమిని కౌలుకు తీసుకుని సాగుచేస్తున్న వారి దగ్గర ఎంత ఎక్కువగా కప్పం రాబట్టుకుంటే - అంత పెద్ద ధనవంతుడై పోతాడు. ఒక్క భూమి విషయంలోనే కాదు యితర ప్రకృతి సంపదలవిషయములోనూ అంతే. దాన్నే దోపిడి అంటారు. ధనిక-దరిద్ర వ్యత్యాసాలకు అసలైన కారణం అదే.

ప్రతివాడూ తనకు తానే సొంతంగా కృషిచేసుకుని ఫలసాయమంతా తానే అనుభవించవచ్చుగా? మరొకనివద్ద ఎందుకు పనిచెయ్యాలి? తాను ఉత్పత్తిచేసిన దానిలో కొంతభాగం ఇంకొకరికో ఎందుకు పోవాలి? -అన్న ప్రశ్న వస్తుంది. ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించవలెనంటే మానవ చరిత్రలో సాంఘిక, రాజకీయ పరికరణాలను ఆసాంతం తిరగవేయాలి. సంక్షిప్తంగా ఆ ప్రశ్నకు జవాబు ఇది- ఏదో ఒక బలవంతం మీదగాని మానవుడు ఏ పని చెయ్యడు. ఇది చరిత్రాత్మక సత్యము.

ఒక విశాలప్రదేశం ఉన్నది. ఎవడైనా అందులో చెట్లు, చేమ కొట్టించివేసి తనకు కావలసినంత మేర సాగుచేసుకోవచ్చు. కాని ఎవడూ కూడా మరొకడికోసం పనిచెయ్యడు. అయినా అసలు ప్రకృతి శక్తులు మొట్టమొదట కొద్దిమందికి మాత్రమే గుత్తపడిపోయినవి. వారు వాటిని బలపూర్వకంగా ఇతర్లను ధిక్కరించి స్వాధీనపరచుకున్నారు. అన్ని ప్రదేశాల్లోనూ జట్లు జట్లుగా కొంతమంది లేచి ప్రకృతిని...ముఖ్యంగా భూమిని ... ఆక్రమించి తమ స్వంతంచేసుకున్నారు. మిగిలినవారిని కూలీలుగా అట్టిపెట్టుకున్నారు; లేదా కౌలుదార్లుగా ఉంచుకున్నారు

ఈ రెండో తరగతివారు తమకుతాము స్వంతంగా వస్తూత్పత్తిచేసుకోగలిగినంత కాలమూ పారిశ్రామికపు దోపిడి ఆరంభం కాలేదు; పారిశ్రామిక ఆదాయాలలో ఎక్కువ వ్యత్యాసాలు పొటమరించలేదు. కాని క్రమేణా ఉత్పత్తి విధానాలు అభివృద్ధి చెందినవి. పట్నాలు పెరిగినవి. స్వంతంగా పనిచేసుకుంటూ ఉండిన చేతిపనివాళ్ళంతా ఒక యజమానిక్రింద పనిచేయవలసిన వారైనారు. దానితో పారిశ్రామిక ఆదాయాలలో కూడా వ్యత్యాసాలు ఆరంభమైనాయి. యంత్రయుగం వచ్చినప్పటినుంచీ ఒకే యజమాని అనేకమంది కార్మికులచే తనక్రింద పనిచేయించుకుంటున్నాడు అంటే-వాళ్ళందరి ఉత్పత్తినీ దోచేస్తున్నాడన్నమాట. ఇలాగ పారిశ్రామిక ధనస్వాములు ఉత్పన్నమైనారు.

సంఘంలో ఇంకొక రకంవారు ఉన్నారు. వీరు కర్మాగారాల యజమానులూ కాదు, భూస్వాములూ కాదు; అయినా కొన్ని సందర్భాల్లో వారికంటేకూడా ధనవంతులై యున్నారు. వీరు వర్తకులు, బ్యాంకర్లు స్పెక్యులేషన్ వ్యాపారులు మొదలైనవారు. వీరు తమకు తామై ఏమీ ఉత్పత్తి చేసేదిలేదు. ఇతరులు ఉత్పత్తి చేసినదాన్ని ప్రత్యక్షంగా దోచుకుంటున్నదీ లేదు. కాని వారికా ధనమంతా ఎక్కడినించి వచ్చినా అది మొత్తంమీద సంఘంలో ఉత్పత్తి కాబడిన సంపత్తిలోనిదే అని మనం మరచిపోరాదు.

కనుక కార్మికులవల్ల సంపద ఉత్పన్నమౌతున్నది. ఉత్పత్తి చేసినందుకు వారికిచ్చిన కూలి పోగా మిగిలినది యజమానుల (దోపిడిదారుల) యాస్తి-ఔతున్నది. వీరు తమ కార్మికులు తయారు చేసిన వస్తువులన్నీ తామేం ఉపయోగించుకోలేరుగా! ఎన్నని ఉపయోగించుకుంటారు? అవి అమ్మి తమకు

కావలసిన ఇతర వస్తువులను కొనుక్కోవాలి. అందుకోసం వర్తకులు, స్పెక్యులేషన్ వ్యాపారులు కావలసివచ్చారు. పారిశ్రామికులు తమ సరుకులను అమ్ముకోవటమే కాదు. మళ్ళీ తమ యంత్రాలను ఆడించేందుకు ముడి పదార్థాలను కొనాలి. ఈ అమ్మటంలోనూ కొనటంలోనూ వారు తమకు అదనంగా మిగిలినధనంలో కొంత భాగం వర్తకులకు స్పెక్యులేటర్లకు ధార పోయాలి. అలాగే బ్యాంకర్లకు కూడాను. బ్యాంకర్లు డబ్బు అప్పు ఇస్తారు. దానిమీద వారికివడ్డీ వస్తుంది. పారిశ్రామికులు ఈ వడ్డీ చెల్లించటం తమ ఆదాయంలోనించే కాబట్టి లాభాలు వడ్డీలు మధ్యమనుష్యులకు పోయే రుసుములు కమీషనులు అన్నీ ఒక సమిష్టి మూలధనంలోనించే వస్తున్నవి. ఉత్పత్తి విధానాలను గుత్తగొన్న పారిశ్రామికులకు అధికంగా మిగిలిపోతున్న సంపదే ఆసమిష్టి మూలధనం. ధనమే ధనాన్ని పుట్టించదు. వ్యాపారపు ఎత్తులు కూడ అపని చెయ్యలేవు. ఎంతసేపటికీ అదనముగా ఉత్పత్తియైన సంపదలో మంచి సాధ్యమైనంత పెద్దభాగం కాజెయ్యటమే పెట్టుబడి దారులతంతు. అందుకే పెట్టుబడిదారులు తమలోతాము పోటీ పడుతుంటారు. వ్యాపారస్థుల తెలివితేటలన్నీ అందుకోసమే. ఆ తెలివితేటలే విశ్వవిద్యాలయాలలో బోధిస్తూ ఉంటారు.

కనుక పునరుక్తి దోషమైనా మరొకసారి చెబుతాను. ఉత్పత్తి విధానాలు గుత్తగొనటంవల్ల ఇతరుల పరిశ్రమను కొల్లగొనటంవల్ల యజమానులనబడేవారి చేతుల్లో సంచితమౌతూన్న ధనమే సమిష్టి మూలధనంఅంటాము. అందులోనుంచే ఇతర ఆర్థికసంస్థలు తమతమ భాగాలను తీసుకొంటాయి. ఈ 'మధ్యమనుష్యులు' స్వయంగా ధనాన్ని ఉత్పత్తి చేస్తున్నారను కోవటం తప్పు. ఉత్పత్తియై మిగిలిపోయిన ధనంలోనుంచి సాధ్యమైనంత ఎక్కువగా తాము తమసంచుల్లోనికి దింపుకుంటున్నారు. ప్రొఫెసర్లు, లాయర్లు, డాక్టర్లు మొదలైనవారుకూడా ఈ సమిష్టి మూలధనంలోనించే తమ జేబులు నింపుకుంటున్నారు. అసలు ఆ మూలధనమంతా నిజంగా కార్మికులూ రైతులూ ఉత్పత్తి చేశారు. అది న్యాయంగా వారికే చెందవలసినది.

కాబట్టి సంపదకు ఆకరమైన ప్రకృతిని, ఉత్పత్తివిధానాలను కొంత మంది మాత్రమే తమ స్వార్థంనిమిత్తము గుత్తగొనియున్నారు. అదే ఆర్థికంగా ఈ నాటి తీవ్రతర తమ వ్యత్యాసాలకు మూలకారణమైంది. కార్మికులు వారు ఉత్పత్తిచేసిన ధనంలో... వారి కనీస అవసరాలకు సరిపో

కొంత మాత్రమే ఇచ్చి మిగిలినదంతా యజమానులు కాజేస్తున్నారు. ఇదే దోపిడి అంటే. తనక్రింద పనిచేస్తోన్న కార్మికుల పరిశ్రమను కొల్లగొట్టటం ప్రత్యక్ష దోపిడిఅంటాం. భూమినిగాని, మరొకటిగాని ఇతర్లకు కొంత కాలం అనుభవించేందుకు ఇచ్చి, కౌళ్ళు అద్దెలు రాబట్టుకుంటే-అది పరోక్షదోపిడి అంటాం.

అసలు మొట్ట మొదట 'నోరుగలవాడిదే రాజ్యం' అన్న విధంగా ఎవరో కొద్దిమంది వ్యక్తులే ఉత్పత్తి సాధనలన్నీ స్వాధీనం చేసుకున్నారు. అలాగ అంగబలం ఉన్నవాడిదగ్గర ద్రవ్యం పెరిగిపోతూ వచ్చింది. వాడు ఇతర్ల పరిశ్రమను కొల్లగొడుతూ ఉండేవాడు. చివరకు విశాలభారత దేశం బ్రిటిష్‌వారి చెప్పుచేతల్లోకి వచ్చింది. పాశ్చాత్యులు ఈ దేశాన్ని బాగా దోచెయ్యటానికి అవకాశా లేర్పడినవి. ఇంగ్లండునుంచీ, జర్మనీనుంచీ యంత్రాలు దిగుమతి అయినవి. ఒకే ఒక కర్మాగారంలో తండోపతండాలుగా కూలీలను నియమించి పనిచేయించుకో గలుగుతున్నారు. అంటే పెద్ద ఎత్తున దోపిడీచేస్తున్నారన్నమాట! ఇదొక దోపిడీయుగం అయిపోయింది.

సంఘంలోని ప్రస్తుత అపార-తరతమ వ్యత్యాసాలకు అదీ కారణం. ఇక ఈ సమస్యా పరిష్కారానికి సోషలిస్టుపంథా ఎట్టిదో ఊహించుట కష్టసాధ్యము కాదు.

## హెచ్చు తగ్గుల నివారణ

ఈ సాంఘిక వ్యత్యాసాలు రూపుమాసిపోయి అందరికీ న్యాయం జరిగి, సౌఖ్యం లభించవలెనంటే- రెండు మార్గాలు కనిపిస్తున్నవి. ఒకటి: ప్రతి వ్యక్తి తనకుతాను స్వంతంగా పనిచేసుకొను అవకాశం లభించేట్టు సాంఘిక వ్యవస్థ పునర్నిర్మితము కావాలి. ఎవరికీ ఏవిధమైన కప్పము చెల్లించనవసరం లేకండా తనభూమి తాను దున్నుకొని పండించుకోవటానికిగాని- తన కార్ఖానాలో తన సొంత పనిముట్లతో తాను పనిచేసుకొనుటకుగాని- ప్రతివానికి స్వాతంత్ర్యం ఉండాలి. తన చేతులకు సాధ్యంకాని పెద్దపెద్ద ఉత్పత్తి సాధనలను ఎవరూ ఉంచుకో కూడదు.

ఆ విధంగా ప్రస్తుత సాంఘిక వ్యవస్థను మార్పు చేయవలెనంటే కఠిన నిబంధనలనే ప్రవేశపెట్టవలసి వుంటుంది. ఏ సంక్షోభమూ ఒడిదుడుకులు లేకుండా, నిరాఘాటంగా జీవయాత్ర సాగించుటకు క్రమశిక్షణ, ఆత్మనిగ్ర

హాము అవసరము. కాని అవి లభించుట దుస్తరం. అదీగాక అట్టి సంఘానికి రైల్వేలు ఉండవు టెలిగ్రాంలు ఉండవు. రాకపోకల సౌకర్యాలు పూర్వ కాలంలో వలె, స్వల్పంగా మాత్రమే ఉంటాయి. అటువంటప్పుడు మిలిటరీ దృష్ట్యా ఆలోచిస్తే-అధికంగా పారిశ్రామికాభివృద్ధి గాంచిన దేశాల దాహానికి అట్టి బలహీన సంఘము తేలిగ్గా బలియైపోతుంది. భారతదేశంలో జనసంఖ్య చాల ఎక్కువ. కనుక జీవన ప్రమాణం పెరగదు. సగటు ఆదాయం స్వల్పంగా ఉంటుంది.

కనుక ప్రస్తుత సాంఘిక అనర్ధాలనుండి తప్పించుకొనేందుకు ఈ మార్గం అవలంబించు దామనుకున్నా...అనేక కారణాల వల్ల అది వాంఛనీయంగా కనిపించటంలేదు.

ఈ మార్గమే అవలంబించుట సాధ్యమూ కాదు. ఆవిధానము( అసలుం చేయుటకు నియంతృత్వం కావలసిందే. ప్రత్యేకహక్కులను నిర్మూలించి, సంఘమంతా అలాపూర్తిగా మార్పుచేయటం అన్యథా సాధ్యం కానిపని. ఒకచిన్న ఉత్పత్తిదారునికి అంత నియంతృత్వం లభించేందుకు తగిన పునాదులు నేటి సాంఘిక వ్యవస్థలో లేవు.

## సోషలిస్టు విధానం

ఇక రెండవమార్గము; అదే సోషలిస్టు విధానం. ధనం ఏకొద్దిమంది వద్దనో అధికంగా సంచితమౌతూ ఉండటానికి పైన కారణాలు వివరించాము కదా! వాటినిబట్టి సోషలిస్టులు సూచించే విధానం ఏమిటంటే-ఉత్పత్తి సాధనాలపై సొంతహక్కులను నిర్మూలించాలి; అవి ప్రజాధీనం కావాలి.

ఉత్పత్తి సాధనాలపై సొంతహక్కులు నిర్మూలించి, వాటిని ప్రజాధీనం చేసిననాడు దోపిడి నశిస్తుంది; ఆర్థిక-తర తమ వ్యత్యాసాలు అంతరిస్తాయి. తద్వారా ప్రస్తుతం సంఘంఅనుభవిస్తోన్న శాపం విమోచన మౌతుంది. ఇతర్ల పరిశ్రమలను కొల్లగొనటం వల్లనే సొంతఆస్తులు పెరిగి పోతున్నాయని పైన సూచించాం. ఉత్పత్తివిధానాలు ప్రజాధీనం అయితే ఒకడు మరొకనికిక్రింద పనిచేయటం ఉండదు. ఎవరికివారు కాకుండా, అందరూ కలిసి అందరికోసమూ పనిచేస్తారు. వారు ఉత్పత్తిచేసిన ద్రవ్యం యజమాని లాభంక్రిందికి వెళ్ళదు; వాళ్ళేఅనుభవించగలరు. ఉత్పత్తిసాధనలు ప్రజాధీనం

కావటమంటే-ఉత్పత్తియైన ద్రవ్యమంతా ప్రజలదే అన్నమాట. అందరూ సమంగా పంచుకుంటారు. ఒకడుచేసిన పనినిబట్టి, అతని అవసరాలను బట్టి ఉత్పత్తిలోనుంచి అతనిభాగం నిర్ణయమౌతుంది. దేశరక్షణకు, పరిపాలనకు, న్యాయానికి, ఆసుపత్రులకు, దేశఆర్థికాభివృద్ధికి-ఇలా ప్రజలందరి సౌకర్యాలకోసం కావలసిన మొత్తాన్ని మాత్రం మినహాయించి మిగిలిన దేశీయ ఆదాయమంతా ఉత్పత్తిదారులందరికీ పంపిణీ ఔతుంది.

ఉత్పత్తి సాధనలన్నీ ప్రజాయత్తం చేయుట-ఇదే ముఖ్యమైన సామ్యవాద సిద్ధాంతము. సామ్యవాదపద్ధతిని సాంఘిక పునర్నిర్మాణం జరుగవలెనంటే ప్రప్రథమంగా చేయవలసిన పని-ఉత్పత్తి సాధనలపై సొంతహక్కులను నిర్మూలించవలెను.

కాని ఒక్కదెబ్బలో ఈ మార్పును తీసుకురావటం చిరకాలానుభవం లేని ప్రభుత్వానికి సాధ్యం కాకపోవచ్చు. అయినా తన సామ్యవాద ఆశయమును విజయవంతంగా నెరవేర్చుకొన వలెనంటే-ఈ మార్పును తక్షణమే భారీపరిశ్రమల విషయములో అమలు చేసి తీరవలెను. ఈ భారీపరిశ్రమలు దేశఆర్థికవ్యవస్థను తమ గుప్పెటలో పెట్టుకొని ఉన్నవి. దేశప్రజల ఆర్థిక జీవితానికి కీలకం అక్కడేయున్నది.

పారిశ్రామికాభివృద్ధి చెందిన దేశాల్లో ఉత్పత్తిసాధనలు హెచ్చిన కొద్దీ బ్యాంకులు, వ్యాపారసంస్థలు, రాకపోకలసౌకర్యాలు మొదలైనవి కూడా హెచ్చినవి. వీటి పుట్టుకకు ఉత్పత్తిసాధనల పెరుగుదలే కారణం. ఉత్పత్తిసాధనలను అవి పోషిస్తూఉంటాయి. ఉత్పత్తి యంత్రచక్రాలను అగకుండాత్రిప్పేవి అవే. కనుక ఉత్పత్తిసాధనలు ప్రజాయత్తమైననాడు బ్యాంకులు, వ్యాపారసంస్థలు మొదలైనవికూడా ప్రజాయత్తము కావలసిందే.

ఇప్పుడు జవహర్ పండితుడు అధికారములోనికి వచ్చినపుడు ఏమి చేస్తాడో...అంతా తెలుసుకున్నాం.

# సామ్యవాదం : భారతదేశం

# 1

## సామ్యవాదం : భారత సాంప్రదాయం

భారతదేశ సమస్యలే వేరు; వాటి పరిష్కారము తదనుగుణ్యంగా జరగవలె. అలా కాకుండా మీరేవో పాశ్చాత్యపద్ధతులు దిగుమతి చేస్తానంటారేమిటి- అంటూ కొందరు మమ్మల్ని ఆక్షేపిస్తున్నారు.

భారతీయ ప్రత్యేక సమస్యలనుగాని, సాంప్రదాయాన్నిగాని మేము నిర్లక్ష్యం చెయ్యనే చెయ్యము. అది మార్క్సు సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకం. మేము భారతసమస్యా పరిష్కరణ మార్గాలన్నీ తరచి చూచాం; ప్రస్తుత పరిస్థితులలో సామ్యవాదాన్ని మించిన పరిష్కరణ విధానం మరొకటి లేదన్న నిర్ణయానికి వచ్చాం. ఇలా అనటంలో... ప్రాచీన భారత సాంఘిక వ్యవస్థానిర్మాతల ప్రతిభను మేము కాదనటంలేదు. యుగప్రవృత్తి వశాత్తు భారతసాంఘికవ్యవస్థ తారుమారైంది. భారతసమస్యలు తలక్రిందులైనాయి. అలనాటి శాస్త్రకారుల అభిప్రాయాలకూ, నేటి యథార్థ పరిస్థితులకూ సంబంధమే లేకుండా పోయింది. అన్ని కాలాలకూ, సర్వదేశాలకూ అనువర్తించే కొన్ని విశాలాశయాలు ఉంటాయి. కాని పాతుకుపోయిన అనర్థాలను నిర్మూలించేందుకు గట్టి ప్రతిక్రియలను తీసుకోవలసిన సందర్భంలో ఆ విశాలాశయాల ప్రయోజనం అంతగా కనిపించదు. అదిగో అక్కడే పాతవిధానాలకూ ఆధునికభావాలకూ పొత్తుకుదరదు. అంతే గాని వ్యక్తి-సమిష్టి-శ్రేయస్సు కావలెనన్న ఆశయంలో ఏకీభావమే.

నాగరకత నిరాడంబరంగా ఉన్నరోజుల్లో ఆ పాతసిద్ధాంతాలు నిలిచాయి. ఇతరుల పరిశ్రమను కొల్లగొట్ట గలుగుటకు వీలైనంత అధికంగా పరిశ్రమలూ, వ్యవసాయమూ అభివృద్ధి చెందలేదానాడు. ఉత్పత్తి అంతా వ్యక్తిగతంగా జరిగేది. జనసంఖ్యతక్కువగా ఉండింది. ప్రకృతి సౌందర్యాన్వితంగా, సుసంపన్నంగా ఉండేది. కాస్త దార్ఢ్యంగల ప్రతివాడూ చెట్లు, గుట్టలు కొట్టి వేసి తనకుటుంబముతో కొంతమేర సాగుచేసుకుంటూ బ్రతికేవాడు.

ఈ నాటి వ్యాపసాయిక–పారిశ్రామిక సమస్య అప్పుడు లేనేలేదు. జమీందారీ విధానము ప్రాచీనభారత సాంప్రదాయానికే విరుద్ధము. మిల్లులు' ఫ్యాక్టరీలు కూడా నేడు కొత్తగా అవతరించినవే. సామ్రాజ్యవాదుల నిరంకుశ పాలనలో ఉద్భవించిన సమస్యలన్నీ కూడా కొత్తవే. భూమిని, తదితర ఉత్పత్తిసాధనలను గుత్తకొనటం ద్వారా ఎవరో కొద్దిమంది బహుళ ప్రజను దోచేస్తూన్న ఈనాటి ఆ ప్రధాన ఆర్థికసమస్య ఇంత తీవ్రంగా మనువు బ్రతికివున్న రోజుల్లో లేదు.

## సామ్యవాదానికి జాతీయ హద్దులు లేవు

ఈ సమస్యకూ మన ప్రాచీన భారతచరిత్రకూ సంబంధంలేదు. అది ఆధునిక ప్రపంచ సమస్యలలో ఒకటైనది. చైనా, జపాన్, ఇంగ్లండు, జర్మనీ, అమెరికాదేశాలలో అధిక సంఖ్యాక ప్రజానీకాన్ని ఎదుర్కొంటోన్న ప్రధాన సమస్య ఇదే. శక్తివంతిములైన ఉత్పత్తిసాధనలు రావటంతో–అంటే ఆవిరియంత్రాలు, విద్యుచ్ఛక్తి యంత్రాలు నిర్మించటంతో ప్రజలను విరివిగా దోచివేయటం ఆరంభమైంది. పెట్టుబడి దారులకు లాభదాయకంగా ఉత్పత్తి–పంపక విధానాలు సాగుతూన్నవి.

దీన్ని తప్పనిసరిగా అరికట్టగలది సామ్యవాదమే. దానికి జాతీయ హద్దులు లేవు. అది ప్రత్యేకంగా ఒక జాతికి చెందినసొత్తు కాదు. ఇంగ్లండులో ఉండవచ్చు; జపాన్‌లో ప్రవేశించవచ్చు. జర్మనీలో కాలుపెట్టవచ్చు. చైనాలో ఇల్లు కట్టుకోవచ్చు. అమెరికాలో చేరవచ్చు. ఇండియాలో కాపురముండవచ్చు. పెట్టుబడిదారుల దోపిడి సాగుతున్న అన్ని ప్రదేశాలకూ–ప్రపంచంలోని అన్ని మూలలకూ–సామ్యవాదం ప్రసరించక తప్పదు. భారతదేశంలో కూడా వస్తుంది; పరిస్థితులు అలాగే కనిపిస్తున్నవి.

మన దేశంలో జమీందారీలు ఉన్న కారణాన సామ్యవాద విధానాల్లో కొంతమార్పు ఉండవచ్చు. అంతేగాని దానిఅసలు తత్వం మారేది లేదు. పెట్టుబడిదారుల చేత కొల్లగొట్టబడుతూన్న వివిధతరగతులవారిమధ్య సమశక్తి[illegible]నం(balance of Power) భిన్నంగా ఉండవచ్చు. పరిస్థితులన్నీ సామ్యవాద సిద్ధాంతానుగుణ్యంగా మార్పుచెందటం నెమ్మదిమీద జరుగవచ్చు. అంతేతప్ప–పెట్టుబడిదారీ–జమీందారీ విధానాలను కూలదోయడ మనేది... కాపిటలిస్టు దేశాల్లో వలె... ఇక్కడ కూడా జరిగితీరవలసినదే.

## భారతసాంప్రదాయానుగుణ్య పరిష్కార మార్గాలు

భారత దేశంలో మనల్ని ఎదుర్కొంటోన్న సమస్యలను పరిష్కరించేందుకు మేము పాశ్చాత్య విధానాలను అనుసరిస్తున్నామని పరిహసించే పెద్దమనుష్యులు పోనీ భారత సాంప్రదాయానుబద్ధమైన విధానాలనే సూచించవచ్చును గా! భారత సమస్యలే వేరు. వాటి పరిష్కరణ విధానాలు కూడా తదనుగుణ్యంగానే ఉండాలి - అంటూ ఊరికే వాదించటమే గాని ఆ విధానాలేమిటో అందరికీ అర్థమయ్యే భాషలో వివరించి చెప్పిన మహానుభావుడెవడూ లేడు- ఒక్క భగవాన్‌దాస్ తప్ప.

నే నెరిగినంతవరకు మన భారతనాయకులలో ఒక్క భగవాన్‌దాస్ మాత్రం ఈ సమస్యను గూర్చి తీవ్రంగా ఆలోచించాడు. భారత సమస్యలకు భారత సాంప్రదాయానుబద్ధములని ఆయన భావించిన విధానాలను కొన్ని సూచించాడు. భావిభారత రాజ్యాంగ స్వరూప నిర్ణయము ప్రస్తుతము మన ఆవశ్యక కర్తవ్యము - అని ఆయన నొక్కి చెప్పినమాట. ఆయన సూచించిన విధానాలు ఎట్టివైనా ఆమాట మాత్రం నిజం. సామ్యవాదులను మినహాయిస్తే అట్టి సదభిప్రాయముతో ఉన్నవాడు ఆయన ఒక్కడే.

సామ్యవాదులు పాశ్చాత్యులను అనుకరిస్తున్నారనీ... అయినా వీరి విధానాలన్నీ స్వరాజ్యం వచ్చాక కదా, ఆముందు ఆలోచనలన్నీ ఇప్పటి నించే ఎందుకనీ... అర్థంలేనిమాట లేవో వాగినంతమాత్రాన తమపని ముగియదు. భారత సాంప్రదాయాభిమానులు 'మొదట మనకు స్వరాజ్యం రానీయండీ' అంటారు. వచ్చాక వాటికి ఏ 'వాద' మైనా పనికివస్తుందిగాని సామ్యవాదం మాత్రం నిషేధమే. అలా కనిపిస్తుంది. వారు సామ్యవాదులను విమర్శిస్తోన్న తరహా చూస్తే.

సామ్యవాదం పనికిరాకపోయిన ఈ భారత సాంప్రదాయాభిమానులకు భగవాన్‌దాసు మన ధర్మశాస్త్రయుక్తంగా సూచించిన ప్రణాళిక కూడా అంగీకారము కాకపోవటము ఆశ్చర్యంగా ఉంది. సి. [illegible] దాస్, భగవాన్‌దాస్ ప్రణాళిక గతియేమైనదో ప్రపంచానికి తెలుసు. ఇప్పుడు మా సామ్యవాదుల ప్రణాళిక కూడా చెవిటి వారికి శంఖం ఊదినట్లు ఉద్ఘోషితమౌతున్నది.

ఒక ఉదాహరణ చెబుతాను; 1934 లో అసెంబ్లీ ఎన్నికలప్పుడు డాక్టర్ భగవాన్‌దాస్ చెప్పారు. "ప్రజలే నాయకుని ఎన్నుకోవాలి. అదే భారత సాంప్రదాయం. అంతేగాని అభ్యర్థులు ప్రజల వద్దకుపోయి 'నన్నే ఎన్నుకోండి' అంటూ వోట్లు యాచించరాదు" అని. కాని ఆ సమయాన భారత సాంప్రదాయాభిమానులు ఆయన సూచన పాటించనే లేదు. పైగా 'ఈ పెద్ద మనిషికి మనువు ఆవేశించాడు' అని వేళాకోళం చేశారు.

భారత సాంప్రదాయమంటూ కలవరించటం ఒక సంకుచిత మనస్తత్వమని నా ఊహ. ఒకరిద్దరు తప్ప మన దేశనాయకులంతా భారతరాజ్యాంగ రచనకు పూనుకున్నట్లయితే సామ్యవాదం భారత సాంప్రదాయ విరుద్ధమని ఎవరెంత నిందించనీగాక, వారు తయారుచేసే ప్రణాళిక తప్పనిసరిగా పాశ్చాత్య ప్రజాస్వామిక సంస్థలకు అనుకరణంగా ఉండితీరుతుంది.

# 2

## సామ్యవాదం భారతసంస్కృతికి విరుద్ధమా ?

ఇతర దేశాలవలె కాదు; ఇండియా పరిస్థితులు వేరు. భారత సాంప్రదాయాలుకూడ వేరు. పైగా పారిశ్రామికంగా వెనుకపడియున్న దేశం. కనుక ఇక్కడ సామ్యవాదం పనికిరాదు అని అంటూ ఉంటారు.

ఆ మాటలనుబట్టి సామ్యవాదంలోని ప్రధాన సూత్రాలు ఇండియాకు సరిపడవు...అని వారి భావమైతే – అంతకన్నా పెద్దపొరపాటు మరొకటి ఉండదు.

ఇండియాలోగాని ఇతర దేశాల్లోగాని ఒకేరకమైన సూత్రాల ననుసరించే కొలదిమందివద్ద ధనం కూడబడి పోతుంది. అట్టి పెరుగుదలను అరికట్టే విధానాలు ఇతరదేశాల్లోనూ ఇండియాలోను ఒకటే. భారత దేశపరిస్థితులు వేరుకాబట్టి ఇక్కడ సామ్యవాద సిద్ధాంతాలు అమలుజరిగే పద్ధతులూ దశలూ మారవచ్చు. అంతేగాని అసలు సిద్ధాంతాలే మారిపోవు. ఇతర దేశాల్లో ఆర్థికవ్యత్యాసాలను సర్దుబాటు చేయటానికి ఇతరుల పరిశ్రమను కొల్లగొట్టే ఆచారాన్ని అరికట్టటానికీ...ఉత్పత్తిసాధనలను ప్రజాధీనం చేయవలసివస్తే...ఇండియాలో కూడా అదేపని అవశ్యం చేయవలసిందే.

జీవిత సౌఖ్యాలూ సౌకర్యాలూ అందరూ అనుభవించ వలసిందే అన్న సిద్ధాంతానికి భారత సాంప్రదాయం వ్యతిరేకం కాదు. వ్యక్తి ప్రాధాన్యతకలది భారతీయ నాగరకత; అందుచేత సామ్యవాదం భారతదేశానికి సరిపడదు అని కొందరి వాదన. మాటలగారడీని తప్పితే ఆ వాదనలో బిగువులేదు. భారతీయ నాగరకతగాని సామ్యవాదంగాని ఏదీ సరిగా అర్థంగాక పలికేమాటలు అవి. వ్యక్తి అభ్యుదయం ఆశయంగా కనుక భారత నాగరకతలో వ్యక్తిప్రాధాన్యం ఉంది. అంతేగాని పెట్టుబడిదారీ విధానంలో కనిపించే సంకుచిత స్వార్థపరత్వపు వ్యక్తిప్రాధాన్యాన్ని కాదు భారత నాగరకత కాంక్షించినది. వాంఛనీయమైన వ్యక్తి అభ్యుదయము సంపూర్ణ సమిష్టి అభ్యుదయముపైనే ఆధారపడి యున్నదని నిరూపించుటము దుస్సాధ్యము కాదు. "సోషలిస్టు సంఘంలోని ప్రతివ్యక్తీ ఒక ప్లేటో, ఒక మార్క్సు కాగలడు" అని ట్రాట్‌స్కీ అన్నాడు.

ఇక ఇండియా పారిశ్రామికంగా వెనకబడియున్న దేశం కావటం నిరుత్సాహకరమైన విషయం కాదు. పైగా అది మనకు సహాయకారి. ఎందువల్లనంటే సామ్యవాదానికి ఒక ప్రత్యర్థిశక్తి ప్రాబల్యం తగ్గిపోయిందన్న మాట! పారిశ్రామికంగా వెనుకబడియున్న దేశంలో సామ్యవాదం అమలు చేయటం సాధ్యమా అన్న విషయానికి రష్యనులు చేస్తున్న కృషి సమాధానమిస్తుంది. ప్రపంచంలో పారిశ్రామికంగా వెనుకబడియున్నచోట్ల కూడ వారికృషి జయప్రదంగా సాగుతోంది.

ఈ పైకారణాలను పురస్కరించుకుని స్వరాజ్యం రాగానే ఇండియాలో సోషలిస్టు సాంఘిక వ్యవస్థను స్థాపించవలెనని పార్టీ ఆశయం.

## 3

## గ్రామ సమస్య

కాంగ్రెసువాదులు చాలమంది గ్రామోద్ధరణవిషయమై శ్రద్ధవహించి ఉన్నారు. కాని వారందరికీ సామ్యవాదులంటే కోపం. ఎందుకంటే సామ్యవాదులు యంత్రసామగ్రి కావాలంటున్నారు. తద్వారా గ్రామసంపద కొల్లగొట్టబడుతుందనీ, ఇళ్లను విడిచిపెట్టి కష్టాలు పెరుగుతాయనీ,

స్వయంసమృద్ధములుగా ఉండవలసిన (ఇప్పుడు లేవు) పల్లెల ఆర్థిక స్థితి పాడైపోతుందనీ కాంగ్రెసు వాదులు దురభిప్రాయ పడుతున్నారు.

వారు పట్నాలనుగురించి విరుద్ధంగా చెప్పే మాటలన్నీ ఒప్పుకుందాం. వికృతంగా పెరిగిపోయినవి; జనసమ్మర్దనం జాస్తి, ఆ 'ట్రాఫిక్' చూస్తే నరాలు లాక్కుపోతాయి; ఎక్కడ చూచినా అనారోగ్యమే; చెత్తకుప్పలే. ఈపట్నాల్లో ఆరోగ్యంగా, హాయిగా బ్రతికేందుకు వీల్లేదు. చాలాభయంకరమైన పరిస్థితులు! నాటకశాలలు ఉన్నాయి; ఇంకా అనేక వినోదాలు ఉన్నాయి. కాని అవన్నీ అలసిపోయిన నరాలకూ, శరీరాలకూ రవంత ఉత్తేజ కరాలు. అంతేగాని నిజమైన ఆనందప్రదములు గావు; ఆత్మవికాస దోహదములు కావు; వ్యక్తిఅభ్యుదయానికి మార్గదర్శకాలుకావు.

ఆధునిక పట్నాలు పల్లెప్రజలనే కాదు, పట్నాలలోని కార్మిక జనాన్నికూడా దోచేస్తున్నవి. అందుచేత పట్నాలకూ, పల్లెలకూ మధ్య ఒక అస్వాభావికమైన శతృత్వం ఉత్పన్నమైనది. తద్వారా ఎక్కువ బాధ పడుతున్నది పల్లెలే. కళ, విజ్ఞానము, భోగము, సౌఖ్యము పట్నప్రజల సొత్తు అయిపోయినవి. పల్లెలు వృద్ధి చెందటంలేదు; అన్నివిధాలా వెనుక పడిఉన్నవి. ఈపల్లెలేపట్నాలను సృష్టించినవి. కాని తాము దిగజారిపోయినవి.

అదంతా నిజమే. కాని సామ్యవాదం వచ్చాక ఈ వికృత సాంఘిక పరిస్థితులు ఇలాగే వుంటాయనుకోటం పొరపాటు. అవి సాగవు. సంఘమంతా క్రమబద్ధంగా సమిష్టిగా అభివృద్ధి చెందటమే సామ్యవాదుల ఆశయం. సోషలిస్టు ప్రభుత్వంలోని గ్రామం పట్నం ఈనాడు ఉన్నట్లుగా ఉండవు. ప్రస్తుతం గ్రామానికీ పట్నానికీ ఉన్న తేడాలు వైరాలు ఇలాగే ఉండనీయము. క్రమేణా నిర్మూలించి వేస్తాము.

సామ్యవాదులు యంత్రాలు కావాలంటారు నిజమే. కాని ఆ యంత్రాలతో ప్రజలను కొల్లగొట్ట వలెనని వారిఉద్దేశం కాదు. మనుష్యులను వాటికి అంటగట్టి పీడించవలెనని వారికోరిక కాదు. అవి మనకు మిత్రులవలె ఉండాలి. మనకు శ్రమ తగ్గిస్తాయి. ఉత్పత్తిని పెంచగలవు.

యంత్రాలువస్తే పట్నాలు వికృతంగా పెరిగి పోతాయనిగాని, పల్లె ప్రజల ఆర్థిక సౌష్టవం దెబ్బతింటుందని గాని అనేకమంది గ్రామస్థుల

నిరుద్యోగులై పోతారనిగాని అనుకోవటం తప్పు. ఎవరో కొద్దిమందిమాత్రమే స్వార్థపరులై స్వలాభం కోసం యంత్రాలను పెట్టుకున్నట్లయితే పైని ఉదహరించిన అనర్థాలు దాపురిస్తాయి, తప్పదు. కాని ప్రజలంతా సమిష్టిగా ఈ యంత్రాలను యావత్ప్రజల మంచికోసం వినియోగించుకున్నట్లయితే ఆ యనర్థాలు ఉండవు.

సామ్యవాద ప్రభుత్వంలో పట్నాలను కశ్మలం లేకుండా చక్కగా ప్లానులువేసి కడతారు. పరిశ్రమలన్నీ ఒకచోటనే నెలకొల్పరు. భౌగోళికంగా జనసంఖ్య ననుసరించి ప్లానులు వేస్తారు. ప్రస్తుతం నాలుగు పూరి కొంపలు కలసి ఒక గ్రామంగా ఉన్నాయి. ఈ గ్రామాలు కొన్ని మారుమూలల్లో ఉన్నాయి. వాటికి ప్రపంచంతో సంబంధం లేదు. అవన్నీ చక్కగా అభివృద్ధిచెంది ఎలెక్ట్రిక్ రైళ్ళు టెలిఫోను రేడియో మోటార్లు మొదలగు సాధనలద్వారా మిగతా ప్రపంచంతో సంబంధంకలవై పట్నాలవలెనే పారిశ్రామిక ఉత్పత్తి కేంద్రములు కావాలి. ప్రతి గ్రామానికీ స్వపరిపాలనము, స్కూళ్ళు, వినోదములు, మ్యూజియమ్ అన్నీ ఉండాలి.

## 4

## సార్వజనిక సమిష్టి వ్యవసాయము

ప్రతి సోషలిస్టు ప్రభుత్వమూ పరిష్కరించుకోవలసిన సమస్యలలో ఇది చాల క్లిష్టమైనది. భారత సోషలిస్టు ప్రభుత్వమునకు మరింత క్లిష్టతరమైనది. దీన్ని మనం జాగ్రత్తగా పరిశీలిద్దాం.

ఇండియా ప్రధానంగా వ్యావసాయిక దేశం. కనుకనే ఈ దేశానికి సామ్యవాదం అంతప్రయోజనకారి కాదని కొందరు వాదిస్తారు. కాని ప్రస్తుత ప్రపంచ పరిస్థితులనుబట్టి సంఘంలో ఉత్పత్తి శక్తులు అభివృద్ధిచెందటాన్నిబట్టి...ఏదేశంలోనైనాసరే...అది ఎంత వెనుకబడియున్న దేశమైనా...సామ్యవాదం నెలకొల్ప వచ్చునని పైన రుజువు చేసివున్నాం. భారతదేశంలో కార్మిక పార్టీ ఆధికారం చేతబుచ్చుకుని సామ్యవాదం స్థాపించదలచెనని, బయలుదేరితే...ఇది వ్యావసాయిక దేశమన్న అంశం అడ్డురాదు. అయితే సాంఘిక

పునర్నిర్మాణ కార్యక్రమము అంత మరీ త్వరగా సాగకపోవచ్చు. అం
తప్ప అడ్డంకు లేమీ ఉండవు.

కనుక అసలుప్రశ్న సామ్యవాదము స్థాపించుట సాధ్యమేనా? కాదు. సామ్యవాదంవల్ల భారతదేశంలో వ్యవసాయానికి రైతుకు జ
మీమన్న లాభం ఉందా? అదీ అసలైన ప్రశ్న. నిస్సందేహంగా సామ్యవ
మొక్కటే భారతీయుల వ్యవసాయాన్ని నాశనమై పోకుండా కా
గలదు; భారత జాతికి బలము అధికారము ప్రసాదించ గలదు; అని నే
ఖండితంగా చెబుతాము.

భారతదేశంలో వ్యవసాయం దీనాతిదీనస్థితిలో ఉన్నది. పద్ధ
తీ పూర్తిగా మారిస్తేనే తప్ప మోక్షంలేదు. ప్రస్తుతం కనిపిస్తూన్న లోప
భూమి విషయంలో కొంతమందికి ప్రత్యేక హక్కులున్నవి. తినుక్కు
ఆ భూమిలో నిజంగా చెమటోడ్చి దున్ని సాగుచేస్తూన్న వాడి పరిశ్ర
ఆసామి కొల్ల గొట్టేస్తున్నాడు. అందుచేత వాడు నిర్లక్ష్యంగా నిరు
త్సాహంగా పనిచేస్తున్నాడు. రైతులో చాకచక్యం నశించిపోతున
హెచ్చుపన్నులు అప్పుల భారము భూమి మరీచిన్నచిన్న ఖండిక
విభాజితమైపోవుట స్వల్ప ఫలసాయము, పంట విక్రయము కావ
విధానాలు సంతృప్తి కరములు కాకపోవుట, అప్పుదొరికే అవకాశాల క
వ్యవసాయానికీ పరిశ్రమలకు సరియైన పొంతన లేక పోవుట, ప
పట్నాలకు మధ్యఉన్న అంతరము-ఇవన్నీ ప్రస్తుతం కనిపిస్తూన్న లోప
ఒక్కొక్కటి ఒక్కొక్క పెద్దసమస్య. అన్నింటినీ విడువకుండా పరిశీ
వలసినదే. అప్పుడుగాని మనకొక సమంజసమైన కర్తవ్యం స్ఫురించదు.

రైతును దోచేస్తున్న ప్రత్యేక హక్కులను నిర్మూలించటం, రైత
ఋణాలనించి విముక్తులను చేయటం, చిన్నచిన్న భూఖండికలన్నీ కలి
సార్వజనిక సమిష్టివ్యవసాయం స్థాపించటం, అప్పులివ్వటానికీ పం
విక్రయం చేయించటానికి ప్రభుత్వమూ కోఆపరేటివ్ సంఘాలు
కోటం- కోఆపరేటివ్ పద్ధతులపై సాధారణ పరిశ్రమలను నెలకొల్ప
ఇదే ఏకైక పరిష్కార మార్గం.

ఇవన్నీ విధ్వంసక చర్యలని భావించకండి. భూస్వామికీ
దారుడూ మధ్యగల సంబంధంలో అంతర్గర్భితమైఉన్న 'దోపిడి' విధా

ఎవరికివారు వ్యక్తిగతంగా స్వతంత్ర వ్యవసాయం చేసుకునేట్లయితే 'ప్లానింగు' సంభవంగాదు. ముడిపదార్థాలూ, ఆహారధాన్యాలు అక్కడక్కడ చిన్నచిన్న పొలాల్లో పైరౌతూ ఉంటే ఉత్పత్తి-పంపక విధానాల ప్లానింగు సాధ్యంకాగలదా? తమకు ఏ యే పారిశ్రామిక వస్తువులు కావాలో, ఏయే ఫాక్టరీలు నిర్మించుకోవాలో, ఏ ఆహారం కావాలో, ఏ వస్తువులు ఎగుమతి, ఏ వస్తువులు దిగుమతి చేసుకోవాలో — ఈ విషయాలన్నీ తేలవలెనంటే ఏ యే పంట యెంతెంత పండించుకోవాలో సంఘం మొత్తంమీద నిర్ణయించుకోవలసి వుంటుంది.

వ్యవసాయము చిన్నచిన్న పొలాలలో వ్యక్తిగతంగా సాగుతూంటే అది సాధ్యం కాదు. గ్రామంలోని భూమిఅంతా గ్రామస్థులు సమిష్టిగా సాగుచేసుకుంటూవుంటే అదిసాధ్యం ఔతుంది. ఆరంభంలో రష్యాప్రభుత్వం ఏ పంటయెక్కువగా కావలసివస్తే ఆ పంటమీద తక్కువపన్నులు విధించేవారు. ఎక్కువగా అవసరంలేని పంటలపై ఎక్కువ పన్నులు విధించేవారు. ఈవిధంగా ఒకానొక పంట ఉత్పత్తిని హెచ్చించటంగాని, తగ్గించటంగాని ప్రభుత్వవశంలో ఉండేది. అట్టి విధానమే అనుసరించి... వ్యక్తిగత వ్యవసాయం సాగుతున్నా... వ్యావసాయికోత్పత్తిని ప్రభుత్వం తన అదుపులో ఉంచుకోవచ్చును; నిజమే. కాని అంతమాత్రాన్నే ప్రభుత్వం ప్లానింగు విషయంలో ఎక్కువ ముందుకు పోలేదు.

కొన్ని సంవత్సరాల ప్రణాళిక తయారు చేయవలసి వస్తుంది కొన్ని సంవత్సరాల్లో ఈ దేశంలోని వ్యావసాయకోత్పత్తిని రెండింతలు చేయవలెనని కోరుతాం. వ్యక్తిగత వ్యవసాయ పద్ధతులమీద అంతపని చేయుటం సాధ్యమౌతుందా? కొత్తకొత్త వ్యవసాయ పద్ధతులూ అవీ నేర్పి రైతును తర్ఫీతు జేస్తామే అనుకోండి. కాని అంతమాత్రమే చాలదు. భూమి చిన్న చిన్న ఖండికలుగా విభాజితమై వ్యక్తిగత వ్యవసాయమే సాగుతూవుంటే లభించే ఫలసాయానికి హద్దులున్నాయి.

వ్యవసాయానికీ, పరిశ్రమకూ పొంతన కుదర్చవలసిన సమస్య తీసుకుందాం. అట్టి పొంతన కుదరనంతవరకూ వ్యావసాయిక సమస్య పరిష్కారం కానేరదు. ఆ పొంతన కుదురుటకు సమిష్టికృషి, ప్లానింగు అవసరం... వ్యక్తిగత వ్యవసాయపద్ధతులు ప్లానింగుకు ఆటంకములే.

ఈసమస్యను మన స్తత్వశాస్త్రదృష్ట్యా పరిశీలించినా... భారత ప్రజా జీవితమును సోషలిష్టుపద్ధతిని పునరుజ్జీవితము చేయవలెనంటే సమిష్టి వ్యవసాయపద్ధతి అత్యావశ్యకమని తెలుస్తుంది. పరిశ్రమలనుమాత్రం సోషలిష్టు పద్ధతిని స్థాపించుకొని వ్యవసాయాన్ని మాత్రం ఇప్పటిలాగే వ్యక్తిగతంగా జరుగనిస్తూ ఉంటేనేం అని కొందరడుగుచున్నారు. అందుకు మా జవాబు: ఒక వంక వ్యక్తిగతవిధానం, మరొకవంక సమిష్టివిధానం–ఈ రెండూ ఒకదానికొకటి కుదరక పరస్పర విరుద్ధంగా తయారై, లేనిపోని దుష్పరిణామాలకు కారణభూతము లౌతాయి. లక్షలాది రైతులు ఎవడిభూమి వాడు పెట్టుకుని, ఎవడిలాభానికి వాడు పండించుకుంటూ వుంటే–వాళ్ళు స్వార్థపరులైన, సంకుచితస్వభావులైన రైతులన్నమాట. అది సామ్యవాదలక్షణం కాదు.

దేశంలో సామ్యవాదం నిర్మించవలెనంటే పల్లెల్లోనూ, పట్నాల్లోనూ సమిష్టిజీవన సూత్రాలను ప్రబోధించాలి? ఆచరణలో పెట్టాలి.

కనుక ఈ సమస్యను ఏదృక్పథంతో పరిశీలించినప్పటికీ భారతదేశ వ్యవసాయములోకూడా సామ్యవాద విధానములే అనుసరణీయములని తేలుతున్నది.

ఇక పోతే సోషలిస్టు వ్యవసాయపద్ధతి అంటే ఏమిటి? సార్వజనిక సమిష్టివ్యవసాయ మంటే ఏమిటి?

ఒకప్పుడు భారతదేశంలో ఒక్కొక్క గ్రామంలోని భూమిఅంతా మొత్తంమీద కలిపి కౌలుకు ఇచ్చేవిధానం ఒకటి అమలులో ఉండినట్లు మనకు తెలుసు. అట్టిగ్రామాలు మొన్న మొన్నటి వరకూ మద్రాసు రాజధానిలో ఉన్నవి. భూమిసాగుబడికూడా ప్రత్యేక రైతులద్వారా కాక సమిష్టిగా జరుగుతూ ఉండేది. ఈపద్ధతి ఈదేశంలో చాలా కాలం అమలులో ఉండింది. మరీపురాతన కాలంలో ఉన్నట్టుమాత్రం మనుస్మృతిలో నిదర్శనం కానరాదు.

ఈ మన పాతవిధానాన్నే సామ్యవాదం అనుసరిస్తుంది. కాని సామ్యవాదపద్ధతి ననుసరించి ఏగ్రామానికి ఆగ్రామం తనకుతాను ఒక ప్రత్యేక సంస్థగా ఉండదు. అన్నీ కలిసికట్టుగా మొత్తంమీద దేశఆర్థికసౌష్టవంకోసం పాటుపడగలవు.

ప్రస్తుతం ఒక్క రష్యాలోనే సామ్యవాదం సుస్థాపితమై ఉన్నది.

అక్కడ వ్యవసాయిక భారమంతా ప్రజల ఆధీనం చేయడానికి పట్టుదలగా ప్రయత్నించారు; విజయం చూరగొన్నారు. ఒకప్పుడు అక్కడ కూడా వ్యవసాయం వెనుకపడే ఉన్నది. పాతసాంప్రదాయాలను గుడ్డిగా అంటిపెట్టుకుని ఉన్నవారే అక్కడి ప్రజలున్నూ; రైతులు కూడా మూఢులు, సోమరులు, స్వార్థపరులు, సంకుచిత స్వభావులుగా ఉండినవారే. అయినప్పటికీ నేడు అక్కడ వ్యవసాయక క్షేత్రంలో మూడురకాల సామ్యవాద విధానాలు అమలులో ఉన్నవి.



మొదటిది సమిష్టివ్యవసాయం. జమీందారుల చేతుల్లోనూ, పెద్ద పెద్ద భూస్వాముల అధీనంలోనూ ఉన్న భూమినంతనూ ప్రభుత్వము లాగికొని రైతులకు వీలైనంతవరకు సమంగా పంచిపెడుతుంది. ప్రతిరైతుకు సొంతంగా కొంతభూమి ఉంటుంది. వ్యవసాయపు పనిముట్లు, ఎద్దులు మొదలైనవి కూడా ఎవరికివారివి సొంతంగా ఉంటాయి. కాని ఎవరికివారు విడివిడిగా కాకుండా తమతమ భూములను కలిపి ఏకంగా సాగుచేసుకుంటారు. తద్వారా వారి సమిష్టి కృషివల్ల తక్కువ ఖర్చులతో ఎక్కువపంట పండించగలుగుతారు. ఖర్చులుపోగా మిగిలిన ఫలసాయాన్ని వారివారి భూమివిస్తీర్ణముల దామాషాలో, వారువారు కావించిన కృషికి సరిపడ పంచుకుంటారు.

సమిష్టిజీవితచరిత్రలో ఇది మొదటిపాఠం. ఇది సంఘంలో పరస్పర సుహృద్భావాన్ని పెంపొందిస్తుంది. అందువల్ల ఎక్కువ ఫలసాయం ఒనగూడుతున్న కారణంచేత ప్రతి కృషీవలుడూ ఆకర్షితుడౌతాడు; నలుగురితో కలిసి పనిచేయుటంలో ఉన్న హాయిని గుర్తిస్తాడు.

దీని పైమెట్టు collective farm. ఇక్కడ ఎవరికీ సొంతభూమి అంటూ ఉండదు. ఫలసాయాన్ని వారివారి కృషికి సరిపడ పంచుతారు. కొన్ని అసాధారణ పరిస్థితులలో మాత్రం అత్యవసరమైన వాంఛలు ఏమైనా వుంటే చెల్లింపబడతాయి. వ్యవసాయపనిముట్లు, పందులు, పశువులు, గుర్రాలు మొదలైనవి కొంతమంది సొంతంగా ఉంచుకుంటే ఉంచుకోవచ్చును. ఈవిధంగా పరస్పర సహాయ సహకారాలు వృద్ధి చెందుతాయి.

ఇక మూడవ మెట్టు 'communes' ఇక్కడ సంపూర్ణ సంఘ సమిష్టి జీవితము వ్యక్తమౌతుంది.

రష్యనులవలె గాక మనము నెమ్మదిగా పురోగమిద్దాం. మనం ఎవరినీ పీడించవద్దు. హింసించవద్దు. పరిశ్రమలనువలె వ్యవసాయాన్ని కూడా బలవంతంగా ప్రజాయత్తము చేయవలెనని పార్టీ చెప్పదు. ప్రజలకు విద్యాబుద్ధుల ద్వారా ప్రచారం ద్వారా, ప్రదర్శనాల ద్వారా సమిష్టి వ్యవసాయాన్ని ప్రోత్సహించాలి. వృద్ధిచేయాలి.

మన దేశంలో జనసంఖ్య జాస్తి. అంతజనసంఖ్యకు వలసిన భూమిలేదు. కనుక రష్యాలోవలె మనం యంత్రపరికరాలు ఎక్కువగా ఉపయోగించుకొనవలసిన అవసరంలేదు. అట్లని ఈ చిన్న చిన్న నాగళ్ళతోనే పని గడుపుతామనకోవద్దు. పరిశ్రమలు వృద్ధిచెందిన చాల మందికి వాటిల్లో పనులు దొరికి వెళ్ళిపోయేంతవరకు మాత్రం...పంటలు కోయటానికీ కట్టలు కట్టటానికీ యంత్రాలు ఉపయోగించనక్కర్లేదు. గ్రామాల్లో విద్యుచ్ఛక్తి ప్రవేశపెడతాం; రేడియోలు నిలుపుతాం. పాశ్చాత్త్యులను అనుకరిస్తున్నామని కొందరు విమర్శిస్తే విమర్శించనీయండి. మనం అనుకరించటం లేదు; నేర్చుకుంటున్నాం.

ఒక విషయం గ్రహించలేని పెద్దమనుష్యులు కొందరున్నారు. వారు దేశమంతా తిరిగి 'సామ్యవాదులు మీ భూములన్నీ లాక్కుంటారుసుమీ!' అని రైతులందరికీ టముటమా వేస్తారు. సామ్యవాదులకు ఎక్కడో సముద్రమధ్యంలో ఒక్క ద్వీపం లేదు. ఈ రైతుల దగ్గరనుంచి జప్తు చేసి ఈ భూములన్నిటినీ తీసుకపోయి అక్కడికి చేరవేసుకోరు. ఎక్కడి భూములు అక్కడే ఉంటాయి. రైతులు సలక్షణంగా సాగు చేసుకోవచ్చు. ఎలా సాగుచేయాలి? తద్వారా ముఖ్యముగా ఆ రైతులు, యావత్తు సంఘము ఎలా బాగుపడవలె?—అదీ ఆలోచనీయమైన సమస్య.

ఎవరో ఒకరిద్దరు బాగుపడటం కాదు కావలసింది; సంఘమంతా బాగుపడవలె. అదీ సామ్యవాదుల ఆశయం. సమిష్టిగా సాగుచేసుకుంటే-భూమి అంతా కూడా సమిష్టిసొత్తు అయితే-భారత గ్రామాలకు వరప్రసాదం అన్నమాటే. ప్రస్తుతపు దుస్థితి తొలగిపోతుంది. గ్రామాలు సంపదతో, విజ్ఞానముతో తులతూగుతాయి. అది భారతచరిత్రలో నూతనాధ్యాయం అవుతుంది.

# భారతదేశం: సామ్యవాదం

## 1

### కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆశయాలు

బ్రిటిష్‌సామ్రాజ్యంనించి విడిపోయి భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధిని బడయుటము – స్వతంత్రభారతంలో సామ్యవాద సంస్థాపన జరగడము– ఇవే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆశయాలు.

సూటిగా, తేటతెల్లంగా ఉన్నాయి. రెండే రెండు ఆశయాలు. స్వాతంత్ర్యసిద్ధి కాంగ్రెసు ఆశయము కూడ ఐవున్నది. కాని స్వతంత్ర భారతదేశము బ్రిటిష్‌సామ్రాజ్యమునుండి చప్పగా విడిపోవలసినదేయని సోషలిస్టు పార్టీ నొక్కిచెబుతున్నది.

ఇక సోషలిస్టుపార్టీవారి ద్వితీయ ఆశయము ప్రకారం స్వతంత్ర భారత ఆర్థిక పునర్నిర్మాణము సామ్యవాద సూత్రముల ననుసరించి జరుగవలసియున్నది. ఎందువల్ల?

మనము సాధించవలసిన ఫలితాలేమిటో ముందుగా నిర్ణయించుకుంటే, అందుకు అనుసరించవలసిన కర్తవ్యం దానంతట అదే తేలిపోతుంది.

ప్రజానీకానికి ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యము చేకూర్చటము, వారిని సుఖసంపన్నులను చేయటం, బైటినించి సర్వవిధములైన దోపిడులను అరికట్టటం, వారి వ్యక్తి అభ్యుదయానికి సర్వవిధ అవకాశాలను కలుగజేయటం– ఇవే మనం సాధించవలసిన ఫలితాలైతే తప్పనిసరిగా సామ్యవాదమే శరణ్యమని స్ఫురించక మానదు. ఇకపోతే ప్రస్తుతము పరస్పరవిరుద్ధంగావుండి, అరాచకానికి దారితీస్తున్న సాంఘికశక్తులను మంచిమార్గానికి త్రిప్పి, సాంఘికశ్రేయస్సుకోసం పునర్నిర్మాణం చేయవలెనన్నా – ప్రజల బుద్ధిబలం, చాకచక్యం దేశాభ్యుదయంకోసం వినియోగమయేలాగు ప్రబోధం చేయవలెనన్నా – సామ్యవాదమే మన ఏకైక గమ్యమని తేలుతుంది.

పైన సూచించినవే మన కర్తవ్యాలైతే ఇతర దేశాల్లోవలె ఈ భారతావనిలో కూడా సామ్యవాదావశ్యకత ఉన్నదన్నమాటే. ఇండియాలో కూడా ఒకవంక దారిద్ర్యము, అన్నములేమి వికటాట్టహాసం చేస్తాంటే మరొకవంక సిరి, సంపద, భోగలాలసత తాండవిస్తున్నాయి. ఇక్కడకూడా దోపిడివిధానం అమల్లోవుంది; ఉత్పత్తి సాధనలన్నీ ఏ కొద్ది మందో గుత్తగొనివున్నారు. ఇతరదేశాల్లోవలె... కొలదిమంది బహుళ సంఖ్యాక ప్రజలను దోపిడిచేస్తూన్నందువల్ల ఏర్పడిన అనర్థాలు, అంటే ఆర్థిక సాంఘిక తీవ్రవ్యత్యాసాలు...ఇండియాలో కూడా ఉన్నాయి.

ఇవి బ్రిటిష్‌పరిపాలనా ఫలితాలు కావు. కనుక బ్రిటిష్ అధిపత్యం పోయినా అవి నిల్చేవుంటాయి. బ్రిటిష్ ప్రభుత్వం అంతం కావటంతోనే భారతదేశదారిద్ర్యసమస్య పరిష్కారంకాదు. అంతమాత్రాన్నే బహుళ సంఖ్యాకులను దోచేస్తూన్న విధానాలు అంతరించవు. అనగా మనము పైని ఉదహరించిన ఫలితాల్లో ఒక్కటి కూడా సిద్ధించదు. ఆర్థికస్వాతంత్ర్యము కూడా అవసరం.

ఆర్థిక స్వాతంత్ర్యం అంటే సామ్యవాదమేనని మా సోషలిస్టుల ఉద్దేశం. సామ్యవాదరహితమైన ఆర్థికస్వాతంత్ర్యం అర్థరహితం, అస్థిరం.

ప్రస్తుత కాంగ్రెసు పథకంలో ఈ యోశయాలు లోపిస్తున్నవి. అది సామాన్య ప్రజల పరిస్థితులను కొంతవరకు బాగుచేయువచ్చును. కాని అధికారము వారిచేతుల్లో పెట్టటంలేదు; వారిని దోచేస్తూన్న విధానాలను నిర్మూలించలేదు. ఆర్థిక వ్యవస్థ యథాతథంగానే ఉంటుంది. కాంగ్రెసు అందులో విప్లవాత్మక సంస్కారణలు తలపెట్టలేదు. ఒకవంక పెట్టుబడిదార్లు భూస్వాములు జమీందార్లు ఉంటారు; మరొకవంక కార్మికులు, కాలుదార్లు, ప్రజలు వారిని ఆశ్రయించుకొని ఉండవలసినదే. ఒక్క కీలక పరిశ్రమలలోతప్ప ఉత్పత్తి సాధనాలన్నీ పెట్టుబడిదార్ల స్వాధీనంలోనే ఉంటాయి. సామాన్యప్రజలనూ, మధ్యతరగతివారినీ దోచెయ్యటమే ఆశయంగాగల ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ మారదు. ఇదేనా ఆర్థిక స్వాతంత్ర్యమంటే? కరాచీ కాంగ్రెసు తీర్మానము మన ఆశయమునకు పూర్తిగా విరుద్ధంగా ఉంది. కాంగ్రెసువారు ఆర్థిక స్వాతంత్ర్యం కోరుతూవున్న

వారైతే ఆర్థిక స్వాతంత్ర్యం అంటే యేమిటో విస్పష్టంగా వారు చెప్పవలసి యున్నది.

మేము సూచించే పథకాన్ని కాంగ్రెసువారు అంగీకరించేందుకు సిద్ధంగా లేకపోవచ్చును. కాని ఆర్థిక స్వాతంత్ర్యం అంటే మేమిచ్చిన నిర్వచనం మార్చుకోటానికి మేము సిద్ధంగా లేము. ఎవరేమన్నా అననీయండి సామ్యవాదం అస్థిరమైందని యిండియా వాతావరణానికి తగదని భారత సామ్యవాదులు కేవలం స్వప్నవీథుల్లో విహరిస్తున్నారనీ, ఒక పురాతన జర్మన్ యూదుజాతివాడు కారల్ మార్క్సు వాక్యాలనే చిలుకల్లా పలుకుతున్నారనీ—ఎవరేమన్నా అననీయండి.

ఇంతకూ కరాచీ సమావేశంలో కాంగ్రెసువారు సోషలిస్టుల పథకాన్నే ఆమోదించియుండవలసినదని నేను చెప్పటంలేదు. కాని ఆర్థిక రాజకీయాధికారాలను ప్రజలపరం చేయగల—దోపిడి విధానాలను నిర్మూలించగల-ఒక ప్రణాళికనైనా వారు కనీసం సృష్టించవలసియుండె.

అటువంటి ప్రణాళికనే కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వాంఛిస్తున్నది.

అయితే మరి కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రతిపాదనలేవి? కీలకపరిశ్రమలను ప్రజాయత్తం చేయుటమే కాకుండా...దోపిడివిధానాలను, అన్యాయాలను, కష్టాలను, దారిద్ర్యాన్ని, అవిద్యను నిర్మూలించి, ప్రజలకు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని చేకూర్చిపెట్టేందుకు...స్వతంత్రభారత ప్రభుత్వం ఏమి చెయ్యాలి?

ఏమి చేయవలయునో అఖిలభారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యక్రమంలో నిర్వచితములైనవి. ఇక్కడ తిరిగి ఉదాహృతమౌతున్నవి.

1. సమస్తాధికారమూ కష్టించి ఉత్పత్తిచేసేవారికే ఉండాలి.

2. ప్రభుత్వము ఆర్థిక నిర్మాణపథకాన్ని రచించి, దేశ ఆర్థిక పుష్టత్వాన్ని పెంపొందించాలి.

3. ప్రధాన-కీలకపరిశ్రమలు (ఉక్కు, ప్రత్తి, జూట్. రైల్వే, నౌకాయానం, గనులు), బ్యాంకులు, ఇన్సూరెన్సు, ప్రజోపయోగ పరిశ్రమలు—ఇవన్నీ ప్రజాయత్తములు కావాలి. తద్వారా ఉత్పత్తి పరికరాలు, పంపిణీ విధానాలు, మార్పిడి పద్ధతులు, ప్రజాయత్తం లౌతాయి.

4. విదేశవ్యాపారం ప్రభుత్వాధీనంలోనే ఉండాలి.

5 ఉత్పత్తి - పంపక విధానాల సౌకర్యంకోసం, అవసరమొచ్చే నిమిత్తం కో ఆపరేటివ్ సంస్థలను నెలకొల్పాలి. సామ్యవాదసూత్రానుగుణ్యముగలేని ఆర్థికజీవన క్షేత్రాలలో

6. పరిహారం ఇవ్వకుండానే జమీందారీ - పెట్టుబడి విధానాలను రద్దుచేయ్యాలి.

7. భూమిని రైతులకు తిరిగి పంపకం చెయ్యాలి.

8. ప్రభుత్వం సమిష్టి వ్యవసాయ పద్ధతులను ప్రోత్సహించాలి; వృద్ధి చేయాలి.

9. కార్మిక-కర్షకుల బాకీలను రద్దుచేయాలి.

10. ఉద్యోగం పొందవలసిన హక్కు ప్రతివానికీ ఉంది. అనగా ప్రభుత్వం ప్రజలందర్నీ భరించాలి.

11. "మనిషి తన శక్తినిబట్టి పనిచేస్తాడు; అతని కనీస అవసరాలకు సరిపోయే ప్రతిఫలం ముట్టజెప్పాలి"—ఇది ఉత్పత్తి-పంపక విధానాలలో గుర్తించవలసిన ప్రాతిపదిక సూత్రం.

12. వయోజన వోటింగు హక్కు ఉండవలె.

13. మతపక్షపాతం ప్రభుత్వానికి ఉండరాదు. వర్గ-మత-జాతి విభేదాలను ప్రభుత్వం పాటించకూడదు.

14. స్త్రీ పురుష విభేదముకూడ ప్రభుత్వము పాటించరాదు.

15. భారతదేశపు అప్పును (Public debt) తిరస్కరించాలి

ఇవి పదిహేను అంశాలు కఠినంగా, క్రూరంగా, పాశ్చాత్య విధానాలకు అనుగుణ్యమైనవిగా పైకి కనిపిస్తాయి. కాని అవన్నీ వివేకబద్ధములు, న్యాయానుగుణ్యములున్నూ, ఆచరణములు కూడ. అవి పాశ్చాత్య విధానానుగుణ్యము లంటున్నారు కదూ! ప్రజాపరిషత్తు, శాసనసభ, టారిఫ్ బోర్డు, వస్త్రాలమిల్లుల సైరన్‌లు - వీటన్నిటికన్నా కూడా అవి పాశ్చాత్యములే అంటారా?

ప్రస్తుతం మనదేశంలో వ్యాపించిపోయిన అనర్థాలన్నిటికీ మూలకందమైన పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించటమే పై పదిహేను అంశాల

లోని అంతరార్థం. అదీగాక అవి...సాంఘిక జీవనసూత్రములలో ప్రధానమైన సోషల్ ప్లానింగ్‌కు మార్గదర్శకములు కాగలవు.

## బెంగాల్ కాంగ్రెసు సోషలిష్టుపార్టీ సమావేశంలో 1935—అధ్యక్షోపన్యాసం

మిత్రులారా !

ఈ సమావేశానికి అధ్యక్షుడుగా నన్ను ఆహ్వానించి గౌరవించినందుకు మీకు కృతజ్ఞుడను. ఇది మీపార్టీ ప్రప్రథమ రాష్ట్రీయ సమావేశము, కనుక ప్రముఖమైనది. ఈ రాష్ట్రములో మన ఉద్యమ భవిష్యత్ప్రభావము ఇప్పుడీ సమావేశము వేయుచున్న పునాదులపై ఆధారపడియున్నది. కనుక ఈ సమావేశ సంచాలక సాంధ్యాలు నాకన్న అనుభవ సామర్థ్యాలు గలవారికి వొప్పజెపితే బాగుండేది. అయినా మీ అందరి సహకారంతో నావిధులు సంతృప్తికరముగ నిర్వహించ గలుగుదునని అనిస్తున్నాను.

భారత దేశంలోని అన్నిరాష్ట్రాలలోనూ బెంగాల్ రాష్ట్రము రాజకీయంగా ఒక ప్రముఖస్థానము అలంకరించియున్నది. ఆదినుంచీకూడా మన స్వాతంత్ర్యోద్యమంలో అది అగ్రగామి. ఎన్నోకష్టాలు అనుభవించింది; త్యాగాలు చేసింది. ఈనాడు చూడండి: ఈ రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ 'మార్షల్లా' అమలులో వున్నది. వేలమంది వంగ దేశయువకులు, ప్రతిభావంతులు, వృద్ధికి రాదగినవారు జైళ్ళలో మగ్గుతున్నారు. వారిపై ఎట్టి నేరారోపణ లేదు; న్యాయస్థానంలో విచారణలేదు. ప్రజలు ఫలానా నేరం చేశారని రుజువు పరచకుండా వారి పౌరసత్వపు హక్కులను అరికట్టింది బెంగాల్ ప్రభుత్వం. వారందరినీ విడుదల చెయ్యమని, లేదా విచారణకు పిలిపించండని మనం కోరటం అజ్ఞానమని, అవివేకమని బెంగాల్ గవర్నరు సర్ జాన్ ఆండర్సన్ అంటున్నాడు. ప్రభుత్వపు గూఢచారులు గవర్నరుగారికి తెలిపిన రహస్యాంశాలు ప్రజలకు తెలియవు; నిజమే. కాని అంతమాత్రాన నాగరకతా విరుద్ధములైన ప్రభుత్వపు చర్యలను ప్రజలు విమర్శించకుండా ఉంటారా? గూఢచారులద్వారా తనకు తెలియవచ్చిన అంశాలు సత్యములని సర్. జాన్. ఆండర్సన్ విశ్వసిస్తున్నట్టతే నేరస్థులను న్యాయస్థానమునకు రప్పించి ఎందుకు విచారణకు పెట్టడు? ఆపని అతను

ప్రభుత్వం చేయనంతవరకూ ప్రజలు ప్రభుత్వవిధానాన్ని విమర్శిస్తూనే ఉంటారు. ఎవరికీ తెలియని ఏదో నేరంకింద బంధితులైయున్నవారిని వెంటనే విడుదల చేయవలసినదిగా ఆందోళన చేస్తూనే ఉంటారు. "నాగరికతావిరుద్ధంగా ప్రవర్తిస్తూన్న ప్రభుత్వ విధానాన్ని ప్రజలు హర్షించటం లేదని ప్రభుత్వం మధనపడటంలో అర్థంలేదు."—అన్నాడు కాంగ్రెసు అధ్యక్షుడు బాబూ రాజేంద్రప్రసాద్.

నిర్బంధితులకు న్యాయం జరుగవలెనని ప్రజలఆందోళనమును అవివేకమని త్రోసివేయుటకేగాక బెంగాలు గవర్నరు దౌర్జన్యప్రేరితమని క్రూరాతిక్రూరములగు చట్టములతో అణచివేయుచున్నాడుకూడ. ఇతర రాష్ట్రములలో నిర్బంధితుల తరఫున సాగుచున్న ప్రజాందోళనము అవివేక జనితమని నిర్లక్ష్యము చేయబడుచున్నది. చూడండి ప్రభుత్వాధికారుల నిరంకుశత్వము! నిజానికి నిర్బంధితులను విడుదల చేయవలెనని ప్రజలకోరిక అవివేక జనితమూ కాదు; దౌర్జన్యప్రేరితమూ కాదు. ఈవిషయము ప్రభుత్వం గుర్తించాలి. న్యాయస్థానంలో విచారణ లేకుండా మానవుని స్వేచ్ఛను అరికట్టరాదు. సభ్యమానవప్రపంచంలో అది ప్రాథమిక సూత్రం. ప్రజాందోళనము ఈ సూత్రమునే అనుసరించి ఉన్నది. ప్రజాందోళనమును కాంగ్రెస్ అధ్యక్షుడు ఈ విధముగ సుస్పష్టముగ సమర్థించినాడు— "నిర్బంధితులను విడుదల చేయవలసినదనిగాని, విచారణకు పెట్టవలసినదని కోరుతూన్న ప్రజలను బెంగాల్ గవర్నరు రెండు తెగలుగ విభజించినాడు. దౌర్జన్యచర్యలను రహస్యముగ ఆమోదిస్తూన్నవారు కొందరట. మిగిలినవారు ప్రస్తుత పరిస్థితులు సరిగా గుర్తించలేనివారట! కనుక ఇరుతెగలవారి మాటలను అంగీకరించతగినవి కావుట. కాని ఇంకొక మూడో తెగవారు కూడా ఉన్నారు. ఆ సంగతి గవర్నరుగారు గమనించలేదు. ఈ మూడో తెగవారు చాలమంది ఉన్నారు; ఈ తెగలో భిన్నభిన్న రాజకీయదృక్పథములు గలవారు, వివిధ రాజకీయపార్టీలకు చెందినవారు ఉన్నారు. వీరంతా వ్యక్తి స్వాతంత్ర్యము పరమపవిత్రముగా పరిగణించేవారు; న్యాయశాస్త్రసమ్మతముగ విచారణ జరుగకుండా స్త్రీనిగాని, పురుషునిగాని నిర్బంధించుట అక్రమమని వీరు విశ్వసిస్తున్నారు."

## బెంగాల్ ప్రభుత్వపు దమననీతి

ఈ నిర్బంధితుల సమస్య దేశంలో తీవ్రరూపం దాల్చింది. గత సంవత్సరం మధ్యభాగంలో మనమంతా జాతీయ సమరంలో నిమగ్నులమై ఉన్నాం. ప్రతిరాష్ట్రమూ ప్రభుత్వపు దమననీతికి గురియై కష్టా లనుభవించింది. ఎక్కువగా బాధపడినది బెంగాల్ రాష్ట్రము. కనుక అది ప్రథమంలో రాష్ట్రీయ సమస్యగానే ఉండినది. అంతటితో ఆగలేదు. ప్రఖ్యాత నాయకులు జవహర్ పండితునివంటివారు ఈ రాష్ట్రసమస్యను చక్కబెట్టుటకు చాల శ్రమించినారు. మా తరఫున కృషిచేసినందుకే ఆయన్ను కూడ ప్రభుత్వము నిర్బంధించినది.

చివరకు సత్యాగ్రహోద్యమము ఉపసంహృతమైనది. సమరంలో అలసియున్న కారణంచేత వెంటనే బెంగాల్ సమస్యనుగూర్చి కృషిచేయలేకపోయినాము. అయినా అనతికాలంలోనే ఈ సమస్య - నిర్బంధితుల సమస్య - ప్రాముఖ్యంలోకి వచ్చింది. క్రమేణా అది దేశసమస్య అయిపోయింది. తద్విషయమై మనమింకా చేయవలసిన కృషి చాలాఉంది.

ఈ సమస్యను ప్రాముఖ్యంలోకి తీసుకురావటానికి మన పార్టీ చాల శ్రమతీసుకున్నది. గత మార్చి నెలలో 'నిర్బంధితుల దినము' జరిపినాము. దానితో ఈ యాందోళనము దేశమంతయు వ్యాపించినది.

బాబు రాజేంద్రప్రసాద్ కాంగ్రెసు అధ్యక్షపదవి స్వీకరించినప్పటి నుంచీ ఈ సమస్య విషయమై తగుశ్రద్ధతో పనిచేస్తున్నాడు; సంతోషము.

కాని మనము చేయవలసిన పని ఇంకా చాలఉన్నదని మనవిచేశాను. నిర్బంధితులను విడుదలచేయవలెనన్న ప్రజల ఆందోళన ఉండవలసినంత తీవ్రముగా లేదు. ఇంకా ఎక్కువగా ఈ విషయమై ప్రచారము జరగాలి. ప్రచారము విదేశాలకు ముఖ్యముగా ఇంగ్లాండునకు - ప్రాకవలసివున్నది. ఈ మార్గమున సి. యఫ్. ఆండ్రూస్ శ్రమచేస్తున్నాడు. ఇంకా ఇతరులు ఆయన్ను అనుసరించవలె.

మేమందరమూ తమ పక్షాన నిల్చి, వలసినంత సాయము తప్పకుండా చేస్తామని బెంగాల్ ప్రజలకు, బెంగాల్ నిర్బంధితులకు నా పార్టీ తరఫున హామీ యిస్తున్నాను.

బెంగాల్‌లో ఇప్పుడు ప్రముఖమైన సమస్య ఈ ఒక నిర్బంధితుల విషయమే కాదు. దౌర్జన్యచర్యలను అణచివేస్తున్నామన్న సాకుచెబుతూ బెంగాల్ ప్రభుత్వము అనేక జాతీయసంస్థలను, ప్రజాసంస్థలను కూడ బాధిస్తున్నది; అనేక కాంగ్రెసు సంస్థలను, ఖాదీ సంఘాలను, ట్రేడ్ యూనియన్లను, రైతు సంఘాలను, విద్యార్థి సంఘాలను, ముద్రణాలయాలను, అనేక ప్రచురణలను నిషేధించింది. ఈ విధంగా నిర్బంధితులైనవారు అస్తమానం ప్రభుత్వపు గూఢచారుల పర్యవేక్షణలో ఉండవలసివస్తోంది.

ఈ నా వాక్యాలకు బలంగా ఉండేందుకు కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటనను కూడా ఇక్కడ ఉదహరిస్తాను: "...వారిప్పుడు అన్యాయపు చట్టాలు విధిస్తున్నారు; వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నిర్మూలిస్తున్నారు; నలుగురు సమావేశమై మాటాడుకోటానికి వీల్లేదు; వేదిక యెక్కి తన సొంత అభిప్రాయాలు బైటికి చెప్పుకోటానికి కూడా అవకాశం లేదు; వార్తాపత్రికల ద్వారా అయినా అభిప్రాయప్రకటనము నేరమే అయింది; బలవంతంగా, అవసరంలేకపోయినా ఇలాంటి క్రూర చట్టాలు అమలుచేస్తున్నారు. ఎన్ని వార్తాపత్రికలు, ముద్రణాలయాలు నిషేధితములైనాయో చూడండి; లేబర్ సంఘాలు, కాంగ్రెసు సంఘాలు—ఎన్ని సంస్థలను ప్రభుత్వం నిషేధించిందో పరికించండి; న్యాయవిచారణ జరక్కుండానే ఎంతమంది వ్యక్తులను నిర్బంధించిందో అవలోకించండి. పరిస్థితులు ప్రశాంతంగా ఉన్నప్పుడు కూడా ప్రభుత్వం ఎంతవరదాకా వెళ్లిందో మీకు తెలుస్తూనే ఉంది."

ఈ విషయమై ఇంకా వివరాలు నేను చెప్పనవసరం లేదు. ఈరాష్ట్ర ప్రజలు మీరు. నాకన్నా మీకే ఎక్కువగా తెలుసు. ఇట్టి స్థితిగతులలో మన కర్తవ్యం ఏమిటి? అదీ మన మిప్పుడు ఆలోచించవలసిన విషయం. బెంగాల్ నిజంగా నిస్సహాయస్థితిలో ఉంది. ఇతర రాష్ట్రాలు ఈ యెడనున సాయపడాలి.

నిర్బంధితుల సమస్యా సందర్భంలో వలె ఈ విషయంలో కూడా తీవ్ర ప్రచారం అవసరం. ప్రజలకు వివరాలన్నీ తెలియవు. బెంగాల్‌లో జరుగుతూన్న సంఘటనలన్నీ దేశీయులందరికీ...ఇంకా ఇతర సభ్య మానవ ప్రపంచానికీ...తెలియ జెయ్యాలి. అప్పుడు ప్రభుత్వ వ్యతిరేక

ప్రదర్శనము, ఆందోళనము, నిరసనము తీవ్రరూపం దాలుస్తాయి. చివరకు ప్రభుత్వం లొంగి వస్తుంది.

## ప్రజా స్వత్వాలు

అట్టి బ్రహ్మాండమైన ఆందోళన లేవదీయటానికి ... పనిగా పెట్టుకుని కృషిచేసే సంస్థ ఒకటి ఉండాలి. లేకపోతే పని సాగదు. ఇందునుగూర్చి ఒక సలహా ఇస్తాను. ఈ సలహా కనిపెట్టినది నేను మాత్రం కాదు. ఇలాగ నిరంకుశ ప్రభుత్వపు దమననీతికింద బాధపడుతున్నది ఒక్క బెంగాల్ రాష్ట్రమే కాదు. మనదేశమంతా బలిపోతూనే ఉంది. శాంతి పరిస్థితులలో కూడా దుర్మార్గము, అన్యాయము సాగిపోతూనే ఉన్నాయి. ప్రభుత్వపు అక్రమచర్యలు దేశమంతటా జరిగిపోతూనే ఉన్నవి. ప్రజలు ఎంతో జాగ్రతగా ఉంటే అట్టి చర్యలు సాగనేరవు. వాటిని బట్ట బయలుచేసి ...న్యాయస్థానాలద్వారా, శాసన సభలద్వారా, వార్తాపత్రికల ద్వారా, ఉపన్యాసాల ద్వారా ప్రభుత్వాన్ని ఎదుర్కొనగల ఒక సంస్థ ఉండాలి.

కనుక నా సలహా యేమంటే – ఒక సంస్థ నిర్మితం కావాలి. అది ఒక రాజకీయ పార్టీ కాదు. ప్రజల పౌరసత్వపు హక్కులను– నాగరిక ప్రపంచంలో ప్రతివానికీ ఉండవలసిన స్వత్వాలను – కాపాడటమే దాని పని.

అమెరికాలో 'సివిల్ లిబర్టీస్ యూనియన్' అను సంస్థ ఒకటి ఉన్నది. అది రోజర్ బాల్డ్విన్ నాయకత్వాన చాలా మెచ్చుకోదగిన పనులే చేసింది. కార్మికుల హక్కులను, కోర్కెలను సంరక్షించేందుకు కూడా అనేక అంతర్జాతీయ సంస్థలున్నూ ఉన్నాయి. ఆ పద్ధతిమీద మనకు కూడా ఒక సంస్థ నిర్మితం కావాలి. అందులో రాజకీయమైన కృషి చేసేవారక్కర్లేదు. న్యాయవాదులు, పత్రికా సంపాదకులు, స్త్రీలు, (ఎక్కువ బాధలకు గురి ఔతున్నది స్త్రీలే) Servants of Indian Society వంటి సాంఘిక సేవకులు– ఈ మొదలైన వారంతా కలిసి ఒక అఖిలభారత సంస్థగా ఏర్పడవలె; ఇతర దేశాల్లోని అట్టి సంస్థలతో సంబంధం పెట్టుకోవాలి. యథార్థ పరిస్థితులను తెలిసికోవాలి; వ్రాతలు ప్రచురించాలి; బాధితుల సహాయార్థం నిధులు వసూలు చేయాలి;

వారి తరఫున వాదించేందుకు న్యాయవాదులను ఏర్పాటు చేయాలి; విదేశాల్లో కూడా ప్రచారం సాగించాలి; శాసనసభలలో తగు ప్రశ్నలు అడిగించాలి; వలసిన తీర్మానాలను ప్రవేశపెట్టించాలి. బెంగాల్ లో పరిస్థితులు ఇంత తీవ్రంగా విషమించినప్పటికీ తద్విషయమై మామూలు పరిస్థితులైనా ప్రజలందరికీ తెలిసేందుకు ఒక్క పుస్తకం కూడా వెలువడలేదు; ఎంత శోచనీయమో ఆలోచించండి. అట్టి పుస్తకం ఒకటి ప్రచురితం కావాలి; దాన్ని ఈ దేశంలో ప్రతివానికీ అందజేయాలి; ప్రతి పార్లమెంటు సభ్యునికీ పంపించాలి; యూరప్ - అమెరికాలలో మానవస్వత్వాలను మన్నించే ప్రతి సంస్థకూ పంపించాలి. అధికారుల దురాగతాలను ఈ విధంగా నిర్మొగమాటంగా ప్రపంచమంతటా తెలియజెయ్యాలి. అప్పుడు వాటిని పూర్తిగా అపుజెయ్యలేక పోయినా, చాలవరకు తగ్గించ గలుగుతాము.

పాశ్చాత్య దేశాలలో మన జాతీయ ప్రచారము అంత లాభదాయకము కాజాలదన్నమాట వాస్తవమే కావచ్చు. కాని మన ప్రభుత్వాధికారుల నిరంకుశ దౌర్జన్యమును పశ్చిమ దేశాలవారికి తెలియజెప్పటం వల్ల కొంతలాభం ఉంది. ఈ సంస్థ సత్యమును పాటించి, యథార్థ పరిస్థితులనే ప్రచారంచెయ్యాలి. అప్పుడు దానిప్రచారము తప్పకుండా లాభిస్తుంది.

ఈ దేశంలో అట్టి సంస్థను నెలకొల్పేందుకు మంచి అవకాశాలే ఉన్నాయి. మొట్టమొదట సమర్థుడైన ఒకవ్యక్తి - ప్రజాగౌరవమును చూరగొన్నవాడు—దేశవిదేశాలు బాగా తిలకించి అధ్యయనం చేసినవాడు — ఒక వ్యక్తని మనం ఎన్నుకోవాలి. అతడు తన కాలమంతా ఈసంస్థకే వినియోగించాలి. అందుకు తగినంత జీతం అతనికి ఇవ్వాలి. అట్టి సంస్థను నడుపుటకు సంవత్సరానికి సుమారు అయిదువేల రూపాయలకు మించదనుకుంటాను. ఆమొత్తాన్ని మనం తేలిగ్గానే వసూలు చెయ్యగలం. కనుక బెంగాల్ మంచే ఒక ప్రముఖవ్యక్తి ముందుకు వచ్చి ఈ కార్యనిర్వాహణకుపూనుకుంటాడని నా ఆశ.

కాని ఈ ఒక్క సంస్థను నెలకొల్పినంతమాత్రాన మన సమస్య పూర్తిగా పరిష్కారమై పోగలదని నే ననలేను. కాని అట్టి సంస్థ చాలవరకు

ఉపయోగిస్తుందనిమాత్రం చెప్పగలను. దానితో పాటు మనం చేకొనదగిన ఇతరవిధానాలు కూడా పేర్కొన్నాను.

ఇక బెంగాల్ రాజకీయ క్షేత్రంలో నీలి నీడలు కట్టుతోన్న ఇతర సమస్యలను గూర్చి మాటాడతాను.

## మ త స మ స్య

మొదటిది మతసమస్య. కమ్యూనల్ ఎవార్డ్ వల్ల అల్పసంఖ్యాకులకు అన్యాయం జరిగిన రాష్ట్రాలలో బెంగాల్ ఒకటి. ఇతరచోట్ల హిందువులు కాని అల్పసంఖ్యాకులకు ప్రత్యేక రక్షణలు ఉన్నాయి. కాని బెంగాల్‌లో అల్పసంఖ్యాకులైన హిందువులకు అట్లు కాదు. అందుచేత యిచట హిందువులైన రాజకీయజ్ఞులు 'జాతీయపార్టీ' అని ఒక కొత్త పార్టీని లేవదీశారు. ఈ సమస్యను ఇంకా కొంచం జాగ్రత్తగా పరిశీలిద్దాం.

కమ్యూనల్ ఎవార్డు శ్రేయకరమా? కాదా? అన్న ప్రశ్నకు రెండు జబాబులు లేవు అది బ్రిటిష్ ప్రధాన మంత్రి తయారుచేసి మనపై రుద్ది నటువంటిది. అందుచేతనే అది నిరసింప తగినది. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు ఇండియాకు మేలుచేయాలన్న తలంపుతో దాన్ని సృష్టించలేదు. తమ సామ్రాజ్యవాదానికి బలం చేకూర్చగల మన మతవైషమ్యాలను వృద్ధిచేసేందుకే వారు దాన్ని బుద్ధిపూర్వకంగా సృష్టించారు. తరువాత జరిగిన సంఘటనలు ఈ సత్యాన్నే ఋజువు చేశాయి. కొత్తరాజ్యాంగం అమలు జరిగిన తరువాత ఇంకా బాగా రుజువౌతుంది ఈ సత్యము. కొన్ని కొన్నిమతాలలో కొంతకొంతమందికి ఈ 'ఎవార్డు'వల్ల ఏవో కొన్నిలాభాలు ఉన్నంత మాత్రాన అది దేశశ్రేయస్కరమైనదే అని చెప్పటానికివీలులేదు. ప్రస్తుతపు మన రాజకీయ జీవిత రంగంలో ఈ 'కమ్యూనల్ ఎవార్డు' జాతీయైక్యతకు అత్యంత భంగకరముగా పరిణమించినది.

'కమ్యూనల్ ఎవార్డు' మంచిది కాదుకనుక దానియెడ మనం ఎలా ప్రవర్తించాలి? బుద్ధిహీనులమై సామ్రాజ్యవాదుల వలలో చిక్కుకుందామా? తెలివితేటలతో మెలగి వారి దుష్ప్రయత్నాలను భంగపరుద్దామా?

'కమ్యూనల్ ఎవార్డు' మంచిది కాదు- అంటే అర్థంఏమిటి? ఆ చెడ్డ తనం ఎక్కడుంది? శాసనసభలలో సీట్లు హిందువులకు, మహమ్మదీయు

లకు ఒక దామాషా ననుసరించి పంచటంలోనా? అది మతవైషమ్యాలను పెంపొందించేందుకు ఉపకరించటంలోనా? జాతీయ దృక్పథంలో ఆలోచిస్తే హిందువులకుగాని, మహమ్మదీయులకుగాని ఎవరికెన్ని సీట్లువస్తే ఏంపోయింది? హిందువులూ, మహమ్మదీయులూ-ఇరుతెగలవారూ భారతీయులేకదా; ఆసీట్లవల్ల ఏదో ఒరిగి ఒళ్ళోపడుతుందే అనుకుందాం, తద్వారా ఏవర్గం బాగుపడినా జాతి బాగుపడిందన్నమాటేగా! మన తెలివితక్కువను పురస్కరించుకొని, మనలోమనకు మతవిద్వేషాల్ని రగులుకొల్పటమే 'కమ్యూనల్ ఎవార్డు' లో ఉన్న ద్రోహచింత. ఆ ద్రోహచింత ఫలించేట్టు మనం ప్రవర్తించటం జాతికి క్షేమమా? మహమ్మదీయులకుగాని, సిక్కులకుగాని, హిందువులకన్నా ఎక్కువ సీట్లు లభించినంతమాత్రాన దేశానికివచ్చిన నష్టమేమీ లేదు. కాని మనలో మనం కలహించటం ఆరంభించామంటే చాలా దెబ్బ తింటాం; పైగా ఇంకొకరు అపరిమితంగా బాగుపడుతారు. 'కమ్యూనల్ ఎవార్డు' మీద మనలో మనం దెబ్బలాడుకోటం ఒక సర్పం తనతోకను తానే దిగమింగుకున్నట్లుగా ఉంటుంది.

అయితే మరి పరిష్కారం కుదరటం ఎలా?- అని అడుగుతాడు 'జాతీయవాది'. పరిష్కారం దేనికి? -అని నేనతన్ని ప్రతిప్రశ్న వేస్తాను. బెంగాల్ శాసనసభలో హిందూ మహమ్మదీయ ప్రాతినిధ్యం తగాయిదాకు పరిష్కారం చెప్పమంటే నేను చెప్పేదేమీ లేదు. ఆతగాయిదాతో నాకు సంబంధంలేదు. ఒకానొక వర్గానికి కొన్ని సీట్లు అధికంగా లభ్యమైతేయేం? దానివల్ల మన స్వాతంత్ర్య సమరానికి వచ్చిన అటంకం ఏమీలేదు.

అదిగాక-హిందూ మహమ్మదీయ లిరువురూ స్వాతంత్ర్యోద్యమంలో నడుములుబిగించి తమ సర్వశక్తులూ వినియోగించుటకు మార్గంఏమిటి ?-అని అడిగితే నేను జవాబు చెబుతాను. ఒకే ఒక జవాబు.

బెంగాల్‌లోని మత సమస్యకు ఆర్థికపరిస్థితులే కారణం. భూస్వాములంతా హిందువులు. మహమ్మదీయులంతా కౌలుదార్లు. భూస్వామికీ కౌలుదారుకు నిత్యసంఘర్షణ ఉండనేఉంది. బెంగాల్‌లో తీవ్రంగాఉంది. కౌలుదార్ల తిరుగుబాట్లు ఇక్కడ మామూలే. భూస్వాములు, కౌలుదార్లు అనబడే రెండు వర్గాలమధ్య పొటమరించిన సంఘర్షణలు, కలహాలు మ

వైషమ్యాలుగా రూపం దాల్చాయి. ఈ రాష్ట్రంలోని మహమ్మదీయులకు మతావేశంతో బాటు ఆర్థిక క్లిష్టత కూడా తోడైంది. ప్రొటెస్టెంట్ (బ్రిటన్ క్రింద ఐరిష్ ప్రజలు తీవ్ర కేథలిక్కులైనారు. కేథలిక్ ఆస్ట్రియా క్రింద జెక్కులు, ఫ్రీథింకర్స్' అయినారు. అలాగే హిందూ భూస్వాముల క్రింద ముస్లిం కౌలుదార్లు మతావేశపరులైనారు; జమీందారీ విధాన నిర్మూలనం వాంఛిస్తున్నారు.

ఇతర రాష్ట్రాలలో కూడ కొద్ది మార్పులతో ఇదే పదవుల-ఉద్యోగాల నియమాలు, సీట్లు సంపాదించటంలో వివిధ వర్గాల మధ్య కలిగే పోటాపోటీలు; కలతలు మత వైషమ్యాలుగా పరిణమిస్తున్నాయి. ఈ విధంగా ఉత్పన్నమైన మత సమస్యను పరిష్కరించటం ఎలాగ ?

శాసనసభలలో సీట్లకోసం పోటాపోటీలు పడటం సాగించాము ఈ పరస్థితులు ఇంకా విషమిస్తాయి. మహమ్మదీయులకు గాని, హిందువులకు గాని మరే యితర మతస్థులకు గాని- సామాన్య ప్రజలకు ఈ సీట్ల పంపకం విషయమేమీ పట్టదు. పార్టీ పెద్దల ప్రచారాన్ని, ప్రబోధాల్ని, ప్రోత్సాహాల్ని అనుసరించి వారు మత ప్రాతినిధ్య విషయమై పట్టుదల చూపుతూ ఉండవచ్చు. కాని వారికి ముఖ్యముగా కావలసింది మరొక రకమైన ప్రాతినిధ్యం. ముస్లిం గాని-హిందువు గాని కార్మిక కర్షకుల పరిస్థితులన్నీ సమానమే. ఆ సంగతి వారు అవగతం చేసుకోగలిగితే ఈ మత ప్రాతినిధ్య సమస్యతో అనవసరంగా తల కాయలు బద్దలు కొట్టుకోరు. తమకు సమాన రాజకీయార్థిక ఇబ్బందులను తొలగించగల ప్రతినిధులనే వారు కావాలంటారు. ఏ మతస్థులైతేనేం ?

స్వార్థ ఆశయాల కోసం ప్రాకులాడేవారు - శాసనసభలలో గవర్నమెంటు శాఖలలో ఉద్యోగాల కోసం తహతహలాడేవారు - ఇలాంటి కొద్దిమందికి మాత్రమే ఈ మత వైషమ్యాలు ఉపకరిస్తున్నాయి. ముఖ్యంగా ఆర్థిక పరిస్థితుల మూలంగా బెంగాల్ వంటి రాష్ట్రాలలో ఏర్పడిన మత వైషమ్యాలను సహాయంగా గొని సాధ్యమైనంతవరకు తమ ప్రత్యేక ప్రాతినిధ్యాది స్వార్థ ఆశయాలను సమంజసమును రుజువు చేసుకోటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ విషయం నేను అనేకసార్లు విన్నవించాను.

ఇట్టి పరిస్థితులలో జాతీయవాది కర్తవ్యం ఏమిటి? నిజంగా అతనికి సమస్య పరిష్కరించాలన్న కోరిక ఉన్నట్టయితే రెండే రెండు పద్ధతులున్నాయి అవలంబించ దగినవి. ఒకానొక మతస్థుల కోరికలను తృప్తిపరచేందుకు ప్రత్యేకవర్గ ప్రతినిధుల సంఖ్యను నిర్ణయించటం కాదు చేయవలసినపని. అలాచేస్తే ఒక ప్రత్యేక మతాన్ని రెచ్చగొట్టటమౌతుంది. మనం అవశ్యం చేయవలసిన పని ఏమంటే—అన్ని మతస్థులవారినీ స్వాతంత్ర్యోద్యమంలోనికి దింపాలి.

అందుకు మొదటికర్తవ్యం: ప్రత్యేక ప్రాతినిధ్యతగాదాలనించి పూర్తిగా విరమించుకోవాలి. రెండవకర్తవ్యం: సామాన్య ప్రజల ఆర్థికసమరాన్ని స్వాతంత్ర్యసమరంతో జోడించటం.

బెంగాల్ నేషనలిస్టు పార్టీ ఈ రాష్ట్రంలో హిందూప్రజల అధికాభిమానాలను చూరగొన్నది. నేను సూచించిన మొదటి కర్తవ్యం వారికి నచ్చకపోవచ్చు. ఈ పార్టీకి లభించిన ప్రజాభిమానము ప్రత్యేక ప్రాతినిధ్యమును ప్రజలు కోరుతున్నందువల్లకాదు. ఈ రాష్ట్రంలోని విద్యాధికులు ఈ పార్టీ ప్రాముఖ్యాన్ని గుర్తించి, దాన్ని ఆధారంగా చేసుకుని ప్రజలను తమవైపు ఆకర్షించుకోవాలని ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి ఇదొక తప్పుడు సమస్య. బెంగాల్ శాసనసభలో ఇంకా కొన్ని సీట్లు లభించినందువల్ల లక్షలాది హిందువులకు ఒరిగేదేమీ లేదు. ఈ లక్షలాది హిందువులకు గల ఇబ్బందుల వంటివే లక్షలాది మహమ్మదీయులకున్నూ ఉన్నవి.

బెంగాల్ నేషనలిస్టుపార్టీలో సర్వోత్తములు, ప్రతిభాశాలులు అయిన కాంగ్రెసువాదులున్నారు. వారు అనుసరిస్తున్న విధానం వల్ల వివిధ మతస్థులవారి మధ్య అనుమానాలు, కలహాలు, వైరుధ్యాలు పోటమరిస్తాయి. ఇలా చేయటం వల్ల ఆ కాంగ్రెసువాదులు మన స్వాతంత్ర్యోద్యమాన్ని ఏకాస్తయినా ముందుకు తీసుకుపోగలుగుతున్నారా? అని నా ప్రశ్న. లేదు సరిగదా మన ఉద్యమాన్ని బలహీన పరుస్తున్నారు; ఉపయోగం లేని, పైగా హానికరమైన మార్గాలు తొక్కుతున్నారు.

కాంగ్రెసుగాని, కాంగ్రెసు వాదులుగాని కమ్యూనల్ ఎవార్డుతో కాదు యుద్ధం చేయవలసినది; దాన్ని సృష్టించిన సామ్రాజ్యవాదంతో సుమా!

ఇక రెండవ కర్తవ్యం : ప్రజల ఆర్థికసమరాన్ని స్వాతంత్ర్యోద్యమంతో జోడించవలెనని చెప్పాను. మన మతసమస్యా పరిష్కారానికి ఇదే ఏకైకమార్గం.

ఈ మత వైషమ్యాలమూలాన మహమ్మదీయులను మన స్వాతంత్ర్యోద్యమంలోనికి ఆకర్షించుకోలేక పోతామనుకోండి. అంటే వారిలో మనయెడ విశ్వాసాన్ని కల్పించలేక పోయామన్న మాట! అట్టి పరిస్థితులలో మన ఉద్యమం ప్రజాఉద్యమం అనిపించుకోజాలదు. మనం చర్చించవలసినది, మన కర్తవ్యాల్ని పురిగొల్ప వలసినది, మన భవిష్యత్ సాంఘిక సిద్ధాంతాల్ని నిర్ణయించవలసినది ప్రజా సమస్యలు. అలా కాని నాడు మధ్యతరగతివారి ఆశయాలతో, కోరికలతో మన దృక్పథం సంకుచితమై పోతుంది. ఈ నాడు ప్రత్యేక ప్రాతినిధ్యసమస్య ఇంతగా పైకి వచ్చిందంటే — అట్టి సంకుచిత దృక్పథమే కారణం. నిజంగా మనం ఒక స్వచ్ఛమైన ప్రజాఉద్యమాన్నే సాగిస్తూన్నవారమైతే అన్ని మతాలలోని ప్రజలూ మన పతాకం క్రిందికి వచ్చితీరుతారు. అనగా మతసమస్య లేకత్తదన్న మాట!

మనం ప్రజల విశ్వాసాన్ని చూరగొనలేకపోయాం. అందుకొక ఉదాహరణం కూడా చెబుతాను. కొన్ని సంవత్సరాల క్రితం బెంగాల్ స్వరాజ్యపార్టీ శాసనసభలో కౌలుచట్టం (Tenancy Bill) ప్రవేశపెట్టింది. రైతులందుకు పూర్తిగా వ్యతిరేకించారు. ముస్లింలు కూడా ఆ బిల్లుకు వ్యతిరేకులే అన్న సంగతి మీకు తెలుసు...అలా గాక స్వరాజ్యపార్టీ నిజంగా ప్రజలపార్టీ అయి రైతులందరికీ అమోదకరమైన బిల్లునే ప్రవేశపెట్టినట్లయితే ఎలా వుండేదో మీరొకసారి ఊహించుకోండి, ఆ పార్టీకి ముస్లింల — కనీసం నూటికి 98 మంది ముస్లింల సహకారం లభించేది. కాని తీరా వారు చేసిన పనివల్ల...కాంగ్రెసు కేవలం హిందువుల — జమీందారుల సంస్థయన్న భావం కలిగించారు. అది ఎంత అపాయకరమైనదో మనం ఊహించుకోవచ్చు. అలాటి పనులవల్ల ప్రజల విశ్వాసాన్ని చూరగొనగలమా ?

కనుక సామాన్య ప్రజలందరికీ అమోదకరమైన పత్రికాళిక రచించుకుని, వారి ఆర్థిక స్వాతంత్ర్యానికి మనం కృషి చేసేట్లయితే ... మనకూ

సులభంగా వారి సహాయ సహకారాలు లభిస్తాయి. మరి ఆ పనికి నడుము కట్టిన మరుక్షణమే మతసమస్య గాలిలో ఎగిరిపోతుంది. బీద ప్రజలలో అన్నిమతాలవారూ ఉన్నారు కదా!

కాబట్టి మతసమస్య పరిష్కారం కావాలంటే బెంగాల్ కాంగ్రెసువాదులు మొట్టమొదట చేయవలసినపని-జమీందారీ విధానాన్ని రూపుమాపవలె; ఆ తరువాత కర్షకప్రజల ఇబ్బందులెట్టివో విచారించి తెలుసుకుని, వాటిని తొలగించేందుకు శ్రమ చెయ్యాలి. బెంగాల్‌లో మతసమస్య పరిష్కారం కావాలంటే... 'జమీందారీవిధానం నశించాలి' అన్న నినాదంతో రైతుఉద్యమం లేవాలి. అట్టి ఉద్యమం మతసమస్యను పరిష్కరిస్తుంది. అంతేగాదు రాజకీయార్థిక స్వాతంత్ర్యసముపార్జనా సామర్థ్యాన్ని ప్రజలకు ఇస్తుంది.

## నిరుద్యోగం

ఇక బెంగాలులో నిరుద్యోగ సమస్యగూర్చి రవంత మాట్లాడతాను. బీదవాళ్ళు అనేకమంది నిరుద్యోగులై ఉన్నారు. ఇది దేశమంతా వ్యాపించివున్న జాడ్యమే. కాని బెంగాల్‌లో మధ్యతరగతివారే ఎక్కువగా నిరుద్యోగులై ఉన్నారు.

ప్రస్తుత సాంఘికపరిస్థితులను పరిశీలించి, ఇంతకన్నా ఉత్కృష్టమైన ఒక సాంఘిక వ్యవస్థను నిర్మించవలెనన్న భావం ప్రజలలో కలిగిస్తున్నది ఈ నిరుద్యోగసమస్యాతీవ్రత.

ఈ నిరుద్యోగసమస్యా పరిష్కారమార్గం ఏది?

బెంగాల్ విజ్ఞానవిభూతిగల రాష్ట్రం. వైజ్ఞానికంగా అభ్యుదయ మార్గాన ఉన్నది. ఐనా ఈ నిరుద్యోగసమస్యా పరిష్కారానికి రాష్ట్రాభిమానమే (Provincialism) మార్గమని భావిస్తున్నారు; నాకు చాలా విచిత్రంగా ఉంది. ఈ సమస్య కూకటివేరు చాలా లోతు. ఇది తేలిగ్గా పరిష్కరించేందుకు వీలైన సమస్య కాదు. ఉత్పత్తి పంపక విధానాలలోని లోటుపాట్లే నిరుద్యోగానికి హేతువు. పెట్టుబడిదారీ సమాజంలో ఈ లోటుపాటు ఉండేవే; సర్దుబాట్లు కాజాలవు. ఆ లోటుపాట్లు అంతర్హితమైపోవడం... అంటే సామ్యవాదసిద్ధాంతానుగుణ్యంగా సాంఘికవ్యవస్థ పునర్నిర్మి

తమైనప్పుడు నిరుద్యోగ జాడ్యం నిర్మూలమౌతుంది. నేటి ప్రపంచచరిత్ర ఈ సత్యాన్నే రుజువు చేస్తున్నది. ప్రతి క్యాపిటలిస్టు దేశంలోనూ నిరుద్యోగ సమస్య తీవ్రరూపంలోనే ఉంది. కాని సామ్యవాదం గమ్యంగా నడుస్తూ సోవియట్ రష్యాలో నిరుద్యోగ సమస్య లేనేలేదు.

జాతీయ స్వాతంత్ర్యం లభించినా నిరుద్యోగ సమస్య పరిష్కారం కాదు; ప్రపంచంలోని స్వతంత్రదేశాల పరిస్థితులు చూస్తే ఆసంగతి తెలుస్తుంది. సామ్యవాద మొక్కటే దానికి తగినమందు.

కనుక నా నిరుద్యోగ సోదరులకు నేను చెప్పేదేమంటే— మీరంతా వచ్చి మా పార్టీలో చేరండి. మీము కేవలం ఒక ఆశయం మాత్రమే సూచిస్తున్నాం, చేసేదేమీ లేదు — అని మీరు విమర్శిస్తారు. ఔను; కాని ఇతర పార్టీలైనా అంతకు మించి చేస్తున్నదేమీ లేదు; పైగా వారి ఉద్దేశాలు మీకు పీసమెత్తుకూడా ఉపకరించవు.

## కొత్త రాజ్యాంగప్రణాళిక యెడ మనదృక్పథం

చక్రవర్తి ప్రభుత్వం మనపై రుద్దిన నూతన రాజ్యాంగం విషయమై మనము అనుసరించవలసిన విధానం ఎట్టిదిగా ఉండవలెనో ఆలోచిద్దాం.

ఈ సంగతి లక్నో కాంగ్రెసు సమావేశంలో నిర్ణయిద్దామని కాంగ్రెసు వర్కింగ్ కమిటీ వార్ధాలో తీర్మానించుకుంది. అంతిమ నిర్ణయం ఎప్పుడూ అఖిలభారత కాంగ్రెస్ సమావేశానిదే. కాని తన అభిప్రాయ నిర్ణయాన్ని లక్నో కాంగ్రెసు సమావేశం వరకూ వాయిదా వెయ్యటంలో అర్థం ఏమిటి? వర్కింగ్ కమిటీ తన అభిప్రాయాన్ని అప్పుడే బయట పెట్టటానికి సిద్ధంగా లేదన్నమాట. కమిటీ తన అభిప్రాయాన్ని ప్రకటించనూ లేదు; కమిటీ సభ్యులెవరూ తమతమ వ్యక్తి గతాభిప్రాయాలను కూడా వెలిబుచ్చరాదని కాంగ్రెస్ అధ్యక్షుడు నిషేధించాడు. అందుచేత ఈ క్లిష్టసమస్యను పర్యాలోచించి, చర్చించి, దిక్కు విడదీయుటకు కాంగ్రెసు నాయకుల సహాయము ప్రజలకు లభించలేదన్నమాట. ఇట్టి స్థితిని నాయకు లెందుకు కల్పించవలసి వచ్చినదో నాకు తెలియదు. ముందుగా ఈ విషయాన్ని బాగా చర్చించుకుని నాయకులు ఒక నిర్ణయానికి రాని పక్షంలో...లక్నో సమావేశంలో ఒక్క సారిగా ఉచితమైన, ప్రజాను

మతి బడయగల నిర్ణయం ఊడిపడుతుందా? కాంగ్రెసు సమావేశంలో ఎవరో కొద్దిమంది నాలుగు ఉపన్యాసాలు చెప్పినంత మాత్రాన ఒక నిర్ణయం తేలదుకదా!

బహుశః కాంగ్రెసుఅధ్యక్షుడు తన మంత్రులందరిలో ఐక్యత పోషించవలెనని ఆశించినాడేమో! కానిశార్దూలసింగ్ రాజీనామా యివ్వటం చూస్తే అధ్యక్షుని ఆశయంలో కూడా అపాయాలు ఉన్నట్టే గోచరిస్తున్నది.

కొంతమంది కాంగ్రెసు వాదులు ఈ కొత్త రాజ్యాంగం క్రింద మంత్రిపదవులు స్వీకరించవలెననే కోరుతున్నారు. మరికొందరు అందుకు వ్యతిరేకంగా ఉన్నారు. ఈ వ్యతిరేకిస్తున్న వారందరినీ సమావేశ పరచవలెనన్న ఉద్దేశం నాయకులకు ఉన్నది. అలాచేస్తే ప్రజాభిప్రాయం ఎలావున్నదో తెలుసుకోటానికి అవకాశం ఉంది. బెంగాల్ సోషలిస్టు పార్టీ వారు మంత్రిపదవీ స్వీకరణకు వ్యతిరేకిస్తున్నారని తెలుసుకున్నాను. అది సంతోషకరమైన సంగతి. మీ దినజ్‌పూర్ రాజకీయ సమావేశంకూడా పదవీస్వీకరణమును నిరసించినట్టే తెలుస్తున్నది.

ఈ సందర్భంలో పదవీస్వీకరణ విషయమై, నా ఉద్దేశాలను, నా పార్టీ ఉద్దేశాలను వివరిస్తాను.

ప్రస్తుత పరిస్థితు లెలా ఉన్నాయి? చక్రవర్తి సార్వభౌమత్వం ఇంకా తన పాలనమును ఈ దేశంలో సుస్థిరం చేసుకునే నిమిత్తం ఒక కొత్త రాజ్యాంగాన్ని బలవంతంగా మనపై రుద్దుతోంది. ఆ యుక్తులు, కుట్రలు, వాటివల్ల మనకు కలిగే అపాయాలు. అవన్నీ మీకు నేను వివరించి చెప్పనవసరం లేదు. ఆవిషయమై దేశంలోని పత్రికలన్నీ బాగానే ఆందోళన చేశాయి. ఈ కొత్తరాజ్యాంగాన్ని స్వీకరించేకంటే ఈ పాతవిధానంతోనే పెనగులాడుతూ ఉంటాం అని చెప్పాయి. కాని మనం వద్దన్నా కొద్ది నెలలలోనే కొత్తవిధానం అమలు జరుగుతుంది; తప్పదు.

అయితే మనం ఏంచెయ్యాలి? అదీ ప్రశ్న!

మనం అనుసరించవలసిన విధానం ఎలాఉండాలో మొదట కొంచెం పైపైన వివరిస్తాను. ఆతరువాత లోతులు ఆలోచిద్దాం. నేనీ సమస్యను

కాంగ్రెసు దృక్పథంతోనే చర్చిస్తున్నాను; కాంగ్రెసు అవలంబించవలసిన విధానాన్ని ఆవిష్కరించేందుకే ప్రయత్నిస్తున్నాను.

లిబరల్ పక్షంవారు ఒకవంక ఈ కొత్తరాజ్యాంగాన్ని విమర్శిస్తూ కూడా, సరే, దాన్ని స్వీకరిద్దాం' పనిచేద్దాం', అంటున్నారు. వారి యీ నిర్ణయం సహేతుకంగా ఉన్నదని నే ననుకోను. రాజకీయంగా వాటికి తెలిసినది ఒక్కటే పంథా— పార్లమెంటరీ కార్యక్రమం; అంతే.

కాంగ్రెసుకు పార్లమెంటరీ కార్యక్రమంలో విశ్వాసం ఏనాడో నశించింది. ప్రత్యక్షప్రతిఘటనమే తన ప్రాతిపదిక విధానంగా స్వీకరించింది. లిబరల్ పక్షీయుల బలము, కాంగ్రెసుబలమూ- రెండింటినీ పరిశీలించి చూస్తే పార్లమెంటరీ కార్యక్రమమే లాభదాయకమో లేక ప్రత్యక్ష ప్రతిఘటన విధానమే లాభదాయకమో తేలిపోతుంది; ఏది సమంజసమో కూడా తెలుస్తుంది.

ఈరెండువిధానాలకూ అసలు పోలికే లేదు. కాంగ్రెసు పార్లమెంటరీ కార్యక్రమాన్ని స్వీకరించేట్టయితే ప్రత్యక్షప్రతిఘటన విధానంలో తనకు సంపూర్ణవిశ్వాసం లేదన్నమాట. అట్టి విశ్వాసం లేని కాంగ్రెసువాది ఎవడూలేడు మంత్రిపదవీస్వీకరణాన్ని అత్యంతం వాంఛిస్తున్న సత్యమూర్తి వంటి పెద్దలకుకూడా ప్రత్యక్షప్రతిఘటన విధానంలో పూర్తినమ్మకం ఉంది.

కనుక ఈ కొత్తరాజ్యాంగాన్ని మనం స్వీకరించలేని పక్షంలో చేయవలసిన పని ఏమిటి? కాంగ్రెసు ఎట్టివిధానాన్ని అవలంబించాలి? కాంగ్రెసు అధిక సంఖ్యాకంగా ఉన్న ప్రదేశాల్లో ఈ కొత్తరాజ్యాంగం అమలు జరగకుండా చెయ్యాలి. జాయంటుపార్లమెంటరీ కమిటీ ప్రణాళిక ఈ దేశంలో బ్రిటిష్‌పాలనమును శాశ్వతం చేసుకునేందుకు, దేశాన్ని ఆర్థిక శోషణకు పాలుచేసేందుకూ ఉద్దేశించబడినది. ప్రస్తుత రాజ్యాంగవిధానం కన్నా అది చాల అపాయకరమైనది; మనకు మరింత ద్రోహం చేస్తుంది కనుక ఈ కొత్త ప్రణాళికను కాంగ్రెసు కార్యవర్గం నిరసిస్తున్నది. ప్రస్తుత పరిపాలనావిధానము దుర్భరంగా, అవమానకరంగా ఉన్నప్పటికీ అందులోనే ఉంటూ ఈ కొత్తవిధానాన్ని ప్రతిఘటిస్తాం" అంటూ కాంగ్రెసు కార్యవర్గం జాయంటు పార్లమెంటరీకమిటీ రిపోర్టుపై వ్యాఖ్యానిస్తూ తీర్మానించింది.

కాంగ్రెసు అభిప్రాయం అది; కాగా కొత్తవిధానాన్ని ప్రతిఘటించ వలెనని కాంగ్రెసు పెద్దలు కావించిన తీర్మానాన్ని అనుసరించి మనం ప్రవర్తించవలదా? అలాచేస్తే గవర్నరు తన ప్రత్యేకాధికారాలను చలాయించి కొత్తరాజ్యాంగాన్ని అనులు చేస్తాడు. అట్టి అవకాశాన్నికూడా గవర్నరుకు మనం కల్పించవలదా;

ఈ సందర్భంలో ఒక బ్రిటిష్ రాజకీయజ్ఞుని వాక్యం మీకు జ్ఞాపకం చేస్తాను. ఈ కొత్తరాజ్యాంగ సంస్కరణ అయిన కాంగ్రెసు అవలంబించ వచ్చునని తాను అనుకున్న విధానాలను కొన్నింటి ఊహించి Political Quarterly (జులై- సెప్టెంబరు 1945) లో కెప్టెన్ హెష్టిఫుడ్ బెన్ ఇలా రాశాడు—

"భారత జాతీయ పార్టీలన్నిటిలో ప్రముఖము, బలవత్తరము అయినది కాంగ్రెసుసంస్థ. అన్ని రాష్ట్రీయశాసనసభలలో (రెండు మూడింటిలో తప్ప) కాంగ్రెసుకే విజయం లభిస్తుంది. కాని కాంగ్రెసు అభ్యర్థులు ఎన్నికలలో గెల్చి శాసనసభలు ఆక్రమించి ఈ కొత్తరాజ్యాంగాన్ని నిస్సందేహంగా భగ్నం చేయటానికే పూనుకుంటారు."

కాంగ్రెసు విధానంలోని ప్రాతిపదిక సూత్రాన్ని చెప్పిస్తూ అతడు ఇంకా ఇలా అన్నాడు- శాసనసభలలో కాంగ్రెసు అభ్యర్థుల వైఖరి స్థానిక మాత్రంగా ఉండదు. తాము నిరసిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రతిఘటనగా ఉంటుంది, చిట్టచివరకు గవర్నరులు తమ ప్రత్యేకాధికారాలను ఉపయోగించుకొనవలసిన పరిస్థితులుకూడ ఏర్పడగలవు అప్పుడు ఇండియాలోని బ్రిటిష్‌వారి నిరంకుశత్వము ప్రజలకు బాగా తెలిసిపోతుంది; అదే కాంగ్రెసు వారికి కావలసినది. "ఒక ప్రముఖవ్యక్తి చెప్పినమాటలు ఇవి; గమనించ తగినవి." ఐర్లండువారి విధానమే ఇండియాగూడ విజయవంతంగా అనుసరించగలదు." అనిగూడా కెప్టెన్ బెన్ అన్నాడు.

కాని ప్రస్తుతం కాంగ్రెసు వైఖరి చూస్తుంటే... అలా జరగదేమో అనిపిస్తుంది.

కాని కెప్టెన్ బెన్ ఈసమస్యలో లోతుకు వెళ్లగలిగినాడు. నిజానికి అతడన్నట్టు బ్రిటిష్ నిరంకుశత్వాన్ని ప్రజలకు రుజావుచేసి చూపటమే కాంగ్రెసు ధర్మం. మంత్రులు లేకుండా గవర్నరు తన ప్రత్యేకాధికారా

ఆతో పరిపాలన సాగించే పరిస్థితులను కాంగ్రెసు కల్పిస్తే అధర్మం నెరవేరిందన్నమాటే.

ఈ విషయం ఇంకా మనలో చాలమందికి బాగాఅవగతమై ఉండదు కనుక ఇంకా కొన్నివివరాలు చెబుతాను. అందుకుగాని ఈ కొత్తరాజ్యాంగ ప్రణాళికలోని ఒక గమనార్హమైన ప్రముఖ అంశాన్ని మీరు తిలకించాలి. ప్రజలింకా దాన్నిబాగా గమనించినట్టులేదు. ఈ కొత్తరాజ్యాంగంద్వారా నిజమైన అధికారాలేమీ మంత్రుల హస్తగతం కావటంలేదు. నిజమైన రాష్ట్రీయ స్వపరిపాలనము లేనేలేదు. బ్రిటీష్ అధికారం కొంచెం పెనకాలకు జరుగుతున్నది. కాని,ముఖ్యమైన,కర్యములన్నీ తనచేతిలో నేఉంచుకున్నది. బ్రిటన్ ఇండియాల మధ్య ఉండవలసిన సంఘర్షణను చల్లార్చటమే దీనిలోని భావం. పైగా ప్రజలకూ మంత్రిత్వాలు స్వీకరించిన వారికీ మధ్య సంఘర్షణ ఉత్పన్నమౌతుంది. అంటే ప్రజలే తమలో తాము ఘర్షణ పడతారన్నమాట. బ్రిటీష్‌వారి భలేరాజనీతి! భారతీయస్వాతంత్ర్య సమరాగ్ని జ్వాలలను మరొక దిక్కుకు మరలించి వేస్తున్నారు. ప్రజాదరణ పాత్రముగాని యీ పరిపాలనా బాధ్యతలను భారతమంత్రుల భుజస్కంధాలపై దించి తద్వారా బ్రిటిష్‌వారిపై ప్రజలకు గల ఆగ్రహాన్ని చల్లార్చి వేస్తున్నారు.

ప్రస్తుత రాజ్యాంగంలోని భారతమంత్రులకూ (ప్రభుత్వ సభ్యులతో సహా) కొత్త రాజ్యాంగంలోని మంత్రులకూ తేడా ఉంది. ప్రస్తుత స్థితిలో బ్రిటిష్ ప్రభుత్వం బిరుదులిచ్చి, ఏవో కొన్ని లాభాలు చూపించి కొందరు భారత వ్యక్తులను దగ్గరదీసి వారిద్వారా పరిపాలనము సాగిస్తున్నది. రాబోయే కొత్త రాజ్యాంగంలో మంత్రులు దేశంలోని వివిధ పార్టీలకు చెందిన వారై ఉంటారు. ఆ పార్టీలు ఒక్కొక్క నియోజక వర్గానికి బాధ్యత వహించి ఉంటాయి. కనుక మంత్రులు నిర్వహించే కార్యక్రమానికి వారి పార్టీ, ఆ పార్టీ ప్రాతినిధ్యం వహించి ఆనియోజకవర్గం బాధ్యత వహించినట్టూ – బ్రిటిష ప్రభుత్వానికే ప్రమేయమూ ఉండనట్టూ పైకి కనిపిస్తుంది. ఇటువంటి పరిస్థితులు ఒక తెలివితేటలు గవర్నరుకు ఎలా ఉపయోగిస్తాయి ? కనుక జరిగేదేమిటో ఊహించుకో వచ్చు. ఈ కొత్త రాజ్యాంగ ప్రణాళిక ద్వారా బ్రిటిష్‌వారు తమ సామ్రాజ్యతత్వానికి అధికంగా బలం చేకూర్చుకో గలుగుతున్నారని చాలమంది చెబుతారు

ఉన్నారు. తమ ప్రత్యేక హక్కులను బాగా పోషించుకో గలుగుతారు. తద్వారా ప్రజల అసంతృప్తి బాగా పెరగనీగాక! తమ సామ్రాజ్య తత్వాన్ని బలపరచుకునేందుకే ఈ 'బాధ్యతాయుత మంత్రిత్వాల'ను ఉపయోగించుకుంటారు. యథారీతిని సామ్రాజ్యతత్వం విజృంభిస్తూ ఉంటుంది. కాని ఇది అప్రస్తుత విషయం. మళ్ళీ మన సమస్యకు వద్దాం.

సంభవమైన ప్రదేశాలలో నెల్ల ఈ రాజ్యాంగాని అమలు కాకుండా నిరోధించ వలసిందేనని చెప్పాను.

అదే సమంజసమైన పని యని చెప్పటానికి మరొక కారణం కూడా ఉంది. మనం జాయంటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టును నిరసించాం. ఈ రిపోర్టు ఫలితమే ఈ కొత్త రాజ్యాంగ ప్రణాళిక. ఇదివరకు నిరసించిన వాళ్ళం ఇపుడా విధానం మార్చుకుని స్వీకరిద్దామా? కొత్త రాజ్యాంగం అమలు జరుగవలెననే బ్రిటిష్‌వారు వాంచిస్తున్నారు; అది వారికి లాభకరం. మిత్రులైన కొందరు భారతీయ వ్యక్తులిచ్చిన సలహాలు కూడా పెడచెవిని పెట్టారు. "ఈ కొత్త రాజ్యాంగాన్ని ఇప్పుడింతగా నిరసిస్తూ కేకలు పెడుతూన్న ఈ పెద్దలే చివరకు దాన్ని అనుమతించి శిరసా వహిస్తారు" అని శాసన సభలోని ప్రభుత్వ సభ్యులు వ్యంగ్యవాక్యాలు విసురుతున్నారు.

పరిస్థితులు ఇలా ఉన్నాయి. కాబట్టి కాంగ్రెసు మెజారిటీగల ప్రదేశాల్లో... బ్రిటిష్‌వారి ఉద్దేశాలను, ఎన్నుగడలను సాగనీయకూడదు. ఇన్నాళ్ళు శ్రమపడి ఈ ప్రసాదించిన రాజ్యాంగం నిరుపయోగమైనది; గవర్నరు తానే పరిపాలనాచక్రం త్రిప్పుకోవలసిందే- అని మనం నిరూపించ వలసియున్నది. అలాచేస్తే స్వదేశంలోనూ, విదేశాల్లోనూ కూడా మనయెడ సదుద్దేశంఏర్పడుతుంది. అట్టి సదుద్దేశం మరేవిధానం అవలంబించినా ఏర్పడదు. కాంగ్రెసు తనశక్తిని నిలుపుకోవాలి. అందుకుగాను మన కర్తవ్యము అదే.

అట్టివిధానం అవలంబించటంవల్ల కాంగ్రెసు పార్టీ ప్రజలకు చేయగల మేలు ఏమీ వుండదు. అందుచేత ప్రజల కావిధానం నచ్చదు- అని కొందరంటారు. కాని అదేమంత సమంజసమైన మాట కాదు.

వోటర్లకు మనయెడల సంపూర్ణమైన సానుభూతి కలగవలెనంటే మనం వారికి నచ్చజెప్పటంలో వుంటుంది. ఓడిపోయినవాళ్లకుమల్లే దీనంగా పడితే వారి విశ్వాసాన్ని సంపాదించలేము. మన ప్రచారం జీవవంతంగా సాగాలి; ఉత్సాహంగా మనం అనుసరించే విధానంలోని సామంజస్యం వారికి నచ్చజెప్పాలి. అలాచేస్తే వోటర్లసానుభూతి అవశ్యం సంపాదించగలం. ఈకొత్త రాజ్యాంగం బలవంతంగా మననెత్తికి రుద్దుతున్నారు. చాల అన్యాయం. అందువల్ల మనం శాశ్వతదాస్యంలో మగ్గిపోతాం. అందుచేత ఈ నూతన రాజ్యాంగ యంత్రాన్ని సాగనియకూడదు. చక్రాలు విరుగగొట్టి పారేయవలసిందే- అంటూ ఝంఝామారుతంలాంటి ప్రచారం చేయగలిగితే ప్రతిసారీ కూడా మనమే మెజారిటీవోట్లు సంపాదించగలం. ఏమీ సందేహంలేదు. ఒకవేళ ఎన్నికలలో ఓడిపోయినా విచారించవలసిన పనిలేదు. బ్రహ్మాండమైన ప్రచారమైతే చేశాంకదా! అది ముమ్ముందు మనం ప్రత్యక్షప్రతిఘటనకు పూనుకున్నప్పుడు ఎంతైనా ఉపయోగపడుతుంది. మన కార్యకలాపమంతా అందుకే దారితీయాలికదా!

కాంగ్రెసు ఈ విధానాన్నే తప్పక అవలంబించవలెనని చెప్పటకు మరొక ప్రముఖహేతువుకూడా ఉన్నది. జాయింటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టుమీద కాంగ్రెసు కార్యవర్గ తీర్మానంలో ఇలా ఉంది – రిపోర్టులో సూచితమైన రాజ్యాంగానికి ప్రత్యామ్నాయంగా మనుష్యుల్ని తృప్తి పరచగలిగినది. భారత ప్రజాపరిషత్తు రచించే రాజ్యాంగమే గడచిన అసెంబ్లీ ఎన్నికల ప్రచార సందర్భంలో ప్రజాపరిషత్తుమాట ఎత్తాం. కాని తరువాత మళ్ళీ ఆ ప్రసక్తే మరచిపోయాం. కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు డా॥ పట్టాభి సీతారామయ్య ప్రజాపరిషత్తు సంస్థాపనగూర్చి చాల తేలిగ్గా మాటేశాడు. ప్రజాపరిషత్తునుగూర్చి మాటాడ్డం ప్రజలను మోసగించటం కాకపోవచ్చుగాని, లేనిపోని ఆశలు కల్పించటం మాత్రమవుతుంది'' అన్నాడాయన. పైన ఉదహరించిన తీర్మానంలోని వాక్యం పలికినప్పుడు కాంగ్రెసు కార్యవర్గం ప్రజలను మోసగించటంలేదుగద! ఏమైనాగానీ కాంగ్రెసు అధ్యక్షుడు తన కార్యవర్గ సభ్యులను ఏ అభిప్రాయమూ ప్రకటించవద్దని చెప్పటం మంత్రిపదవీ స్వీకరణ విషయమునసో, లేక కార్యవర్గ నిర్ణయాలను తేలికచేసి మాటాడవద్దనియో!

ఇంతకూ వెస్టుమినిస్టర్‌లో తయారైన రాజ్యాంగం మనకు పనికిరాక ...కార్యవర్గతీర్మానంలో ఉదహరించినట్లు భారత ప్రజా పరిషత్ రచించిన రాజ్యాంగమే మనకు అంగీకారయోగ్యము కాదగినదైతే...ఆ విషయము రానున్న ఎన్నికలలో ప్రజలకు తెలియజేయటం మనధర్మం కాదా ? ప్రజాపరిషత్తు ఇప్పుడిప్పుడే స్థాపితమయ్యేదికాదు. కనుక పట్టాభిగారన్నట్టు ఆ ప్రసక్తి తీసుకురావటం ప్రజలను మోసగించటమే ఔతుందని కొందరనవచ్చు. కాని ప్రజాపరిషత్తు స్వాతంత్ర్యంకన్నా ఆలస్యంగా స్థాపింపవలసినదా ? అయినా కూడా స్వాతంత్ర్యం కావాలని ప్రతిఉపన్యాసంలోనూ ఉద్ఘాటిస్తున్నాం కదా! అదీగాక-అది ఇప్పుడప్పుడే స్థాపితమయ్యేది కాకపోతే గడచిన అసెంబ్లీ ఎన్నికల సందర్భంలో దాని ప్రసక్తి తెచ్చాం కదా! ఎందుకు తేవలసివచ్చింది? "గడచిన అసెంబ్లీ ఎన్నికలద్వారా ఈ దేశము ప్రజాపరిషత్ సంస్థాపనమును మనస్ఫూర్తిగా వాంఛిస్తున్నది" అని కాంగ్రెసు కార్యవర్గము తమ తీర్మానంలో సంతోషపూర్వకంగా పేర్కొన్నది. ఆ వాంఛే కదా ఇప్పుడు జాయింటు పార్లమెంటరీకమిటీ రిపోర్టుకు ప్రత్యామ్నాయంగా మనం అడుగుతున్నాం! కనుక ఇప్పుడు ఆ రిపోర్టును మననెత్తికి బలవంతంగా చుట్టటానికి బ్రిటీష్ ప్రభుత్వం ప్రయత్నిస్తోంటే...దాన్ని మనం నిరసిస్తూ ప్రజాపరిషత్తు సంస్థాపన విషయమై తీవ్రంగా ఆందోళన చేయవలదా?

ఒకవైపున అట్టిపనేచేస్తూ మరొకవైపున ఈ కొత్తరాజ్యాంగం సాగకుండా తీరినంతవరకు అవరోధాలు కల్పిస్తూనేవుండాలి. బ్రిటీష్‌వారు ఈ కొత్తరాజ్యాంగాన్ని నిర్వచించు మన అభిప్రాయం అడిగారు. దాన్ని మేము నిరసిస్తున్నాం; ప్రజాపరిషత్తు నిర్మించే రాజ్యాంగం మాకు కావాలి అని చెప్పాం. ఇప్పుడు వారా రాజ్యాంగ ప్రణాళికనే అమలు చేయబోతున్నారు. ఆ రాజ్యాంగచక్రాన్ని సాగకుండా నిరోధించటము ప్రజాపరిషత్తు సంస్థాపనకు ఆందోళన చేయటమూ మన కర్తవ్యమైయున్నది. అంతకన్నా మనం అవలంబించతగిన ఆత్మగౌరవప్రదమైన విధానం ఇంకొకటి లేదు. మంత్రిత్వాలు స్వీకరించి పరిపాలనాబాధ్యతలు నిర్వహింప దలిస్తే ప్రజాపరిషత్తు సంగతి ఎన్నికల ప్రచారంలో ఎత్తి లాభంలేదు. రాజ్యాంగ చక్రాన్ని నిరోధించ దలిస్తేనే ఆ పని చెయ్యాలి.

ఇక పోతే ఈ విధానం చాలమంది ప్రజలకు నచ్చదేమోనని

కొందరి అభిప్రాయం కారణం? అందువల్ల ప్రజలకు తక్షణం కలిగే లాభాలేమీ ఉండవు గనుక. నిజంగా మనం ప్రజలకు కొన్ని మేళ్ళు చేకూర్చ వలెనని వాంఛించేట్టయితే వీలైనంతవరకు మంత్రిపదవులను అంటి పెట్టుకునే ఉండవలసి వస్తుంది; బైటికివచ్చేస్తే నిష్ప్రయోజనమే కదా! కాని ఈ కొత్తరాజ్యాంగంలో మనం ప్రజలకు ఎక్కువ ప్రయోజనాలు చేకూర్చలేమన్న సంగతి జగద్విదితమే. మంత్రిపదవులు స్వీకరిస్తాం; సంస్కరణలు ప్రవేశపెడతాం; మంత్రిత్వకాలపరిమితి ముగిసేటప్పటికి తిరిగి చూచుకుంటే మనం చేయగలిగింది అతి స్వల్పం అని తెలుసుకుంటాం; ప్రజలు మనయెడల, బ్రిటిష్ వారియెడల అసంతృప్తులై పెదవి విరుస్తారు. అంతేగాక ప్రభుత్వంతో పోరాడేందుకు కావలసిన జవసత్వాలను ప్రజాహృదయాల్లో నులిమి పారేశాం; ఆ జవసత్వాలే కాంగ్రెసు ఉద్యమానికి మూలకందాలు. మన మంత్రిత్వాలు వాటిని నిర్మూలించేస్తాయి; ప్రజలను పొట్ట పట్టుకుని ఉద్యోగాలకు ప్రాకులాడే బానిసలుగా తయారుచేస్తాయి. రాజ్యాంగాన్ని నిరోధించటమే మన విధానంగా పెట్టుకుంటే ప్రజలకేమీ మేళ్ళు చేకూర్చలేకపోతాం అన్న తర్కానికి దిగేట్టయితే మంత్రిత్వాలు స్వీకరించవలసే వస్తుంది. మరో మధ్యమార్గమేమీ లేదు.

ఇంతవరకూ కాంగ్రెసు మెజారిటీవున్న ప్రదేశాలలో మన మనుసరించదగిన విధానాన్ని గూర్చి ఆలోచించాం. ఇకపోతే కాంగ్రెసుకు బలం లేని ప్రాంతాల్లో మనకర్తవ్యం ఏమిటి?

ఈవిషయాన్ని చర్చించటానికి ముందు శాసనసభా ప్రవేశాన్ని ఆమోదిస్తూన్న వారి వ్యవహారం గమనిద్దాం. పైని నేను ఉదహరించిన గుల్లాముల్లా అన్నీ వారు పరిశీలించినట్టు కనిపించదు. మన కాంగ్రెసు ఉద్యమ ప్రాతిపదికసూత్రాలు, దాని ఆంతరంగిక తత్వం, పూర్వానుభవాలు కూడా వారు గుర్తించటంలేదు.

1926 ఎన్నికలలో పాల్గొనటానికే నిశ్చయించుకున్నప్పుడు కాంగ్రెసు అవలంబించినవిధానం ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకుందాం. "ప్రభుత్వం కాంగ్రెసుయెడల సమంజసంగా ప్రవర్తిస్తుందన్న విశ్వాసం కలగనంతవరకూ శాసనసభలలో కాంగ్రెసు ప్రతినిధులు పదవీస్వీకరణం చెయ్యకూడదు" అని అఖిలభారత కాంగ్రెసుకమిటీ తీర్మానించింది. పదవీస్వీకర

జాకు ఆ పెట్టిన షరతు గమనించండి. ఆనాటి కాంగ్రెసు ఆశయాలకు,ఉత్సాహావేశాలకు తగివున్న దా నిర్ణయం, ఆత్మగౌరవప్రదం గానూ ఉన్నది! ఇప్పుడు కాంగ్రెసు ఆశయాలు ఇంకా విశాలమైనవి. ప్రభుత్వ ప్రవర్తనము మార్చిన హామీ ఇప్పుడు కాంగ్రెసుకు అవసరం; కనుక ఈ ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసువారు పదవీస్వీకరణకు ప్రాకులాడుట విచారకరము కాదా? ఇప్పు డీపదవులు ప్రభుత్వపు బహుమతులు కావుకదా అనవచ్చును; కాని అది లోతు లెరిగి పలికేమాట కాదు. ఈ కొత్తరాజ్యాంగాన్ని ప్రజలు ఆమోదించటంలేదు. అంతా ప్రభుత్వం ఇస్తూన్న బహుమానమే— మట్టరాని బహుమానం!

కనుక మంత్రిపదవులకు ప్రాకులాడుతూన్న పెద్దమనిషి కాంగ్రెసు ఉద్యమ అంతరంగికతత్వాన్ని హత్యచేస్తున్నాడు.

ఈ హత్య చేసినందువల్ల కలిగే ప్రయోజనాలేమిటి? చాల పేర్లు ఉన్నాయి; గవర్నమెంటు ఉద్యోగులచేత ఖద్దరు కట్టించవచ్చు; ప్రభుత్వ భవనాలమీద జాతీయజండా ఎగురవేయవచ్చు;— అంటున్నారు; సత్యమూర్తి మొదలైనవారు. ఏమో, అనుమానమే. కాంగ్రెసు తన విశాలాశయములను వొదులుకుని చిన్నచిన్న మార్పులకోసం ఎన్నికల ప్రచారంలోకి దిగవలె నన్నమాట! కాంగ్రెసు అలా చేసేట్టయితే ప్రజాహృదయాన్ని అసలైన సమస్యలనుండి మరలించివేస్తుంది; ప్రజలు ప్రభుత్వప్రసాదంకోసం ఎదురు చూస్తూండటం నేర్చుకుంటారు అంటే ప్రజాశక్తులు అనవసరమైన పంథాలలో దుర్వినియోగ మౌతా యన్నమాట. తత్ఫలితంగా జాతీయోద్యమం దుర్బలమై పోతుంది.

కాంగ్రెసు ఆశయాలకు అనుగుణ్యమైన కార్యక్రమాన్ని కాంగ్రెసు మంత్రులు నిర్వహించగల అవకాశాలను ప్రభుత్వం ఇవ్వదు. కాంగ్రెసు మంత్రులు కొంత కాలంమాత్రమే పదవులలోవుండి ఏమో కాస్త ప్రయత్నం చేస్తారు. కాని ఎక్కడఉన్నవాళ్ళం అక్కడే వుంటాం; పైగా మన ప్రధాన ఆశయాలు, సిద్ధాంతాలు కొన్ని దెబ్బ తింటాయి; తప్పదు.

ఇటీవల దక్షిణదేశంలో సి. ఆర్. రెడ్డి ఒక ఉపన్యాసం చెబుతూ ఒక సూచన ఇచ్చాడు. మంత్రాంగం నిర్వహించటానికీ, దాన్ని ధ్వంసం చెయ్యటానికీ నడుమ ఒక మధ్యమార్గం ఉన్నదంటాడు. కాంగ్రెసు పార్టీ

ఎన్నికలలో పాల్గొని మెజారిటీ వోట్లతో శాసనసభలు ఆక్రమించగలిగితే మంత్రిపదవులు స్వీకరించి, కాంగ్రెసు కార్యక్రమాన్ని నిర్వహించవలెనట! గవర్నరు అందుకు ఆటంకపరచేట్టయితే కాంగ్రెసు మంత్రులు రాజీనామా లిచ్చివేసి బైటికి రావచ్చునట!

ఎప్పుడూ కాన్‌స్టిట్యూషన్ పద్ధతులమీదే ఆలోచిస్తూండే వ్యక్తి ఇలాంటి సలహాలే ఇస్తూంటాడు. ఈ యుక్తివల్ల ప్రయోజనం ఏమిటి? కొత్త రాజ్యాంగాన్ని నిరసించాలి, ప్రతిఘటించాలి, ధ్వంసం చెయ్యాలి అన్న నినాదం పోతుంది; మన స్వాతంత్ర్యసమరంలో ప్రభుత్వం మన శత్రువన్న భావం కలిగింది ప్రజల్లో, ఆ భావం కాస్తా నశిస్తుంది; మంత్రులు మనకే మా త్రివ్వి తలకెత్తుతారన్న ఆడియాసలు మొలకెత్తుతాయి ప్రజల్లో; ఇలాగే అనేక నష్టాలున్నాయి. కొద్దిమంది కాంగ్రెసువ్యక్తులు పదవులాక్రమించి వుంటారు, కొంతకాలం. ఎంతకాలం? రాజీనామా లిచ్చి బైటకి రావటానికి తగినట్టి పరిస్థితులేర్పడేంతవరకూ. ప్రతిష్టంభన ఏర్పడిన తర్వాత ప్రజలకుజరిగే మేళ్ళు ఏమీ ఉండవుకదా! మంత్రులు ఏమీ చెయ్యలేరుకదా! ప్రజలకు ఏ కాస్తో చేతనయినంత...వీలైనంత మేలు చేద్దామనుకునే పార్లమెంటరీ విధాన పక్షపాతికికూడా ఈ యుక్తి లాభించనేరదు. పైగా గవర్నరుకు మంత్రులకు మధ్య స్వాతంత్ర్య సమస్య మీద కాదు సంఘర్షణ; ఏదో ఒక అల్పవిషయంమీద. రెడ్డిగారి సలహా చాలా అపాయకరమైనది;

ఈ విషయం మీదే ఎక్కువ కాలహరణం చేయటం నాకిష్టంలేదు. అయినా పదవీస్వీకరణ వాదులు అనుసరిస్తూన్న మార్గంలో ఇంకా కొన్ని అపాయాలున్నాయి, సూచిస్తాను.

ఎన్నికల ప్రచారం తీసుకుందాం. కాంగ్రెసువారు పదవులు స్వీకరించేందుకే నిశ్చయించేట్టయితే పార్టీకి మెజారిటీ సంపాదించేందుకు ప్రయత్నించవలసిందేగా! అటువంటప్పుడు కాంగ్రెసేతర వర్గాలతో కూడా కూడి వ్యవహరించవలసి వుంటుంది. కాంగ్రెసేతరవర్గాలవారు కాంగ్రెసు ఎన్నికల ప్రచారంలో చేరేందుకుగాను కాంగ్రెసు కార్యక్రమంలో కొన్ని మార్పులు చేయవలసివస్తుంది. గడచిన అసెంబ్లీ ఎన్నికల సందర్భంలో సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు పార్లమెంటరీకమిటీ హిందీ

భాషలో ఒక మానిఫెస్టో ప్రకటించింది. అది చూచి నేను ఆశ్చర్య పోయాను. ఆరాష్ట్రంలోని భూస్వాములు ఎన్నికలలో కాంగ్రెసుఅభ్యర్థులకే ఎందుకు తోడ్పడవలెనో కొన్ని కారణాలు అందులో వివరింపబడినవి. అంటే కాంగ్రెసు ఎప్పుడూ భూస్వాముల హక్కులను సంరక్షించేందుకు ఏర్పడిన సంస్థయని ఆ మానిఫెస్టో రుజువు చేస్తోందన్న మాట! ఆరాష్ట్ర కాంగ్రెసు పార్లమెంటరీ కమిటీయే ఇంగ్లీషులో కూడా మరొక మానిఫెస్టో ప్రకటించింది. ఇది వోటర్లందరికీ ఉద్దేశింపబడినది. దీనికీ ఆ హిందీ మానిఫెస్టోకూ పోలికే లేదు. రెండూ పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఈ రాష్ట్రంలోనే కొన్ని సంవత్సరాలక్రితం రాష్ట్ర రాజకీయ సమావేశంలో రైతులకూ, ప్రభుత్వానికీ నడుమ వ్యవహరించీ మధ్యమనుష్యులనందరినీ తొలగించి వేయవలెనని ఒక తీర్మానం ఆమోదించబడింది.

ఇదంతా ఎందుకు చెప్పానంటే- అసలే ఇప్పుడు కాంగ్రెసు ఆదర్శాలు మితవాదితత్వాన్ని అనుసరించి ఉన్నాయి. అవికూడా... మనం ఎన్నికలలో దిగి మెజారిటీ సంపాదించాలని ప్రయత్నం చేయటంలో... కొన్ని నీరుగారిపోతాయి; కొన్ని దెబ్బతింటాయి; కొన్ని మారిపోతాయి. ఈ విషయంలో ఒక్క సంయుక్త రాష్ట్రంలోనే కాదు; ఇతరచోట్లకూడా అలాగే జరక్కతప్పదు;

కనుక ఎన్నికల ప్రచారంలోకి దిగటంతో మితవాదిత్వానికి లొంగిపోతాం. ఇతరవర్గాలతో సంప్రదింపులకు దిగుతాం; ప్రజాళికి విద్య గరపటం; వారి శక్తులను సమీకరించటం- ఇత్యాది ప్రముఖ సమస్యలనించి వైదొలగి విభిన్నపక్షాలతో సమాధానాలకు ప్రయత్నించవలసివస్తుంది; అర్థం లేని వినాదాలు ప్రచారంచేస్తాం? ఉపయుక్తంగాని కార్యక్రమం అవలంబిస్తాం.

ఇక మంత్రిత్వాలు స్వీకరించిన తరువాతకూడా కొన్ని అపాయాలున్నాయి. అవి నిర్లక్ష్యం చేయదగినవికాదు. సంస్థకు నైతికపతనం తప్పదు. పార్లమెంటరీకార్యక్రమంలో మునిగిపోయి వుంటారు నాయకులు. కాంగ్రెసుసంస్థ ఛిన్నాభిన్నమౌతుంది.

ఇంతవరకు కాంగ్రెసు మెజారిటీగా ఉన్న ప్రదేశాల్లో అనుసరించవలసిన విధానంగూర్చి చర్చించాను. ప్రస్తుతం ఈవిషయమే మన స్వాతంత్ర్య

సమరంలో ప్రముఖస్థానం అక్రమించింది. కనుక దాన్నిగూర్చి ఇంతసేపు మాటాడవలసి వచ్చింది.

ఇక కాంగ్రెసుకు మెజారిటీలేని ప్రాంతాల్లో అవలంబించవలసిన విధానంగూర్చి చెబుతాను. "జాతిని స్వాతంత్ర్యగమ్యం చేరనీయకుండా ఆటంకపరచే ప్రభుత్వ చర్యలను గాని, తదితరుల చర్యలను గాని ఎక్కడికక్కడ ప్రతిఘటించటమే" పూర్వం స్వరాజ్యపార్టీ లక్ష్యము. దానితో పాటు సమాధాన విధానాలుకూడా అనుసరిస్తుంటారు. కేవలం నిరోధకశక్తులను ప్రతిఘటించటంతో సరిపోదు. శాసనసభలలో ప్రజలఇబ్బందులు, కోరికలు వాక్కులు ప్రచారం కావాలి. శాసనసభలబైట జరుగుతూండే సమరం శాసనసభలలోకూడా ప్రవేశించాలి. కాంగ్రెసు ప్రజాశక్తులను రేపాలి. కర్షకుల, కార్మికుల, ఇంకా ఇతర పీడితవర్గాల ఆర్థికసౌష్టవంకోసం కృషి చేయాలి. అందుకు అసెంబ్లీలను తాము వినియోగించుకోవాలి.

అలాగ అసెంబ్లీలలో సాగించే కృషికీ, బయట సాగించే సమరానికీ సమన్వయం కుదిర్చి రెంటినీ, జోడించగలిగితేనేతప్ప... లేకపోతే శాసనసభలు పూర్తిగా నిష్ప్రయోజనములు, దుర్బలములు ఐపోతాయి.

ఇంకా ఈ విషయమై నేను ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు. కాంగ్రెసు మైనారిటీగా వున్నప్రదేశాల్లో మన కర్తవ్యం నిర్ణయించుకోటం అంత కష్టతరమైన పనికాదు. మనకు దారిచూపగల చరిత్రాత్మక అంశాలు చాల ఉన్నాయి.

కాన్‌స్టిట్యూషన్ విషయమై నేను చెప్పదలచిన మాటలు ముగించే ముందు ... శాసనసభలలో మనప్రవర్తనకు ప్రాతిపదికగా ఉండవలసిన సూత్రం ఒకటి చెబుతాను. దేశంలోని విప్లవోద్యమానికి బలం, తోడ్పాటు చేకూర్చేందుకే శాసనసభలను మనం ఉపయోగించుకోవాలి. మనకు పార్లమెంటరీ కార్యక్రమమంటూ లేదు. కాంగ్రెసుపార్టీ శాసనసభలలో అనుసరించవలసిన విధానం నిర్వచిస్తూ మనం కావించిన నిర్ణయంపై శ్రీ రాజగోపాలాచార్యులవారు జబల్‌పూర్‌లో మాటాడుతూ ఇలా అన్నారు: "మనం శాసనసభల్లోకి వెడితే అక్కడ మామూలుగా జరిగే పనులే మనమూ చెయ్యాలి" అంటే ఆయనఉద్దేశం మనం కాన్‌స్టిట్యూషన్ పద్ధతుల ననుసరించి వ్యవహరించవలసి వుంటుందని. అసెంబ్లీలో ప్రజా

పరిషత్తు స్థాపనగురించి ఆందోళన చెయ్యాలని మనం అంటున్నాము. అది ఆయన దృష్టిలో అవివేకము. అసెంబ్లీబైట ఎప్పుడో సరియైన సమయంలో ఆ ప్రసక్తి లేవలెనట!

మన విధానం ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. మనం శాసనసభల్లో ప్రవేశించి అనేక సందర్భాల్లో ప్రభుత్వాన్ని ఓడించటమే కాదు మనం చేయవలసిన పని; ప్రచారంకోసం ప్రాతిపదిక నినాదాలను లేవదీయాలి; అసెంబ్లీలో మన కార్యక్రమాన్ని బైట ప్రజాస్వాతంత్ర్య సమరంతో జోడించాలి; సామ్రాజ్యవాదుల దౌష్ట్యాన్ని బైటపెట్టాలి, సాగనివ్వకూడదు; కాంగ్రెసు తన మనుష్యులను అసెంబ్లీలకు పంపిస్తూ, బైట తన ప్రజలయిబ్బందులు తొలగిపోయేందుకుగాను ఆందోళన చేయాలి. ఒక బలవంతమైన కార్మిక-కర్షక-ఉద్యమం లేవదీయాలి; అసెంబ్లీలను విప్లవాత్మకంగా ఉపయోగించుకోవాలి – అదీ కాంగ్రెసువంటి విప్లవసంస్థ అనుసరించవలసిన విధానం. మిగతా వివరాలన్నీ నాయకులపై ఆధారపడి ఉంటాయి. సూత్రం మాత్రం అది.

## పార్టీ కర్తవ్యం

నేను మిమ్మల్ని విసిగిస్తున్నానేమో నాకు తెలియదు. నేను సామ్యవాదాన్ని గురించి మాటాడతానని మీరు నిస్సందేహముగా భావించియుంటారు. ఈ ప్రస్తుత పరిస్థితులలో సామ్యవాదులు మీరంతా ప్రముఖంగా అనుసరించవలసిన మార్గం: స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనటమే. అది పురస్కరించుకునే ఆ ఉద్యమానికి సంబంధించిన కొన్ని ప్రముఖ సమస్యలను మీ ముందు చర్చించాను. ఇక మనపార్టీ గురించీ, మన మనుసరించవలసిన విధానం గురించీ, మన కర్తవ్యంగురించీ మాటాడతాను.

ప్రథమంగా, ప్రముఖంగా మనం చేయవలసినపని: సామ్రాజ్య వాద వ్యతిరేక ఉద్యమాన్ని సాగించటమే. ఈఉద్యమం ద్విముఖంగా సాగాలి. కాంగ్రెసులో మనం చేయవలసిన పని ఒకటి; ప్రజలలో మనం చెయ్యవలసినపని రెండవది. ఈరెండురకాల కార్యక్రమాలకూ పరస్పర సంబంధంఉంది.

కాంగ్రెసును మనం ఒకనిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేకసంస్థగా తయారు చెయ్యాలి. కొందరు అపోహపడినట్లు కాంగ్రెసును పూర్తిగా

సోషలిస్టు పార్టీగా మార్చివేయటం కాదు మన ఆశయం. మనం కోరేది ఏమంటే— కాంగ్రెసులోని శక్తులను, విధానాలను పునీతంచేసి, కాంగ్రెసును ఒక నిజమైన ప్రజాసంస్థనుగా... ప్రజలను పరపరిపాలననించి, పెట్టుబడిదారీవర్గాల పీడనించి విముక్తులనుచేయగల ఒకబలవత్తరమైన సంస్థనుగా తయారుచెయ్యటమే.

ఈ మాటవిని పరిహాసంచేసేవారు కొందరున్నారు. కాంగ్రెసు ఒక బూర్జువాసంస్థ యనీ, నేనుచెప్పినట్లు అది మారటానికి అవకాశాలు లేవని వారి ఉద్దేశం. ప్రస్తుతం కాంగ్రెసు ఉన్నతవర్గాలవారి అధీనంలో ఉంది; తదీయనాయకులు ప్రజాళి ఆర్థిక ఇబ్బందులు తొలగించటం తమ కర్తవ్యంగా భావించే స్థితిలో లేరు. కాని కాంగ్రెసులో కూడా మనఆశయాలను మన్నించేవారు చాలామంది ఉన్నారు. మన కార్యక్రమం జాతీయశక్తులలో విభేదాలు కల్గించదు; జాతీయపోరాటాన్ని దుర్బలంచెయ్యదు— అని వారందరినీ మనం నమ్మించాలి. అలా వారిని నమ్మించకుండా మనం ఎన్ని గొప్పమాటలు చెప్పినా సామ్రాజ్యవాద వ్యతిరేకసంస్థను స్థాపించలేము. వారి విశ్వాసం మనం చూరగొనగలిగితే పాతనాయకత్వాలు పోతాయి. అభ్యుదయ మార్గాన మన భావాలు నడుస్తాయి. మన కార్యక్రమం శక్తివంతమనీ, ఫలప్రదమనీ రుజావుచెయ్యాలి. ఈ విషయాన్నిగురించి ముమ్ముందు ఇంకా వివరంగా చెబుతాను.

కనుక కాంగ్రెలో సామ్రాజ్యవాదవ్యతిరేకులు ఎక్కువగా ఉన్నట్టయితే— అధికసంఖ్యాకులుగా ఉన్నారనే నానమ్మకం— మన పార్టీకూడా కాంగ్రెసులోనేఉండి తీవ్రంగాపనిచేయుటం ఉచితం కాదా? అయితే మనం ఏలక్ష్యంతో, ఏవిధానం అవలంభించి పనిచేయాలి? కాంగ్రెసును తిట్టిపోస్తూ దాన్ని ఛిన్నాభిన్నం చెయ్యకూడదు. ప్రజల్లో తీవ్రమైన ప్రచారం చేసి సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులనన్నింటినీ మన చేతిక్రింద సమీకరించుకోవాలి; అప్పుడు కాంగ్రెసు మన సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యక్రమాన్ని అంగీకరించక తప్పదు అంటే ఈవిధంగా కృషిచేసి, మితవాదులను మన కార్యక్రమానికి ఒప్పుకునేట్టుగా జేసి, కాంగ్రెసును మార్చివేయగలమని కాదు. కాంగ్రెసు ఇప్పుడున్న విధంగా చాలకాలం నిలువదు. మనం మన కార్యక్రమాన్ని తీవ్రంగా సాగించుకుంటూ పోతే చివరకు కాంగ్రెసులో చీలిక ఏర్పడుతుంది. మన మంతా కలసి కాంగ్రెసును ఛిన్నాభిన్నం

చేస్తున్నామని మితవాదులు మనల్ని దుయ్యబట్టుకుంటారు. కాని నిజంగా సామ్రాజ్య వ్యతిరేకశక్తులుబాగా సమీకృత మౌతున్నాయని దానిఅర్థం. అట్టి చీలికలు కాంగ్రెసులో ఇదివరకు ఏర్పడ్డాయి. ఏర్పడినప్పుడల్లా కాంగ్రెసు మరింత బలవత్తరమౌతూ వచ్చింది. ఇంకొకచీలిక కాంగ్రెసును ఇంకొక మెట్టుకు—ఆదేఅంతిమ మనుకొంటాను—తీసుకుపోతుంది దానితో కాంగ్రెసు పూర్తిగా సామ్రాజ్య వ్యతిరేకసంస్థ కాగలదు.

కాంగ్రెసును బలవత్తరం చేయటానికి మరొక కార్యక్రమం కూడా ఉంది. అది అంతర్నిర్మాణము విధానములకు సంబంధించినది. ఇప్పుడీ కాంగ్రెసుసంస్థ వ్యక్తిసభ్యత్వాలమీద ఆధారపడి ఉంది ఈ విధానం అంత తృప్తికరమైనది కాదు. అందువల్ల అనేక అసహజమైన సంస్థ ఔతుంది; అందులో సరిగా ప్రజా ప్రాతినిధ్యం ఉండజాలదు; ఎవరో కొందరుసభ్యులు ఉంటారు అంతే. ఈ విధానం మనం మార్చాలి. కాంగ్రెసును నిజమైన ప్రజాప్రాతినిధ్యసంస్థనుగా తయారు చెయ్యాలి. వర్గప్రాతినిధ్యంవల్ల ఈపని నెరవేరగలదు. ప్రాతిపదిక కాంగ్రెసు కమిటీలో వివిధవర్గీయ సంస్థలకు ప్రాతినిధ్యం ఉండాలి. అంటే రైతులు, కార్మికులు, వర్తకులు, ఇతరవృత్తులవారు అందరూ అందులో సభ్యులుగా ఉండాలి. ఇట్టి నిర్మాణానికి అవసరమైన వివరాలన్నీ ఇక్కడ వివరించటం కష్టం. కాని సిద్ధాంత మది. నామనసు కది సమంజసంగానూ న్యాయంగాను కనపిస్తున్నది.

వర్గీయసంస్థలు ఏర్పడితేనేగాని అట్టి నిర్మాణం సాగదు. కనుక అట్టి వర్గీయసంస్థలను ముందుగా స్థాపించుకోవలసి ఉన్నది.

మీరు నన్ను అపార్థం చేసుకోకుండా ఒక్కవిషయం విశదంగా చెబుతాను. సామ్రాజ్యవాదవ్యతిరేకోద్యమాన్ని బయలుదేరదీయగల ఏకైక సంస్థ మనపార్టీయే యని నేను అహం చూపెడుతున్నా ననుకోకండి. ఇంకా సోషలిస్టువర్గాలు చాల ఉన్నాయి వివిధపద్ధతులతో వివిధవిధానాలతో కృషిచేస్తున్నాయి. కాని అన్నింటికీ లక్ష్యం ఒకటే. ఈ వివిధ సోషలిస్టు వర్గా లన్నీ కలిసి పనిచేయలేకపోతున్నా యని చాలమంది విమర్శిస్తారు. కాని అంతిమ ఫలితాన్ని సాధించటానికే అన్నివర్గాలూ కృషి చేస్తున్నాయి. అన్నివర్గాలూ ఒకే ఒక కార్యక్రమం అనుసరించి నడిస్తే మాత్రం ఇంకా ఎక్కువ విజయం లభిస్తుంది.

ఈ లక్ష్యసిద్ధికై అనుష్ఠితము లౌతున్న అన్ని మార్గాలలోనూ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అనుసరిస్తూన్న మార్గమే సర్వశ్రేష్ఠమని నేను విశ్వసిస్తున్నాను. మనకు కాంగ్రెసుతో సన్నిహితబాంధవ్యం ఉంది. కనుక మన యత్నాలు అవశ్యం ఫలిస్తాయి. 1930 జాతీయోద్యమానికి ముందు 1929 లోనే రాడికల్ శక్తులు కాంగ్రెసునించి చీలి బైటికి వెళ్ళిపోయాయి. అలాచీలి వెళ్ళిపోకపోయినట్టయితే కాంగ్రెసు ఇంకా బలవత్తరమయ్యేది. ఈనాడు మన లక్ష్యానికి చాల చేరువలో ఉండేవాళ్ళం.

కేవలం ఆదర్శాల ప్రచారం చేసినంతమాత్రాన సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల విజృంభణము సిద్ధించదు. ప్రజాబాహుళ్యంలో జొరబడి పని చెయ్యాలి. సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో అసగ్నవాచకులే కాదు, కార్మిక - కర్షకులు, దారిద్ర్య పీడితులైన మధ్యతరగతివారు కూడా ఉంటారు. వారిలో ప్రచారంచేసి, వారిలో రాజకీయ చైతన్యం కలిగించాలంటే మనం ముఖ్యంగా చేయవలసిన పని: వారి ఆర్థిక పోరాటాన్ని సమాయత్తం చెయ్యాలి. ఈ పని మనం ఇంతవరకూ చేయవలసినంత శ్రద్ధగా చేశాం కాదు. కాని ఈ విధమైన కార్యక్రమం చాల రాష్ట్రాలలో ఆరంభమైంది. కార్మిక - ఉద్యమంలో మనకేమంత కష్టంలేదు; ఇతర రాడికల్ వర్గాలతో చేతులు కలుపుతాం, కార్మిక ఉద్యమానికి బలం చేకూరుస్తాం. కాని రైతుల్లో మనం చేయవలసిన కృషి చాల ఉంది. ఇక్కడ బెంగాల్ రైతుల్లో తమ ఆర్థిక పరిస్థితులు చక్కబడవలెనన్న ఆందోళన ఉన్నట్టే కనిపిస్తుంది. అలాగైతే మనపని తేలిక పడ్డట్టే.

బెంగాల్ రైతుల్లో; కార్మికులలో మీరు చెయ్యవలసిన కృషి చాల ఉంది. బెంగాల్ రాష్ట్రంలో రైతులస్థితి అత్యంత విషాదకరం; రైతు సమస్యలు కూడా తీవ్రతములే. బెంగాల్ కాంగ్రెసు ఉద్యమం జమీందారుల ప్రాబల్యం కలది. పైపైన ఈ జమీందారుల ప్రాబల్యం కనిపిస్తూనే ఉంటుంది. అంతస్సులో అందుకు నాయకుల, ప్రజల వైరుధ్యం గోచరమౌతుంది. కాని వారికొక నిర్దిష్టమైన కార్యక్రమం లేదు; ఆదర్శం లేదు; ఇష్టం ఉన్నా లేకపోయినా ప్రస్తుత నాయకత్వానికి లోబడి ఉండవలసినదే.

కార్యక్రమాన్ని ఉపదేశించవలసిన బాధ్యత బెంగాల్ సోషలిస్టు పార్టీపై ఉంది. బెంగాల్ సోషలిస్టుపార్టీ అట్టి ఉపదేశంచేస్తే ఈ రాష్ట్రంలోని కాంగ్రెసు సభ్యులు చాలమంది ఆకర్షితులౌతారు. ప్రస్తుతం అకర్మణ్యంగా ఉన్న కాంగ్రెసు సంస్థకు చురుకుదనం వస్తుంది.

ఉన్నత కాంగ్రెసు వ్యక్తులు మన ఆశయాలయెడ సానుభూతి కలిగే ఉన్నారు. పల్లెలలో పనిచేస్తూన్న కాంగ్రెసు కర్మఠులతో ప్రసంగించాను. వారికి నేనొక కార్యక్రమం నిర్ణయించి నచ్చజెప్పటం చాల కష్టమనిపించింది. కార్మిక కర్షకులచేత [illegible] పెట్టుబడిదారీ సమాజానికి విరుద్ధంగా ఆందోళన చేయిస్తూ వారి ఆర్థిక స్థితులను చక్కబరచేందుకు ప్రయత్నం చెయ్యాలి; సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు తద్వారా విజృంభిస్తాయి. ఈ విషయం వారికి నేను నచ్చజెప్పలేకపోయాను. అంతమాత్రాన వారికి సామ్రాజ్య వాదులతో ప్రత్యక్ష సంబంధం లేదుగదా? అని వారు ప్రశ్నిస్తారు. నిజానికి సామాన్య ప్రజలను తర్జించి, దోచేస్తున్నది పెట్టుబడిదారీ సమాజం మాత్రమే. తద్వారా వారు నానాటికీ మరింత బీదవారై పోతున్నారు. కనుక వారు పోరాడవలసినది ఈ పెట్టుబడిదారీ సమాజంతోనే. కాని ఈ పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్య తత్వంలో ప్రధానభాగం ఐవుంది. ఈ సంగతి పలు ముఖాలుగా చర్చించి రుజువు చేయవచ్చు. కాని ఆ విషయాలన్నీ ఇక్కడ అప్రస్తుతాలు.

నేను ఉదహరించిన గ్రామప్రచారక కాంగ్రెసు కర్మఠులు మన ఆదర్శాలయెడ సానుభూతి చూపించారు. కేవలం తర్కంతో మనిషిలో విశ్వాసాన్ని కుదురుకొల్పలేదు. అనుభవంకూడా ఉండాలి. మనం సూచిస్తూన్న కార్యకలాపంలో కాంగ్రెసు కార్యపరులకు అనుభవం తక్కువ. బీహార్‌లో, బెంగాల్‌లో, సంయుక్తరాష్ట్రాలలో వర్గపోరాటం ఉంటే, కాంగ్రెసువారు ఆశ్రమాలద్వారా, ఆసుపత్రులద్వారా, ఖాదీకేంద్రాలద్వారా పనిచేశారు. మనం ఇప్పుడు వారికి మార్గం చూపాలి; వారు మనల్ని అనుసరిస్తారు.

ఇప్పటికి మన పార్టీ కర్తవ్యమేమో క్లుప్తంగా వివరించాను. ఇక మనపార్టీని అభివృద్ధిచేసుకోవటం గురించి చెబుతాను. ప్రస్తుతం మనపార్టీ

ఆవశ్యకత ఎంతైనా ఉంది. పరిస్థితులలో మార్పులు సంభవిస్తూన్న కొద్దీ మన విధానాలను కూడా తదనుగుణ్యంగా సరిదిద్దుకుంటూ పోవాలి. దేశంలోని ఇతరసోషలిస్టు వర్గాలనించి మనం విడిగా ఉండవలెనని నేను చెప్పను. అలా విడిగా ఉండటం మన ఆశయాలకే భంగకరం. ఈ వివిధవర్గాల సమైక్యత లేకపోతే మన లక్ష్యాలు తీరని కోరికల్లాగే ఉండిపోతాయి. కనుక ఒంటిమిట్ట రామలింగంపద్ధతి పనికిరాదు; అనవసరపు వివాదాలు వద్దు. సాధ్యమైనంత వరకు ఇతరసోషలిస్టు వర్గాలతో సమరసంగా వ్యవహరిద్దాం, ఏవో అల్ప విభేదాలు ఉంటే ఉంటాయి. అయినా మన అందరి లక్ష్యమూ ఒక్కటే కదా! ఆసందర్భంలో ఆ యితరసోషలిస్టువర్గాలకుకూడా నేను అదే సమరస విధానం అనుసరించవలసినదిగా సలహా యిస్తున్నాను. విమర్శించవద్దని నేను చెప్పను. నామటుకు నేను విమర్శించకుండా ఉండలేను. వారికీ మనకూ సమానమైన ఆదర్శాలు కొన్ని ఉన్నాయి. వాటిని సిద్ధింపజేసుకునేందుకైనా వారు కలిసి పనిచేయవలసి వున్నది. ఎప్పటికైనా మన మందరమూ కలిసి ఒకే సంస్థగా పరిణతి చెందవలె. ఈసంగతి మనమంతా గుర్తుంచుకోవాలి. ఆ ఏకైకసంస్థ స్వరూపాన్ని నేనిప్పుడు నిర్వచించలేను. ఇప్పుడు నిర్వచించ వలసిన సమయమూ కాదు.

ఇక నేను సెలవు పుచుచ్చుకుంటాను. ఈరాష్ట్రంలో మీరు నిర్వర్తించవలసిన విధులు కష్టతరములే; నాకు తెలుసు. అయినా ఒక్కసంగతి మీరు మనసులో ఉంచుకోండి; అరెండోపార్టీ మన మార్గాన్ని సుగమం చేస్తుందని ఆశించలేము. మనపద్ధతులు సక్రమమైనవైతే ఎట్టిపరిస్థితులలో నైనా మనం ముందుకు పోగలం.

శ్రద్ధగా సావధానులై నామాటలు విన్నారు; మీకు నా ధన్యవాదాలు! ఇంతగా కాలవిలంబనము చేసినందుకు క్షంతవ్యుడను.

# 3

## గాంధీనాయకత్వము - కాంగ్రెసు సోషలిస్టుపార్టీ (1940)

ఇటీవల కొన్ని నెలలనించీ కాంగ్రెసుసోషలిస్టుపార్టీ కాంగ్రెసుపట్ల అనుసరిస్తూన్న విధానాన్ని కొందరు తీవ్రంగా నిరసిస్తున్నారు, నిందిస్తున్నారు. మనసులో కోపంలేకుండా ఆలోచించుకుంటే మా విధానం సమంజసమైనదని వారు తెలుసుకోగలరు. కాని వారు కోపం లేకుండా ఆలోచించుకోలేరు. ప్రస్తుత స్థితిగతులు అలాంటివిమరి! పరస్పర అనుమానాలు రెచ్చిపోయాయి ఒకరిమీద ఒకరికి కిట్టటంలేదు. బోలెడన్ని సమస్యలు తికమకగా ఉన్నాయి. తమతో ఏకీభవించనివాడికి ఏవో లోపాయికారీ ఉద్దేశాలు ఉన్నాయని కూడా ప్రచారం చేస్తున్నారు. కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వం వాంఛించి నేను ప్రవర్తిస్తూన్నానని కొందరంటున్నారు. అలా అంటూన్న అనామపత్రికల ఉద్యమం ఎంతగా క్రిందికి దిగజారిపోయిందో ఊహించుకోవచ్చు.

కొంచెం కటువుగాధ్వనించినా ఇక్కడ రవంత స్వవిషయం చెప్పకోక తప్పటంలేదు. కొందరు మిత్రులు నేను కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వానికి లోభపడుతున్నానని అంటున్నారు. కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వం నాకూ తదితర సోషలిస్టుపార్టీ ప్రముఖ వ్యక్తులకూ చాల కాలంనించీ అడక్కుండానే ఇస్తామంటున్నారు. 1936 లో నా సభ్యత్వానికి నేనే బుద్ధిపూర్వకంగా రాజీనామా యిచ్చాను. ఆ తరవాత వారు నాకు ఆ సభ్యత్వాన్ని ఇస్తామన్నప్పుడల్లా నిరాకరించాను. హరిపురా కాంగ్రెసులో ఆచార్యనరేంద్రదేవ్‌కూ అచ్యుత పట్వర్ధన్‌కూ కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వాన్ని ప్రసాదించారు. కాని వారు స్వీకరించలేదు. తరవాత మళ్ళీ బాబు సుభాస్‌చంద్రబోస్ కాంగ్రెసు అధ్యక్షుడైనప్పుడు కూడా వారికి కాంగ్రెసు వర్గంలో సీట్లు ఇస్తామన్నారు. కలకత్తాలో మళ్లీ డా. రాజేంద్రప్రసాద్ తన కార్యవర్గంలో చేరవలసిందిగా మమ్మల్ని కోరాడు. కొంకాయి

సమావేశంలో కూడా మేము అహూతులమైనాం. కాని మా అందరి తరఫునా నరేంద్రదేవ్ అపదవులను నిరాకరించాడు.

మేం మా సభ్యత్వాన్ని నిరాకరించామంటే కాంగ్రెసుయెడ గౌరవం లేక కాదు. కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వం జాతీయగౌరవ ప్రదమైనది. మా నిరాకరణము మా పార్టీ నాయకత్వానికి భిన్నమూ కాదు.

ఇక ప్రస్తుతానికి వద్దాం. మేము ప్రస్తుతం అనుసరిస్తూన్న విధానం గాంధీవాదానికి లొంగిపోవటంగా చాలమంది విమర్శిస్తున్నారు. "సామ్యవాదం" "గాంధీవాదం" అన్నది కాదు ప్రస్తుత సమస్య. సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనేందుకు ఒక జాతీయసమరానికి అయత్తులమై సమర రంగంలో దుముకవలసి యున్నది. ఇది కేవలం సోషలిస్టులపనే కాదు. సోషలిస్టులు గాంధీవాదులు తదితరులు అంతా పాల్గొనవలసిన ఒక జాతీయ కార్యక్రమం. కనుక జాతీయైక్యత స్థిరపడి జాతీయసమరం సాగవలెనంటే కాంగ్రెసులో ఐక్యత ఉండాలి- అని మేము చెప్పాము. అదే మిగిలిన వారికి చాల తప్పు అయింది. అంతేకాదు కాంగ్రెసులో ఐక్యత చెడకుండా వుండాలంటే కాంగ్రెసునాయకత్వంలో మార్పురా కూడదని మేము చెప్పాం; అదికూడా ఇతర్లకు తప్పుగానే తోస్తున్నది. ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో కాంగ్రెసునాయకులలో చీలికలు కల్పించి కాంగ్రెసు ఐక్యతకు భంగం కలిగించరాదని మేము ఉద్దేశపడ్డాం. కేవలం ఒక్క కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మంచికే కాక (అంటే వామపక్ష క్షేమానికే గాక) వామపక్ష - మితవాదివర్గ - సమ్మిశ్రిత సమస్తకాంగ్రెసు సంస్థక్షేమాన్ని మేము కాంక్షించి వ్యవహరించాం. అదికూడా తప్పుగానే పరిగణింపబడ్డది. కొంతమంది వామపక్షీయులు తమ తమ పార్టీలు ఒక పెద్ద పార్టీ అంగాలవంటివన్న సంగతి మరచిపోయారు. తమతమ పార్టీలే సంపూర్ణ సంస్థలని భావించుకుంటున్నారు. తల్లిసంస్థకూ తమ పార్టీలకూ ఏవిధమైన సంబంధంలేదనీ-తల్లిసంస్థనించి పూర్తిగా పృథక్కృతయిలనీ అనుకుంటున్నారు- శరీరావయవాలకూ శరీరానికీ సంబంధం లేదనుకున్నట్టు. ఇది చాల అపాయకరమైన పరిణామమని నా నమ్మిక. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కాంగ్రెసుకు పోటీసంస్థగా తయారు కావాలన్న ఉద్దేశంతో స్థాపితం కాలేదు. కాంగ్రెసులోనేఉండి, కాంగ్రెసును బలపరచి, కాంగ్రెసు

విధానాలను పెంపొందించి తగు విధంగా రూపొందించటానికి సోషలిస్టు పార్టీ అవసరం. ఈ పార్టీ మొలకెత్తి ఈ అయిదేళ్ళనించీ కాంగ్రెసు విధానంలో చాలవరకు అభ్యుదయాన్ని తీసుకువచ్చింది. కాంగ్రెసు తీర్మానాలలో చాలవరకు మా ప్రచార ప్రాబల్యం కనిపిస్తూనే ఉంది. 1934 నించీ ఈ పార్టీ ఎన్నో చెప్పుకోతగ్గ పనులు చేసింది. 1934లో దేశపరిస్థితులు కుంగిపోయాయి. శాసనోల్లంఘనోద్యమం ఉపసంహృతమైంది. పార్లమెంటరీ విధానంలోకి చాలమంది పరుగులు పెట్టారు. అటువంటి సమయంలో చురుకైన వామపక్షం కాంగ్రెసులో బలుపు చేసింది; నాయకుల పైనూడ దాని ప్రభావం ప్రాకింది. రైతుసంఘాల సమీకరణ కార్యక్రమం మొదలుగావించి కాంగ్రెసు ముందు పెట్టాం. కాంగ్రెసు కార్యవర్గం దాన్ని మంజూరు చెయ్యలేదు. కాని చాలమంది కాంగ్రెసువ్యక్తులు, అనేక రాష్ట్రాలు తమతమ సంఘాలు మా కార్యక్రమాన్ని ఆమోదించారు. 1920 నాటి గాంధీజీ కార్యక్రమమే ఈనాడుకూడా కాంగ్రెసు కార్యక్రమమైంది. మా ప్రయత్నాలు ఫలించలేదు. కొత్త నాయకులు లేచారు. కాని ప్రముఖ నాయకత్వం పాతవారిచేతుల్లోనే ఉండిపోయింది. ముప్పయి సంవత్సరాలనించీ పాత నాయకులే చుక్కాని తిప్పుతున్నారు, ప్రజల్లో కొత్తజీవం పోశారు; కొత్తబలం చేకూర్చారు; కొత్తచైతన్యం తెచ్చారు. వాళ్ళు అంతా ఒక ముఖ్యమైన జాతీయ శక్తిగా ఉన్నారు. ఇప్పటికీ దేశంలో వారికే పలుకుబడి జాస్తి.

అటువంటప్పుడు– ఈ క్లిష్టపరిస్థితులలో మన విధియేమిటి? ఇంకొక అయిదు సంవత్సరాల కాలవ్యవధి ఉంటే కాంగ్రెసులోనూ, దేశంలోనూ మన పలుకుబడి అధికమయ్యేది; కొత్తనీరు పాతనీటిని తోసిపారేసేది. శ్రీ సుభాసు చంద్రబోస్ మనసలహా ప్రకారం నడుచుకున్నట్టయితే– కమ్యూనిస్టులూ, తదితర వామపక్షీయులూ అతనికి అదేసలహా ఇవ్వగలిగి వున్నట్టయితే– ఈనాడు వామపక్ష నాయకుల పలుకుబడి జాస్తిగా ఉండేది. కాంగ్రెస్ అధ్యక్షపదవినించి రాజీనామా ఇయ్యవద్దని మనం బోసుబాబుకు సలహాయిచ్చాం. ఆయన మనమాట వినినట్టయితే ఈనాటి పొరపాటువలన దుష్టఫలితాలు లేకుండా పోయేవి; ఆయన కార్యవర్గంలో అధిక సంఖ్యాకులుగా వామపక్షీయులు చేరేవారు. సుభాస్‌బాబు అధ్యక్షుడుగా ఉండేవాడు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ కార్యదర్శిగా ఉండేవాడు. ఆతడే

చంద్రబోస్, ఇంకా ఇద్దరు వామపక్షీయులు కార్యవర్గ సభ్యులుగా ఉండేవారు. ఇందుకు పాతనాయకులు ఒప్పుకునేవారే. కాని అలా జరుగలేదు.

అటువంటి పరిస్థితులలో మనవిధియేమిటి ?— అని ప్రశ్న వేసుకున్నాం. దానికి జవాబు తెలుసుకునేముందు మరొక ప్రశ్న వేసుకుందాం. ఒక జాతీయ సమరం సాగించటానికీ జాతీయైక్యతను పోషించటానికి సమర్థమైన సంస్థ కాంగ్రెసు తప్ప మరొకటి ఏదైనా ఉన్నదా? చరిత్ర అంతా తిరుగవేయండి. పరస్పరవిరుద్ధమైన శక్తుల సంఘర్షణమే కనిపిస్తుంది; తత్ఫలితంగా జాతీయైక్యతావకాశాలు సన్నగిలినవి. ఈనాడుకూడా ఒక్క కాంగ్రెసు తప్ప మనసాంఘిక రాజకీయ జీవితరంగంలో ఐక్యత సాధించగలసంస్థలేదు. సామ్రాజ్యతత్వాన్ని పలుముఖాలుగా, బలోపేతంగా కాంగ్రెసు ఇదివరకు ఢీకొన్నది; ఇప్పుడు ఢీకొంటున్నది; ఇకముందుకూడా ఢీకొంటుంది. ఈ మాట కమ్యూనిస్టులకు కటువుగా ఉండవచ్చు. భారతదేశం విజయవంతంగా సామ్రాజ్యవాదంతో యుద్ధంచేయవలెనంటే— ఆయుద్ధం త్రివర్ణపతాకం క్రిందనే జరగాలి. రైతులనీ, మజ్దూర్లనీ, యువకులనీ, విద్యార్థులనీ ప్రజలు విడివిడిగా మాటాడుతూంటారు— వీరంతా కాంగ్రెస్‌నించి వేరైనట్లు. కిసాన్ సభ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, విద్యార్థి ఫెడరేషన్— ఇవన్నీ ఉన్నాయి. వీటిశక్తి భవిష్యత్తులో సూచితమౌతుంది. కాని ప్రస్తుతంమాత్రం బహుకొద్ది రాష్ట్రాల్లో తప్ప ఈ సంస్థలనిర్మాణము బాల్యదశలోనే ఉంది. జాతీయసమరంలో వాటికిగల భారము గొప్పదే. వాటినిచక్కగా నిర్మించి, జాతీయసమరంలో అవి ఇంకా ఎక్కువ భాగాన్ని నిర్వహించగలిగేట్టు చేయుటయే సోష లిస్టుల— ఇతర అభ్యుదయవాదుల కర్తవ్యం. సమరంలో అవి కాంగ్రెసుకు సహాయభూతాలు. యుద్ధ నాయకత్వం కాంగ్రెసుది. ఈ సంస్థలసహాయం కాంగ్రెసుకు బలంఇస్తుంది. కాని ఈ కిసాన్‌సభగాని, ట్రేడ్ యూనియన్‌గాని ప్రస్తుతం తామున్నస్థితిలో సామ్రాజ్యతత్వంతో ఢీకొని విజయం పొందలేవు. ఆపని కాంగ్రెసు చెయ్యాలి.

ఇవీ మనల్ని ఎదుర్కొంటూన్న యథార్థ పరిస్థితులు. ఒక్క కాంగ్రెస్ ద్వారానే దేశానికి ముక్తి. కాంగ్రెస్ అంటే యావత్ కాంగ్రెస్ సంస్థ, శరీరంనించి ఊడబెరుకబడిన ఒక అవయవానికి తన సొంత శక్తి, బలం ఉండనేరవు. పైగా దానికి ప్రాణం కూడా ఉండదు.

ఒక జాతీయసమరాన్ని సాగించేందుకు ఆయత్త పడుతూన్న స్థితిలో ఉన్నామని పైన చెప్పాను. ఈ సమరం సాగించ వలసినది కాంగ్రెసే అన్నాను. ఇంకా కొన్ని విషయాలు కూడా పరిశీలిద్దాం. కాంగ్రెస్ నాయకత్వం గాంధిజీ చేతుల్లో ఉంది. ఇవాళ కాంగ్రెసు ఒక సమరం సాగించేట్టయితే అది గాంధిజీ ఇచ్చిన కార్యక్రమం ప్రకారం సాగుతుంది. ఆ కార్యక్రమాన్ని మనం విమర్శించవచ్చు; కాని కార్యక్రమాన్ని మనం రచించటానికి వీల్లేదు. కనుక ఎవరు ఇష్టపడినా, ఎవరు ఇష్టపడకపోయినా సమరవ్యూహం గాంధిజీ సిద్ధాంతానుగుణ్యంగానే రచితమౌతుంది.

ఆవ్యూహానికి మనం అంగీకరించామంటే గాంధీవాదానికి లొంగిపోయినట్టు అర్థం కాదు; సామ్యవాద ప్రచారానికీ మేము నీళ్ళు వొదులుకోలేదు. కిసాన్ సభలలోనూ, ట్రేడ్ యూనియన్ లలోనూ పని చేయటం మానుకోలేదు; కార్మిక - కర్షకోద్యమాలను వృద్ధి చేయటం విరమించుకోలేదు. గయా కాటన్ టెక్స్టయిల్ మిల్ లో యుద్ధభత్యం కోసం ప్రప్రథమంగా సమ్మె కొనసాగినది కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకత్వాన. దాల్మియా కార్మికులు యుద్ధ భత్యాన్ని బడయగలిగినది సోషలిస్టుపార్టీ నాయకత్వం మూలముననే. బీహార్ లో, సంయుక్త రాష్ట్రాలలో, బొంబాయిలో, బెంగాల్ లో ఇంకా అనేక ఇతర ప్రదేశాల్లో సోషలిస్టు పార్టీ సభ్యులు కార్మికుల పోరాటాలను ఇదివరకు లాగే చురుగ్గా సాగిస్తూనే ఉన్నారు; రైతు ఉద్యమాలనుకూడా సాగిస్తున్నారు. ఎచ్చటనైనా కార్మిక కర్షకులకు రవంత యిబ్బందులు కలిగాయంటే అందుకు కారణం: ఇటీవల పార్టీ శక్తులన్నీ జాతీయ సమరానికి ఆయత్త పడు పరిస్థితులలో ఉన్నాయి. అందుకుగాను కాంగ్రెసు కమిటీల స్థాపన, తీవ్ర ప్రచారము సాగించుట, వాలంటీరు దళాల నిర్మాణము - ఇత్యాది కార్యాలలో నిమగ్నమై ఉన్నది పార్టీ.

కాని మనపార్టీస్వయంగా నిర్ణయించిన కార్యక్రమాన్నిబట్టి, పద్ధతుల ననుసరించి జాతీయసమరం సాగదు; పరిస్థితులు అలాలేవు. నిజమే. మనపని మనం చేస్తాం; మన ఆశయాలు మనం ప్రచారంచేస్తాం కాని ఒక సత్వరసమరాన్ని కాంక్షిస్తూనే ఉన్నాం. ప్రస్తుత నాయకుల ద్వారా తప్పమరి

ఏయితర మార్గంవల్లా సమరం ఆరంభం కాగల అవకాశాలు లేవు. మనం ఆ సంగతి తెలిసివుండీకూడా ప్రస్తుత నాయకత్వాన్ని ధిక్కరించటం, అపకీర్తిపాలుచేయటం, దుర్బలపరచటం- ఇలాంటి పనులకు దిగటం ఉన్మాదం కాదా? అలా చేసినందువల్ల సమరాన్ని సమాయత్తం చేస్తున్నామా? ఆటంకపరుస్తున్నామా?

'నాయకుల ఐక్యత' 'సంయుక్త జాతీయసమరం' అంటూ చాలసంవత్సరాలనించీ ప్రసంగిస్తూవచ్చాం. ఆ ప్రసంగాలు, సిద్ధాంతాలు ఈ సమయాన ఆచరణలోనికి రానున్నవి. ఇట్టిసమయంలో ధైర్యసాహసాలు లేని విప్లవవాదులు వెనక్కు జారుతున్నారు. సంయుక్త జాతీయసమరానికి నాయకుల ఐక్యత అవసరం. ఈమాట కమ్యూనిస్టులు... కాంగ్రెసు పార్లమెంటరీ కార్యక్రమంలో నిమగ్నమైనప్పుడు, ఇంకా సమరందూరాన ఉన్నప్పుడు... పలుసార్లు ఉచ్చరించారు. కాని ఇప్పుడు కాంగ్రెసు పార్లమెంటరీ విధానానికి తిలాంజలిచ్చి సమరాయత్తమౌతూంటే కమ్యూనిస్టు సిద్ధాంతులు తమసిద్ధాంతాల నన్నిటినీ మంటగలిపి ప్రస్తుత నాయకత్వాన్ని విమర్శిస్తున్నారు. ఈ విధంగా వారు జాతీయ సమరాభివృద్ధి నిరోధకులౌతున్నారు.

మనం కొన్ని హద్దులలో పనిచేయవలసిఉన్నాం; ఆసంగతిగుర్తించటం అవసరం. ఆహద్దులను నిర్లక్ష్యం చేసినందువల్ల అవి ఇంకా పెరిగిపోతాయి. ప్రసుతనాయకత్వంతో మనం దెబ్బలాటకు దిగటం వాంఛనీయం కాదు; అపాయకరముకూడా. సకలవర్గాలూ పాల్గొనే ఒక అఖండ జాతీయసమరానికి గాంధిజీ ఉద్యుక్తుడౌతూంటే ఆయనతో మనం యుద్ధానికి దిగటం ఆత్మహత్యచేసుకోవట మన్న మాట. అంతిపని ఆయన ఒక్కడే చేయగలడు. సమరానికి దేశం సిద్ధమయ్యే నిమిత్తం వలసిన సర్వసహాయాలూ మనమాయనకు చెయ్యాలి. ఆయన షరతులకు మనం అంగీకరించాలి. కాని తీరా ఆయన సమరం లేవదీయకపోతే మనం ఆయన్నువిడిచి వచ్చి జాతీయ సమరానికి ప్రజాళిని ఆయత్తపరచే బాధ్యతను చేతనయితే మనమే నెత్తిపై వేసుకుందాం.

కాంగ్రెసు చెప్పుచేతల్లోనే నడుస్తూంటే 'కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ' అంటూ వేరేమరొక పార్టీకూడా దేనికి? అని చాలమంది అంటున్నారు. వారికి ఒకమనవి చేస్తాను : మన మెప్పుడూ ఉద్యమం

యొక్క శ్రేయస్సును కనిపెట్టి వుండాలి; అంతేగాని ఆ స్వరూపం మన మద్దెలే వాయించుకుంటూ ఉండరాదు. మనం అవలంబించే విధానం మంచిదైతే తద్వారా మన పార్టీకి బలం చేకూరుతుంది; 1934 లో వలె మళ్ళీ ఈ నాడు కూడా... మార్క్సు సిద్ధాంతాల్ని ప్రచారం చేస్తూన్న అన్ని పక్షాలలోనూ ఒక్క కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకే ఆ సిద్ధాంతాలను భారతదేశంలో ఎలా ఆచరణలో పెట్టాలో తెలుసు... అని నిర్ధారణ ఔతుంది. ఆ విషయమంతా ఇక్కడ చర్చించటం అప్రస్తుతం; కాని ఈ అయిదు సంవత్సరాలనించి క్లిష్టపరిస్థితులు పొడసూపినప్పుడల్లా, ఏమి చెయ్యాలో దారి చూపించినది సోషలిస్టు పార్టీయే ఇతరులంతా తమ పొరపాట్లు తెలుసుకుని సోషలిస్టు పార్టీ పంథా అనుసరించారు. ఉదాహరణాలు చెబుతాను: 1934 లో కమ్యూనిస్టులు కాంగ్రెసునించి చీలిపోయారు; చాల తెలివితేటలుగా ప్రవర్తించా మనుకున్నారు. మేము మాత్రం కాంగ్రెసులోనే ఉన్నాం. కాంగ్రెసును ఉద్ధరించి, శక్తివంతం చెయ్యాలన్న తలంపు మాది. 1936 లో వాళ్ళుమళ్ళీ వచ్చి చేరారు. వారా పని చేసినది కాంగ్రెసును బలపరచటానికో, దాన్ని నాశనం చెయ్యటానికో — వారి ఉద్దేశమేమిటో కాలమే నిర్ణయించ గలదు. 1936 లో కాంగ్రెసువారు మంత్రి పదవుల్ని స్వీకరించ వచ్చునన్న తీర్మానాన్ని సోషలిస్టు పార్టీ ప్రతిఘటించింది. కమ్యూనిస్టులు మొట్టమొదట స్వీకరింప వచ్చునన్నారు కొన్ని షరతులు పెట్టి కాంగ్రెసులోని వామపక్ష శక్తులన్నీ సోషలిస్టుల అభిప్రాయాన్నే అనుసరించాయి. అప్పుడు కమ్యూనిస్టులు కూడా ప్లేటు మార్చేశారు తరువాత ఎన్నికలలో సోషలిస్టులు హృదయపూర్వకంగా కాంగ్రెసుకు తోడ్పడ్డారు. ఒక్క నియోజక వర్గంలో మాత్రం కమ్యూనిస్టులు కాంగ్రెసును ప్రతిఘటించారు. ఎందుకు? తమ ప్రాముఖ్యత ప్రకటించుకోటానికీ, కాస్త తమడప్పు వాయించుకోటాని. త్రిపురీకాంగ్రెసులో వారు ఐక్యతను గురించీ, నాయకుల సమైక్యత ఉండలేదనీ ఆవేశంగా ఉపన్యాసా లిచ్చారు. కాని మళ్ళీ మేము ఒకళ్ళమే అయిపోతా మేమోనన్న భయంచేత కార్యరంగలో ప్రవేశించారు; ఆశయ విరుద్ధంగా ప్రవర్తించారు. కలకత్తాలో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ శ్రీ సుభాస్ చంద్రబోసుకు ఒక సలహా యిచ్చింది; కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఇచ్చిన రాజీనామా ఉపసంహరించుకోమని.

అట్టి సలహా యివ్వగల ధైర్యం కమ్యూనిస్టులకు లేకపోయింది. నోరు మూసుకుని కూర్చున్నారు. ఇటీవల కాంగ్రెసు సోషలిస్టుపార్టీ independence pledge ని అంగీకరించలేదు. కమ్యూనిస్టులు దాన్ని దిగమింగి కూచున్నారు. వాళ్ళు ప్రతిజ్ఞను సారం సుబుద్ధితో వ్యవహరిస్తున్నారని నలుగురూ అనుకుంటారు. లేకపోతే మోసం బయటపడవచ్చు. గాంధిమహాత్ముడు సమరాన్ని సాగించకనే పోవచ్చు. మౌలానా అబుల్ కలామ్ అజాద్‌ను కాంగ్రెస్ అధ్యక్షుని చేయవలెనన్న తీర్మానాన్ని సోషలిస్టుపార్టీ బలపరచింది. కమ్యూనిస్టులు తటస్థంగా ఊరుకున్నారు. మౌలానాఅజాద్‌కు వోటుచేస్తే కాంగ్రెసు వర్కింగ్ కమిటీ పాలసీని అంగీకరించినట్లు ఔతుందని కామ్రేడ్ పి. సి. జోషి ఒక పబ్లిక్ ప్రకటన చేశాడు ఎంత విచిత్రమైన తర్కం! ఆ మెరి కాలో కమ్యూనిస్టులు రూజ్‌వెల్టుకు వోటుచేశారు. అంటే వారు పూర్తిగా రూజ్‌వెల్టు పాలిసీని అంగీకరించినట్టే అర్థమా? అధ్యక్షుని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు ఎవర్ని ఎన్నుకుంటే దేశానికి ఎక్కువ ఉపయోగమో ఆలోచించుకుని వోట్లు ఇస్తాం. అధ్యక్షుని పాలసీ సర్వదా తమకు అంగీకార యోగ్యముగా ఉండవలెనంటే ఒక్కటే మార్గం ఉంది. ప్రతిసారీ తమపార్టీ లేక వర్గంలోనించే ఒక మనిషిని తెచ్చి అధ్యక్షపీఠంమీద కూచోబెట్టుకోటమే. వర్కింగ్ కమిటీతో తనకు విభేదాలు ఉండవచ్చు. ఆ విభేదాలను వెల్లడించుటకు వెయ్యినొక్క మార్గాలున్నాయి సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ ఆపనిచేస్తూనే ఉన్నారు. మౌలానా అజాద్‌కు వోట్లు ఇవ్వటం వర్కింగ్ కమిటీతో తనకు గల విభేదాలను సూచించే మార్గం జోషికి మరిలేకుండా చేస్తుందా? 'మౌలానా అజాద్ సామ్రాజ్యవాదుల ఏజెంటు' అని మాత్రం అతనిచేత అనిపించేది కాదు. ఇంకొక్క ఉదాహరణం చెబుతాను. Anti Compromise Conference (సమాధాన వ్యతిరేక సమావేశం)తో కాంగ్రెసు సోషలిస్టులు ఏవిధమైన సంబంధమూ పెట్టుకోలేదు. కమ్యూనిస్టులు దానియెడ తాటస్థ్యం వహించారు. వారు మాటిమాటికీ ఇలా తాటస్థ్యం వహించటం వారి రాజకీయ నపుంసకత్వాన్ని రుజువు చేస్తున్నది.

ఈ విషయ మింతగా వివరించాలన్న తలంపు నాకు లేదు. ఉదాహార

దాలు ఇంకా చాల ఉన్నాయి. అవన్నీ మేము కార్యక్రమం విడనాడి ఎత్తుపైయెత్తులకు దిగేట్టయితే వెల్లడించ దగినవి.

ఇక మన ప్రధానాంశానికి వద్దాం. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అనవసరమైన సంస్థకాదు. జాతీయసమరాన్ని అయత్తపరచటంలో ప్రముఖస్థానం దానిదే సమరంలో అగ్రసరమూ అదే. కాంగ్రెసు కమిటీలో ఒక చురుకైన అవయవంలా ఇదివరకు వల్లే ఇకముందు కూడా అది వుండవలసినదే. నిర్మాణ కార్యక్రమంలోనూ, అందోళనలు కొనదీయటం లోనూ అది కాంగ్రెసుకు మార్గదర్శకంగా ఉండవలసినదే. ప్రజా బాహుళ్యంలో సోషలిస్టుపార్టీ ప్రచారంచేసి సమరానికి పునాదులు నిర్మిస్తుంది. విమర్శనల మూలంగా, ప్రచారం ద్వారా కాంగ్రెసు విధానాలను సవ్యమైన మార్గాల్లో నడిపిస్తుంది కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఇన్నాళ్ళనించీ ప్రబోధిస్తోన్నసిద్ధాంతాలను ఆచరించి చూపగల సమయం ఆసన్నమైంది.

# 4

## ఎక్కడికి వెడుతోంది కాంగ్రెస్? స్వరాజ్య స్వరూపం (1940)

ఎక్కడికివెడుతున్నాంమనం; ఎక్కడికివెళ్ళాలని కోరుతున్నాం? ఇవి అర్ధరహితమైన ప్రశ్నలుకావు. కేవలం సాహిత్య వినోదంకోసం చర్చించుకునే సమస్యలు కావు. ఆప్రశ్నల జవాబులమీద మన దేశభవిష్యత్తు, కాంగ్రెసు వారు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెబుతూన్న లక్షలాది ఆమాయక ప్రజల భవిష్యత్తు ఆధారపడిఉన్నాయి.

ప్రజాపరిషత్తు అచిర కాలంలోనే స్థాపితం కాగలదు. స్వాతంత్ర్య శిఖరగాములమైన మనమిప్పుడెక్కవలసిన మెట్టు అదే. ఎప్పుడో మనం చచ్చిపోయాక అది స్థాపితమౌతుందనుకోనక్కర్లేదు. అద్యతన భవిష్యత్తు లోనే దాన్ని నెలకొల్పుతారు. దాన్నిగూర్చి మనమందరమూ మనకు తోచిందిఏదో చెప్పుకోవాలనుకుంటాం.

ప్రజాపరిషత్తు ఏమిచేస్తుంది? మనం మొదట వేసుకున్నామే, ఆప్రశ్న అకే జవాబు చెబుతుంది. స్వతంత్ర భారత సంఘ సంస్థాపనకు ప్రాతిపదిక

సిద్ధాంతాలను నిర్వచిస్తుంది. ముందుతరాలవారి స్వాతంత్ర్యానికి, అభ్యుద యానికీ, సౌఖ్యసంపదలకూ పునాదులు నిర్మిస్తుంది.

## రంగంమీద నటకులు

అయితే ప్రజాపరిషత్తుఅనే రంగంమీద ఎవరానటకులు? ప్రజలలో అధిక సంఖ్యాకుల ఆదరాభిమానాలను చూరగొన్న కాంగ్రెసుకే ప్రజాపరి షత్తులో ప్రముఖస్థానం - అని మానమ్మిక; కనుక ఒక్క అల్పసంఖ్యాక సమస్యల విషయంలోతప్ప మిగిలిన అన్నివిషయాల్లోనూ కాంగ్రెసుమాటే చలామణిఔతుంది. మైనారిటీసమస్యలవిషయంలో మైనారిటీ జాతులదే పైచేయిగా ఉంటుంది. కాంగ్రెసుతో ఇతర్లకు అభిప్రాయభేదాలురావచ్చు కదా: కనుక కాంగ్రెసు పైప్రశ్నలను గూర్చి విరివిగా ఆలోచించి తగిన సమాధానాలకు రావలసి ఉన్నదికాదా? ఈసందర్భంలో ఒక్క కాంగ్రెసు నాయకులకేకాదు నేనీవిజ్ఞప్తి చేస్తున్నది; ప్రతికాంగ్రెసువాదికిన్నీ.

ఈప్రశ్నలనుగూర్చి చర్చించేముందు కాంగ్రెసు ప్రకటనలద్వారా బయలుపడినవారి సిద్ధాంతాలను మీముందు పెడతాను. 'సంపూర్ణ స్వరా జ్యము' అన్నది మొదటిసూత్రం అందుకే కాంగ్రెసు కృషిచేస్తున్నది. అది ప్రధానలక్ష్యం.

## ఆర్థికస్వాతంత్ర్యం

రెండవది ఆర్థికస్వాతంత్ర్యం. కాంగ్రెసు కాంక్షిస్తూన్న స్వరాజ్యం అంటే 'ప్రజారాజ్యం' అని కరాచీ కాంగ్రెసులో నిర్వచితమైంది. రాజ కీయ స్వాతంత్ర్యంతోపాటు ఆర్థికస్వాతంత్ర్యంకూడా సముపార్జితమైతేనే గాని 'ప్రజారాజ్యం' అన్నపదానికి అర్థం ఉండదు- అనికూడా కాంగ్రెసు ఒప్పుకున్నది. కాని ఆర్థికస్వాతంత్ర్యంకూడా కావాలని కేవలం మాటల్లో లక్ష్యాన్ని సూచించారేతప్ప ఆ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఎలా సంపాదిం చాలో మార్గాలు తేటతెల్లంగా చెప్పారు కాదు. అయినా రాజకీయ స్వాతంత్ర్యం తరువాత అవశ్యం మనకు కావలసినది ఆర్థికస్వాతంత్ర్యమేనన్న విషయం మరచిపోరాదు. ఆర్థికస్వాతంత్ర్యంగురించి మున్ముందు చర్చిస్తాను.

ఇంకా కాంగ్రెసు నిర్వచించిన లక్ష్యాలేమంటే- వ్యక్తిస్వాతంత్ర్యము, వాక్కుల రక్షణ, మతస్వాతంత్ర్యము, మైనారిటీ రక్షణ, జాతి మత లింగ విభే

శాస్త్ర సూత్రాలవలె అవికూడా సత్యములనీ మారగూడనివనీ విశ్వసించటం నేర్చుకున్నాం. అంటే— బుద్ధిపూర్వకంగా కాకపోయినా కేపిటలిస్టు సిద్ధాంతాలను జీర్ణించుకున్నాం; కేపిటలిస్టు సంస్థలు సత్యబద్ధములైన సాంఘిక సంస్థలని నమ్ముతున్నాం అన్నమాట.

ఇలాంటి స్థిరమైన ఊహాలు ఏర్పడటంవల్ల పర్యవసానం ఏమిటంటే మనసంఘాన్ని పునర్నిర్మించేందుకు తలపెట్టినప్పుడెల్లా మన ఆచరణ విధానాలన్నీ కేపిటలిస్టు పంథాలో నడుస్తాయి. కేవలం కేపిటలిస్టు సంస్థలనే అనుకరిస్తాం; వాటినే నెలకొల్పుకుంటాం. భారీపరిశ్రమలయెడ కాంగ్రెసుమంత్రుల దృక్పథంఇందుకొక ప్రబలనిదర్శనం. కార్మికచట్టాలేర్పరచటంలో, వారికూలి నిర్ణయించటంలో సరుకు ధరలు నిర్ణయించటంలో, ఇంకా ఇటువంటి అనేక విషయాలను చర్చించటంలో కాంగ్రెసు మంత్రులు పెట్టుబడిధనం ఇతర రాష్ట్రాలకు ఎక్కడ వెడుతుందోనని ఆతృతపడుతూ వ్యవహరించారు. అందుచేత పెట్టుబడిదారీ పరిశ్రమలకే ప్రోత్సాహం ఇచ్చారు. కొన్ని స్థిరమైన ఊహాలలో నిర్బంధితమైనబుద్ధితో అంతకన్నా మరేమిచేయగలరు.

## కేపిటలిస్టు ప్రభావం

పైని చెప్పిన దృక్పథంతో జాతీయ పునర్నిర్మాణానికి పూనుకుంటే ఏమవుతుందో ఊహించుకోవచ్చు. కేపిటలిస్టు పరిశ్రమలు కేపిటలిస్టు ఫైనాన్సు కేపిటలిస్టు వాణిజ్యం త్వరత్వరగా వృద్ధిపొంది దేశఆర్థిక రాజకీయ జీవితాన్ని తమ గుప్పెటలో బిగించిపెట్టుకుంటాయి. దారిద్ర్యం అలాగే వ్యాపించి వుంటుంది. నిరుద్యోగం యథాపూర్వంగానే ఉంటుంది. పెట్టుబడిదారుల దోపిడి యథారీతిని సాగిపోతూనే ఉంటుంది. ఇది అందరూ తేలిగ్గా గ్రహించగల విషయమే మన మొకవిచిత్రమైన మానసికావస్థలో ఉన్నాం ఒకవంక కేపిటలిస్టు విధానాలకు బలి ఔతు ఉన్నాం; మరొక వంక ఈ పడిపోతూన్న కేపిటలిజములో దాని నిష్ఫలత్వం, పాషండత, క్రౌర్యం చూస్తున్నాం. కేపిటలిస్టు దృక్పథం మనలో జీర్ణించివున్నా దాని నికృష్ట రోగగ్రత నైచ్యం ఎరిగే వున్నాం; కనిపిస్తూనే ఉన్నాయి దాని ముఖాన. గుడ్డివాడైతే తప్ప కన్నులున్న ప్రతివానికీ కనిపిస్తూనే ఉన్నవి. కనుక అనాలోచితంగా సాంఘిక పునర్నిర్మాణానికి పూనుకుంటే భయంకర పరిణామాలకు దారి తీస్తున్నామన్న మాట!

దాలను పాటింపకుండుట, అన్ని జాతుల పరస్పర సౌహార్ద్రము, సాంఘిక వివాదాల శాంతియుత పరిష్కారము – ఈ ముఖ్యమైనవి.

ఇవన్నీ ఎంతో ఉదారమైన లక్ష్యాలు. ఇట్టి ఉదారలక్ష్యాలను ప్రకటించటంతో కాంగ్రెసుకు భారతప్రజలలోనూ, ప్రపంచంలోనూ గౌరవం పెరిగింది. కాని అవి ప్రస్ఫుటంగా లేవు. ప్రకటించదగిన ఉదారలక్ష్యాలు ఇంకా ఉన్నవి. అస్ఫుటంగా ప్రకటితమైన ఈ లక్ష్యాలు చదువుకుని ప్రజలు భవిష్యత్తులో తమ పంథా ఎట్లుండవలెనో నిర్ణయించుకోలేక పోతున్నారు. వచ్చే ఆటంకాలను తప్పించుకునే మార్గాలు తెలుసుకోలేక పోతున్నారు.

ఇంకానూటిగా చెబుతాను. మనదేశంలో ప్రధాన సమస్య దారిద్ర్యం. అది మన సాంఘిక జీవితంలో వికటాట్టహాసంచేస్తూ మన తెలివితేటలను, ప్రజ్ఞా విశేషాలను ఛాలెంజి చేస్తోంది. కాంగ్రెసుకు ఈసంగతి తెలుసు. అందుకనే ఆర్థికస్వాతంత్ర్యం కావాలని చెబుతున్నారు. కాని ఈ ఆర్థిక స్వాతంత్ర్య స్వరూపాన్ని వారు చిత్రించలేదు. అలా అస్పష్టంగా ఒకమాట చెప్పినంతమాత్రాన ప్రయోజనం లేదు; పైగా హానికరం కూడాను. ఆ మాటతో 'మీదారిద్ర్యాన్ని, మేము నిర్మూలిస్తాం' అని బీదవాళ్ళను నమ్మించి వాళ్ళను జోకొట్టటం జరుగుతున్నది. అంతేగాని అంత అస్పష్టమైన నిర్వచనం వల్ల దారిద్ర్యసమస్య పరిష్కారం కాబోదు. ఆసమస్యా పరిష్కారానికి ధీపటిమ, ఆ నిమిష సేవానిరతి కావాలి; కార్యరంగంలో దుమికి శ్రమ చెయ్యాలి. మాటలవల్ల అయ్యేదేమీ ఉండదు. అయితే ఆ చేయవలసినశ్రమ యెట్టిది?

## స్థిరమైన ఊహాలు

మనకు తెలియకుండానే కొన్ని స్థిరమైన ఊహాలు మనల్ని పట్టిపీడిస్తూ ఉంటాయి. ఆర్థిక పొత్తు మార్గాన్వేషణలో అవేమనకు ప్రప్రథమ ఆటంకం. మనం పెట్టుబడిదారీయుగంలో ఉన్నాం. ప్రముఖ కేపిటలిస్టు దేశమైన ఇంగ్లాండుతో మనం ఇంగ్లీషుభాష నేర్చుకోవటంద్వారా, ఇక్కడి విద్యా విధానంద్వారా, ఇంకా రాజకీయ–ఆర్థిక సంస్థలద్వారా సంబంధం కలిగిఉన్నాం. కేపిటలిస్టు ఇంగ్లండు– యూరపులయొక్క, కేపిటలిస్టు అమెరికాయొక్క యుద్దేశాలు, భావాలు మన మెదడులో వేళ్ళుపాకి ఉన్నాయి; ప్రకృతి

శాస్త్ర సూత్రాలవలె అవికూడా సత్యములనీ మారగూడనివనీ విశ్వసించటం నేర్చుకున్నాం. అంటే- బుద్ధిపూర్వకంగా కాకపోయినా కేపిటలిస్టు సిద్ధాంతాలను జీర్ణించుకున్నాం; కేపిటలిస్టుసంస్థలు సత్యబద్ధములైన సాంఘిక సంస్థలని నమ్ముతున్నాం అన్న మాట.

ఇలాంటి స్థిరమైన ఊహాలు ఏర్పడటంవల్ల పర్యవసానం ఏమిటంటే మనసంఘాన్ని పునర్నిర్మించేందుకు తలపెట్టినప్పుడెల్లా మన ఆచరణ విధానా లన్నీ కేపిటలిస్టు పంథాలో నడుస్తాయి. కేవలం కేపిటలిస్టు సంస్థలనే అనుకరిస్తాం; వాటినే నెలకొల్పుకుంటాం. భారీపరిశ్రమలయెడ కాంగ్రెసుమంత్రుల దృక్పథంఇందుకొక ప్రబలనిదర్శనం. కార్మిక చట్టాలేర్పరచటంలో, వారికూలి నిర్ణయించటంలో చెరకు ధరలు నిర్ణయించటంలో, ఇంకా ఇటువంటి అనేక విషయాలను చర్చించటంలో కాంగ్రెసు మంత్రులు పెట్టుబడిధనం ఇతర రాష్ట్రాలకు ఎక్కడ వెడుతుందోనని ఆతృతపడుతూ వ్యవహరించారు. అందుచేత పెట్టుబడిదారీ పరిశ్రమలకే ప్రోత్సాహం ఇచ్చారు. కొన్ని స్థిరమైన ఊహాలలో నిర్బంధితమైనబుద్ధితో అంతకన్నా మరేమిచేయగలరు.

## కేపిటలిస్టు ప్రభావం

పైని చెప్పిన దృక్పథంతో జాతీయ పునర్నిర్మాణానికి పూనుకుంటే ఏమౌతుందో ఊహించుకోవచ్చు. కేపిటలిస్టు పరిశ్రమలు కేపిటలిస్టు ఫైనాన్సు కేపిటలిస్టు వాణిజ్యం త్వరత్వరగా వృద్ధిపొంది దేశఆర్థిక రాజకీయ జీవితాన్ని తమ గుప్పెటలో బిగించిపెట్టుకుంటాయి. దారిద్ర్యం అలాగే వ్యాపించి వుంటుంది. నిరుద్యోగం యథాపూర్వంగానే ఉంటుంది. పెట్టుబడిదారుల దోపిడి యథారీతిని సాగిపోతూనే ఉంటుంది. ఇది అందరూ తేలిగ్గా గ్రహించగల విషయమే. మన మొకవిచిత్రమైన మానసికావస్థలో ఉన్నాం ఒకవంక కేపిటలిస్టు విధానాలకు బలియౌతు ఉన్నాం; మరొక వంక ఈ పడిపోతూన్న కేపిటలిజములో దాని నిష్ఫలత్వం, పాషండత, క్రౌర్యం చూస్తున్నాం. కేపిటలిస్టు దృక్పథం మనలో జీర్ణించివున్నా దాని నిరుపయోగత నైచ్యం ఎరిగే వున్నాం; కనిపిస్తూనే ఉన్నాయి దాని ముఖాన. గుడ్డివాడైతే తప్ప కన్నులున్న ప్రతివానికీ కనిపిస్తూనే ఉన్నవి. కనుక అనాలోచితంగా సాంఘిక పునర్నిర్మాణానికి పూనుకుంటే భయంకర పరిణామాలకు దారి తీస్తున్నామన్న మాట!

అట్టి భయంకర పరిణామాలకు దారితీయగల మరొక ప్రమాదం కూడా ఉంది. కాంగ్రెసులో తమకు తెలియకుండానే సాంఘిక పునర్ని ర్మాణ విషయమై కేపిటలిస్టు ఆశయాలకు లొంగి యున్నవారు చాలమంది వున్నారు. అంతే కాదు; కొద్దిమంది కాంగ్రెసువాదులు బుద్ధిపూర్వకంగా కేపిటలిస్టు ఆశయాలకేసి మొగ్గియున్నవారు కూడా ఉన్నారు. ఎందువల్ల నంటే - కేపిటలిస్టు పంథాలో నడిచే పరిశ్రమలన్నా, బ్యాంకులన్నా, ఇన్స్యూరెన్సు కంపెనీలన్నా, ఇంకా అటువంటి ఇతర సంస్థలన్నా వారికి అభిమానం. బ్రిటిష్‌వారి పెట్టుబడిపోయి, స్వదేశీయుల పెట్టుబడులతో ఆ సంస్థలు వైభవోపేతంగా సాగవలెనన్న తలంపుతోనే వారు స్వరాజ్యం కోరుతున్నారు. కాంగ్రెసులో ఎక్కువగా పలుకుబడిగలవారు చదువుకున్న మధ్యతరగతివారు. సాంఘికంగా ఉన్నత శిఖరానికి ఎక్కిపోవాలనేది సాధారణంగా మధ్యతరగతివారి ప్రధాన లక్ష్యం. కనుక వీరు కేపిటలిస్టు లాభాలచేత ఆకర్షితులు కాక తప్పదు. తత్ఫలితంగా మళ్ళీ అధఃపతనమే గతి! కనుక మనం అత్యధిక జాగరూకులమై ఉండాలి.

## కుతర్కాలు

ఈ విషయాన్ని కాంగ్రెసువారితో చర్చిస్తే వారు ఏమేమో విపరీతమైన తర్కం ఉపయోగించి మాటాడతారు. భవిష్యత్తు విషయమై వారి కేమీ భయంలేదు. "ప్రభుత్వపు ఓడ అపాయాలన్నీ దాటి సురక్షితంగా సాగిపోగలదు. ప్రజాక్షేమము తెలిసిన, సాంఘిక మర్యాద లెరిగిన, ఉదారాశయాలు గల పెద్దలు ఆ ఓడకై కెప్టెన్లుగా ఉంటారు. ఆ ప్రజా నిధులు కేపిటలిజమ్‌కు కళ్ళాలువేసి, అన్ని వర్గాలవారి మధ్య సామంజస్యం కుదిర్చి, అపాయాలను తొలగించ గలరు" అని కాంగ్రెసు వాదుల కుతర్కం.

అలాటి తర్కాలతో నిశ్చింతగా కాలక్షేపం చేస్తూన్న మహాశయులకు అసలు సమస్య సరిగా అర్థం కాలేదనే చెప్పాలి. ఒకానొక అనర్థానికి కళ్లాలు బిగించటంగాని, లేక దాన్ని నిర్మూలించటంగాని- అదికాదు అసలు సమస్య. సంఘపునర్నిర్మాణానికి ఎట్టిపునాదులు వెయ్యాలి?- అదీ తేల వలసిన విషయం. జాతీయపార్లమెంటు, జాతీయప్రభుత్వం ఏర్పడగానే పన్నులు విధించుట, టారిఫ్‌లు, కరెన్సీ, వస్తుమార్పిడి, బ్యాంకింగ్, జాతీయ

ఋణము, రైల్వే చార్జీలు, దేశ-విదేశ వర్తక వాణిజ్యాలు, కూలినిర్ణయం, పని చేయుగంటల వినియమం, వ్యవసాయిక పారిశ్రామికవిషయాలు- ఇత్యాదు లన్నీ పరిశీలించవలసివస్తుంది. ఎప్పుడో తీరిగ్గా ఆలోచించవచ్చులే అని త్రోసి పారేయటానికి వీల్లేదు. తక్షణం పరిష్కరించవలసినదే. ఆ విషయాలను పరిష్కరించటంలోనే ఆదర్శపురుషులు అప్రభుత్వపు ఓడకెప్తానులు భారత సంఘానికి పునాదులు వేయటమౌతుంది. ఒకవిధమైన పరిష్కారమార్గం అవ లంబించారంటే కేపిటలిస్టు పునాదులే నిర్మితాలైపోతాయి. ఇంకొకవిధమైన పరిష్కారమార్గం అవలంబిస్తే మరొకరకమైన పునాదులు ఏర్పడతాయి. వివిధవర్గాలమధ్య సామంజస్యం కుదర్చటంకాదు- ఏవర్గంవారు పరిపాలనాధి కారం వహించాలో నిర్ణయించవలసిన అవసరం వస్తుంది. పైవిషయాలను పరిష్కరించటంలో వారు అవలంబించే ప్రాతిపదిక ఆర్థిక సిద్ధాంతాలు కేపి టలిజమ్‌ను పెంపొందించేటటువంటివైతే వారు కేపిటలిజమ్ సంకెళ్లలో బంధితులైపోయారన్నమాటే. ఆసూత్రాలు వారికి తెలియకుండానే, వారు ప్రథమంలో అనుకోని ఏగమ్యస్థలానికో తీసుకుపోయి విడిచిపెడుతుంది.

ఒకసారి పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించినతరువాత దానికి కళ్లాలు బిగించటంకాదు మనం చేయగలపని. దాన్ని వృద్ధిచేస్తాం, రక్షిస్తాం; చివరకు అదేమనకు కళ్లాలు తగిలిస్తుంది. జాతిఅంతా కేపిటలిజమ్‌తో బాధిత మైపోతుంది, ఆవిధానం సక్రమంగా నడవనినాడు జీతాలు పడిపోతాయి; నిరుద్యోగులు ఎక్కువౌతారు; వ్యవసాయ పరిశ్రమ వెనకబడిపోతుంది. ప్రభుత్వపు ఓడకెప్తానుల తరువాత అధికారంలోకి వచ్చే మహాశయులు కేవలం పెట్టుబడిదారీ సమాజంవారి కార్యవర్గసభ్యులుగా తయారౌతారు. ఆ పెట్టుబడిదారులేమో జాతీయశక్తుల నన్నింటినీ తమకింద నౌకరీకి వినియో గించుకునేందుకు ప్రయత్నిస్తారు. కాంగ్రెసులో బుద్ధిపూర్వకంగా కేపిటలిస్టు పక్షపాతులు కొందరున్నారని పైన చెప్పాను. అట్టివారు బాగా తోడ్తారు. పైగా లంచగొండితనం మొదలైన దుర్మార్గాలు, కాంగ్రెసులో చాలమంది ఉద్యోగాలకోసం ప్రాకులాడటం- ఈ మొదలైన పరిణామాలన్నీ కూడా బాగానే తోడౌతాయి. కొంతవరకు ఈదుష్పరిణామాలు కాంగ్రెసు మంత్రిత్వాలు సాగినరోజుల్లో కనిపించాయి.

ప్రభుత్వాధికారాన్ని కేపిటలిస్టులే ఆక్రమించుకోగలరన్నమాటేమిటి? సాధారణ ప్రజలుకూడా ఎందు కాక్రమించుకోకూడదు? అని ప్రశ్నించ

వచ్చును. కేపిటలిస్టులే ఆక్రమించుకుంటారనిగాదు. మేము చెబుతున్నది, ప్రస్తుతం చాలమంది ఆలోచనల ధోరణిలో అవరోధాలు ఇమిడియున్నాయని సూచిస్తున్నాను; జాగ్రత్తగా ఈవిషయాలను పర్యవేక్షించవలసినదని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈసమస్యనే ఇంకోవిధంగా చెప్పవచ్చును; సామాన్యప్రజ రాజకీయాధికారాన్ని వహిస్తుంది; ఆ యధికారాన్ని తాను ఎలా నిలుపుకోవాలి? తన సుఖసంపదలకు, భవిష్య దభ్యుదయానికి ఆయధికారాన్ని తాను ఎలా వినియోగించాలి? ఆ యధికారాన్ని కాస్తా కేపిటలిస్టు సమాజానికి తాను దత్తంచేసిందంటే దుర్వినియోగమైందన్నమాటే. మనలో జీర్ణించిన కేపిటలిస్టుభావాలు, ఊహలు మనల్ని విడిచిపోని పక్షంలో ఆపనేచేసి కూచుంటాం

## ఉన్నత వర్గాలవారు

ఈవిషయమైన ఆలోచనకు పూనుకునే ముందు ఒక్క సంగతి చెప్పుతాను. కాంగ్రెసు విజయమే ప్రజావిజయమని అనుకోటం కేవలం ఉత్ప్రేక్ష. నిజానికి కాంగ్రెసువిజయం సంపూర్ణ ప్రజావిజయం కాజాలదు. కాంగ్రెసులో ఉన్నతవర్గాలవారి హక్కులకు ప్రాతినిధ్యం వహించిన ఒకతరగతివారు ఉన్నారని ఇదివరకే చెప్పాను. వీరు విద్యాధిక్యత వల్లా, సాంఘిక పరువు మర్యాదలు కలవారు కావటంచేతా కాంగ్రెసు నిచ్చెన పైమెట్లుకు దగ్గరగా ఉంటారు. క్రిందిమెట్లకు దూరస్థులు. కనుక పై వారికి అనుకూలమైన విధానాలే అవలంబిస్తారు. కాగా కాంగ్రెసు విజయమంటే ఉన్నతవర్గాలవారి విజయమన్నమాట. రానున్న పోటీలో పైతరగతులా? సామాన్యప్రజా? ఎవరు విజయోపేతులౌతారో మనం నిర్ణయించుకోవలసి ఉంది.

ఇండియా ముఖ్యంగా వ్యావసాయిక దేశం. మనందరమూ ఏదో విధంగా గ్రామంతో సంబంధం కలవారమే. అందుచేత చాలమంది ఒక ఆదర్శవంతమైన గ్రామనాగరకతా స్వరూపాన్ని మనకు చిత్రించి చూపెడతారు. కుటీరపరిశ్రమలు పెంపొందించి గ్రామం స్వయంసమృద్ధమైననాడు కేపిటలిజమూ, దారిద్ర్యమూ వుండవని వారి వాదన. దురదృష్టవశాత్తు, ఈ విషయమై చాలమంది నిశితంగా ఆలోచించరు; ఏదోవాదనకోసం అలా తర్కిస్తారు. సరే, కుటీరపరిశ్రమలు నెలకొల్పుతాం. గ్రామం స్వయంపోషకమై తనకాళ్లమీదే తాను నిల్చోగలుగుతుంది; అయినా ఇంకా

సమస్య చాలభాగం పరిష్కృతం కాకుండానే అట్టే ఉంటుంది. ఆధునిక యుగంలో ఏ దేశప్రభుత్వమూ కేవలం కుటీర పరిశ్రమల పునాదులమీదే నిర్మితం కాజాలదు. ఈమాట వివేకవంతుడెవడూ కాదనలేడు. వివిధ జీవితరంగాలలో యంత్రాలద్వారా భారీఉత్పత్తి వుంటేనేగాని ప్రజలజీవన ప్రమాణం పెరగదు; తగినంత స్థైర్యం చిక్కదు; అభ్యుదయం ఉండదు. ఆధునిక జీవన సౌకర్యాలు లభించవు.

## ప్రభుత్వ యాజమాన్యం

అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘ కార్యదర్శి ప్రొఫెసర్ జె. సి. కుమారప్పగారిని మించి...భారతి గ్రామాన్ని దృక్పథంలో పెట్టుకుని, దారిద్ర్యాన్నీ దోపిడి విధానాన్నీ నిర్మూలించవలెనన్న తలంపుతో... ఈదేశ ఆర్థిక పునర్నిర్మాణవ్యవస్థను గూర్చి తీవ్రంగా ఆలోచించినవారు మరెవరూ లేరు. ఎంతో ఆలోచించినమీదట పరిశ్రమలు రెండుతరగతులుగా విభజించవచ్చునని ఆయన నిర్ణయించాడు. వికేంద్రీకరణ పద్ధతిని కొనసాగించగల పరిశ్రమలన్నీ మొదట తరగతిలో వస్తాయి. కేంద్రీకరణవిధానంలో తప్పనిసరిగా సాగవలసినవి రెండవతరగతి పరిశ్రమలు. ఇనుము, ఉక్కు, గనులు, రవాణా (రైళ్లు ఓడలు, మోటార్లు) విద్యుచ్ఛక్తి, విమానాలు, రక్షణ యంత్రాలను తయారుచేయటం– ఇత్యాది పరిశ్రమలన్నీ రెండవ తరగతిలో వస్తాయి.

కనుక 'గ్రామస్వయంపోషక'వాదులు కోరే కుటీరపరిశ్రమలేగాక చాలవరకు యంత్రపరిశ్రమలుకూడా స్థాపించవలసియున్నదని కశదమే. పట్నాలూ పెరగవలసినదే. ఉన్న యంత్రపరిశ్రమలు సాగించవలసినదే; కొత్తవి స్థాపించుకోవలసినదే. అయితే ఈ భారీపరిశ్రమలను ఏంచెయ్యాలి? వాటిని నడపవలసినది యెవరు? లాభాలు కాంక్షించే ప్రయివేటు వ్యక్తులా? అభ్యుదయాన్ని కాంక్షించే ప్రజలా? ప్రజలే అనగా ప్రభుత్వమే వాటిని తన ఆధీనంలో ఉంచుకొని నడపాలి– అని గొంకులేకుండా శ్రీకుమారప్ప చెబుతున్నాడు; మాకు సంతోషం. కారణం అందరికీ తెలిసినదే. అవసరమైన భారీపరిశ్రమలను కేపిటలిస్టులచేతుల్లో పెడితే దారిద్ర్యం, దోపిడి విధానం యథారీతిని తాండవిస్తూనే ఉంటాయి, అంతేకాదు; కేపిటలిస్టులో

అధికార ప్రాభవం పెరిగిపోతుంది. క్రమేణా వారు కుటీర పరిశ్రమలను నాశనం చేస్తారు.

## గ్రామ ఆర్థిక విధానం

ఇక్కడ ఇంకొకవిషయంకూడా చెప్పటం అనుచితంకాదు: గ్రామ స్వయంపోషకవిధానం ఆచరణసాధ్యంకాదు. ఆసంగతి అలావుండగా గ్రామాన్ని స్వయంపోషకం చేయాలన్న ఆదర్శం రాజకీయ దృక్పథంలో వాంఛనీయంకాదు. ఈగ్రామాల స్వయంపోషక విధానంవల్లనే భారత దేశంలో... సాంస్కృతిక ఐకమత్యం ఉన్నా... రాజకీయ సమైక్యత ఏనాడూలేదు. ఒకజాతి శాశ్వతంగా ఐకమత్యంకలిగి మనవలెనంటే గ్రామాలూ అన్నీ ఒకేరాజకీయార్థిక సాంస్కృతిక జీవన సూత్రాలతో బంధితములై ఉండాలి.

ఇకపోతే సత్యము- అహింస-ఈరెండూ అన్ని యిబ్బందులనూ పరిష్కరించగలవని అంటారు. సరే పరిష్కరించగలవనే అనుకుందాం. కాని ఎంతవరకు పరిష్కరిస్తాయి? సత్యమూ, అహింసా అసంభవాలను సంభవం చేయగల మంత్రాలేమీ కావు. నైతికసూత్రాలు అవి. "అహింస దారిద్ర్యాన్ని ఎలా నిర్మూలిస్తుంది? అన్న ప్రశ్నకు అహింసదారిద్ర్యాల్ని నిర్మూలిస్తుంది" అన్నది సమాధానంకాదు. కాని అలాగే సమాధానం చెబుతున్నారు అహింసఅంటే అర్థంగాని అహింసావాదులు. జమీందారీ - కేపిటలిస్టు విధానాల నిర్మూలన సమస్య వచ్చినప్పుడల్లా "నిర్మూలనంగురించి" మాటాడ్డం అహింసా తత్త్వానికి విరుద్ధంసుమీ! "అని మాకు జ్ఞాపకంచేస్తున్నారు.భూస్వాములు రైతులతో కేపిటలిస్టులు కార్మికులతో బుజాలుకలిపి మెలగవచ్చును; భాగ్యవంతులూ, బీదవాళ్ళూ ఇరుతెగలూ హాయిగా సుఖపడవచ్చు- . అని చెబుతున్నారు. ఇలాంటి మాటలు చెప్పేవారంతా గాంధీవాదాన్ని తమకు లాభదాయకంగా ఉపయోగించుకోవాలని చూచేవాళ్ళూ, సరిగా ఆలోచించుకోలేనివాళ్ళూ.

## గాంధిజీ దృక్పథం

గాంధీవిధాన దృష్ట్యా ఈసమస్యలను సమగ్రంగా ఆలోచించినవాడు ప్రొఫెసర్ కుమారప్ప. ఆయన ఉద్దేశాలు చెప్పానుకదా ! గాంధిజీ

అభిప్రాయాలు కూడా తేటతెల్లమే ఆయన కేపిటలిజమ్‌ను నిరసిస్తాడు. సంపద అంతా ప్రజలదేనని ఆయన విశ్వాసం. భారీ పరిశ్రమలు ప్రజా యత్తములు కావలెననీ, వాటిద్వారా ప్రయివేటు వ్యక్తులు లాభాలు ఆర్జించే పద్ధతి రూపుమాసి పోవలెననీ ఆయన కోరిక. స్వతంత్ర భారతదేశ రాజకీయార్థిక సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి ప్రాతిపదిక సూత్రాలను నిర్వచిస్తూ వెలువడిన శ్రీ జయప్రకాష్ నారాయణ్ తీర్మానముపై … క ప్రకటన చేశాడు. ఆ ప్రకటనలో ఆయన అభిప్రాయాలు స్పష్టంగా తెలుస్తున్నాయి. ఆ ప్రకటనను పాఠకులు చదువుకుని, దాని ప్రాముఖ్యమును గూర్చి యోచించెదరు గాక! రవాణా, గనులు మొదలైన భారీ పరిశ్రమలు, ప్రజా యత్తములగుటకు – జమీందారీ విధాన నిర్మూలనమునకు – హాయిగా జీవయాత్ర గడుపుటకు అవసరమైనంత కన్న ఏ రైతుకూ ఎక్కువగా లేకుండా భూమిని తిరుగ పంపకం చేయుటానికీ – గాంధిజీ అంగీకరిస్తున్నాడు. గాంధీవాదులు ,మేము శుద్ధిగా గాంధీజీని అనుసరిస్తున్నా,మని చెప్పుకుంటూ అదొక పెద్ద సుగుణంగా భావిస్తున్నారు శ్రీ జయప్రకాశ్ తీర్మానంలోని ఈ పై ఆశయాలను – గాంధిజీ ఆమోదించిన ఆ ఆశయాలను వారు అంగీకరిస్తారా మరి? అంగీకరించేట్టయితే కాంగ్రెసు చరిత్రలో ఒక నూతనాధ్యాయం ఆరంభమైన దన్నమాటే.

## సామ్యవాదపు పునాదులు

శ్రీ జయప్రకాష్ సామ్యవాద కార్యక్రమాన్ని వ్యతిరేకించే వారంతా... తొందరపడి సామ్యవాద స్థాపనకు దిగకండని చెబుతోన్న గాంధిజీ హెచ్చరికను జ్ఞాపకం చేసుకుని తృప్తి పడుతూంటారు. సామ్యవాద స్థాపనము తొందరగా జరుగవలెనా? ఆలస్యంగా జరుగవలెనా? అన్న సమస్య విషయమై మనము వివాదానికి దిగేముందు సామ్యవాద కార్యక్రమాన్ని మొదట అంగీకరిద్దాం. దాన్ని ఎంత తొందరగా అమలు చేద్దామన్న విషయమై ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు. ఆర్థికంగా కొందరు ఇప్పుడు అనుభవిస్తూన్న ప్రత్యేక హక్కులూ, లాభాలు ఇక ముందు ఉండవని ప్రజలను సమాధాన పరచటం కష్టమే. ముందుగా వాళ్ళ నందర్నీ సమాధాన పరచటం కూడా సాధ్యం కాదు. ఈ విషయాలన్నీ ఇప్పుడు మనం కాంగ్రెసు ప్రభుత్వాధికారం స్వీకరించే పక్షంలోనే

మాట్లాడుతున్నాం. ప్రభుత్వాధికారం కాంగ్రెసు హస్తగతం కావటం తోనే పునర్నిర్మాణ కార్యక్రమానికి పునాదులు వేయవలసి వుంటుంది. అందుకు వలసిన ప్రాథమిక కార్యకలాపమంతా తక్షణమే జరుగవలె. ఆలస్యం అపాయకరంగా పరిణమించవచ్చు. పునాదులు వెంటనే ఏర్పరచు కోవాలి; లేకపోతే నిర్మాణం దుర్లభం. ప్రత్యేక హక్కులు అనుభవిస్తున్న వారు నిరోధిస్తారని మనం కాలయాపన చేయరాదు; వారి అంగీకారం కోసం వేచియుండనూ కూడదు మనం వాళ్ళ మనస్సులు త్రిప్పగలమన్న మాట సందేహమే. కాంగ్రెసు మంత్రిత్వాలు వ్యవహరించినప్పటి అనుభవం జ్ఞాపకం చేసుకోండి. ఒక వర్గంవారు నిరోధిస్తారన్న భయంతో బొంబాయి మంత్రివర్గం మద్యపాన నిషేధాన్ని అమలు పరచకుండా ఊరుకున్నదా? సారాయం అమ్మేవాళ్ళలో మనం హృదయపరివర్తనం కొనివచ్చేంతవరకూ ప్రభుత్వం ఊరుకుండవలసినదే నంటారా? 'ఔను' అని అహింసాతత్వంలో విశ్వాసంగల ఏప్రముఖుడూ అనడు. అదిగాక వడ్డీవ్యాపారస్థుల అంగీకారం లభించేంతవరకూ మద్రాసుమంత్రివర్గం 'ఋణనివారణ చట్టాన్ని' అమలు చేయకుండా ఉండవలసినదని అంటారా? తాలూకాదారులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారని సంయుక్త రాష్ట్రమంత్రులు రైతుబిల్లును అమలుచేసియుండ వలసినదా? పెద్దపెద్ద భూస్వాములు వ్యతిరేకిస్తున్నారని బీహారు ప్రభుత్వం వ్యవసాయకాదాయంమీద పన్ను వెయ్యకుండా ఉండవలసినదేనా? ఈ ఉదాహరణలను బట్టి ప్రభుత్వం ప్రజాక్షేమకరమైన కార్యక్రమాన్ని కొనసాగించవలెనని తేలుతున్నది. అందువల్ల రవంతబాధ కలుగవచ్చు. కొన్ని వర్గాలవారిని వారి ప్రతిఘటనమును ప్రభుత్వం లెక్కచెయ్యరాదు. శ్రీజయప్రకాష్ ప్రతిపాదించిన కార్యక్రమాన్ని అధిక సంఖ్యాక ప్రజ ఆమోదించదని కాంగ్రెసుకు సందేహమేమున్నా ఉన్నదా? అట్టి కార్యక్రమాన్ని కాంగ్రెసు అనుసరించని పక్షంలో ప్రజలను పూర్తిగా మోసంచేసినదన్న మాటే; ద్రోహంచేసిందన్నమాటే.

ఇవాళ మనం ప్రజాపరిషత్తు గుమ్మంలో ఉన్నాం. మనం ఎక్కడికి వెళుతున్నామో, ప్రజలను మనతోకూడా ఎక్కడికి తీసుకువెడుతున్నామో నిక్కచ్చిగా వారికి చెప్పివెయ్యటం మనధర్మం. లేదా మళ్ళీ శాసనోల్లంఘనోద్యమాన్ని ఆరంభింప నిశ్చయం చేసుకునేందుకు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశం కావచ్చు. అప్పుడు మన ఆశయాలేమిటో, ఉద్దేశాలేమిటో

బహిరంగంగా చెప్పివేయటానికి మంచి అదను. శ్రీజయప్రకాష్ కావించిన సూచనలు గాంధీజీ అంగీకారాన్ని బడసినవి. కనుక మున్ముందు కాంగ్రెసు బహిరంగపరుపక్ష ల ఆశయాల కవి ప్రాతిపదికలుగా ఉపయోగించగలవు, గాంధిజీ అడుగుజాడల్లో నడుస్తున్నామని గర్విస్తూన్న నాయక నాయకమహాశయులు ఈసారికూడా ఆయన ఉపదేశాన్ని మన్నిస్తారా మరి?

## భారతదేశంలో సోషలిస్టు ఐక్యతా సమస్యలు
## (1941)

గడచిన ఆరడజను సంవత్సరాలనించీ- అంటే 1934 లో శాసనోల్లంఘనోద్యమం ముగిసిన నాటినించీ ఈదేశంలో సామ్యవాద ప్రచారం క్రమేణా వృద్ధిచెందింది. ఈవృద్ధిచెందినగాథే చాలవరకు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ చరిత్ర.

ఈపార్టీ 1934 లో శాసనోల్లంఘనోద్యమం ఉపసంహృతమైన వెంటనే స్థాపించాం. అంతకుముందు భారత రాజకీయరంగంలో సామ్యవాదమనేది మచ్చుకేనా లేదు. మీరట్ కుట్రకేసు సందర్భంలో దానికి కొంచెం పత్రికాప్రచారం లభించింది. కాని అది ప్రజల రాజకీయ జీవితంలో అడుగుపెట్టలేదు. అదేదో పరదేశాలనించి దిగుమతియైన సరుకనుకున్నారు ప్రజలు. 1931 లో శ్రీ యమ్. యన్. రాయ్ రహస్యంగా ఇండియాకు తిరిగివచ్చాడు. వచ్చి సొంతపార్టీ ఒకటి స్థాపించాడు. కాని ఆపార్టీ ఉన్నట్టే ప్రజలకు తెలియదు. అది భారత రాజకీయ రంగంలో నలుసంత సంచలనం కూడా, తీసుకురాలేదు. వ్యక్తిగతంగా రాడికల్ జాతీయవాదులైన పండిట్ జవహర్‌లాలు నెహ్రూ, శ్రీ సుభాష్ చంద్ర బోస్‌లవంటి నాయకులమాటలు కొన్ని కొంతమంది మధ్యతరగతివారిని ఆకర్షించాయి. కాని చెప్పుకోదగ్గ సంస్థ ఏదీ నిర్మితంకాలేదు. కనుక 1934లో రాజకీయరంగంమీద సామ్యవాదాన్ని ప్రతిష్ఠించినది కాంగ్రెస్ సోషలిస్టు పార్టీయే అనిచెప్పటంలో ఉత్ప్రేక్షయేమీలేదు. తరువాత ఈ ఆ రేళ్లలోనూ దాని పలుకుబడి బాగా వ్యాపించింది.

ఈ ఆరేళ్లలోనూ సోషలిస్టు ఉద్యమం మంచి అనుభవం సంపాదించింది; అనేకకష్టాలు పడ్డది; అనేక సమస్యలను ఎదుర్కొన్నది. వాటిలో

ఒక్క సమస్యనుగురించిమాత్రం ఇక్కడచెబుతాను. అది సోషలిస్టు ఐక్యతా సమస్య. సోషలిస్టు ఉద్యమంలో అది అత్యంతప్రముఖమైన సమస్య. ఈ సమస్యా పరిష్కారనిమిత్తమై పడిన కష్టాలు, కలిగిన అనుభవాలు ఒకసారి సమీక్షించుకోనటం అవసరం. పూర్వానుభవాలనుబట్టి ఇకముందైనను జాగ్రత్తగ మెలగవచ్చును. ఆవివరాలన్నీ తెలుసుకోవాలని ప్రజలు ఉత్సుకులై ఉంటారు. కాంగ్రెసుసోషలిస్టుపార్టీవారు ఆ వివరాలు తెలుసుకోవలసినఅవసరం ఎంతైనాఉంది. అసలైన వివరాలు ఇదివరకెన్నడూ ప్రచురితాలు కాలేదు. పైగా పార్టీశత్రువులు కొన్ని సన్నివేశాలకు అపార్థాలు కల్పించి దుష్ప్రచారం చేశారు. కనుక ఈవ్యాసంపార్టీ సభ్యులకు, పార్టీ అభిమానులకు ఉపయోగకారి కాగలదని నానమ్మిక. ఇది వారికి విషయం తెలియజెప్పటమేగాక ముందు జాగ్రత్తకు మార్గసూచి కాగలదు. పైపెచ్చు ప్రజలకుకూడా ఇది కొంత ఉపయోగించవచ్చు.

‘సోషలిస్టు ఐక్యత’ అన్నపదం అస్పష్టంగా ఉంది; సామ్యవాదులమని చెప్పుకునేవారందరి ఐక్యత -అనేనా దీని అర్థం? ఇకపోతే ‘ఐక్యత’ అంటే అర్థం ఏమిటి? పరస్పర సహకారమా? సమాశయాలు కలిగి వుండటమా? ఏకైకసంస్థగా సమీకరణ జరగటమా? అనేకతరహాల మనుష్యులంతా ‘మేము ‘సోషలిస్టుల’ మని చెప్పుకుంటున్నారు. లిబరల్ పక్షీయులు కొందరు సోషలిస్టులమని చెప్పుకుంటున్నారు. నేను సోషలిస్టునంటాడు గాంధీజీ. మార్క్సవాదమే నిజమైన సోషలిజమ్ అని చెబుతున్నారు కాంగ్రెసుసోషలిస్టుపార్టీవారూ, అలాంటి వారే మరికొందరున్నూ. ఇలా మార్క్సవాదాన్ని అనుసరించివున్న వివిధవర్గాలూ, వ్యక్తులూ - అంతా ఒకేపార్టీగా కలిసి పోవటమన్న సమస్య గురించే మనమిక్కడ ప్రస్తావిస్తున్నాం.

పార్టీస్థాపితమైనప్పుడు ఈసమస్య ఎలా ఆరంభమైనదో చూద్దాం. ఆ తరువాత పార్టీలో కలిగిన మార్పులు, ప్రస్తుతపరిస్థితి పరికిద్దాం.

పార్టీ ఆరంభమైనప్పుడు మార్క్స వాదాన్ని అనుసరిస్తున్నట్లు చెప్పుకుంటోన్న రెండు సోషలిస్టు వర్గాలు ఉన్నవి - అఖిలభారత సంస్థలుగా పెంపొందవలెనన్న ఆసలతో.

మొదటిది కమ్యూనిస్టుపార్టీ; రెండవది రాయ్ ముఠా అంతేగాక పంజాబ్ సోషలిస్టుపార్టీఅనీ, బెంగాల్ లేబర్ పార్టీఅనీ మార్క్సవాదాన్ని

అనుసరిస్తున్న కొన్ని స్థానికసంస్థలు కూడా ఉండేవి. ఈస్థానిక-జాతీయ సంస్థలనన్నింటినీ కలిపి ఒకేఒక సోషలిస్టుపార్టీగా సమీకరించవలెనన్న ఉద్దేశం కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి మొదటనుంచీఉన్నది. అందుకుచేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమై పోయాయి. ఉత్సాహం లేక కాదు; ప్రయత్న లోపం వల్ల కాదు. ఇతర పార్టీలు...ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ-దేనికదే స్వార్థపరత్వంతో వ్యవహరించాయి. ఈ ఐక్యతకోసం చేసిన నిష్ఫలయత్నాల గాథ వివరిస్తాను

## రాయ్ ముఠా

మొదట రాయ్‌ముఠాను గురించి చెబుతాను. ఈవర్గంవారు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ స్థాపనమును హర్షించారు. కొందరు రాయిస్టులు మొదటినుంచీ మనపార్టీతో కలిసిమెలిసి వుంటూవచ్చారు; రాయిపార్టీ యావత్తుకూడా మనపార్టీ అంటే సదభిప్రాయంతో ఉండేది; సహకారం ఇచ్చేట్టే కనిపించింది. మనపార్టీ రాయ్‌ముఠాలోని వారందరినీ సభ్యులుగా చేరగలందులకు ఆహ్వానించింది. కొన్ని నెలలలోనే రాయ్‌ముఠా యావత్తూ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో కలిసి పోయింది. ఇంకేం, మూడు ప్రముఖ వామపక్షాలలో రెండైనా కలిసి ఒకటిగా మిళితమౌతాయిగదా అని ఆశించాం. కాని అలా జరుగలేదు.

కాంగ్రెసు ఒక జాతీయసంస్థ. దాని హృదయంలోనించి ఉద్భవించింది మనపార్టీ. కనుక కాంగ్రెసులో మనపార్టీ ఒక కీలకస్థానం ఆక్రమించిఉంది. అందుచేత ఇతరపార్టీలు స్వలాభంకోసమని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని బుట్టలో వేసుకోవాలని చూచాయి. అది వీలుగాకపోయేసరికి తమవృద్ధికి ఆటంకంగా వున్నదని దాన్ని నిర్మూలించటానికి ప్రయత్నాలు చేశాయి. రాయిస్టులు, కమ్యూనిస్టులు చేసినపని ఇదే.

రాయిముఠా మనపార్టీలో చేరినప్పుడు మన ప్రాథమిక విధానాలతో వారికి అభిప్రాయభేదాలు లేవనే చెప్పవచ్చు. కాని మొదటి సంవత్సరమే- జనవరి 1936 లో మీరట్‌లో పార్టీ ద్వితీయ సమావేశానికి కొంత కాలంముందు- కొన్ని అభిప్రాయ భేదాలు పొడకట్టాయి. ఒక డాక్యుమెంటుద్వారా వారు తమ భేదాభిప్రాయాన్ని వెలిబుచ్చారు: ఈపార్టీ ఒక సోషలిస్టుపార్టీగా వృద్ధికారాదుట! కాంగ్రెసులో ఒక వామపక్షంగా

తయారు కావాలట! కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అనేది ఉండకూడదనికూడా వారు అన్నారు.

ఇంకొక విచిత్రం; ఐక్యత సాధించలేకపోవటానికి అసలైన కారణం ఏమంటే- ప్రతిచిన్న అనామకపు పార్టీకికూడా తానే సిసలైన మార్క్స్‌వాదినన్న అహం ఉన్నది; కనుక మిగతా పార్టీలను కేవలం తన స్వలాభం నిమిత్తం ఉపయోగించుకోవాలనీ, లేకపోతే అణచిపెట్టి ఉంచాలనీ, వీలైతే నాశనం చేసెయ్యాలనీ దురూహాలకు పోయేది. రాయ్‌ముఠా ఉద్దేశాలు కూడా ఇలాంటివే. అందుచేత ఇంకొక సోషలిస్టుపార్టీ అనేది వృద్ధిపొందటం తమకు అనవసరమనీ, అపాయకరమనీ రాయిస్టులు భావించారు. అంతకన్నా దాన్ని తమ వామపక్ష ప్రాబల్యానికి ఉపయోగించే ఉపకరణంగా తయారుచేయటం మంచిదని వారికి తోచింది. మొట్టమొదట వారి మాటలన్నీ దురదృష్టవశాత్తు మాకు బాగా అర్థంకాలేదు. ఎలాగైనా ఈ వివిధ సామాజిక వర్గాలన్నీ ఐక్యం కావాలని తీవ్రంగా కృషిచేశాం. ఐక్యం సాధించాలన్న తృష్ణలో మేము కొట్టుకుంటూ రాయిస్టుల అంతర్యాన్ని చాలకాలంవరకూ గ్రహించలేకపోయాం. చివరకు వారే ముసుగులు తీసివేసుకుని యథార్థస్వరూపాలతో ప్రత్యక్షమైనారు.

మీరట్‌లో పార్టీసమావేశమప్పుడు రాయిస్టుల డాక్యుమెంటు మన కార్యవర్గంవారి సమీక్షకు వచ్చింది. రాయిస్టుసభ్యులే ఇద్దరు దాన్ని నిరసించారు; మన మీరట్ తీర్మానాన్నే ఆమోదించారు. మన పార్టీ మార్క్స్‌వాదానుగుణ్యమైన ఒక సోషలిస్టుపార్టీగా ఉండవలసినదేనని మీరట్ తీర్మానం. ఈవిషయం సమావేశంలో చర్చకువచ్చింది. రాయిస్టులు కొందరు ఒప్పుకున్నారు; కొందరు ఒప్పుకోలేదు. కొందరు మీరట్ తీర్మానానికి వోటుచేశారు. కొద్దిమంది ఏవో ఎమెండుమెంటులు తెచ్చారు. కాని అవన్నీ వీగిపోయినవి. ఆసందర్భంలో మనకూ, వారికీ గల ఒక ముఖ్యమైన విభేదం ప్రస్ఫుటమైంది. కాని నాటినుంచీ రాయ్‌ముఠా అత్యంత సన్నిహితమైనదిగా కనిపించింది; కొలదికాలంలోనే పూర్తిగా మనపార్టీలో కలిసిపోగలదనిపించింది. అయినా అప్పుడప్పుడు ఏవో పొరపులు తల చూపుతూనే వచ్చాయి. కాని ఆదర్శాల్లో పెద్ద పెద్ద వ్యత్యాసాలేమీ మొలకెత్తలేదు.

1936 సంవత్సరాంతంలో శ్రీ యమ్. యన్. రాయ్ జైలునుంచి

విడుదలై వచ్చిన తరువాత కొంత కాలం వరకూ కూడా పరిస్థితులు ఇలాగే సాగుతూ వచ్చాయి. శ్రీ రాయ్ పార్టీ యెడ స్నేహభావంతోనే ఉండేవాడు. అందులో కలిసిపోయేవాడులాగే ప్రవర్తించాడు. కాని రోజులు గడచిన కొద్దీ పరోక్షంగా పార్టీని, పార్టీ విధానాలనూ విమర్శించటం మొదలుపెట్టాడు. 'కాంగ్రెసులోనే మరోక పార్టీ ఉండకూడదు'- 'జమీందారీ విధాన నిర్మూలనమంటున్నదో గాని తలపెట్టేట్టులేదు ఈ పార్టీ'- 'కాంగ్రెసు కమిటీలే తప్ప రైతుసంఘాల నిర్మాణం జరుగరాదు' (కిసాన్ సభలను నెలకొల్పటంలోనూ, భూస్వామికత్వ నిర్మూలనంకోసమూ పార్టీ చాలా కృషి చేసింది) - ఇలాంటి వాక్యాలు తరచుగా తన ఉపన్యాసాల్లో విసురుతూ వచ్చాడు. కాని కాంగ్రెసు సోషలిష్టు పార్టీలో సభ్యులుగా చేరిన అనుచరులను అలాగే ఉంచాడు కొంత కాలం వరకూ. చివరకు హఠాత్తుగా 1937 లో ఢిల్లీ కన్వెన్షన్ సమయాన కాంగ్రెస్ సోషలిష్టు పార్టీనుంచి తన మతావారిని వెనక్కు పిలిపించేసుకోవాలని రహస్యంగా నిశ్చయం చేసుకొన్నాడు. ఎందుకలా నిశ్చయం చేసుకున్నాడో బహిరంగంగా ఎప్పుడూ చెప్పాడు కాదు: బహుశః నాయకుడూ అనుచరులూ రెండు వేరు వేరు సంస్థలలో ఉండటం బాగుండదనుకున్నాడు కామాలు! కాంగ్రెసు సోషలిష్టు పార్టీని తన ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకోటానికి వీల్లేదని తేలిసివచ్చింది కామాలు! తాను అధిష్ఠింపదలచిన ఉన్నత శిఖరాన్ని ఎక్కగలందులకు ఈ పార్టీ తనకు నిచ్చెనగా ఉపయోగించదనే తోచిందేమో! కారణాలు ఏమైనాగానీ, మొత్తానికి రాయిష్టులంతా కాంగ్రెస్ సోషలిష్టు పార్టీలోనించి నిష్క్రమించారు; రాజీనామాలు దాఖలుచేస్తూ కాంగ్రెస్ సోషలిష్టు పార్టీ కాంగ్రెసును దుర్బలం చేస్తోందని ఆడిపోశారు. ఆ తరువాత శ్రీ యమ్. యన్. రాయ్ యొక్క, ఆయనగారి 'Independent India' పత్రిక యొక్క రాజకీయ కార్యకలాపమంతా కాంగ్రెసు సోషలిష్టు పార్టీ మీద కారాలు మిరియాలు నూరటం, నిందించటం, అపకీర్తి పాలు చేయటం; అంతే. పార్టీని వారు తమ బుట్టలో వేసుకోలేకపోయారు. కనుక దాన్ని నాశనం చెయ్యాలి; అదీ వారి కోరిక.

ఈ విధంగా ఒక సంవత్సరన్నర కలిసివుండి చివరకు రాయిష్టులు మనమీద దెబ్బదీసి వెళ్ళిపోయారు. ఇంత కాలంనించీ మనం సాధించిన ఐక్యతను కాస్తా భంగంచేసిన బాధ్యత పూర్తిగా రాయిష్టులది. ముఖ్యంగా శ్రీ రాయిది కాని అలా-

విడిపోవటంమూలాన సామ్యవాదోద్యమం తీవ్రంగా దెబ్బ తిన్నట్టేమీ కని పించటం లేదు- డెమొక్రటిక్ ప్రజాపార్టీ ప్రస్తుత కార్యకలాపాన్ని చూస్తూంటే ఏమైనాగానీ శ్రీ రాయ్ గారి అనుచరులంతా అయువవంటివారే అనటానికి వీల్లేను. వారిలో చాలమంది ,రాయిజం' అనే గోతాంలో చిక్కుకోకపోతే సామ్యవాద ఉద్యమానికి ఎంతైనా పనికివచ్చేవారే.

# 2

## బెంగాల్ లేబర్ పార్టీ-పంజాబ్ సోషలిస్టుపార్టీ పంజాబ్ కీర్తి కిసాన్ పార్టీ

ఇక కమ్యూనిస్టుపార్టీతో మన సంబంధ బాంధవ్యాలెట్టివో వివరించే ముందు ఇంకా రెండుపార్టీలున్నాయి; వాటిసంగతి చెబుతాను.

బెంగాల్ లేబర్ పార్టీ ఆరంభంనుంచీ మనపార్టీయెడల స్నేహంగానే ఉంటూవచ్చింది. ఈశత్రుత్వాన్ని రూపుమాపి ఎలాగైనా లేబర్ పార్టీనికూడా సంయుక్తసమితిలోనికి తీసుకురావలెనని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రయత్నించింది. తొందరలోనే ప్రయత్నాలు ఫలించాయి; ఒక,జాయంటుబోర్డు' ఏర్పాటుచేయబడింది. అందులో బెంగాల్ సోషలిస్టుపార్టీనుంచీ, లేబర్ పార్టీ నుంచీ ప్రతినిధులు చెరిసగంగా ఎన్నుకోబడినారు. ఈజాయంటుబోర్డు రెండుపార్టీల కార్యకలాపాలను సమన్వయం చేయవలసియున్నది. కాని కొంతకాలానికి లేబర్ పార్టీ కమ్యూనిష్టుపార్టీలో లీనమైపోయింది ఆ తరువాత మేము దానితో కమ్యూనిస్టుపార్టీతోవలెనే వ్యవహరించవలసివచ్చింది. తరువాతమళ్ళీ అది ఒక స్వతంత్రపార్టీగా తయారై ఫార్వర్డుబ్లాక్ తో చుట్టరికం కల్పించుకుని పనిచేసింది. ఇప్పుడు దానితో మా సంబంధం ఫార్వర్డుబ్లాక్ తోవలె స్నేహపూర్వకంగానే ఉంది. పరస్పరసహకారంఉంది.

పూర్వపు నవజీవన్ భారతసభలోనించి ఉద్భవించింది పంజాబ్ సోషలిస్టుపార్టీ. ఈపార్టీ మొదటినించీ కాంగ్రెసుసోషలిస్టుపార్టీయెడ సద్భావంతోనేఉంది; అందులో కలిసిపోవటానికికూడా ఇచ్ఛగిస్తూనే ఉంది. కొన్ని ఆదర్శవిషయికములైన అభిప్రాయభేదాలు అటంకాలుగాఉన్నాయి. ఉదాహరణంగా పంజాబ్ పార్టీ కాంగ్రెస్ యెడల పూర్తిగా వ్యతిరేక

భావంతో ఉండేది. అయినా కొంతకాలానికి ఈ అభిప్రాయభేదాలు సమసి పోయాయి. పంజాబ్ సోషలిస్టుపార్టీ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో కలిసి పోయింది.

ఇకపోతే పంజాబ్ కీర్తికిసాన్ పార్టీతోకూడా మనసంబంధాలు ఎల్లప్పుడూ స్నేహపూర్వకంగానే ఉన్నాయి. ఒకప్పుడు చాలమంది కీర్తికామ్రేడ్లు పంజాబ్ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో సభ్యులే.

# 3

## భారత కమ్యూనిస్టుపార్టీ

ఇక కమ్యూనిస్టుపార్టీతో మనసంబంధాలు ఎలావుండినవో పరిశీలిద్దాం. ఈసంబంధాలగాధ నాలుగు ప్రకరణాలుగా విభజంపవచ్చు: (1) పార్టీస్థాపించినది మొదలు 1936 జనవరిలో మీరట్ సమావేశం వరకు (2) 1936 జనవరి మొదలు 1937 అగష్టువరకు (3) 1937 అగష్టు మొదలు ద్వితీయ ప్రపంచ సంగ్రామారంభం వరకు (4) సంగ్రామారంభం మొదలుకొని ఇప్పటివరకు.

ప్రథమంలో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఆరంభమైనప్పటినించీ కమ్యూనిస్టుపార్టీ దానియెడల ఈర్ష్యాసూయా ద్వేషాలతో పూర్తిగా శత్రుత్వం వహించివుంది. కాని సోషలిస్టుపార్టీ మాత్రం నిరంతరమూ స్నేహసౌహార్ద్రాలు కాంక్షిస్తూ ఐక్యతకోసం ప్రయత్నించింది. మొదటినుంచీ చివరవరకు పార్టీ ఇట్టి సమరసభావంతో నేఉన్నది. ఈనాడుకూడా కమ్యూనిస్టు పార్టీ ఎంత తీవ్రవైరం ప్రదర్శిస్తూఉన్నా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పరస్పర సహయోధ్యతనే కోరుతున్నది. కాని జరిగిన అనుభవాలను బట్టి అట్టి సహయోధ్యత ఏర్పడగలదన్న ఆశమాత్రం కనిపించటంలేదు.

పార్టీ స్థాపితమైంది; కమ్యూనిస్టులు ఈర్ష్యాగ్రస్తులైనారు. తీవ్రవైరం పూనినారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీని 'బూర్జువాల ప్రాపకంగల వామపక్షం' అనీ 'సోషల్ ఫాసిస్టుపార్టీ' అనీ అడిపోశారు. ఈ 'ఫాసిస్టు' అన్న పదం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో పదేపదే వినుపిస్తూంటుంది. భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీయే కాదు, బ్రిటన్‌లో ఉంటూన్న తదీయ అభిమానులు పామీదత్తు లాంటివారుకూడా కాంగ్రెసుసోషలిస్టు

పార్టీయెడ విరోధమే ప్రదర్శించారు. ఆ రోజుల్లో ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ కమ్యూనిస్టు ఉద్యమం ఒకే రకమైన ప్రత్యేక పాలసీననుసరించి సాగుతోంది. ఈ పాలసీని థర్డ్ ఇంటర్నేషనల్ ఆరవ కాంగ్రెసు నిర్వచించినది. కమ్యూనిస్టుపార్టీలకు ఒక ప్రత్యేకత చేకూర్చుగల పాలసీ అది. దానితో కార్మికోద్యమాలను లేవదీసి సోషలిజంపేరుతో పనిచేస్తోన్న ఇతర సంస్థలన్నిటినీ వారు తీవ్రంగా నిరసింపసాగినారు. నిజానికి వారు బూర్జువాలమీదకన్నా సోషలిస్టు సంస్థలమీదే ఎక్కువపగబూని వ్యవహరించారు. వారు అవలంబించిన ఇట్టి విధానంవలని ఫలితమే ప్రపంచ సోషలిస్టు ఉద్యమంలో కొట్లాటలు, పరస్పరవైరాలు. ఇండియాలోగూడా స్వతంత్ర సోషలిస్టుపార్టీ ఒకటి ఉండటం కమ్యూనిస్టులకు దుస్సహమనిపించింది కామాలు! మార్క్సువాదాన్ని తామే పూర్తిగా గుత్తగొన్నామనుకుంటూ క్షుద్రసంకుచిత చిత్తులైనవారికి కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఒక పోటీ సంస్థగా కనిపించింది; ఇంకేం నడుములు బిగించి కయ్యానికి కాలుదువ్వారు.

ఇలా వారు అవివేకంగా, ప్రదర్శించిన క్రౌర్యానికి తిరిగి మనపార్టీ క్రౌర్యాన్నే ప్రదర్శించలేదు. కమ్యూనిస్టుపార్టీని ఎదుర్కొని ఓడించాలని కోరలేదు: ఒకవినాశకరమైన పాలసీ అనుష్ఠిస్తూ ఎంత తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నా అదికూడా ఒకవిప్లవసంస్థకదా అన్న భావంతో ఉన్నది; తోబుట్టువేఅనుకున్నది. కమ్యూనిస్టుపార్టీ నిరసనభావం చూపింది; పోట్లాటలకు దారితీసింది; కాని మనపార్టీ అన్నిసోషలిస్టువర్గాలను కూడదీసి ఒక సంయుక్త సామ్యవాదసంస్థను స్థాపించవలెనని దారి తీసింది. అందుకుగాను మొట్టమొదట కమ్యూనిస్టుపార్టీతో ఒడంబడిక గావించుకోటానికి ఉద్యుక్తురాలైంది. ఆరోజుల్లో కమ్యూనిస్టుపార్టీ, రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను నెలకొల్పింది. ఈ రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకూడా కమ్యూనిస్టుల అవివేకపు పాలసీలో ఉద్భవించినదే. మనపార్టీ రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌తో సంప్రదింపులు సాగించింది; ఒక ఒడంబడిక జరిగి సంతకాలైనవి. ఇంతపనీ... ఒకవంక కమ్యూనిస్టులు తీవ్రంగా అడిపోస్తూఉన్నా... మన పార్టీ సహృదయంతో తనకుతానై నిర్వహించింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అన్నిసోషలిస్టువర్గాల సమైక్యతను హృదయపూర్వకంగా వాంఛిస్తున్నదని చెప్పటానికి ఇంతకన్నా నిదర్శనమేమి కావాలి?

రెడ్ ట్రేడ్ యూనియన్లు కాంగ్రెస్‌తో ఒడంబడిక చాలరోజులు నిలుపజాలకపోయింది. రెండు పార్టీలూ సంయుక్త ప్రదర్శనాలు జరుపటానికి ఒప్పుకున్నాయి; పరస్పర యుద్ధవిరమణముకూడా ఒడంబడికలో ఒకషరతు. మనమెప్పుడూ కమ్యూనిస్టు పార్టీతో యుద్ధానికి దిగలేదు. కనుక అషరతు ముఖ్యంగా వారు పాటించవలసినదే. రోజులు గడిచాయి. కమ్యూనిస్టు పార్టీ ఒడంబడికను పాటించలేదు. మనపార్టీని దూషిస్తూ రహస్యప్రచారాలు చేశారు. సంయుక్తసమావేశాలనూ, ఉత్సవాలనూ ఏపార్టీకూడా పార్టీజాతి ప్రచారంకోసం వినియోగించుకోరాదని ఒకషరతు ఉంది. అనేక పర్యాయాలు కమ్యూనిస్టులు ఈషరతునుకూడా ఉల్లంఘించి ప్రవర్తించారు. పోనీ, ఇన్నాళ్లనుంచీ అనుసరిస్తూ వచ్చారు ఒకస్వార్థభూయిష్ఠమైన విధానాన్ని; ఒక్కసారి దానిబారినించి తప్పించుకోలేక తప్పటడుగులు వేస్తున్నారు: ముందుముందు జాగ్రతగా మెలగగలరు; ఐక్యత కుదురుతుందిలే - అని అనించాం.

ఈస్థితిలో ఒక్కసంగతి గుర్తుంచుకోవాలి. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకి కమ్యూనిస్టు పార్టీకి విభేదాలు చాలా ఉన్నాయి. అందుచేత తొందరలోనే కమ్యూనిస్టుపార్టీతో మనకు ఐక్యత చేకూరగలదని భ్రమపడలేదు. కాని ఐక్యత వాంఛనీయమే, అయితే, అది భవిష్యత్తులో ఎప్పుడైనా సిద్ధించవలెనంటే- పరస్పరం పోట్లాడుకుంటూవుంటే సిద్ధించదుకదా! కలిసి మెలిసి ప్రవర్తించటానికి ప్రయత్నిస్తూఉంటె సిద్ధించగలదు అని మేము విశ్వసించాం. కమ్యూనిస్టుపార్టీకూడా అట్టి విశ్వాసంతోనే, మాకుమల్లే అంత ఉత్సాహంతోనే ప్రవర్తించినట్లయితే - నిజంగా ఐక్యత కాంక్షించినట్లయితే- చరిత్ర ఇంకొకవిధంగా ఉండేది.

నాటికీ నేటికీకూడా కమ్యూనిస్టుపార్టీ థర్డు ఇంటర్నేషనల్‌కు ఒకశాఖ. కాంగ్రెసుసోషలిస్టుపార్టీ అలాంటిదికాదు; ఒకస్వతంత్ర సంస్థ. విదేశీయ జన్యం కాదు. కమ్యూనిస్టుపార్టీ విదేశీయజన్యం కనుక కాంగ్రెసు పైపోలగి ఉంది. కాంగ్రెస్‌ను ఎదిరిస్తోంది. కాంగ్రెస్ సంస్థలకు పోటీ సంస్థలను నెలకొల్పుతోంది. అల్పాయుష్యపు కార్మిక - కర్షక పార్టీ (Workers and Peasants Party) అటువంటిదే. పుట్టగానే చనిపోయిన (anti imperialist League) సామ్రాజ్యవాద వ్యతిరేకసంస్థ కూడా అలాంటిదే. మనపార్టీ థర్డు ఇంటర్నేషనలు వంశానికి చెందదు కాబట్టి కాని

కాంగ్రెసుకు చేదోడువాదోడుగా ఉంది; కాంగ్రెసును బలపరుస్తోంది. కాంగ్రెసును జాతీయ సమరంలో ప్రధానాయుధంగా ఉండేట్లు పదును పెడుతోంది. కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసును ఒక బూర్జువాసంస్థగా భావిస్తుంది. కమ్యూనిస్టులు బూర్జువాలను నిరసిస్తారు. వారితో యుద్ధంచేస్తారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కాంగ్రెసును ఒక జాతీయ సంస్థగాను, ప్రజా ప్రతినిధి సంస్థనుగా భావిస్తుంది. సోషలిస్టులు అందులో ప్రవేశించాలి; దాన్ని తమవిధానాలకు అనుగుణ్యంగా వృద్ధిలోకి తీసుకురావాలి. ఇక మూడో విభేదం ట్రేడుయూనియన్ ఉద్యమం విషయమై. కమ్యూనిస్టు పార్టీ ఈ యుద్యమాన్ని భిన్నాభిన్నం చేసింది. థర్డు ఇంటర్నేషనల్ ఆజ్ఞలను అనుసరించి తనసొంత రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును స్థాపించింది: ఇలాగ ప్రతిచిన్నపార్టీ తనసొంత యూనియన్లను స్థాపించుకుంటూవుంటే ట్రేడ్ యూనియన్ ఉద్యమం గతియేం కావాలి. కార్మికుల్లో ఐక్యత నిలుస్తుందా? ప్రతిపరిశ్రమాగారంలోనూ, ప్రతి ఫ్యాక్టరీలోను కార్మికులు వివిధయూనియన్లకు చెందినవారై ఉండి తమలో తాము దెబ్బలాడుకుంటారు. ఇంతమాత్రం ప్రాథమిక మార్క్సు సూత్రం కూడా ఆ రోజుల్లో మా కమ్యూనిస్టు మిత్రులకు తెలిసిచావలేదు. వారికేమిటి, థర్డు ఇంటర్నేషనల్కు కూడా తెలియలేదని చెప్పవచ్చు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ విధానం అటువంటిది కాదు; నిజమైన మార్క్సు విధానం వారిది. ట్రేడ్ యూనియన్ ఉద్యమం చెదిరిపోకూడదని వారి నమ్మకం. అన్ని యూనియన్ల ఐక్యతకోసం కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కృషిచేసింది. అట్టి ఐక్యత సిద్ధించునంతవరకూ అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతో చేతులు కలిపింది. తన యాజమాన్యంలో నెలకొన్న అన్ని యూనియన్లనూ అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో కలిపివేసింది. అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసును ఎన్నుకోటంలో మన పార్టీ వివేకంగా ప్రవర్తించింది. ఎందువలనంటే ఆ యితర రెండు సంస్థలు కూడా అందులోనే మున్ముందు లీనము కావలసిఉన్నది. కమ్యూనిస్టులకూ సోషలిష్టులకూ మరొక విభేదంకూడా ఉంది. అది మన మిప్పుడు చర్చిస్తూన్న సోషలిష్టు సంస్థల ఐక్యతావిషయమై. కమ్యూనిస్టుపార్టీ తానే నిజమైన సంస్థయనీ, తానే శాశ్వతంగానిల్చియుండదగిన దనీ, భావించి మిగతా అన్ని పార్టీలనూ శత్రువులుగా చూస్తోంది. కాని మన పార్టీమాత్రం అన్ని

సోషలిస్టు సంస్థలూ పరస్పర సహకారంతో ప్రవర్తించి చివరకు ఒకే ఒక సంయుక్త సోషలిస్టుపార్టీగా వర్ధిల్లవలెనని సర్వదా వాంఛిస్తున్నది.

మనము సోషలిస్టులమే కామనీ, మార్క్సువాదం మనకు అర్థమే కాలే దనీ కమ్యూనిస్టులు అస్తమానం అడిపోస్తూ ఉన్నారు. నాటికీ నేటికీ వారి విమర్శనా పద్ధతి ఆదారిలోనే ఉంది. మార్క్సు వాదాన్ని, లెనిన్ తత్వాన్ని నిజంగా ప్రపంచానికి అనువదించగల ప్రజ్ఞానిధులు తామేనట! కాని ఇంతకన్నా విచిత్రం ఏమంటే— ఈ అహంభావపూరిత మార్క్సు పూజారులు ఇటీవల తమ మాటలు తామే మ్రింగివేస్తున్నారు; మిడిమిడి జ్ఞానంతో ఇంతవరకు తాము ప్రకటించిన ప్రాతిపదిక విధానాలకు భిన్నంగా వర్తిస్తున్నారు. రెండు సంవత్సరాలు ముగియకముందే కాంగ్రెసులోకి పరిగెత్తు కుంటూ వచ్చి చేరారు; రెడ్ ట్రేడ్ యూనియన్లను తీసివేసి అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో చేరారు; సోషలిస్టు సంస్థల ఐక్యత అవసరమేనని పైకి మాత్రం ఒప్పుకుంటున్నట్లు చెప్పారు. దానితో కమ్యూనిస్టుల సామ్యవాదం కేవలం చిలుకపలుకులవంటిదనీ, మూఢవిశ్వాసాలతో నిండినదనీ తేలిపోయింది. అంతకన్నా కాంగ్రెస్ సోషలిస్టుల సామ్యవాదమే ఉత్తమమైనదని రుజువైంది.

ఇక మళ్ళీ అసలు కథకు వద్దాం. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రథమ సమావేశం బొంబాయిలో జరిగినప్పుడు కార్యవర్గం ఒక తీర్మానం చేసింది. కమ్యూనిస్టుపార్టీ పైకి బూని ఉన్నదికనుక ఆ పార్టీ సభ్యులను ఎవరినీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేర్చుకోకూడదని అతీర్మానం. కమ్యూనిస్టుపార్టీ అవలంబిస్తూన్న విధానం వల్లనే అట్టి తీర్మానం తప్పనిసరిగా చేయవలసి వచ్చింది. అయినా ఈతీర్మానాన్ని ఉపసంహరించుకునేందుకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడవలెననీ, అతరువాత క్రమంగా పరస్పర స్నేహసౌహార్ద్రాలతో రెండుపార్టీలూ ఏకము కావలెననీ కార్యవర్గం మనఃపూర్తిగా వాంఛించింది. అందువల్లనే మనపార్టీ జనరల్ సెక్రిటరీ, ఇంకా కార్యవర్గంలోని ప్రముఖ సభ్యులు కొందరూ తరువాత కొన్నినెలల పర్యంతమూ కమ్యూనిస్టు పార్టీ నాయకులతో సంప్రదిస్తూనే వచ్చారు. ఇలా ఒక సంవత్సరం జరిగింది. ఈలోగా థర్డ్ ఇంటర్నేషనల్ ఏడవ కాంగ్రెసు మాస్కోలో సమావేశమై ప్రస్తుత విధానంమార్చి, పూర్వపు విధానాన్నే అనుసరించవల

చివరిదిగా తీర్మానమైంది. తదనుగుణ్యంగానే భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ కాంగ్రెస్ యెడల, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యెడల ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యెడల తన వైఖరి మార్చుకున్నది.

1936 జనవరిలో మన పార్టీ ద్వితీయ సమావేశం మీరట్‌లో జరిగింది. జనరల్ సెక్రెటరీ నివేదిక ననుసరించి ... కమ్యూనిస్టు పార్టీ సభ్యులను కార్యవర్గ సభ్యులు అనుమతిస్తే మన పార్టీలో చేర్చుకోవటానికి అభ్యంతరం ఉండదని కార్యవర్గం ఏకగ్రీవంగా తీర్మానించింది. మన పార్టీ ఇలా ఏకగ్రీవంగా తీర్మానించినందుకు హర్షించవలె. కమ్యూనిస్టు పార్టీలోని ప్రముఖ వ్యక్తులు మన పార్టీ ముఖ్యాశయాలను అంగీకరిస్తారని ఉన్నారన్న నమ్మకంతోనూ – అట్టివారిని మన పార్టీలో కలుపుకోవటంవల్ల సోషలిస్టు ఉద్యమాన్ని బలపరచుటవుతుందన్న విశ్వాసంతోనూ – ఆ తీర్మానం చేశారు. కాని అధికారరీత్యా కమ్యూనిస్టు పార్టీ తన పాత విధానాన్నే అవలంబిస్తూ వచ్చింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఇలాగ ఐక్యతకోసం సర్వవిధాలా శాయశక్తులా కృషి చేస్తూంటే కమ్యూనిస్టు పార్టీ ఒక్క ప్రతినిధిని మాత్రం మీరట్ సమావేశానికి పంపింది ఎందుకు? బూర్జువాల పాటు పక్షపు వ్యవహారాలను పరిశీలించి ఒక నివేదిక తయారుచేసి పంపేందుకు.

ఈ విధంగా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఆదరంగా చాచిన చేయి అందుకోటానికి కమ్యూనిస్టులు ఎన్నో నెలలు గడచిపోయాక గాని ముందుకు రాలేదు. లక్నో కాంగ్రెసు సమావేశమప్పుడు వారు మాతో చేతులు కలిపారు; మేము చాల సంతోషించాం. సోషలిస్టు సంస్థల ఐక్యత సిద్ధించగలదనుకున్నాం. అప్పటికి రాయిస్టులు మాతో కలిసి వున్నారు; కమ్యూనిస్టులు కూడా క్రమేణా మాలో చేరిపోగలరని అనుకున్నాం. ఇక అందరమూ కలిసి పనిచేస్తూంటే తొందరలోనే విభేధాలు నశించిపోతాయనీ, పరస్పర విశ్వాసం పెంపొందుతుందనీ, ఒక సంయుక్త సోషలిస్టు పార్టీ ఏర్పడగలదనీ ఆశించాం.

అయినా ఇంకా మాకూ, కమ్యూనిస్టు పార్టీకీ గల విభేదాలను గుర్తించే ఉన్నాం. ముఖ్యంగా థర్డ్ ఇంటర్నేషనల్ అధికారానికి లోబడి ఉండటం గురించి భేదాభిప్రాయం ఉండనే ఉంది. కాని ఉద్యమం వృద్ధి చెందుతూన్న కొద్దీ ఎదురయ్యే సమస్యలను క్రమేణా పరిష్కరించుకోగలమని

అనుకున్నాం. అన్ని సమస్యలనూ ఆరంభంలోనే పరిష్కరించుకోవటానికి ప్రయత్నించటం సాధ్యం కాదుగదా! ఉద్యమం వృద్ధిచెందితే వచ్చే ఇబ్బందులను తొలగించుకోగల శక్తి. బలం లభిస్తాయి. మాకుమల్లేనే ఇతర పార్టీల వారుకూడా నిజంగా ఐక్యతను కాంక్షించి, అందుకోసం తీవ్రంగా కృషిచేసినట్టయితే మేమనుకున్నట్టు అంతా సవ్యంగానే జరిగిపోయేది.

"మొత్తానికి ఎలాగైతేనేం మనపార్టీ మీరట్ సమావేశం అయాక కమ్యూనిస్టులు చాలమంది మనపార్టీలో చేరారు. మీరట్ తీర్మానంలో... కార్యవర్గం అనుమతిననుసరించి కమ్యూనిస్టులు కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేర్చుకోబడతారని ఉంది, కాని అట్టి అనుమతి లేకుండానే చాలమందిని చేర్చుకున్నాం. కార్యవర్గానికి ఆసంగతి తెలుసు; అయినా అభ్యంతరపెట్టలేదు; ఉదారంగా ఊరుకుంది. అదే పెద్ద పొరపాటైంది. కమ్యూనిస్టులు కపటవేషాలతో వచ్చి మనపార్టీలో చేరారు. అందువల్ల తరువాత చాల ఇబ్బందులే వచ్చాయి. అప్పుడు వారు 'మేము అసలు కమ్యూనిస్టుపార్టీ సభ్యులమే కాద'ని కూడా చెప్పగలిగారు.

కాలక్రమాన ఎక్కువమంది కమ్యూనిస్టులు పార్టీలో చేరారు. చాల కటువైన సమాచారాలే వినవచ్చాయి. 1936 చివర నెలలలో కమ్యూనిస్టులు పార్టీలో విభజన కార్యక్రమం (చీలికలు లేవదీయటం) ఆరంభించారనీ, పార్టీ ఏర్పరచిన సంస్థలను తమస్వాధీనంలోకి లాక్కోటానికి ప్రయత్నిస్తున్నారనీ వార్తలు వినవచ్చాయి. ఇట్టి రిపోర్టులు ఆంధ్రదేశంనుంచి ఎక్కువగా వచ్చాయి. కాన్పూరు, బొంబాయి, కలకత్తా మొదలైన చోట్లలోని లేబర్ ఫిర్కాలనించి వచ్చిన రిపోర్టులబట్టి రెండుపార్టీల అనుచరుల మధ్య కూడా సంబంధాలు విషమిస్తున్నట్టే తెలియవచ్చింది. లేబర్ ఉద్యమంలో మరెవ్వరినీ కలుగచేసుకోనీయమని కమ్యూనిస్టులు పట్టుపట్టారు. అయితే స్వార్థపరులను, పేరుకోసం పాకులాడే వారినీ కూడా కలుగచేసుకోనీయకుండా వుంటే బాగుండేది. కాని కమ్యూనిస్టులు అట్టివారితోనే చేతులు కలిపి, లేబర్ ఉద్యమంనుంచి సోషలిస్టులను నెట్టివేయటానికి ప్రయత్నించారు. ఇకపోతే మనపార్టీలో వారు చీలికలు కల్పించటానికి చేస్తున్న ప్రయత్నాలను గురించి కాంగ్రెసు సోషలిస్టు కార్యవర్గం తీవ్రమైన చర్యేమీ తీసుకోలేదు. జాగ్రతగా ఉండవలసినదని మాత్రం రాష్ట్రసంస్థకు హెచ్చరిక జారీచేశారు; అంతే.

కొన్ని నెలలు ఇలాగే సాగిపోయాయి. చివరకు ఆగస్టు 1937 లో నేమిక ఓపిక పట్టలేకపోయాం. కమ్యూనిస్టుల యెడ మా విధానం మార్చుకోవలసి వచ్చింది. అప్పటికి రెండవభాగం పూర్తిఅయిపోయి, మూడవభాగం ఆరంభమైందన్నమాట. రాయిస్టులవలె కమ్యూనిస్టులుకూడా తమకు తామే మాతో కల్లోలం పెట్టుకుని లేచిపోయారు. కాంగ్రెసు సోషలిస్టు కార్యవర్గం పాట్నాలో సమావేశమైంది. ఆ సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ ప్రకటన ఒకటి చదివివినిపించారు. అది మాకొక పెద్ద అఘాతంగా తగిలింది. చాలకోపం వచ్చేసింది. అది కమ్యూనిస్టుపార్టీవారి రహస్యపుడాక్యుమెంటు; సభ్యులకొరకు మాత్రమే ఉద్దేశింపబడినది. ఆ డాక్యుమెంటులో క్లుప్తంగా ఇలా ఉంది; కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నిజంగా సోషలిస్టు పార్టీ కాదు. కమ్యూనిస్టుపార్టీకి పోటీగా మరొక పార్టీ ఉండకూడదు. అది కమ్యూనిస్టుపార్టీ సహించదు. కమ్యూనిస్టుపార్టీయే నిజమైన సోషలిస్టు పార్టీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వామపక్ష బలంకోసం ఉపయోగపడేట్లుగా మాత్రమే వృద్ధి చెందవలసి యున్నది.

కమ్యూనిస్టుపార్టీవారి యీ డాక్యుమెంటు స్వరూపాన్ని సాకల్యంగా గమనించాలి మనం. కాంగ్రెసుసోషలిస్టుపార్టీయెడ వారి దృక్పథం ఎలాంటిదో అందులో విశదమైంది. వారికముందు అనుసరింపదలచిన విధానాలు కూడా అందులో వ్యక్తమైనాయి. అయినా పాట్నాసమావేశంలో మన కార్యవర్గం రానున్నఆపదలను నిర్లక్ష్యంచేసింది; ఐక్యత కావలెనన్న ఆదర్శం కోసమే పాకులాడింది. అదే పొరపాటైంది, తరువాత విచారించవలసి వచ్చింది. అపై డాక్యుమెంటు కాంగ్రెస్‌సోషలిస్టుపార్టీకి, కమ్యూనిస్టుపార్టీకి జరిగిన అన్ని ఒడంబడికను యావత్తూ దగ్ధంచేసింది. ఈరెండూ సోషలిస్టు పార్టీలేనని, కాలక్రమాన పరస్పర సహయోధ్యత కుదిరి రెండూ ఒక పార్టీగా పరిణతి చెందగలవనీ ఆ ఒడంబడిక ఉద్దేశం. అట్టి ఉద్దేశమే లేకపోతే సోషలిస్టుసంస్థల ఐక్యత కావాలి అన్ననినాదంలో అర్థమేముంది? ఆడాక్యుమెంటు అహంభావయుక్తంగా చెప్పినట్టుసోషలిస్టుపార్టీ ఒకటే ఉంటే మరొకసోషలిస్టుపార్టీతో ఐక్యత కావాలన్న సమస్యేఉత్పన్నం కాదుగా? అంటే కమ్యూనిస్టుపార్టీ తనఒంటిమిట్ట రాములింగనివిధానం విడిచిపెట్టలేదన్నమాట. కాక తన యిష్టప్రకారం సోషలిస్టు ప్రపంచాన్ని గుత్తగొనవలెనన్న నిరంకుశత్వం విడనాడలేదన్నమాట! సోషలిస్టుసంస్థల ఐక్యతలో తనకు విశ్వాసం

లేదన్న మాట! ఐక్యత కావాలన్న నినాదాన్ని ఉపయోగించుకుని, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీతో సంబంధం ఏర్పరచుకుని, తిరిగి తన ఏకైక ప్రాబల్యాన్ని అర్జించుకోదలచినదన్న మాట! కమ్యూనిస్టుపార్టీ ప్రాభవానికి ఉపయోగపడేట్టుగా మాత్రమే కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని వృద్ధిలోకి తీసుకురావలెనని డాక్యుమెంటు చెబుతోంది. ఆ చెప్పటంలో అర్థం అదేగా! కమ్యూనిస్టుపార్టీ ఒక పోటీసంస్థను సహించలేదు- అని డాక్యుమెంటులో ఉన్న మాటకు అర్థంఏమిటి? ఐక్యత తనకు అక్కర్లేదనేగా! ఇరుపార్టీలవారు ఐక్యతలో విశ్వాసం కలవారైతే ఒకపార్టీ ఇంకొకపార్టీకి పోటీ ఎలాగౌతుంది? కనుక ఆ డాక్యుమెంటువల్ల తేలిన అంశాలేమంటే- కమ్యూనిస్టుపార్టీకి ఐక్యతలో నమ్మకంలేదు ఇంకొక సోషలిస్టుపార్టీని తాను గుర్తించదు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని నాశనం చెయ్యాలని దానికోరిక; తనప్రాబల్యానికి మన పార్టీని ఉపయోగించుకోవాలని ఉద్యమించింది.

ఇదంతా మన కార్యవర్గంవారికి అశనిపాతంలా సోకింది; అందరూ ఉగ్రులై పోయారు. అప్పుడు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యవర్గంలో నలుగురు కమ్యూనిస్టు కుహనామూర్తులు ఉన్నారు. వాళ్లుకూడా కోపం వచ్చినట్టే నటించారు ఎక్కడ బయటపడిపోతామోఅని. వారిలో ఒక్కడు కూడా నోరెత్తి ఆ డాక్యుమెంటును సమర్థించలేదు. కొంతసేపు చర్చజరిగింది. ఇకనించి కమ్యూనిస్టుపార్టీసభ్యులను ఎవరినీ పార్టీలో చేర్చుకోరాదని ఏకగ్రీవంగా తీర్మానించటమైంది. తరువాత కలిగిన అనుభవాన్నిబట్టి అలా తీర్మానించటం పొరపాటేనని తెలిసింది. ఇకముందు కమ్యూనిస్టు సభ్యులను చేర్చుకోకుండా ఉండటమే గాక, ఇదివరకు చేరియున్నవారిని తక్షణమే వెళ్ళగొట్టవలెననికూడా తీర్మానిస్తే బాగుండిపోయేది. కాని ఐక్యతా సముపార్జనకు అత్యంతం ఆటంకములేనాయనిపించే పనులు చేయటానికి కార్యవర్గంవారు వెనుకాడుతూ వచ్చారు మొదటినించీ ఇకముందు చేర్చుకోమని తీర్మానించినంత మాత్రాన్నే కమ్యూనిస్టులు తమ తప్పులు సవరించుకుని దారికి వస్తారని కార్యవర్గంఆశించింది. కమ్యూనిస్టుపార్టీలో ఐక్యత వాంఛించే ఉత్తమవ్యక్తులు కొందరైనా ఉండవచ్చుననికూడా ఆశించింది. ఈ ఆశలు తుదకు నిరాశలే ఐనాయి.

ఈ విధంగా రాయిస్టుల తరువాత సోషలిస్టుల ఐక్యతకు భంగం కలిగించింది కమ్యూనిస్టులే.

1937 ఆగష్టు తరువాత పరిస్థితులు నానాటికీ దిగజారిపోయాయి. మన పార్టీకి పూర్తిగా విసుగెత్తిపోయింది. పార్టీలోనించి కమ్యూనిస్టులను బహిష్కరించి వెయ్యటంతప్ప గత్యంతరం లేదనిపించింది. నెలల తరబడి ఆలోచించాం. కాని అంతపని చేయలేకపోయాం. అలా బహిష్కరించడం వల్ల ఐక్యతకోసం ఇన్నాళ్ళనించీ కొనసాగించిన కృషి యావత్తూ భగ్నం చేసినట్లు ఔతుందనీ 'ఇక ఐక్యతకు పూర్తిగా తిలలు విడవవలసి వస్తుంది' అనీ భయపడ్డాం. అందుచేత ఏమీచర్య తీసుకోలేదు; కమ్యూనిస్టులను పార్టీలోనే ఉంచుకుని పోషించాం. అదిగో ఆసమయంలోనే పార్టీ పునర్నిర్మాణం చేస్తూ మన జనరల్ సెక్రెటరీ ఆంధ్రా పార్టీని యావత్తూ వారికి ఒప్పజెప్పేశాడు. అందుకు కార్యవర్గంకూడా ఆమోదించింది తరువాత,

ఏప్రియల్ 1938లో మన పార్టీ సమావేశం లాహోరులో జరిగింది. ఈ విషాద గాథలో ఆసమయం చాల ముఖ్యమైనది. మన కార్యవర్గానికి కమ్యూనిస్టుపార్టీ ఒక విచిత్రమైన, హాస్య రసప్లుతమైన చిన్న లేఖ పంపించింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీకూడా మార్క్సు వాదానుగుణ్యమైన ఒక విప్లవాత్మక సంస్థేనని తాము అంగీకరిస్తున్నట్లూ — ఈ రెండు పార్టీల కలయిక వల్లనే సోషలిస్టు — ఐక్యత సాధ్యము కాగలదని తాము విశ్వసిస్తున్నట్లూ — ఆలేఖలో తెలియజేసారు. అప్పటికి పాట్నా సమావేశం ముగిసి ఎనిమిది నెలలయింది. పాట్నా సమావేశమప్పుడు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అసలు సోషలిస్టుపార్టీయే కాదని వారు డాక్యుమెంటు జారీచేశారు. ఈ ఎనిమిదినెలలలో అది వారి దృష్టిలో ఒక విప్లవాత్మక సోషలిస్టు సంస్థగా వృద్ధిపొందింది. థర్డ్ ఇంటర్నేషనల్ ఇండియా బ్రాంచివారి (కమ్యూనిస్టుల) హృదయాలను ఈనాడు అంతగా ఆకర్షించగలిగామంటే — ఈలోగా మేము ఎంతో అభ్యుదయాన్ని సంపాదించామన్నమాట! ఈహాస్యప్లుతమైన లేఖను ఎవరూ లెక్కచెయ్యలేదు. ఆలేఖలోని అంతర్యం అందరికీ తెలిసినదే. సంగతేమంటే — కమ్యూనిస్టు పార్టీకి వొణుకుడుపుట్టింది; పాట్నా సమావేశం మొదలుగా కమ్యూనిస్టు పార్టీ వారి కపటపు పన్నుగడలయెడల క్రోధం క్రమంగా పెరుగుతూవచ్చింది. మన పార్టీలోనించి కమ్యూనిస్టులను వెడల నడపవలసిన సమయం ఆసన్నమైంది. చాలకాలంగా ఐక్యతను వాంఛిస్తూ వాళ్ళను మనపార్టీలో ఉంచుకున్నాం. అది అవకాశంగా తీసుకొని వాళ్ళు మన పార్టీని తమ ప్రాబల్యానికి వని

యోగించుకున్నారు. ఇప్పుడు లాహోర్ సమావేశానికి యమ్. ఆర్. మసాని అధ్యక్షుడు కావటంతో కమ్యూనిస్టులకు మరీ భయం హెచ్చిపోయింది. ఆయన కమ్యూనిస్టు వ్యతిరేకి అని వారు అడిపోశారు. కాని నిజానికి ఆయన అటువంటి వాడేమీ కాదు, కరాఖండీ మనిషి; అసాధారణ నిర్మాణ చాకచక్యం కల వాడు. అందుచేత ఆయనంటే కమ్యూనిస్టులకు కోపం, భయం. ఆయన కమ్యూనిస్టువిధానాలతో ఏకీభవించడు. అయినా రెండు స్వతంత్ర పార్టీల మధ్య ఉండవలసిన పరస్పర సయోధ్యను వాంఛిస్తాడు. కాని ఐక్యతా నినాదాన్ని పురస్కరించుకుని కమ్యూనిస్టులు పార్టీలో దూరి చీలికలు తీసుకురావటానికీ, పార్టీని తమ స్వీయ ప్రాబల్యంకోసం వినియోగించుకోటానికీ చేస్తున్న నీచపుపనులు ఆయనే ప్రథమంగా కనిపెట్టాడు. అందుచేత ఆయన పార్టీలోనించి కమ్యూనిస్టులను వెళ్ళగొట్టుటకే ఇచ్ఛగించాడు. కమ్యూనిస్టులయెడ శత్రుత్వం ప్రకటించవలెనని కాదు అందులో ఉద్దేశం. వారు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి చేస్తున్న ద్రోహాన్ని అణగద్రొక్కటానికీ, వారి నీచపుపనులను వారించటానికిన్నీ. అనుభవంవల్ల మసానీసలహా సమంజసమైనదేనని రుజువైంది. సోషలిస్టు కార్యవర్గం పాట్నాతీర్మానాన్ని పునరుద్ఘాటించరేమోననీ, మీదుమిక్కిలి ఇంకాయేమన్నా తమకు విరుద్ధమైన తీర్మానాలే చేస్తారేమోననీ కమ్యూనిస్టులు భీతిచెంది, ఆలేఖ పంపించారు. పాపం! కాని వారు అంతశ్శుద్ధిలేని మనుష్యులన్న సంగతి సమావేశంలోనే విశదమైంది.

కార్యవర్గం ఆలేఖను అంతగా లెక్కచేయలేదు. అయినా పాట్నా తీర్మానాన్ని పునరుద్ఘాటించారు. ఐక్యత కావాలన్న ఆదర్శాన్ని పార్టీ విడనాడలేదు. 'ఏకైక కార్యక్రమం' ఉండాలనికూడా ఉద్ఘాటించారు. కమ్యూనిస్టుసభ్యులను పార్టీలో ఉండనిచ్చారు. నిజానికి కమ్యూనిస్టులను పార్టీలోనించి వెళ్లగొట్టవలసిన సమయమే ఏతెంచింది. కాని కార్యవర్గం అంతపనికి పూనుకోలేదు. 'ఏకైక కార్యక్రమ'నినాదం ఏమైనా ఫలిస్తుందేమోనని ఆశపడ్డారు. అందువల్ల కలిగిన లాభమేమీ లేదు. పార్టీ చాల నష్టపడింది.

సమావేశంలోనే కమ్యూనిస్టుల ప్రవర్తన వారు పంపినలేఖకు విరుద్ధంగా ప్రదర్శితమైనదని పైన చెప్పాను. కార్యవర్గసభ్యుల ఎన్నికల విషయంలో ఒక కమ్యూనిస్టులలిస్టు తయారుచేసి దానికే అందరూ వోటుచేశారు.

అంటే ఒకవంక ఐక్యత కావాలని చెబుతూకూడా వారు మన పార్టీని ముట్టడించి కొయ్యాలని చూస్తున్నారన్నమాట! అలా ముట్టడించాలని చూచే రాజనీతికీ, ఐక్యత కావాలని కోరే రాజనీతికీ దక్షిణోత్తర ధృవాల కున్నంత అంతరం ఉంది; అవి పరస్పర విరుద్ధాలు, కాని కమ్యూనిస్టుల విచిత్ర పరిభాషలో అవి విరుద్ధాలుకావు. అందుచేతనే వారు మాటమాటకీ విప్లవనిరోధమే విప్లవమని భావిస్తుంటారు.

లాహోర్ సమావేశంతరువాత కొన్ని నెలలకు మరొక సాక్ష్యం దొరికింది. కమ్యూనిస్టుపార్టీవారి నోటీసు ఒకటి మసానీకి దొరికింది, ఆయన దాన్ని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీపై కమ్యూనిస్టులకుట్ర అన్న శీర్షికతో ప్రకటించాడు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నెలకొల్పిన వివిధసంస్థలను కమ్యూనిస్టులు ఎలాగ ముట్టడించి తమ స్వాధీనం చేసుకోవలెనో ఆదొంగ ఎత్తులన్నీ ఆనోటీసులో వివరింపబడినవి. దాన్నిబట్టి కమ్యూనిస్టులు కోరుతూన్న ఐక్యత ఎలాంటిదో మరొకసారి తెలియవచ్చింది. అయినా మన కార్యవర్గం వారు ఏమీచర్య తీసుకోలేదు; అలాగే సాగిపోనిచ్చారు. ఐక్యత చేకూరుతుందేమో ఆశలు పూర్తిగానే నశించిపోయాయి. అయినా ఏమీ చర్య తీసుకోలేదు. అవి మనపార్టీకి చెడురోజులు. పరిస్థితులు సవ్యంగాలేవు. పార్టీ దుర్బలమౌతూ వచ్చింది. అది అదనుగా తీసుకుని శత్రువులు బాగా పుంజుకున్నారు.

విషమ పరిస్థితులు ఇలాగే కొన్నాళ్ళు సాగాయి. ఈ కుళ్ళులోనించి బయటపడేందుకు రెండేమార్గాలు గోచరించాయి: కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెసు సోషలిష్టుపార్టీ – ఈ రెండూ కలిసిపోవాలి; లేదా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఇంతకాలంనించీ తనలో ఉన్న ఇతర పార్టీ సభ్యులను వెడలనడిపి, తన్ను తాను పునర్నిర్మాణం చేసుకోవాలి. పూర్వానుభవాన్ని బట్టి మొదటిమార్గం అసంభవమని తేలిపోయింది. కమ్యూనిస్టులయెడ నాకు సద్భావం నశించింది. కమ్యూనిస్టునాయకులతో ఈ విషయమై సంప్రదించాను. ఆదర్శాలలో సామ్యంలేనిదే ఈ రెండుపార్టీలూ కలిసిపోవటం సంభవంకాదుగదా! అట్టి ఆదర్శాల సామ్యాన్ని సృష్టించగలందులకు ప్రయత్నించవలెనని అంగీకరించాం. కాని అట్టి ప్రయత్నాలేమీ ఫలించలేదు. పైగా ఈలోగా రోజురోజూకూ రాజకీయరంగంలో రెండు పార్టీలమధ్య

విభేదాలు మరీ పెరిగిపోతూ వచ్చాయి. తరువాత త్రిపురీసమావేశం, ఆ తరువాత కలకత్తా సమావేశం కూడా జరిగాయి. కమ్యూనిష్టు పార్టీకి జాతీయోద్యమంలో స్వతంత్రశక్తి లేదు. అందుచేత విచలితమై వామ పక్ష నాయకత్వం కోసం ఆటూ ఇటూ ఎవరు ఎక్కువగా కాంగ్రెస్‌ను అడిపోస్తుంటే వారివైపు పరిగెత్తుతూ కాలక్షేపం చేసింది.

ఇంతకూ రెండుపార్టీలూ కలియటం అసంభవమని రూఢిగా తెలిసిపోయింది. అయినా మన పార్టీ కార్యవర్గం వారు కమ్యూనిస్టు సభ్యులను మన పార్టీలోనించి తొలగించటానికి పూనుకోలేక పోయారు. అందుచేతనానాటికీ పార్టీ కమ్యూనిస్టుల చేతుల్లోకి జారిపోతోంది. చివరకు కొందరు ప్రముఖవ్యక్తులు కార్యవర్గంలోనించి రాజీనామా లిచ్చి వచ్చేశారు. దానితో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వర్గాలలో కలకలం బయలు దేరింది. అది కమ్యూనిస్టు పార్టీకి, దాని అనుచరులకూ, మన పార్టీ కార్యవర్గం లోని కమ్యూనిస్టు కుహనామాత్రులకూ చాల సంతోషమైంది.

ఇట్టి పరిస్థితులలో – 1939లో – బొంబాయిలో మన కార్యవర్గం సమావేశమైంది. అప్పుడే అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం కూడా జరుగుతోంది. పార్టీలో చీలికలు ఏర్పడకుండా కాపుదల చేసుకో వలసిన సమయం అసన్నమైనదనీ, ఇలా పరిస్థితులు దిగజారి పోతోంటే చూస్తూ ఊరుకుండ రాదనీ– కార్యవర్గ సభ్యులందరూ (కమ్యూనిస్టు సభ్యులు తప్ప) అంగీకరించారు. కనుక పార్టీలోని కమ్యూనిస్టులకూ, తదితర పార్టీ సభ్యులకూ తుదిచీటీ యివ్వించ వలసినదేనని కార్యవర్గంలో చాలమంది అభిప్రాయ పడ్డారు. చర్చలు ముగిసిన పిదప ఆ విషయపరిష్కార బాధ్యతను జనరల్ సెక్రటరీ అయిన నామీద మోపారు. సోషలిస్టు ఉద్యమంలో ఒక విషాద పరిస్థితిని తెచ్చిపెట్టటం నాకు మనస్కరించలేదు. నేను ఒక విధంగా సమరసమైన తీర్పు ఇచ్చాను. ఒక స్వతంత్ర సంపూర్ణ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ స్థాపనకు నేను అంగీకరించాను. కాని ఇన్నాళ్ళనించీ పార్టీలో మెంబర్లుగా ఉన్న కమ్యూనిస్టులను వెళ్ళగొట్ట నక్కర్లేదనే సలహా యిచ్చాను. అలా వెళ్ళగొట్టేస్తే పరస్పరం క్రోధాలు పెరిగిపోయి మరీ దూరమైపోతామని అభిప్రాయపడ్డాను. కాని పార్టీ వ్యవహారాలను నడిపే బాధ్యతలన్నీ అసలైన సభ్యుల చేతుల్లోనే ఉండాలి; ఇతర పార్టీల్లో

కూడా సభ్యులుగా ఉన్నవారిచేతుల్లో పెట్టరాదు అని గట్టిగా చెప్పాను. ఈ తీర్పు కార్యవర్గం అంగీకరించింది. ఇకముందు సంపూర్ణ స్వతంత్ర సంస్థగానే మన పార్టీ వృద్ధిచెందవలెనని ఆశించాం. దానితో పరిస్థితులు పూర్వంకన్నా కాస్త బాగుపడ్డాయి. కాని పూర్వపు విధానాన్ని పూర్తిగా మార్చుకోలేక పోవటం వల్ల కొన్ని యిబ్బందులు పడవలసే వచ్చింది.

బొంబాయి తీర్మానం మనపూర్తిగా చేసింది కాదు. మనపూర్తిగా ఆచరణలోకూ పెట్టలేదు. నిజానికి ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభ మయేంతవరకూ దాన్ని ఆచరణలో పెట్టనేలేదు. ఇక్కడ ఒక విచిత్రమైన – విచారకరమైన సంఘటనము చెప్పవలసి యున్నది. బొంబాయి తీర్మానం అయిన తరువాత జనరల్ సెక్రటరీ తన సొంత అధికారంమీదే సంయుక్తరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అలహాబాద్ కమిటీలో ఎనిమిది మంది కమ్యూనిస్టులకు ప్రవేశం ఇచ్చాడు. తన మాదిరిగానే కమ్యూనిస్టులుకూడా ఉదారంగా ప్రవర్తించక పోతారా అన్న ఆశతో – వారిలో పరివర్తన కలిగితే ఈ దేశపు సోషలిస్టు ఉద్యమంలో కొత్త ప్రకరణం ఆరంభించ గలదన్న ఆశతో – జనరల్ సెక్రటరీ అంతవరదాకా వెళ్ళాడు. కాని ప్రయోజనం లేకపోయింది. దొరకిన అవకాశాలన్నీ కమ్యూనిస్టులు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని దిగనార్చటానికే వినియోగించుకున్నారు.

సెప్టెంబరు 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభమైంది ఈ యుద్ధంమూలంగా సోషలిస్టు – ఐక్యత విషయమై కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ విధానం మారినదిలేదు. యుద్ధారంభం వరకూ ఈ ఐక్యతాగాథ వివరించాను కదా! ఆరంభంలో చాల పట్టుదలతో, ఉత్సాహంతో సోషలిస్టు శక్తులన్నింటినీ పార్టీలోనికి సమీకరిద్దామని ఉద్యమించాం. కాని రాను రాను నిరుత్సాహం పెరిగి బలవంతాన ఆ ఉద్యమంనించి విరమించుకోవలసినంత పనైంది. చివరకు స్వతంత్రంగా ఇతర పార్టీసభ్యులు లేకుండా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నిర్మించుకుందామని ఉద్దేశించాం. ఇంతలో యుద్ధం ఆరంభమైంది. ఒకవేళ ప్రభుత్వం దమననీతి అనుసరించవచ్చు; పార్టీని నిషేధించవచ్చు. అందుచేత అర్జంటుగా కొన్ని ఏర్పాట్లు చేసుకోవలసి వచ్చింది. బొంబాయి తీర్మానాన్ని ఆచరణలో పెట్టవలసిన

అవసరమూ ఏర్పడింది. కనుక యుద్ధం ఆరంభంకాగానే రాష్ట్రాలలో కొన్ని కమిటీలను అప్పటికప్పుడు నెలకొల్పినాము. ఆ కమిటీలలో ఇతర పార్టీ సభ్యులెవరూ లేకుండా జాగ్రత్తపడ్డాం. ఇంకా కమ్యూనిస్టులు పార్టీలో ఉన్నారు. ఇంకా పార్టీ పరస్పర సహోద్యోగ్యాను కోరుతూనే ఉంది. ఊరికే కమిటీలను నెలకొల్పటంలో కాదు; అసలైన కార్యక్రమం కమ్యూనిస్టుపార్టీ హృదయ పూర్వకంగా సహకారం ఇచ్చేట్టయితే మన పార్టీ చేతులు కలపటానికి సిద్ధంగానే ఉంది.

యుద్ధం ఆరంభించగానే కమ్యూనిస్టుపార్టీ విధానం హఠాత్తుగా మారిపోయింది. ఇన్నాళ్ళనించి కప్పుకున్న ముసుగు తీసివేసి కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో బహిరంగంగా శత్రుత్వం ప్రకటించింది; కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతోనే కాదు – తాను ఇదివరకు కలిసి పనిచేసిన ప్రతి అభ్యుదయ సంస్థతోనూ కాంగ్రెస్‌తో, ఫార్వర్డుబ్లాక్‌తో వైరం ప్రకటించింది.

కమ్యూనిస్టుపార్టీవారి యీ ప్రవర్తనము సరిగా అర్థమయ్యేందుకు ఒక సంఘటనము చెబుతాను. అక్టోబరు 1939 లో అన్ని వామపక్షాల ప్రతినిధులతోకూడిన ఒక సభ లక్నోలో సుభాస్ చంద్రబోస్ అధ్యక్ష్యంలో జరిగింది. వివిధ వర్గాలవారి యుద్ధవ్యతిరేక కార్యక్రమాలను నడిపేందుకు ఒక 'సంయుక్త అధ్యక్ష్యం' (Joint command) కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులు, ఇంకా మరికొన్ని ఇతర పార్టీల ప్రతినిధులు ప్రతిపాదించారు. మనపార్టీ ప్రతినిధులు ఆ ప్రతిపాదనను ప్రతిఘటించారు. ఎందు చేతనంటే – దానిపై ఏకగ్రీవమైన అంగీకారం లేదు; పార్టీలలో పరస్పర విశ్వాసం లేదు; కనుక అది ఆచరణయోగ్యం కాదని వారి వాదన. వారు మరొక ప్రతిపాదన చేశారు. ఒకే ఒక కార్యక్రమం రచించి, దాన్ని అన్ని పార్టీలవారూ పరస్పర సహకారంతో అనుష్ఠించవలెనని. చివరకు ఆ ప్రతిపాదనకు నెగ్గింది. ఏడు అంశాల కార్యక్రమం రచితమైంది. హాజరైన ప్రతినిధులంతా దాన్ని ఆమోదించారు. అంతటితో ఆ సమావేశం ముగిసింది. భవిష్యత్ కార్యక్రమం ఒకటి నిర్ణీతమై అందరూ ఒప్పుకున్నారు. కాబట్టి కనీసం ఆ సమావేశంలో ప్రాతినిధ్యంగల సంస్థలన్నీ కలిసి పరస్పర సహకారంతో వ్యవహరిస్తాయి కదా అని ఆశించాం. అలా జరిగి

వట్టయితే ఆ సమావేశం చరిత్రలో ఎంతో ప్రముఖస్థానం ఆక్రమించేది. కాని అలా జరుగలేదు. కమ్యూనిస్టుపార్టీ అలా జరుగనీయ లేదు.

తరువాత మరి మూడువారాలకు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని విమర్శిస్తూ కమ్యూనిస్టుపార్టీగ్రంథం ఒకటి బయటపడింది. దానితో మేము 1934 నాటికి వెనక్కు వెళ్ళిపోయాం. ఇంత అకస్మాత్తుగా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ మీద కమ్యూనిస్టు మిత్రులు ఎందుకు యుద్ధం ప్రకటించారో — ఆ కారణాలేమీ ఇంతవరకూ మాకు తెలిసిరాలేదు. ఈ గ్రంథం నవంబరులో వచ్చింది. లక్నో సమావేశం తరువాత ఈ నవంబరులోగా గాని, అంతకుముందు గాని, తరువాతగాని కమ్యూనిస్టుపార్టీయెడల కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ గావించిన అపరాధం ఏమీలేదు. మూడువారాలక్రితమేగదా కమ్యూనిస్టు పార్టీ మా అందరితోకలసి ఏకైక కార్యక్రమాన్ని నిర్వహిస్తానని ఒప్పుకున్నది! ఈగ్రంథ ప్రచురణతో బాగానే నిర్వహించింది! సరే ఏమైనా గానీ 1939 నవంబరులో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీయెడ కమ్యూనిస్టులకు దయతప్పింది. తదాదిగా దాన్నివారు క్రూరంగా ఎదిరించారు. 1940 లో కమ్యూనిస్టువారి డాక్యుమెంటు ఒకటి బయలుదేరి కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి అంత్యక్రియలు చేసి భరతవాక్యం పాడింది. కమ్యూనిస్టులకే చెల్లిపోయిన ఒకవిచిత్ర మార్క్సుపద్ధతిలో ఆ దుఃఖభరిత- లేదా సంతోషభరిత- భరతవాక్య గానానికి కారణాలు వివరించారు. కమ్యూనిస్టుపార్టీ పత్రిక 1941 ఫిబ్రవరి సంచిక కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ చరిత్ర ప్రకటిస్తామని బెదిరించింది కూడాను. అయితే వారు దయ్యంకథ రాస్తారన్నమాట ! కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ చచ్చిపోయిందని వారేఅన్నారు. ఇప్పుడు దయ్యంరూపంలో ఉండి వారినిపీడిస్తోందన్నమాట! మళ్ళీ ఇప్పుడు దాన్ని కూడా కాగితం మీద చంపివేస్తేనేగాని వారికి దయ్యంపీడ వదలిపోదన్నమాట!

అసలు ఈ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీనీ, తదితరులనూ ఎందుకు అలాగ అకస్మాత్తుగా దూషించటానికి దిగారు? దానికొక రాజకీయ కారణం ఉంది. యుద్ధం ఆరంభమైందిగా! దానితోపాటు భారత విప్లవం లేచే అదనుకూడా రానున్నదని వారు భావించారు. అట్టి చారిత్రక సంఘటనకు నాయకత్వం తమకే ఉండాలిగాని, మరేపార్టీకీ పోకూడదని వారి లోభం. ప్రజలకు, కార్మికులకు, కర్షకులకు, విద్యార్థులకు

(ముఖ్యంగా విద్యార్థులకు, గమనించండి) తానే ఏకైక విప్లవసంస్థగా కనిపించవలెనని ఆతృతపడ్డది. పోటీ పనికిరాదు. హస్తగతం కానున్న అధికారానికి భాగస్వాము లెవరూ ఉండకూడదు. ఎంతగొప్ప ఆశయం! వారు అర్థం చేసుకున్న మార్క్సు సిద్ధాంతాలకు అనుగుణ్యంగానే ఉంది. దాని భావమేమిటంటే – మిగతా పార్టీలన్నీ చచ్చిపోవాలి; వాటికి ప్రజల్లో ఉన్న పలుకుబడి సమసిపోవాలి. కనుక ఆ పార్టీ రచయితలు సామాన్యప్రజకు బాగా అర్థమయ్యేలాగు, పాటలతో, పదాలతో వారికి వచ్చిన సాహిత్యమంతా గుప్పించి రీములు రీములు కాగితాలు ఖరాబు చేశారు. చూడండి వారి తడాఖా! కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ-లన్నీ గాలిలో ఎగిరి మాయమైపోయాయి. కమ్యూనిస్టు మరివాళ్లే విప్లవయోధులైపోయారు; వారెవా! అంతా ఒక ఆనందమయమైన స్వప్నం! నిద్రలేచేసరికి ఏమీ ఉండదు. మరికొన్నాళ్ళు పోయేసరికి కమ్యూనిస్టుపార్టీ ఇంకో గ్రంథం ప్రకటిస్తుంది–ఈ చరిత్రాత్మక సమయంలో చాల పొరపాట్లు జరిగాయంటూ విచారంగా.

ఇక ఈగాథ ముగిస్తాను. కమ్యూనిస్టుపార్టీ కొట్టినదెబ్బకు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ తిరుగుదెబ్బకొట్టలేదు. కొంతకాలంవరకూ తనలో ఉన్న కమ్యూనిస్టుపార్టీసభ్యులను వెళ్ళగొట్టనూలేదు. కమ్యూనిస్టు పార్టీ పొరపాట్లను విమర్శిస్తుంది; కాని మనసులో ద్వేషంలేదు. తనతోడి విప్లవసంస్థనుగా భావించి సహకరించటానికి సిద్ధంగానే ఉంది– అని తన అభిప్రాయాన్ని ఉద్ఘాటించింది. సోషలిస్టు ఉద్యమంలో అది చేస్తున్న నిరోధక చర్యలను ఖండించింది. కాని వారేమీ లెక్కచెయ్యలేదు. మనపార్టీ మీద దాడులు చేస్తూనే ఉన్నారు. తరువాత రామ్‌ఘర్ లో మనపార్టీ కార్యవర్గం మరిగత్యంతరం లేక కమ్యూనిస్టు పార్టీ సభ్యులను, ఏజెంట్లను మనపార్టీలోనించి బైటికి తోలివేసింది. భారతసోషలిస్టు ఉద్యమంలో ఈవిషాదాంత ప్రకరణం అలాముగియవలసి వచ్చింది. మనకార్యవర్గం అలా నిర్ణయించటంలో కమ్యూనిస్టులపై దాడిచెయ్యాలన్న ఉద్దేశం కాదని తెలుసుకోవాలి. మన పార్టీ శ్రేయస్సుకోసం ఆపని ఎన్నడో చేసి యుండవలసినది. మనపార్టీ నిర్మాణానికి అది అవసరం. ఒక శత్రుపార్టీ సభ్యుడుగాని ఏజంటుగాని మన పార్టీలో ఉండరాదన్న భావమే ఆ నిర్ణయంలో ద్యోతకమవుతుంది.

# 4

## సారాంశాలు

మన పార్టీ సోషలిస్టు ఐక్యతకోసం ఎంతగా ప్రయత్నించిందో, ఆ ప్రయత్నాలన్నీ ఎలాగ విఫలమైపోయాయో పైగాధ స్పష్టంగా వివరిస్తోంది. మొదటి కొద్ది నెలలు తప్ప మిగతా కాలమంతా కమ్యూనిస్టు – కాంగ్రెస్ సోషలిస్టుపార్టీల సయోధ్యతకోసమే ఎంతోకృషి చేశాం. కాని కమ్యూనిస్టుల కపటపు ఎత్తులవల్ల ఆకృషి ఫలించలేదు. కాని కమ్యూనిస్టులనూ, వారి ఎత్తులనూ నిందించటం తప్పు. ఆ పార్టీకి ఆ ఎత్తులు స్వభావతః వచ్చేవే. ఇంకొక విధంగా కమ్యూనిస్టు పార్టీ ప్రవర్తించగలగటం అసంభవం. ఆ సంగతి మాకు తెలియలేదు మొదట. లేకపోతే ఈనాడు మాపార్టీ ఎంతో బలవత్తరంగా ఉండేది. ఇప్పుడు తెలిసివచ్చింది.

స్వభావతః కమ్యూనిస్టుపార్టీ తత్వమే అలాంటిది; తప్పనిసరిగా అలా ప్రవర్తించవలసినదే నని చెప్పాను. దానికి కారణం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం. ఈ ఉద్యమ నిర్మాణం పునాదులుకట్టి క్రిందనించి పైకి లేచింది కాదు. థర్డ్ ఇంటర్నేషనల్ సెంట్రల్ కమిటీ రష్యన్ కమ్యూనిస్టుపార్టీ సంపూర్ణాధికారం క్రింద ఉంటుంది. వివిధ దేశాలలో దానికి బ్రాంచీలు ఉంటాయి. ప్రతిముఖ్యదేశంలోనూ థర్డ్ ఇంటర్నేషనల్‌కు ఒక బ్రాంచి ఉండవలసినదే. ఒక్క టర్కీ లో తప్ప. టర్కీ ప్రభుత్వానికి, రష్యాప్రభుత్వానికీ ఒక ఒడంబడిక ఉంది. దానిననుసరించి టర్కీలో అట్టిబ్రాంచి స్థాపించటాని వీల్లేదు. భారత కమ్యూనిస్టుపార్టీ కూడా అట్టిబ్రాంచీలలో ఒకటి. కనుక అది ఇంకొకపార్టీతో కలియదు. కలిసిందా థర్డ్ ఇంటర్నేషనల్‌కు బ్రాంచిగా ఉండకుండా పోతుందిగా! రెండో పార్టీకూడా థర్డ్ ఇంటర్నేషనల్‌కు బ్రాంచిగా ఉండేందుకు ఒప్పుకుంటే కమ్యూనిస్టుపార్టీ దానితో ఐక్యతకు అంగీకరిస్తుంది. కాని అట్టి ఐక్యత నిజంగా ఐక్యత అనిపించుకోదు కదా! ఇక పోతే కమ్యూనిస్టుపార్టీ ఐక్యతకోరిన మరొక పార్టీలో చేరి రహస్యంగా థర్డ్ ఇంటర్నేషనల్ బ్రాంచిగానే పనిచేస్తూ చివరకు ఆ పార్టీని పూర్తిగా మట్టడించివెయ్యాలని అంటే – అదికూడా ఐక్యత అనిపించుకోదు. కనుక కమ్యూనిస్టుపార్టీతో ఐక్యత అసంభవం. దాన్ని సాధించ

టం వ్యర్థం. కమ్యూనిస్టు పార్టీవలె ఒక 'బ్రాంచిపార్టీ' కాని ఏ యితర సోషలిస్టు సంస్థతోనైనా ఐక్యత సిద్ధించ వచ్చును గాని కమ్యూనిస్టు పార్టీతో ఐక్యతకు అర్థంలేదు. అట్టి ఐక్యత కావాలంటే కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకూడా థర్డ్ ఇంటర్నేషనల్‌కు బ్రాంచీ అయిపోవలసిందే; అంటే కమ్యూనిస్టు పార్టీలో ఒక భాగంగా అయిపోవాలన్న మాటే.

అయితే కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకూడా థర్డ్ ఇంటర్నేషనల్ గోత్రంలో కలిసిపోకూడదు? అంటే కమ్యూనిస్టుపార్టీలో కలిసిపోకూడదు? అని ఎవరేనా ప్రశ్న వెయ్యవచ్చు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ వ్యతిరేకి కాదు; రష్యావ్యతిరేకికూడా కాదు.

అంతర్జాతీయ గోత్రంలో కలిసిపోవటమన్న సమస్యకు అనివార్యమూలైన యిబ్బందు లున్నాయి. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ బైటనించి తెచ్చి, ఈ దేశంలో నాటిన మొక్క కాదు. భారత భూమిలో మొలకెత్తింది. విదేశాలనించి వచ్చే పాలడబ్బాలతో ఎదగలేదు. స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న భారత ప్రజలతోటి నిరంతరానుభవాలతో పెరిగి పెద్దదైంది. దాని జననమే – థర్డ్ ఇంటర్నేషనల్‌వారు ఇండియాలో అనుసరిస్తూన్న విధానానికి తిరుగుబాటు. థర్డ్ ఇంటర్నేషనల్‌వారి తెలివితేటల్లోనూ, వారి మార్గదర్శకత్వంలోనూ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి విశ్వాసం ఎలా ఉంటుంది? పార్టీ స్థాపితం కాగానే ఇంటర్నేషనల్‌వారి ఇండియా బ్రాంచి క్రూరంగా దానిపై కత్తి దూసింది. కమ్యూనిస్టు నాయకులూ, సెంట్రల్ కమిటీ మెంబర్లు కూడా దాన్ని 'సోషల్ ఫాసిస్టుపార్టీ' అని నిందించసాగినారు. ఇవన్నీ మమ్మల్ని ఇంటర్నేషనల్‌కు దరిజేర్చుకోటానికి చేసిన పనులేనా? కాని మాకు మేమే కమ్యూనిస్టుపార్టీకి సన్నిహితులమౌదామని ప్రయత్నించాం, మోసపోయాం.

ప్రపంచ విప్లవానికి తానే నాయకత్వం వహిస్తున్నా నంటుంది 'ఇంటర్‌నేషనల్'. అయితే మరి ప్రపంచంలో ఉన్న విప్లవ శక్తులన్నింటినీ ప్రోత్సహించి, సమీకరించటం తన విధ్యుక్త ధర్మం కాదా? అలా చేయకుండా సంకుచిత చిత్తవృత్తులతో ప్రవర్తించి, తన శాఖను మాత్రమే పోషిస్తూ ఇతర శక్తులను నిర్లక్ష్యం చేస్తున్నది. ఆరోజునించి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఒక పరిపూర్ణవిప్లవ సంస్థగా పనిచేస్తూంది. అయినా

'ఇంటర్నేషనల్' దానితో ఏ విధంగానూ సంబంధం పెట్టుకోలేదు; సాయం చెయ్యలేదు; ప్రోత్సాహం ఇవ్వలేదు. పైగా భారతదేశంలో దాని ఏజంట్లు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని నాశనం చెయ్యాలని సర్వవిధాలా ప్రయత్నించారు. ప్రపంచవిప్లవ నాయకత్వం వహిస్తున్నానని చెప్పుకుంటూన్న 'ఇంటర్నేషనల్' ను నిలవదీసి అడగవద్దూ? – "ఎందుకు కాంగ్రెసు సోషలిస్టు పార్టీని నీదరి జేర్చుకోలేక పోయావు?" అని.

ఈ సందర్భంలో కాంగ్రెస్ పార్టీ విధానానికీ, 'ఇంటర్నేషనల్' ఇండియాలో కొనసాగిస్తూన్న విధానానికీగల భేదాలు తెలుసుకోవలసిఉంది. పూర్వం ఉన్న భేదాలు ఇదివరకే వివరించాను. ఇక ప్రస్తుతస్థితి ఆలోచిద్దాం. కమ్యూనిస్టు పార్టీ మళ్ళీ తన నాగలి తానే దున్నుతోంది; కాంగ్రెసునూ, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని చూచి జాలి పడుతోంది; సత్యాగ్రహోద్యమాన్ని తీవ్రవంగా తెగనాడుతోంది; ఇటీవలి ఒకానొక ప్రచురణలో సుభాషుబాబు అంతర్ధానంగూర్చి– అంతతీవ్రమైన విషయాన్ని కూడా– పరిహాసంకింద కట్టివేసి ఏగాతాళి మాటలు రాసింది, కమ్యూనిస్టు పార్టీయే విప్లవాన్ని లేవదీసి, నడుపుతుంది; అదీ 'ఇంటర్నేషనల్' విధానం. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పాలసీ అదికాదు, అన్ని పార్టీల ఐక్యతను కోరుతుంది; కాంగ్రెస్ను గాని, సత్యాగ్రహోద్యమాన్నిగాని ప్రతిఘటించదు; ఉద్యమంలో పటుత్వం లేకపోతేనూ, జంకుగొంకులు ఉంటేనూ విమర్శిస్తుంది; కాని జాతీయసమరంలో (చిన్నదే అయినా) పాలుతీసుకోకండా వైదొలగి వుండటం విప్లవశక్తులకు వినాశహేతువని విశ్వసిస్తుంది; సమయం వచ్చినప్పుడు, సర్వప్రజాళి పాలుతీసుకోగల దేశవ్యాపిత విప్లవాన్ని కొనితెచ్చేనిమిత్తం కార్మికకర్షకోద్యమాలను కూడా వృద్ధి చేస్తుంది. ఈ విధంగా కమ్యూనిస్టు పార్టీకి, కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి– అంటే 'ఇంటర్నేషనల్'కు కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి పాలసీలలో చాల విభేదాలు ఉన్నాయి.

ఇంకొక్క విషయం: 'కమ్యూనిస్టు ఇంటర్నేషనల్' అనేది కేవలం రష్యా విదేశాంగ ఆఫీసుకు ఒక ఉపశాఖఅనీ, దాని విధానాలన్నీ రష్యావిదేశాంగ విధానాన్నిబట్టి ఉండవలసినదేననీ – అంతర్జాతీయ కార్మికోద్యమం (International working class movement) లో చాలమంది అభిప్రాయపడుతున్నారు. పైగా కమ్యూనిస్టు పార్టీకి, 'కమ్యూనిస్టు ఇంటర్నేష

నల్కూ గల సంబంధ బాంధవ్యాలను చర్చిస్తూ ఎడ్గార్ స్నో తన Red star over china అను గ్రంథంలో అదే అభిప్రాయం వెల్లడించాడు. ఇందుకు యుద్ధాత్ పూర్వమూ, యుద్ధానంతరమూ కూడా హఠాత్తుగా మాటి మాటికీ ప్రపంచమంతటా కమ్యూనిస్టు పార్టీల విధానలు మార్పులు అంటూ ఉండటమే నిదర్శనం. మిగతా విషయాలెలా ఉన్నా ఒక్క సంగతి మాత్రం రూఢి: ప్రతి కమ్యూనిస్టు పార్టీ మాస్కో ఆజ్ఞలను అనుసరించవలసినదే. ఎందువల్ల? రష్యాకు ఏది మంచో, ఏది చెడో మాస్కో ఒక్కతెక్కే తెలుసును కాబట్టి. కాంగ్రెసు సోషలిస్టుపార్టీమాత్రం పరుల ఆజ్ఞలను పాలించేందుకు సిద్ధంగా లేదు. ఇంటర్నేషనల్ గోత్రంలో చేరటమంటే దాని కనుసన్నల మెలగవలసినదేగా! అంతేకాదు. రష్యా ప్రభుత్వం వారి ప్రతి చర్యనూ సమర్థిస్తూ ఉండవలసినదే. ఈ బడితపెత్తు వ్యాపారం మాకక్కర్లేదు బాబూ!

ఇంతవరకూ మనం ఎందువల్ల 'థర్డ్ ఇంటర్నేషనల్' గోత్రంలో చేరజాలమో విశదమైందికదా! కాని 'ఇంటర్నేషనల్' మనమీద ఎంత వైరభావంతో ఉన్నా మనం మాత్రం దానిమీద సద్భావంతోనే ఉన్నాం. నిప్పులమని కనిపిస్తూనే ఉన్నా పరస్పరసహాయ సహకారాలకు సిద్ధంగానే ఉన్నాము.

మళ్లీ కమ్యూనిస్టు పార్టీ సంగతి ఎత్తుకుందాం. ఐక్యతలో విశ్వాసమే లేకపోతే కమ్యూనిస్టు పార్టీలోకి తన సభ్యులను కాంగ్రెసుసోషలిస్టు పార్టీలోకి ఎందుకు పంపింది? అనే ప్రశ్న కొందరు అడుగుతారు. కొంత కాలం వరకూ మొదట కమ్యూనిస్టుపార్టీ మాతో ఏమీసంబంధం పెట్టుకోకండా దూరదూరంగానే ఉన్నసంగతి అందరికీ తెలుసు. కాని ఆ పాలసీ మార్చుకుని కాంగ్రెసులో చేరవలసినదిగా 'ఇంటర్నేషనల్' ఆజ్ఞాపించేసరికి తీవ్రమైన సమస్య ఉత్పన్నమైంది. ఇంత వరకు దానికి కాంగ్రెస్‌తో ఎట్టి సంబంధమూ లేదు; ఇప్పటికి తాను జాతీయశక్తుల నాయకత్వం వహించాలిగా! అందుకు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఒకచక్కని ఉపకరణంగా కనిపించింది. కాంగ్రెసులో ఒక ఉన్నతస్థానం ఆక్రమించి ఉన్నది కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ. కమ్యూనిస్టులు రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలలోనూ, కార్యవర్గాలలోనూ, అఖిలభారత కాంగ్రెస్ కమిటీలలోనూ, కాంగ్రెస్ కార్యవర్గంలోనూకూడా జొరబడాలని ఆతృతపడ్డారు.

తమసొంత శక్తిసామర్థ్యాలతో వాటిని సమీపించనైనా లేరుకదా! కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఒకటి కనిపించింది. తదీయసభ్యులు పెద్ద పెద్ద కాంగ్రెస్ కమిటీలలో కూడా ఉన్నారు ఇంకేం; "కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి జై, మనంపోయి అందులో చేరదాం అనుకున్నారు. చేరారు. కాంగ్రెస్ సోషలిస్టుల వోట్లతో అఖిలభారత కాంగ్రెస్ కమిటీలోనికి రాష్ట్రీయ కార్యవర్గాల్లోనికీ ఎగబ్రాకినారు. అంతవరకూ అనామకులుగా ఉండిన ఈ కమ్యూనిస్టులకు తమ్మునుతాము ఎడ్వర్టయిజు చేసుకోటానికి కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ అమోఘంగా ఉపకరించింది.

వారు మనపార్టీలో చేరటానికి మరొక కారణంకూడా ఉంది. తమ కమ్యూనిస్టుపార్టీ ఒక్కటేతప్ప మరేయితర సోషలిస్టుపార్టీ బ్రతికి ఉండేందుకు హక్కులేదు; అని వారి యుద్దేశమైనట్లు అదివరకే చెప్పాను. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఒక స్వతంత్రసంస్థగా వృద్ధిపొందటం వారి నైరంకుశత్వానికి ఆటంకమౌతుంది. కనుక ఎలాగైనా దాన్ని తాము కైవసం చేసుకోటానికీ, లేదా దాన్ని ఛిన్నాభిన్నం చేసివెయ్యటానికీ వారి అదను పుచ్చుకొని పార్టీలో ప్రవేశించారు. ఈరెండు ఉద్దేశాలతో వారు మన పార్టీలో అడుగుపెట్టారు. అడుగు పెట్టటానికి వారు ఐక్యతా నినాదం అంగీకరించవలసివచ్చింది. లేకపోతే కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ వారినెందుకు చేర్చుకుంటుంది? కాని ఈఐక్యతానినాదం అనే తెరమరుగున వారు తమ పన్నాగాలను నెరవేర్చుకున్నారు.

కనుక ఇంతకూ కమ్యూనిస్టుపార్టీతోటి ఐక్యతా సంపాదన సమస్యను, అందులోనున్న కష్టనష్టాలను మేము మొదట సరిగా గ్రహించలేకపోయాం. అదీగాక ఐక్యతకోసం మేము అవలంబించిన పద్ధతికూడా లోపభూయిష్టమే. ముఖ్యంగా ఇతరపార్టీల మెంబర్లను మాపార్టీలో చేర్చుకోటం శుద్ధతప్పు. చక్కనిపార్టీ వ్యవస్థను నిర్మించుకునేవారు ఆపని చేయరాదు. అట్టి పని మళ్ళీ ఎన్నడూ చేయకూడదు అది అంతఃకలహానికీ, తగవులకూ దారి తీస్తుంది. ఒకపార్టీలోనించి మరొక పార్టీలోకి సభ్యులను చేర్చుకోటంద్వారా ఐక్యత సాధించాలన్న ప్రయత్నం ఏదేశంలోనూ ఎన్నడూ ఎవరూ చెయ్యలేదు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ అలా ప్రయత్నించి చూచింది; అది ఆత్మహత్యాసదృశమైన మార్గమని తెలుసుకుంది.

అయితే ఈ చీలికలు లేవదీసేపని కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే ఎలా చేయగలిగింది? మనం మాత్రం ఎందుకు చేయలేకపోయాం? — అని పార్టీ చర్చలలో ప్రశ్న వచ్చింది. అందుకు రెండు కారణాలున్నాయి. అట్టి పని చేయగల అవకాశం కమ్యూనిస్టులకు మనం ఇచ్చాం. వాళ్ళకు మన పార్టీలో స్థానం ఇచ్చాం. మన కట్టి అవకాశం లేదు. వాళ్ళ పార్టీలో జొరబడాలని మనకు కోరికాలేదు; అటువంటి అదనూలేదు. ఇక రెండో ముఖ్యకారణం ఏమంటే — ఇంకో పార్టీలో చీలికలు లేవదీయుట మనేది ఐక్యతా నినాదానికి విరుద్ధం. మనం త్రికరణ శుద్ధిగా ఐక్యతలో విశ్వాసం పెట్టుకున్నాం. అందుచేత చీలికలు లేవదీయాలన్న బుద్దే మనకు ఉత్పన్నం కాలేదు.

చిట్టచివరకు మనం కమ్యూనిస్టులను పార్టీలోనించి వెళ్ళగొట్టానికి నిశ్చయించామని వారది కమ్యూనిస్టు వ్యతిరేక చర్యగా ప్రచారం చేస్తున్నారు. కాని ఆ నిర్ణయంలో కమ్యూనిస్టు వ్యతిరేక చర్య ఏమీలేదు. కమ్యూనిస్టులు మనపట్ల నెరపుతోన్న విరోధచర్యలనించి ఆత్మరక్షణచేసుకునేందుకే ఆలా నిశ్చయించుకున్నాం. కమ్యూనిస్టులు మాపార్టీలో ఉండేందుకు ప్రత్యేక హక్కులేమీ లేవు. రెండుపార్టీల ఐక్యత సాధించేనిమిత్తం కేంమే వారిని పార్టీలో చేర్చుకున్నాం. కాని కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి శత్రువుగా తయారైంది; దాన్ని నాశనం చెయ్యటానికి తీవ్రంగా ప్రయత్నించింది. కమ్యూనిస్టులు పార్టీలోనే ఉంటూ శత్రువులుగా వ్యవహరిస్తూ దాని పలుకుబడినీ, ఐక్యతనూ నిర్మూలం చేయటానికి ఉద్యమిస్తూ ఉంటే వారి సభ్యత్వాన్ని రద్దు చేసేసింది. అంతకన్నా ఎక్కువ చేసిందేమీలేదు! శత్రువులను ఏ పార్టీ తనలో ఉంచుకోదు కదా! కనుక మేము కమ్యూనిస్టులను పార్టీలోనించి పంపించి వెయ్యటం పగబూనటం కాదు.

ఆలా కమ్యూనిస్టుల సభ్యత్వాన్ని రద్దుచేసే అధికారం పార్టీ కార్యవర్గానికి ఉన్నదా? — అని కొందరు ప్రశ్నిస్తున్నారు. ఇది కమ్యూనిస్టుల ప్రోద్బలంతో వేయబడుతూన్న ప్రశ్న. పార్టీ సమావేశానికి అట్టి సమస్యలను చర్చించే అధికారం లేదా? అట్టి తీర్మానం జారీ చేయగల అధికారం కార్యవర్గానికి పూర్తిగా ఉంది. మొదటినించీ కూడా ఈ విషయాలను కార్యవర్గమే తీర్మానిస్తూ వచ్చింది. కమ్యూనిస్టులను పార్టీలోకి తీసుకోవచ్చు

నన్న తీర్మానం ఏ పార్టీ సమావేశంలోది కాదు. మీరట్‌లో కార్యవర్గం చేసిన తీర్మానమే అది. సమావేశంలో జరిగిన నిర్ణయమైతే మళ్ళీ సమావేశంలోనే దాన్ని మార్చవలసి వుంటుంది. ఈ విషయాన్ని ఒక్క కార్యవర్గం చేతుల్లోనే అట్టి పెట్టామంటే - అందుకొక కారణం కూడా వుంది. కమ్యూనిస్టుపార్టీ అప్పుడూ, ఇప్పుడూ కూడా ప్రభుత్వం నిషేధించిన పార్టీ. అందుచేత దాన్ని గురించిన ప్రశంస సమావేశంలో తెచ్చేందుకు వీల్లేదు. కాంగ్రెసు మంత్రిత్వాల కాలంలో...కొంతవరకు పౌరస్వాతంత్ర్యాలు అనుభవంలోకి వచ్చాయి కాబట్టి కాస్త స్వతంత్రంగా ఆ విషయాలు బహిరంగంగా చర్చించుకో గలిగాం.

ఇంతకూ అట్టి అధికారం కార్యవర్గం వారికి వున్నదా ? అని ప్రశ్నించటంలో కార్యవర్గాన్ని కమ్యూనిస్టు వ్యతిరేక సంస్థయని ప్రపంచాన్ని నమ్మించాలని కమ్యూనిస్టుల ఉద్దేశం. ఆ సమస్య పార్టీ సమావేశంలోనే చర్చకు వచ్చేట్టయితే ఫలితం ఇంకో విధంగా వుండేదని వాదించటం కూడా వారి ఉద్దేశమై వుంది. కమ్యూనిస్టులతో మాకుగల సంబంధాలను పైన నాలుగు భాగాలుగా వివరించాను. మూడవ భాగంలో మా కార్యవర్గం కమ్యూనిస్టులతోడి సమైక్యతకోసమై ఎంత చేసిందో వివరించటమైంది. మీరట్ సమావేశంలో కార్యవర్గం కమ్యూనిస్టులను చేర్చుకో వలెనని తీర్మానించటం పార్టీ సభ్యులందరి ఒత్తిడివల్ల కాదు. తరువాత కమ్యూనిస్టులు మన పార్టీవెనుక గోతులు త్రవ్వుతున్నా కార్యవర్గం సహించి ఊరుకున్నది పార్టీ సభ్యులందరి వత్తిడివల్ల కాదు. ఆంధ్రా పార్టీ వారి పరం చేయబడి నప్పుడు... బొంబాయి తీర్మానం అయిన తరువాత కూడా ఎనిమిది మంది కమ్యూనిస్టులను అలహాబాదు కమిటీలో కార్యవర్గం చేర్చుకున్న దంటే - పార్టీ సభ్యులందరి ప్రోద్బలంవల్ల కాదు. ఈ నాడు కూడా కమ్యూనిస్టుపార్టీ మన మెడల కత్తిగట్టి వ్యవహరిస్తున్నా మన కార్యవర్గం వారితో మిత్రత్వాన్నే వాంఛిస్తున్న దంటే పార్టీ సభ్యులందరికీ భయపడి కాదు. పార్టీసభ్యులకూ, కార్యవర్గానికీ మధ్య పొరపులు పెట్టాలని కమ్యూనిస్టు పార్టీ ఈ విధంగా ప్రయత్నించటం హాస్యాస్పదంగా వుంది. ఇక పోతే-

మార్క్సువాదం ఒక్కటే కదా! రెండు సోషలిస్టుపార్టీలు ఎందుకు వుండాలి? అన్న ప్రశ్న ఇంకొకటి వున్నది. ఈ వ్యాసమంతా ఆప్రశ్నక

జవాబు. ఔను, మార్క్సువాదం ఒక్కటే, కాని ముఖ్యమైన సమస్య ఏమంటే- మార్క్సు వాదాన్ని ప్రస్తుత సాంఘిక పరిస్థితులలో ఎలా అమలు చెయ్యాలి? 1934 లో కూడా మార్క్సువాదం ఒక్కటే. కాని అప్పుడు భారత కమ్యూనిస్టుపార్టీ, థర్డ్ ఇంటర్నేషనల్ దాన్ని అమలు పరచిన విధానానికీ, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అమలు పరచిన విధానానికీ మహా దంతరం ఉండింది. టూకీగా అదే జవాబు.

మార్క్సువాది ఎప్పుడూ ఒక సాంఘిక పరిస్థితిని చరిత్రదృష్ట్యా తత్సంబంధమైన ఇతర సంఘటనలతో పోల్చిచూచి అర్థం చేసుకోవాలి. మార్క్సువాదానుగుణ్యమైన ఒక్కేఒక పార్టీ ఉండవలెననే మా కోరికకూడా. కాని రెండుపార్టీలు ఉండటం ఎలా తటస్థించిందో తెలుసుకోవాలంటే- ఈ విషయాన్ని చరిత్రదృష్ట్యా పరిశీలించాలి. 1930-34 జాతీయ సమరంలో కాంగ్రెసులోని యువకబృందానికి చాలావరకు రాడికల్ భావాలు ఉద్భవించాయి. తత్ఫలితంగా 1934 లో ఒక సోషలిస్టు సంస్థఏర్పడింది. ఈ సంస్థకూ, అంతకు కొంత కాలంనించీ ఉన్న కమ్యూనిస్టుపార్టీకీ మధ్యఒక పెద్దగోడ అడ్డంగా ఏర్పడింది. కాంగ్రెసునించి వేరుగా స్వతంత్రంగా ఉండవలెనన్న కమ్యూనిస్టుల విధానమే ఆగోడ. కనుక ఒకకొత్త పార్టీఏర్పడ వలసిఉంది. కమ్యూపార్టీ యొక్క, థర్డ ఇంటర్నేషనల్ యొక్క తప్పు విధానం వల్లనే కాంగ్రెసు సోషలిస్టు ఉద్భవించ వలసివచ్చింది.

ఈరెండో పార్టీఉద్భవించిన తరువాత జరిగిన పరిస్థితులన్నీ ఇదివరకే నివేదించాను కదా! ఉద్భవించినదాదిగా ఒక్కే ఒక మార్క్సు వాదానుగుణ్యమైన పార్టీని సృష్టించేందుకే ప్రయత్నించింది, కాని కమ్యూనిస్టులకు ఐక్యత అక్కర్లేదు కాబట్టి ఆప్రయత్నాలన్నీ విఫలమై పోయాయి. కనుక రెండు పార్టీలు ఉండకతప్పలేదు. ఈ రెండు పార్టీలకూ మధ్యగల విభేదాలన్నీ చర్చించాం; ఇంటర్నేషనల్ గోత్రంలో చేరటంవల్ల కలిగే యిబ్బందులు కూడా చూచాం; ఈవిభేదాలు, ఇబ్బందులు ఉండేంతకాలం ఇలా రెండు పార్టీలుగా ఉండవలసినదే!

ఇదంతా మన దురదృష్టం అని నాకుమల్లేనే చాలమందికి అనిపిస్తుందేమో! కాని అది తప్పనిసరి అయింది. అందుకు కారణాలు అన్నీ వివరించానుకదా! కాని ఒక్క విషయానికి మాత్రం నేను సంతోషిస్తున్నాను.

కొంతమంది మిత్రులు భయపడుతూనే ఉన్నా మన పార్టీ మొదటినించీ కూడా అన్ని సోషలిస్టు సంస్థల పరస్పరసహకారం కోసం (సమైక్యతకోసం కాకపోయినా) ప్రయత్నం చేసింది. ఇతరపార్టీలు కూడా స్వార్థపరత్వం వీడి మనకు మల్లేనే వ్యవహరించినట్లయితే మన ప్రయత్నాల ఫలితం ఇలా ఉండేదికాదు- అని నేను నమ్మకంగా చెప్పగలను. కానీ, ఎప్పటికైనా ఈ చిన్న చిన్న వర్గవిభేదాలకన్నా, ఈ అల్పస్వార్థ లాభాలకన్నా మనం సాధించవలసిన ఏకైక ఉన్నతలక్ష్యం ఒకటి ఉన్నదని అందరూ గుర్తించగలరని ఆశించుదాం.

# వ్యాసాలు, ప్రకటనలు

## 1

### ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ (1936)

ఫెయిజ్‌పూర్ వచ్చి సమావేశంలో హాజరు కాని వారికీ, పత్రికల్లో శీర్షికలే తప్ప వివరాలుచదివేందుకు తీరికలేని వారికీ ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ నిజమైన ప్రాముఖ్యం తెలుసుకోలేరనే చెప్పాలి. శీర్షికలను బట్టి రెండు విషయాలు కనిపిస్తాయి. (1) కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి బాగా దెబ్బలు తగిలాయి (2) ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు అఖండ విజయోపేతంగా జరిగింది. (అందరూ ఇలా అన్నారు గనుక)

ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు విజయోపేతంగా సాగిన మాట వాస్తవమే. ఆ విజయం ఎటువంటిదో... సహాయ సంపాదకుడు పెట్టిన శీర్షికను బట్టి ఊహించటం పొరపాటు.

ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు విజయవంతంగానే సాగింది. అనేక విధాల లక్షలాది రైతులు గుంపులుగా వచ్చి కాంగ్రెసు సమావేశాన్ని సార్థకం చేశారు. కాంగ్రెసు చరిత్రలో అభూతపూర్వమైన ఒక శక్తి అనుభూతమైంది. మహారాష్ట్ర కాంగ్రెసు నాయకులు ఒక నవ్యవిధానాన్ని ప్రదర్శించారు; మనమందరమూ అనుసరించవలసిన ఒక కొత్తమార్గం చూపెట్టారు. మన కృతజ్ఞతకు, భాగధేయకు వారు పాత్రులు.

మితవాద ధోరణికి శాశ్వతంగా తాళం పడిపోయింది; అదీ ఫైజ్‌పూర్ కాంగ్రెసుకు ఒనగూడిన అసలు విజయం. అంటే మితవాదులు ఓడిపోయారని నేను చెప్పటం లేదు. ఇప్పటికీ మితవాదులు వామపక్షం కన్న బలీయులయ్యే వున్నారు. కాని వారి నిరంకుశత్వానికి ఫైజ్‌పూర్ కాంగ్రెసు భరతవాక్యం పాడింది. ఇకముందు వామపక్షం క్రమేణా వృద్ధి చెంది కాంగ్రెసును శాసించగలదు.

ఇదంతా కేవలం ఊహాగానమేనని కొందరనవచ్చు. మేము గట్టిగా పెనగులాడలేదని కొందరు మిత్రులు నిరాశ వెలిబుచ్చారు. పెనగులాట జరక్కపోలేదు; జరిగింది. కాని మొండిగా ప్రతిఘటించటమే రాజకీయ చతురతయని భావించేవారికి మా పెనగులాట తృప్తికరముగా ఉండక పోవచ్చు. నిజానికి అధికారిక తీర్మానాలు చాలవరకు వామపక్షీయుల ప్రచారంవల్ల, నాయకత్వంవల్ల సిద్ధించినవే. రైతులకు, యుద్ధానికి సంబంధించిన తీర్మానాలు అట్టివే. కాంగ్రెసు కార్యవర్గం ప్రతిపాదించిన తదితర తీర్మానాలు చాలవరకు వామపక్షం ప్రవేశపెట్టిన ఎమెండుమెంటులననుసరించి సవరించ బడినవి. వాటిలో ముఖ్యమైనది కన్వెన్షన్ తీర్మానం. చివరకు ఏప్రియల్ ఒకటవ తేదీనాటి హర్తాల్ గురించిన తీర్మానం ఒకటి ఉంది. కాంగ్రెసు వర్కింగ్ కమిటీ దాన్ని త్రోసిపుచ్చింది. కాని అది సబ్జక్టు కమిటీలో చాల పెద్దమెజారిటీతో నెగ్గింది. కొన్ని గమనించదగిన ఓటమిలు కూడా ఉన్నాయి. పదవీ స్వీకరణ సమస్య విషయమై ఓటమే లభించింది. ఈ సమస్యపై సమరం పదవీస్వీకరణ అక్కర్లేదన్న వారికీ కావాలన్న వారికీ మధ్య జరుగలేదు; అక్కర్లేదన్న వారికీ ఈ విషయం ఫైజ్‌పూర్‌లో నిర్ణయించటం ఇష్టంలేని వారికీ మధ్య జరిగింది. ఇంకా కొన్ని వారాలకు ఈ సమస్యపై యుద్ధం ఆరంభమైనప్పుడు...పదవులను నిరాకరించటమే కాంగ్రెసు ఆదర్శాలకు అనుగుణ్యమైన ఏకైక మార్గం అని వామపక్షం కాంగ్రెసుకు నచ్చచెప్ప గలదు; నాకేమాత్రం సందేహంలేదు.

కాంగ్రెస్ సమావేశానికి కొన్ని రోజులముందే వర్కింగ్ కమిటీ కన్వెన్షన్ తీర్మాన పాఠాన్ని ప్రచురించింది. 'జాతీయ కన్వెన్షన్' అని పత్రికల్లో పెద్ద అక్షరాలతో శీర్షిక తగిలించారు. చూచి నేను కొంచెం

విచలితుడనైనాను. మన స్వాతంత్ర్య సమరం ప్రస్తుతం ఉన్న స్థితిలో ఈ సామ్రాజ్యవాద యుగంలో జాతీయ కన్వెన్షన్ అన్న నామధేయం ఏమిటి? అది చలామణి అవటం అపాయకరం కాదా? అనుకున్నాను. అదీగాక స్వాతంత్ర్య సమరంలో జోక్యంలేని, సరియైన ప్రాతినిధ్యంలేని ఒక చిన్న కమిటీని జాతీయ కన్వెన్షన్‌గా ఏర్పరచటం అపాయకరమని భావించాను.

కాని ఫైజ్‌పూర్‌లో ప్రతిపాదితములైన సవరణలూ, ఇచ్చిన హామీలు అపాయాలను చాలవరకు తగ్గించినవి. ఆ కన్వెన్షన్ను ఏవిధంగానూ జాతీయ కన్వెన్షన్‌గా ఊహించదగినది కాదన్నారు. కేవలం ప్రదర్శన కోసమున్నూ, రాష్ట్రీయ కాంగ్రెస్ పార్టీలు వివిధ పంథాలలో చెదరిపోకుండా ఒకేఒక పరస్పరము సమన్వయించుకొన్న విధానాన్నే అవలంబించ గలందులకున్నూ ఈ కన్వెన్షన్ను ఏర్పరచినామన్నారు. ఈ కన్వెన్షన్ కాంగ్రెస్ విధానాలనేమీ నిర్ణయించదనీ; కాంగ్రెసూ, అఖిలభారత కాంగ్రెసు కమిటీ నిర్ణయించిన విధానాలనే అమలు పరుపగలదనిన్నీ సుస్పష్టం చేశారు. కన్వెన్షన్‌కు ముందుగానే పాలసీ నిర్ణయం చేసేందుకు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశ మవుతుంది.

కనుక అపాయాలన్నీ తొలగిపోయినట్టే. ఇక ఈ బానిసరాజ్యాంగంపై మనం సమరం సాగించటానికి ఈ కన్వెన్షన్ ఒక ఆయుధం కాగలదు. ఈ ప్రదర్శనంవల్ల ప్రస్తుత రాజ్యాంగంపట్ల ప్రజల ప్రతిఘటన కేంద్రీకృత మవుతున్నదన్న మాట! కనుక అది ఒక విలువైన ఆయుధమే.

ఐనా నేనొక హెచ్చరిక చేస్తున్నాను. ఈ కన్వెన్షన్‌కు ఏ అధికారాలైతే మనం నిషేధించామో ఆ యధికారాలనే దానికి వొప్పచెప్పాలని చూచేవారు కొంతమంది కాంగ్రెస్‌లో ఉన్నారు. ఆ కన్వెన్షన్‌ల్ దురదృష్టవశాత్తు స్వాతంత్ర్య సమరంలో అనుభవజ్ఞులుగాని యోధులు, నిన్న మొన్నటి వరకూ సామ్రాజ్య వాదులిచ్చిన బిరుదులు వేలాడగట్టుకుని తిరిగినవారూ, దేశంలోని ప్రత్యేక హక్కుదారులతో బాంధవ్యం గలవారూ ఉంటారు. మనమొక ప్రక్కకు లాగుతోంటే వీరంతా మరొక ప్రక్కకు లాగుతారు. అఖిలభారత కాంగ్రెస్ కమిటీ జోక్యము కలిగించుకోవటం వారికి కంటకమనిపిస్తుంది. అదీగాక కాంగ్రెస్‌లోనే మరికొందరుండవచ్చు వారికి తోడ్పాటు ఇచ్చేవారు. కనుక మనం జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి.

రెండు సంవత్సరాల తరువాత మళ్ళీ ఈనాడు గాంధీజీ కాంగ్రెస్ వేదికమీద కనిపించాడు. కాంగ్రెస్ అధ్యక్షుడు తన ఆవేశభరితమైన ఉపన్యాసం అప్పుడే ముగించాడు. గాంధీజీ వేదిక ఎక్కాడు ఆయన ఆకృతి కనిపించగానే సముద్రంలా ఉన్న సభాసదులలో అవ్యాహతానంద తరంగాలు లేచాయి. సుమారు ఒకలక్షమంది ప్రజ ఆయనమాటలు వినాలని వచ్చారు.

ఆనాడే కొన్ని గంటలక్రితం గాంధీజీ ఒక రాజకీయోపన్యాసం ఇచ్చియున్నాడు. నేనా యుపన్యాసానికి హాజరు కాలేకపోయాను. కనుక ఈసారి ఆయన యుపన్యాసం అత్యంత శ్రద్ధతో విన్నాను. కొన్నాళ్ళ క్రిందటి వరకూ లక్షలాది భారతప్రజను ఉర్రూత లూగించినవాడు మళ్ళీ రంగంలో అగ్రభాగం ఆక్రమించనున్నాడా అనిపించింది. ఏమి చెబుతాడో! ఆయన కాంగ్రెస్‌ను విడిచివెళ్ళి నప్పటినించీ చాల గొప్ప సంఘటనలే జరిగాయి. నెమ్మదిగా కాంగ్రెస్ కొత్తదృక్పథాలు అలవరచుకుంది. కొత్త పంథాలకేసి మళ్ళింది. ప్రముఖ సమస్యలతో తీవ్రమైన చర్చలతో గడబిడగానే ఉంది కాంగ్రెస్. గాంధీజీ ఇప్పుడు వాటన్నిటిని గూర్చి ప్రసంగిస్తాడా? ఆ బోసినోటి వెలువడిన ప్రతిమాటా జాగ్రత్తగా విన్నాను. ఆ పూర్వపు ఆత్మవిశ్వాసమే ఆ గురుత్వమే ఆయనలో ఇప్పుడు కూడా తొణికిసలాడుతోంది. కుండ బ్రద్దలుకొట్టినట్టుగా ఉన్నాయి ఆయన మాటలు. ఉపన్యాసం ముగిసింది. చప్పట్లు లేవు. గాంధీకిజై అన్న నినాదాలు పొంగిరాలేదు.

తాను కాంగ్రెస్‌నించి విరమించుకున్నప్పటినించీ జరిగిన సంఘటన లేమీ ఆయన ఎత్తనే లేదు. తన కార్యక్రమాన్నీ, దానిలో తనకుగల విశ్వాసాన్నీ మాకు మరొకసారి జ్ఞాపకం చేసేందుకు వచ్చారా అనిపించింది. మేము ఏమిచెప్పినా ఏమిచేసినా ఆయన మార్గమే విజయప్రదమని ప్రబోధించటానికి వచ్చాడనిపించింది. ఇప్పుడీ ముందుకు వస్తూన్న కొత్తకొత్త విషయాలు కార్యక్రమాలు ఆయన దృష్ట్యా అర్థరహితములే. ఆయన వాటిపై దృష్టి బరుపనేలేదు. ఖాదీ ఉద్యమం, అస్పృశ్యతా నివారణ, గ్రామ పరిశ్రమల స్థాపన, హిందూముస్లిం ఐక్యత ఇవి నెరవేరితేనే తప్ప భారతదేశానికి విముక్తి చేకూరదని ఆయన ఇదివరకు చెప్పినదే మళ్ళీ చెప్పాడు. ఆ మాటలు

శ్రోతలకంత ఉత్సాహ జనకములైనట్టు కనిపించలేదు. ఆ మాటలు వామపక్షానికి ఛాలెంజిలా ఉన్నాయి. కాని అవి నిష్ఫలితములే అయినవి

ఫెయిజ్‌పూరులో మన విజయం మనపై ఒక గొప్ప బాధ్యతను మోపింది. విమర్శనమే ప్రధానంగా భావించేవారు మనలో చాలమంది ఉన్నారు. అట్టి భావన మనం విడిచిపెట్టాలి. బుజాలపై చక్రాలెత్తుకుని రథం మొయ్యాలి. కాంగ్రెస్ కార్యక్రమం నిర్వహించాలి. మొట్టమొదట మనం చెయ్యవలసిన పని ఏప్రియల్ ఒకటవ తేదీనాడు హర్తాళ్ విజయవంతంగా జరపాలి. కామ్రేడ్స్! పదండి ముందుకు!

# బీహార్‌లో రాజకీయ భూకంపం (1937)

బీహార్‌లో ఎన్నికల జ్వరం తీవ్రంగా వ్యాపించింది. ఈ రాష్ట్రంలోని పల్లె పట్టులలో కూడా కాంగ్రెస్‌కు మంచి పలుకుబడి ఉంది. అంచేత ఎన్నికల సంచలనం పల్లె ప్రాంతాల్లో కూడా అధికంగానే ఉంది.

గత నాలుగు రోజులనించీ 'పోలింగు'ను గూర్చి వచ్చిన వార్తలను బట్టి కాంగ్రెస్ ప్రతి పక్షుల నందర్నీ తుడిచి పెట్టేస్తోంది. – తమ క్రింద ఉన్న బీదవాళ్ళ వోట్లను దురధికార యుక్తంగా సంపాదించ గల పెద్ద పెద్ద భూస్వాములనూ, ధనం అధికారం గలిగి మంత్రిత్వాలకోసం ప్రాకులాడే అభ్యర్థులను, ప్రజలను మోసగించి మతవైషమ్యాలను పెంపు చేసేవాళ్ళనూ – అందర్నీ తుడిచిపెట్టేస్తున్నది.

కాంగ్రెస్ ప్రచారం విజయోపేతంగా వరదల్లోఉన్న నదీప్రవాహపు వేగంతో వలె అన్ని అడ్డంకులనూ కూలద్రోసుకుంటూ సాగిపోతున్నది. మొదటి రోజున రెండు ఆఫీసులవద్ద పోలింగు చూచాను. ఆ యావేశం వర్ణనాతీతం. సముద్రపుతరంగాల్లా ఎక్కడచూచినా త్రివర్ణ పతాకాలే. వాటిముందు ప్రత్యర్థి పార్టీల జండాలు గణనీయములుగా తోచనే లేదు. ఆ జాతీయ నినాదాల్లో మిగతా అరుపులన్నీ అంతర్హితములై పోయినవి. ఓటర్లు గుంపులుగుంపులుగా జాతీయ జండాలు పుచ్చుకుని, జాతీయ గీతాలు ఆలపిస్తూ వచ్చారు. ఈ రకమైన ఊరేగింపులు చాలవరకు కాలినడ

కనే సాగినవి. అక్కడక్కడ గుర్రాలు, ఏనుగులు కూడా త్రివర్ణధ్వజాలు మోచికొని ఊరేగినవి.

మరపురానివి ఆ ప్రదర్శనాలు. అదంతా చూస్తోంటే స్వాతంత్ర్యం ఉదికి వస్తోందన్నట్టు తోచింది. ఇప్పుడే ఇంతఉత్సాహం వెల్లి విరుస్తోందే! ప్రజాపరిషత్తుకు అద్యతన భవిష్యత్తులో ప్రతినిధులను ఎన్నుకునే సమయంలో ఈ ప్రజల్లో ఎంత ఉత్సాహం, ఉల్లాసం, ఆనందం వెల్లివిరుస్తుందో కదా!

కొన్నాళ్ళ క్రితమే పండిట్ నెహ్రూ ఈ బీహార్ ప్రాంతాలకు ఒక తుపానుగాలిలా వచ్చి వెళ్ళాడు. ఆ తరువాతనే ఇక్కడ ఎన్నికల ప్రచారం తీవ్రంగా ఆరంభమైంది. ఈ రాష్ట్రంలో తరచుగా ప్రకృతిగతములైన ఆపత్తులు వచ్చి పోతూఉంటాయి. ప్రకృతిసిద్ధంగా ఇక్కడ ప్రతి సంఘటనమూ కోపఘూర్ణితంగానే ఉంటుంది.

ఇక్కడ ఎన్నికలప్రచారం ఒక మహాసముద్రాన్ని గుర్తుకు తెస్తుంది. నెహ్రూపండితుని సంచారం ఒక పెద్దభూకంపాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఔను; నిజంగా నెహ్రూ పండితుని సంచారం ఒక రాజకీయ భూకంపమే. అతడు ఈ రాష్ట్రాన్ని యావత్తూ కూకటి వ్రేళ్ళతో కదిపి ఊగించాడు. అలాగ ఇదివరకు ఏ సంఘటనమూ చేయలేదు. ఒక మహాబలుడు వచ్చి నిద్రాముద్రితమైన ఈ రాష్ట్రాన్ని తన చేతులతో ఎత్తి, ఊపి, మేలు కొలిపినట్టయింది; జీవం, చైతన్యం లభించాయి. అతడు అడుగు పెట్టిన చోట్లకు...పొలాల నాగలి చాలులలో నించి పుట్టుకు వచ్చినట్టు ప్రజలు అతన్ని చూడ్డానికి, అతని సందేశం వినటానికి పరిగెత్తుకుని వచ్చారు. అతని ఉపన్యాసాలు ప్రజల హృదయాల్లోకి సూటిగా చొచ్చుకుని పోయాయి. వారికి కనువిప్పయింది. "బాబూజీ! హమారీ ఆంఖోం కా పరదా గిర్ గయా" అన్నది కర్షకలోకం. ఎన్నికలలో విజయం లభించింది.

* * *

ప్రజలు చూపిన ఆ ఉత్సాహం పట్టుదల చూస్తోంటే మాకుకూడా ఆత్మసాక్షాత్కారమైనట్టు తోచింది. కాంగ్రెస్ పట్ల వారికెంత భక్తి! పోలింగు ఆఫీసులకు ఆ నిరాడంబర కర్షకులు దేవాలయాల్లోకి వెళ్ళినట్టు వెళ్ళారు. చీట్లు "గాంధీజీ పెట్టె"లో జారవిడిచి చేతులు జోడించి

నమస్కారం చేశారు. తెలకుతెలుగా దూరమనక ప్రజలు తమకు తామై వచ్చారు. ఇతర్ల బెదరింపులను పీడింపులను లెక్క చెయ్యలేదు. 'స్వతంత్ర భారత్ కీజై' అని కేకలు పెట్టుకుంటూ కాంగ్రెస్‌కు వోటు చేసేందుకు వచ్చారు.

వాళ్ళ ఆశలన్నీ కాంగ్రెస్ మీద. కాంగ్రెస్ తమ కష్టాలు గట్టెక్కిస్తుందని ఆశ! పోలింగ్ ఆఫీసులకు ఈ కర్షక ప్రజల ప్రస్థానము రానున్న స్వాతంత్ర్య సమరాంగణ ప్రస్థానానికి నాంది.

*  *  *

ఈ యెన్నికల వలని రాజకీయ పర్యవసానాలు అలావుండగా రెండు ముఖ్యమైన సాంఘిక పర్యవసానాలు గమనార్హములు. బీహారుకు రెండు రకాల యజమానులున్నారు. ఒకటి! బ్రిటిష్ ప్రభుత్వం; రెండు! భూస్వాములు. బీహార్‌లో పెద్దపెద్ద భూకామందులే ఉన్నారు. ఈ కామందుల మూలంగా బీహార్ రైతులస్థితి (వారు ఏ కులం వారైనా ఎట్టి ఆర్థిక పరిస్థితులలో ఉన్నా) బానిసలకన్నా హీనంగా ఉంది. రైతు ఎంత భాగ్యవంతుడైనా సరే భూకామందుముందు నిల్చోవలసిందే; కూచో కూడదు; చెప్పులు తొడుక్కుని ఉండరాదు. నమస్కారం చెయ్యవలసిన ప్రత్యేక రీతులు కూడా ఉన్నాయి. వాటిని పాటించవలసిందే. కాలుదార్ల మీద ఏ మత్యాచారాలు! వాళ్ళంతా పశువులు! భూస్వామి వారికేసి కన్ను విప్పి చూడనైనా చూడడు.

అట్టి భూస్వామి ఇప్పుడేవరస్నా ఎన్నికలలో అభ్యర్థిగా నిలిస్తే ఇంటింటికీ తిరిగి వోట్లు యాచించవలసిన గతి పట్టింది. పశువులుగా చూచిన వారినే తోబుట్టువులుగా ఆదరించి బుజాలు రాసుకుని 'మీ కష్టాలు తొలగిస్తా'నని వాగ్దానం చేస్తూ అర్థించక తప్పలేదు. కనుక ఈ ఎన్నికలవల్ల యజమానికీ నౌకరుకూ మధ్య వుండే అంతరం తగ్గిపోతోంది.

నౌకరుకు కూడా ప్రతిపత్తి ఏర్పడుతోంది. వోటు అతన్ని ఒక మనిషిని చేసింది. ముసుగు జారిపోయినట్లు అతనిలోని భయం పారిపోయింది. అతనికి ఆత్మాభిమానం లభించింది. తన యజమాని ఈ ఎన్నికలలో ఓడిపోయినట్లయితే (చాలచోట్ల ఓడిపోవటమే తటస్థిస్తుంది.) అతని పూర్వపు అధికారం చాలవరకు నశిస్తుంది. కాలు వదాలు చేసుకోగల హక్కు

ఒక్కటే మిగులుతుంది. మిగిలిన వాక్కులన్నీ జారిపోతాయి. ఇదిబీహారులో మున్ముందు ఒక ముఖ్యమైన సాంఘిక పరివర్తన.

ఇకపోతే హిందూ సాంఘికవ్యవస్థలో మరొక మార్పు కూడా వస్తుంది. ఇప్పుడు మన సాంఘిక నిర్మాణానికి వర్ణ వ్యవస్థ పునాది. ఇది మానవులను బిన్న భిన్న తరగతులుగా విభజించింది. ఎన్నికల ప్రచారం ఈ వ్యవస్థకు విద్రోహిగా జోరుగా లేచింది. ఇట్టి విద్రోహం ఇదివరకు సంఘ సంస్కర్తల ద్వారా లేచింది. తక్కువ కులస్థులంతా చాలవరకు తటస్థంగా ఉండినారు. కాని ఇప్పుడీ యెన్నికల ప్రచారం వారిని మేల్కొలిపింది. వారికి అర్థమైంది : ఇంతకాలంనించీ అల్పసంఖ్యాకులుగా ఉండిన అగ్రజాతులవారే తమ సొంత వోట్లతో స్వార్థలాభాలు భుజిస్తున్నారు – అని. ఈ విధానం ఎందుకు సాగనీయాలి ? తమ వోట్లు మాత్రం వినియోగించుకో కూడదూ ?– అన్న తృష్ణ వారిలోనూ ఉద్భవించింది. సాంఘిక సమానత్వ సిద్ధాంతం త్వరత్వరగా వ్యాపిస్తోంది. సంఘ సంస్కర్తలు నిర్మూలం చేయదలచిన ఈ హిందూసంఘపు దుర్మార్గవ్యవస్థను బద్దలు చేయజాలిన ఆశయాలు, ఆదర్శాలు వ్యాప్తి చెందుతున్నవి.

కాని ఇలాగ తక్కువ కులస్థులలో మొలకెత్తిన ఈ నూత్న భావోద్రేకాన్ని ప్రస్తుతం స్వార్థ పరులు, ఏ యెండ కా గొడుగు పడుతూ తమ అవసరాలు గడుపుకో దలచినవారూ ఉపయోగించుకుంటున్నారు. కాని మొత్తంమీద హిందూసంఘంలో సర్వసామ్య సిద్ధాంతం తన పని ఆరంభించింది. సర్వతోముఖమైన సాంఘికవిప్లవం రాగల సూచనలు కనిపిస్తూనే ఉన్నాయి.

* * *

ఒక చిన్న సంఘటన మనవి చేస్తాను. ఒక సహ ప్రయాణీకునితో నా కొకసారి రవంత సంభాషణ జరిగింది. రైలుడబ్బా నిజంగా యదార్థజీవిత ఖండాన్ని ప్రతిఫలిస్తూ ఉంటుంది. రైల్వే తరగతులు కూడా మామూలు సాంఘికతరగతులను పోలినవే. ఇంటర్ క్లాస్ అంటే నా దృష్టిలో మధ్య తరగతికి సంబంధించినది. అట్టి ఇంటర్ క్లాస్‌లోనే నేనొక సారి ప్రయాణం చేస్తున్నాను. అందులో ఉన్నాడొక ముస్లిం యువకుడు; సుందరరూపి. అతడు నన్ను ఆకర్షించాడు. ఇద్దరమూ సంభాషణకు దిగాం. అతని ముఖమే కాదు, మనస్సు కూడా అందమైనదేనని తెలుసుకున్నాను.

ఒకసారి జవహర్ పండితుని ఉపన్యాసం వినగలిగిన భాగ్యం తనకు లభించినదనీ, తాను ఆయన మాటలచే మిక్కిలి ఆకర్షితుడ నైనాననీ అతడు చెప్పాడు. జవహర్ పండితుడు హిందూ – ముస్లిం – రెండు జాతులకూ నాయకత్వం వహించ గలడనీ, కాంగ్రెస్ ఒక్కటే నిస్వార్థంగా ప్రజల శ్రేయస్సుకోసం కృషి చేస్తోన్న సంస్థయనీ, మిగిలిన వారంతా స్వార్థలాభాలు చూచుకుంటూన్న వారేననీ చెప్పాడు. తాను కూడా కొన్నాళ్లు స్వతంత్ర ముస్లింపార్టీలో పని చేశాడట. కాని తన కిప్పుడా పార్టీఅంటే విసుగెత్తి పోయింది. అంధులలో ఒంటికంటివాడే రాజా అన్నట్లుగా వ్యవహరిస్తోందట ఆ పార్టీ. మిగతా పార్టీలన్నీ మరీ అధ్వాన్నంగా ఉన్నాయట! తన పార్టీమాత్రం ఉన్నవాటిలో మెరుగ్గా ఉందన్నాడు. ఆమాట నిజమే.

స్వతంత్ర ముస్లింపార్టీ చాలవరకు జాతీయభావాలను ప్రదర్శిస్తోంది. కాని అది మాటల్లో మాత్రమే. ఆపార్టీ అభ్యర్థులు చాలమంది జాతీయతా విరోధులు. సామ్రాజ్యవాదుల మిత్రులు. మతావేశపరులు. ఒకొనొక నియోజకవర్గంలో కాంగ్రెసు ముస్లిం అభ్యర్థితో కూడా ఈ పార్టీ పోటీ చేస్తున్నది. కాంగ్రెసు కూడా ముస్లిం నియోజక వర్గాలలో తన అభ్యర్థులను నిలువ బెట్టకపోవటం విచారకరమని అతడన్నాడు.

పల్లెటూళ్ళలో ముస్లిం రైతులు తాము వోట్లు ఇవ్వటానికి 'కాంగ్రెస్ అభ్యర్థి యెవరు?' అని అడుగుతూ వచ్చారుట. కాని కాంగ్రెస్ అభ్యర్థి లేడని తెలిసి వారు చాల నిరుత్సాహపడ్డారుట చాలమంది మిత్రులు చెప్పారు నాకీసంగతి. ఈ యెన్నికల ప్రచారంలో ముస్లిం నియోజక వర్గాలలో కాంగ్రెస్ ముస్లిం అభ్యర్థులను నిలుపకపోవటం ఒక పెద్ద పొరపాటని నా అభిప్రాయం.

ప్రతి "డాలు"కూ రెండవవైపు కూడా ఉంటుంది కాంగ్రెస్‌పై అభిమానం ఈ యెన్నికల సందర్భంలో వెల్లడియస్తోంది. కాని కాంగ్రెస్ ఈ యెన్నికల అవకాశాన్ని అన్నివిధాలా ఉపయోగించుకో లేకపోయింది. కొన్ని నియోజక వర్గాల్లో వ్యక్తిగత విజయానికే ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఆశయాలు, సిద్ధాంతాలు అడుగున బడిపోయాయి. అలాజరక్కుండా చాల

ముందే సోషలిస్టు కర్మిష్ఠులు, కిసాన్ సభవారు తీవ్రంగా పనిచేశారు. నిజానికి జవహర్ పండితుని సంచారమే ఈ యెన్నికలకు కొత్తజీవం పోసింది.

ఈ యెన్నికల ప్రచారంవల్ల కాంగ్రెస్ సంస్థకు ఒక శాశ్వతమైన మేలు ఒనగూడేలాగు నాయకత్వం వహించలేక పోయినారు రాష్ట్రీయ నాయకులు. ఎలెక్షన్ అవసరాలు గడిచేందుకు ఉత్పన్నమైన యంత్రాన్ని శక్తులనూ నిలుపుకొనవలెనన్న ఇచ్ఛతో కొన్ని ప్రయత్నాలు సాగుతూనే ఉన్నవి. ఆ కీర్తికూడా సోషలిస్టులదే. వారి ఉద్దేశం ఏమంటే దేశసేవకుల ఆశ్రమాలు ప్రతి తాణాలో నిర్మించటం; ఎన్నికల ప్రచారకుల్లోనించి, ఏజంట్లలోనించి వాలంటీరు దళాన్ని ఏర్పరచటం.

నిన్న రాత్రి ఒక ఎలెక్షన్ మీటింగునించి బండీ యెక్కి తిరిగి వస్తున్నాను. ఒక చిన్న కర్మాగారం దగ్గరకు వచ్చేసరికి "స్వతంత్ర భారత్-కీ-జై" నినాదాలు వినిపించాయి ఆ వెంటనే 'రాజా రామచంద్రకీ జై' అన్న ఇక్ష్వాకులనాటి జయశబ్దం కూడా వినిపించింది. అంటే కొంతమంది కార్మికుల బృందం రామాయణ కావ్య శ్రవణం చేస్తూ మధ్యమధ్య అలా జయశబ్దం పలుకుతూ ఉన్నారు రామచంద్రమూర్తికి. కాని ఆధ్యాత్మిక సంబంధమైన ఆ జయశబ్దంతో పాటు ఆ జాతీయనినాదం కూడ ఇంతగా ప్రజాదరణ పాత్రమైనందుకు నాకు సంతోషమైంది. ప్రజల్లో ప్రజ్వలించే మానసిక విప్లవాని కది చిహ్నం. ఆ విప్లవం చాలవరకు పరిపక్వ దశకే వచ్చిందనుకున్నాను.

# 3

## ప్రాసిక్యూషన్ సమయమప్పుడు స్టేట్‌మెంటు, జమ్‌షెడ్‌పూర్ (1940)

"యుద్ధ నిర్వాహణానికి అత్యవసరమైన సరఫరాలకు, మందుగుండు సామాను ఉత్పత్తికి ఆటంకాలు కలిగించేందుకు ప్రయత్నిస్తున్నానని — సక్రమ యుద్ధ నిర్వాహణకూ, బ్రిటిష్ ఇండియా రక్షణకూ ప్రతిబంధకంగా ఉండేలాగున ప్రజలను రెచ్చగొట్టేందుకు ప్రయత్నిస్తున్నానని — నామీద నేరాలు మోపినారు. నిజమే ఈ నేరాలు చేశాననే ఒప్పుకుంటున్నాను.

“అవి నిజంగా నేరాలే కాదు నాకు. పర్యవసానాలు ఏమైనాగానీ, నేను అనుష్ఠిస్తూన్న విధ్యుక్త ధర్మాలే అవి. బలవంతాన ఈ దేశంలో స్థాపితమైన విదేశప్రభుత్వపు చట్టాలు కొన్నింటిని బట్టి అవి నేరాలే కావచ్చు. పోగాక! నాకా విషయం అనవసరం. ఆ చట్టాల ఉద్దేశం భారతజాతీయోద్యమాశయానికి పూర్తిగా విరుద్ధం. ఆ భారత జాతీయోద్యమ ప్రతినిధిని నేను. కనుక ప్రభుత్వానికీ, నాకూ సంఘర్షణ అనివార్యం.

“ఏ విధంగాచూచినా నాదేశం ఈ యుద్ధంలో భాగస్వామి కాదు. నాదేశం జర్మనుల నాజీతత్వాన్నీ, బ్రిటిష్‌వారి సామ్రాజ్యతత్వాన్నీ – రెంటినీ అనర్థములుగా, శత్రువులుగా పరిగణిస్తున్నది. ఈ యుద్ధంలోని ఇరుపక్షాల వారు ప్రపంచాన్ని జయించి, అణగద్రొక్కి, దోచి, మడమక్రింద నొక్కిపెట్టి వుంచుకోవాలన్న స్వార్థఆశయాలతో బయలుదేరారు. బ్రిటను నాజీతత్వాన్ని నిర్మూలించేందుకు కాదు యుద్ధం చేస్తున్నది. తాను పోషించినదే ఈ నాజీతత్వం, ఇప్పుడది ఒక పోటీదారుగా తయారైంది దాన్ని పెచ్చుపెరిగి పోనీయకూడదు. కనుక ఆపోటీని అణగద్రొక్కివేయటానికే ప్రయత్నిస్తూన్నది. తాను ఇదివరకు ఆర్జించుకునియున్న ఉచ్చపదవినీ, సామ్రాజ్యాధికారాన్ని, వైభవాన్ని నిలబెట్టుకునేందుకే యుద్ధం చేస్తున్నది. ఇండియాను శాశ్వతంగా తన అధిపత్యంలో ఉంచుకునేందుకే యుద్ధంచేస్తున్నది.

“కనుక అటువంటి యుద్ధంతో ఇండియాకేమీ సంబంధంలేదు. తన దేశసంపదను సామ్రాజ్యతత్వాన్ని నిలువబెట్టేందుకూ, చివరకది యుద్ధానంతరం తనదేశాన్ని బంధించివేసే ఇనుపగొలుసుగా తయారయ్యేందుకూ వినియోగించవలెనని ఏభారతీయుడూ వాంఛించడు. నేను ఆచరిస్తున్నానని చెప్పిన ఆ పవిత్ర విధ్యుక్తధర్మాన్ని కాంగ్రెస్ ఇదివరకే ప్రజలకు ఉపదేశించింది. కాంగ్రెస్ జాతీయసంస్థ. కాంగ్రెస్ సేవకుడను, నాధర్మాన్ని నేను నిర్వర్తిస్తున్నాను.

“బ్రిటిష్‌ప్రభుత్వం భారతప్రజాభిప్రాయాన్ని పాటించకుండా ఇండియానుకూడా యుద్ధంలోకి ఈడ్చి, ప్రజలను, ధనాన్ని, వస్తుసామగ్రిని తన యుద్ధనిర్వహణకు వినియోగించుకుంటోంది. కాని మేమంతా ఆయుద్ధానికి పూర్ణ వ్యతిరేకులం. అలా చేయటం ఇండియామీద దురాక్రమణకే,

పోలెండుపై జర్మనీ దురాక్రమణ కది ఏమాత్రం తీసిపోదు. ఇండియా ఈ దురాక్రమణను ప్రతిఘటిస్తుంది. మా దేశసంపదను తన సామ్రాజ్య దాహానికి వినియోగించుకుంటోన్న బ్రిటీష్‌ప్రభుత్వ చర్యలను ప్రతిఘటించుట దేశభక్తుడైన ప్రతిభారతీయుని విధి. కనుక యుద్ధనిర్వహణాన్ని ఆటంక పరుస్తున్నానని నాపై మోపబడిన నేరము నిజానికి ఒక దేశభక్తుని విధ్యుక్త ధర్మ నిర్వహణమే. భారతదేశభక్తుని విధ్యుక్తధర్మాన్ని ఒక నేరంగా బ్రిటిష్ ప్రభుత్వం పరిగణిస్తున్నదంటే — తన సామ్రాజ్యతత్వాన్ని మరింత తీవ్రంగా ప్రదర్శిస్తోన్నదన్న మాట!

“ఇక ఏ ఉపన్యాసం ఇచ్చినందుకుగాను నన్ను ప్రాసిక్యూట్ చేశారో ఆ ఉపన్యాస ఉద్దేశం ఎంతవరకు నెరవేరిందో నేను చెప్పలేను. నిజంగా యుద్ధనిర్వహణ కది ఆటంకం కలిగించటంలో కొంతవరకు ఉపయోగపడి నట్టు తెలుసుకోవటంకంటే నాకు ఆనందప్రదమైన విషయం మరొకటి ఉండదు. అట్టి విజయమే నాకు చేకూరినట్టయితే అందుకు ప్రతిఫలంగా ఎంత పెద్దశిక్షయైనాసరే సిద్ధంగానే ఉన్నాను.

“బ్రిటిష్ ఇండియా రక్షణకు కూడా నేను అభ్యంతర పెడుతున్నా నని నామీద నేరారోపణ చేశారు. ఎంత హాస్యంగా ఉందో చూడండి! ఒక బానిస తన బానిసత్వాన్ని పోకుండా రక్షించుకోవాలన్న మాట! రక్షించుకోవలసిన బాధ్యత అతనికేమీ లేదు. బంధాలను తెంచివేసు కోవటమే అతని ఏకైక కర్తవ్యం. మాకు మా స్వాతంత్ర్యం సిద్ధించిన తరు వాత మమ్మల్ని మేము పరుల దాడులనించి రక్షించుకోవటం తెలుసుకో గలం.

“జెమ్‌షెడ్‌పూర్ ఉపన్యాసానికి నన్ను ప్రాసిక్యూట్ చేయటం నా అదృష్టమని భావిస్తున్నాను. అది ప్రముఖ పారిశ్రామిక కేంద్రం. కాని లేబర్ ఉద్యమ దృష్ట్యా ఈపట్నం రాజకీయంగా వెనుకబడియున్నది. అట్టిచోట నేను ఉపన్యాసం ఇచ్చాను. ఆ ఉపన్యాస ఫలితంగా ప్రభుత్వం నన్ను అరెస్టు చేసింది. ఈ సంఘటనను అచ్చటి రాజకీయ నాయకులను, లేబర్ నాయకులను అవశ్యం ఆకర్షించ గలదన్న తృప్తితో నేను హాయిగా జైల్లో గడపగలను. ఈ యుద్ధంయెడ మేము విముఖులం. అయినా ఆ యుద్ధం నిర్వహించేందుకే మా ముఖ్య ప్రకృతిసంపద

లన్నింటినీ దుర్వినియోగం చేయటం పట్టి నిందార్హమైన పని యని నే నంటాను. దేశమంతటా కార్మికులంతా ఈ యుద్ధం వల్ల సంఘటిల్లిన పరిస్థితులకు వ్యతిరేకిస్తోంటే, జమ్‌షెడ్‌పూర్ కార్మికులు మాత్రం ఏ వాలినట్టయినా లేకండా యథారీతిని గనిస్తూనే ఉన్నారంటే – అది మరీ నిందార్హంగా ఉన్నది. ఈ నా ప్రొనిస్యాషన్ వల్ల 'యుద్ధబోనస్' కోసమైన వారి యాందోళనకైనా కొంత ప్రోత్సాహం కలుగును గాక!

"స్టేట్‌మెంటు ముగించేముందు ఒక్క సంగతి చెబుతాను; ఆంగ్ల దేశస్థులు మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు. యుద్ధ నిర్వహణను అభ్యంతర పెడుతున్నానని, జర్మనీకి సహాయం చెయ్య గోరుతున్నానని గాని, జర్మనీకివిజయం వాంఛిస్తున్నానని గాని అనుకోవద్దు. నేను నాజీ విజయమూ కోరను; సామ్రాజ్య వాదుల విజయమూ కోరను. నేను కాంగ్రెసు వాణ్ణి; సోషలిస్టును; బ్రిటిష్‌వారి పట్ల, జర్మనుల పట్ల నాకు సద్భావమే. బ్రిటిష్ సామ్రాజ్య వాదుల యుద్ధానికి ఇండియా సహాయం చేయని పక్షంలో నాజీలకే విజయం కలిగేట్టుగా ఉంటే – బ్రిటిష్ ప్రజలు ముందుగా ఆలోచించుకొని తేల్చుకోవాలి: నాజీల దురాక్రమణమే వారికి కావాలా? లేక తమ దేశంలోనూ, ఇండియాలోనూ ప్రజా స్వామ్యం నెలకొల్పగల విజయం కావాలా? బ్రిటన్ తన ప్రస్తుత పరిపాలనమును వొదులుకోవాలి; పెట్టుబడిదారీ ప్రభువుల సామ్రాజ్యతత్వాన్ని త్యజించాలి; అప్పుడు ఒక్క భారతదేశమే కాదు; ప్రపంచంలో స్వాతంత్ర్యం వాంఛిస్తూన్న సర్వ జాతులవారూ నడుములు బిగించి, నాజీలను ఓడించి, స్వాతంత్ర్య – ప్రజాస్వామ్యాలకు విజయం చేకూర్చేందుకు ముందుకు దుముకుతారు. ప్రస్తుత పరిస్థితులలో మాత్రం బ్రిటిష్ సామ్రాజ్యతత్వాన్ని ఎదుర్కొని అంతమొందించటం కంటే కర్తవ్యాంతరం లేదు.

"ఈ స్టేట్‌మెంటుతో తమ పనిని తేలిక చేశాను. నేనందుకు విచారించేది లేదు".

"ఈ విచారణ సందర్భంలో మీరుచూపిన మర్యాదకు ధన్యవాదాలు."

# ఇటీవలి ఉపన్యాసాలు

## 1

### పాట్నా ఉపన్యాసం (1946)

### అంతిమ పోరాటం

[జైలునుంచి విడుదలై రాగానే పాట్నాలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌కు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. ఆసందర్భంలో అతడక్కడ యిచ్చిన ఉపన్యాసం Indian Nation పత్రికలో ప్రచురితమైంది. దానికి తెనుగుసేత యిది]

పాట్నా ఏప్రియల్ 21: అదొక అపూర్వమైన దృశ్యం. ఆగస్టు విప్లవానంతరం ప్రప్రథమంగా పాట్నాకు విచ్చేసిన జయప్రకాశ్ నారాయణ్‌కు స్వాగతమిచ్చేందుకు పట్నంలోని సగంమందికి పైగా బంకీపూర్ మైదానంలో సమావేశమైనారు. ఈ గడచిన దశాబ్దిలో ప్రజ లింతమంది గుమిగూడి తమ నాయకుల ఉపన్యాసాలను అంత శ్రద్ధగా విన్నది ఎన్నడూ లేదు. యథాసమయానికి గంటముందుగానే ప్రజలు నానాదిక్కుల నుండీ వచ్చి హాజరైనారు మిన్నుల్లో ఆ పెద్ద త్రివర్ణపతాకం ఎగురుతోంది "ఇన్‌క్విలాబ్ జిందాబాద్" "జైహింద్" నినాదాలు మిన్నుముట్టినవి. నాయకుడు వేదిక ఎక్కాడు. జయజయధ్వానాలు కరతాళధ్వనులు అతనికి స్వాగత మిచ్చాయి. అతడు చేతులు జోడించి నమస్కారం చేశాడు.

ప్రధానమంత్రి శ్రీ కృష్ణసిన్హా జయప్రకాశ్ నారాయణ్‌కు స్వాగత వాక్యం పలికి, అతడు యువకహృదయాలకు చక్రవర్తి అన్నాడు. రాష్ట్ర ప్రజలందరి తరఫున అతనికి స్వాగతం చెప్పాడు. భారతదేశం ఈ నాడొక పెద్ద అగ్నిపర్వతముఖంలో ఉంది అన్న విషయాన్ని ఈ సమావేశం తెలుపుదు చేస్తున్నది. ఈ విషయం మన పాలక మహాశయులు గమనించవలెనన్నాడు ప్రధానమంత్రి. అతడు జయప్రకాశ్ గుణగానం చేశాడు. ప్రజల ఆశయాలు మూర్తిగట్టిన శుభాంగుడన్నాడు. అతడేమి పలికినా ఏమిచేసినా మన లక్షలాది క్షుధార్త నగ్నప్రజలకు కూడు, బట్ట ప్రసాదిం

చేందుకే నన్నాడు. ప్రతివాడూ స్వేచ్ఛగా తలెత్తుకు తిరిగేందుకు వీలైన నూత్న సాంఘిక వ్యవస్థా నిర్మాణాన్ని కతడు కలలు కంటున్నా డన్నాడు.

జయప్రకాష్‌ను జైల్లో మగ్గజేసినశక్తి తన ప్రవర్తనకు సిగ్గుపడవలసి వున్నది. జైలుజీవన నిబంధనల నతడు అతిక్రమించాడు. కాని మనం ఆయన ప్రవర్తనను అసాధారణ నియమాలతో కొలువ కూడదు. ప్రస్తుత రాజకీయ పరిస్థితులు అయన్ను అలా ప్రవర్తించేట్టు చేశాయి అన్నాడు ప్రధానమంత్రి.

"జయప్రకాష్ దీర్ఘాయుష్మంతుడగును గాక! అతని ఆశయాలు ఈడేరును గాక! అతనికన్నా పెద్దవాణ్ణి కాబట్టి నేను అయన్ను అశీర్వదిస్తున్నాను" అని ప్రధాన మంత్రి తన ఉపన్యాసం ముగించాడు.

విద్యార్థి కాంగ్రెస్, ముస్లిమ్ విద్యార్థి కాంగ్రెస్ మొదలైన అనేక సంస్థలవారు శ్రీజయప్రకాష్‌కు స్వాగతపత్రాలు సమర్పించారు సైన్సు కాలేజి విద్యార్థినుల తరఫున మిస్ ప్రమీల శ్రీవాస్తవ స్వాగత పత్రం అర్పించింది. రాష్ట్రంలోని మహిళల తరఫున శ్రీమతి అన్నపూర్ణాదేవి స్వాగత పత్రం చదివింది. పాట్నా పురజనుల తరఫున 16 వేల రూపాయలు కూడా సమర్పించటమైంది. ఇంకా వ్యక్తులు కూడా చాలమంది రొక్కము, ఉంగరాలు, నగలు ఇచ్చారు.

## ముఖ్యమైన అంశాలు

1942 అగస్టు విప్లవ నాయకుడు శ్రీ జయప్రకాష్ గౌరవార్థం జరిగిన సమావేశ సందర్భంలో గమనించదగిన ముఖ్యమైన అంశాలు : పాట్నా ప్రజ లాయనకు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు;

వివిధ తరగతులకు చెందిన ప్రజలు డబ్బు సమర్పించారు;

ఎన్నడూ కని విని యెరుగనంత అసంఖ్యాకంగా ప్రజలు హాజరైనారు. శ్రద్ధా భక్తులతో అతని ఉపన్యాసం విన్నారు.

ఈ సోషలిస్టు నాయకుడు కాంగ్రెసు విధానంలోని లోటుపాట్లను బహిరంగంగా విమర్శించి హైకమాండ్ మీద స్నేహ పూర్వకమైన అటుంకాంబు విసిరాడు.

మితవాదివర్గం తన్ను ఎంత నిరసనభావంతో చూచినా కాను మాత్రం కాంగ్రెస్‌లో ఐక్యత కాపాడుకొవాలనే సమ్మకం చెప్పాడు.

ఒక వంక పార్లమెంటరీ విధానం సాగుతూన్నా మరొక వంక అంతిమ పోరాటానికి సిద్ధం కావలసిందే నన్నాడు. జైళ్ళకు వెళ్ళటమనేది పాత కాలంమాట. ఇప్పుడు కావలసినది తుపాకులు, చావులు.

పర్యవసానం ఏమైనాగానీ, ఢిల్లీ మంతనాల క్షేమంత ప్రాముఖ్యం ఇవ్వకూడదు. ఒక నిర్దిష్టమైన నిర్మాణ కార్యక్రమం ఏర్పరచుకుని పని అరంభించాలి; నెలకొకసారి, లేదా మూడు నెలల కొకసారి జరిగిన పనిని పర్యవేక్షిస్తూ ఉండాలి.

విప్లవాశయాలు నిర్భయంగా, బహిరంగంగా ప్రదర్శితమయ్యే మీటింగుకు రాష్ట్రప్రధాని అధ్యక్షుడు కావటం గమనించదగిన విషయం.

మీటింగు ఆరంభమైంది దినకర్ పాడిన ఒక ఆ వేశపూరితమైన పాటతో. ఆ యవసరానికి ప్రత్యేకంగా రాశా రా పాట. ఆ తరువాత అగస్టువిప్లవసంఘటనలను శ్లాఘిస్తూ చాల పాటలు గానము చేయ బడినవి. వివిధ సంస్థలవారు – ముఖ్యంగా స్త్రీలు – విద్యార్థులు – స్వాగత పత్రాలు, డబ్బు సమర్పించటమైన తరువాత రాష్ట్ర ప్రధాని వేదిక యొక్క రాష్ట్ర ప్రజల తరఫున నాయకశిరోమణికి స్వాగతం చెప్పాడు.

ఖాదీ దుస్తులతో, గాంధీ టోపీతో, మధ్య మధ్య ఒక గ్లాసెడు మంచినీళ్ళు సేవిస్తూ శ్రీ జయప్రకాష్ నారాయణ్...ఆత్మీతతో, శ్రద్ధా భక్తులతో సమావేశమైన శ్రోతలను తన ఉపన్యాసంతో అలరించాడు. చిర స్మరణీయము లైన అగస్టు సంఘటనలను వివరించి, ఆ విప్లవంలో ప్రాణాలర్పించిన వీరులకు జోహారు చేశాడు. ప్రస్తుత ఢిల్లీ మంతనాలను గురించి చెబుతూ పూర్వపు గాంధీ - ఇర్విన్ ఒడంబడికను గురించీ, ఆ తరువాత జరిగిన రౌండు టేబిల్ సమావేశం గురించీ ప్రస్తావించాడు.. అన్నింటికీ సిద్ధపడి యుండవలసినదిగా ప్రజలకు హెచ్చరిక చెప్పాడు. సాయంత్రం ఆరున్నరకు ఆరంభమైన మీటింగు రాత్రి తొమ్మిదింటికి ముగిసింది. 'జయప్రకాష్ జిందాబాద్' 'ఇన్‌క్విలాబ్ జిందాబాద్' 'మహాత్మా గాంధికీ జై' నినాదాలతో సమావేశం ముగిసింది.

జయప్రకాష్ ఉపన్యాసం చెప్పటానికి లేచినప్పుడు కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. ప్రజలు ఆన కిచ్చిన అపూర్వస్వాగతం, వారి యావేశం

అతడు గమనించాడు. తన్ను కాదు; నిజానికి వారు అగస్టువిప్లవజ్యోతిని గౌరవిస్తున్నారని గుర్తించాడు. జైల్లో ఉన్నప్పుడు, నేను బయటికి వెళ్ళాక దేశంకోసం ఎవరితో కలిసి పనిచెయ్యాలి? అని అనుకునేవాడు. ఇప్పుడు ప్రజల ఆవేశం చూచేసరికి అతని కాథిన్యం పోయింది. ప్రజలు స్వాతంత్ర్య సమరం సాగించటానికే ఉద్యుక్తులై యున్నారని తెలిసిపోయింది.

నిశ్చల గంభీరస్వరాన శ్రీ జయప్రకాష్‌నారాయణ్ ఇలాఅన్నాడు. "ప్రస్తుతం ఢిల్లీలో జరుగుతోన్న సంప్రదింపులు విఫలమయ్యేట్టయితే 1931 లో వలె బ్రిటీష్‌వారు కాంగ్రెస్‌తో తలపడ్డారన్న మాటే అప్పుడు మనం కయ్యానికి సిద్ధమై ఉండము. ప్రభుత్వంవారు అన్నివిధాలా జాగ్రత్త పడుతున్నారు. లిస్టులుతయారుచేస్తున్నారు. పోలీసుఠాణాలలో మందుగుండుసామాను, రేడియోలు మొదలైనవి సిద్ధంచేసుకుంటున్నారు. మనం మాత్రం ఎందుకు అయత్తులం కాగూడదు? చేతులుముడిచిపెట్టుకు కూర్చుని చేజిక్కే అవకాశాన్ని ఎందుకు జారవిడుచుకోవాలి?"

తరువాత అగస్టు విప్లవోద్యమాన్ని గురించి చెబుతూ జమ్‌షెడ్‌పూర్‌లో పోలీసులు సమ్మెచేసినవిషయం వివరించాడు. అధికారులు భయపడిపోయారు. పరిస్థితులు చక్కబేసుకు రండని బ్రిటిష్ సైనికులను పంపించారు. కొంతమందిని అరెస్టుచేశారు. కాని ఈ విషయం ప్రజల్లో ప్రచారం కాకండా, ఈ సంఘటనకు ఏవిధమైన ప్రాముఖ్యతా రాకుండా అధికారులు బందోబస్తు చేశారు. క్రూరులు, బ్రిటీష్ తాబేదారులు అనిపించుకున్న పోలీసులుకూడా మన స్వాతంత్ర్యసమరంతో సహకరిస్తున్నారంటే గర్వించదగినవిషయం. సమయంవచ్చినప్పుడు దేశంలోని పోలీసులందరూకూడా అట్లే ప్రవర్తించగలరని ఆశించాడు.

అగస్టు యోధులయెడ కాంగ్రెసు హైకమాండు దృక్పథం వివరిస్తూ శ్రీ జయప్రకాష్‌నారాయణ్ ఇలా అన్నాడు - కాంగ్రెస్ నాయకులు మమ్మల్ని నిందిస్తున్నారు - మేము తప్పులు చేశామంటున్నారు మేమూ తప్పులు దిద్దుకోవాలంటున్నారు. కాని వారుగూడా తప్పులుచేశారు, ఆసంగతి తామూ గమనించాలి. ఈ దేశంలో 1942 లో జరిగిన సంఘటనలు సర్వదా ఏదేశంలోనూ తరచుగా జరిగేటటువంటివి కావు. అది చాలా అరుదైనవిషయం. కాని దాన్ని మనం సమగ్రంగా ఉపయోగించుకోలేకపోయాం. బ్రిటీష్

వారు మనదేశంనుంచి వైదొలగి పోవటానికి మనం అనుసరించవలసిన మార్గం ఏమిటో మననాయకులు తెలపడు చేయలేదు. ఒక పక్కన బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఛాలెంజి చేశాం; మరొకవంక మనచేతుల్లో కార్యక్రమమేమీ లేదు. ఈ విషయమై ఒక్క జవహర్ పండితుడుతప్ప మరెవ్వరూ ఆలోచించనైనా లేదు. అలా ఆలోచించకపోవటం తప్పని ఒప్పుకోనైనా లేదు. కాంగ్రెస్ నాయకత్వం గాంధిజీ చేతుల్లో పెట్టాం అంటూ తమన్ను తాము సమర్ధించుకోవటానికి ప్రయత్నించారు. కాని మాకు దారి చూపవలసిన బాధ్యత తమదేగా! కనుక వారి సమర్ధన నిస్సారంగా ఉంది. విప్లవంయెడ ప్రదర్శించవలసిన దృక్పథం అదేనా? అది వివేకమనిపించుకుంటుందా? వాళ్ళు నిజానికి ఒక కార్యక్రమం నిర్ణయించి యుంచవలసింది. పైగా మాకందుకే అంతా తెలుసుననీ, మనం ఆలోచించుకోనక్కర్లేదనీ, సమరానికి సిద్ధపడనక్కర్లేదనీ - వాదిస్తే నేను ఒప్పుకోను.

ఆగస్టు ఉద్యమంలో సుమారు నలభైవేల మంది మరణించారు. ఇంతమంది మానవ జీవితాలు బలి అవటానికి నాయకులేకారణం. సమరం సాగించట మెలాగో ప్రజలకు తెలియదాయెను. అంధకారంలో ఉన్న ప్రజలకు ఎవరోవచ్చి వెలుగు చూపించారు. ఇప్పుడా వెలుగు చూపెట్టినవారిని దుయ్యబట్టుకుంటున్నారు నాయకులు. నిజానికి వెలుగు చూపెట్టవలసిన బాధ్యత నాయకులది.

అహింసా విధానానికి వ్యతిరేకంగా నడిచామని మామీద నేరం మోపారు. అహింసలో మౌలానా ఆజాద్‌కు ఎంతవిశ్వాసం ఉందో నాకూ అంత విశ్వాసం ఉంది. హింసలో నాకెంత విశ్వాసం ఉందో అంతవిశ్వాసం మౌలానా ఆజాద్‌కు కూడా ఉంది. మహాత్ముని అహింసావ్రతం నాకర్థమౌతుంది. దానికి నేను సాష్టాంగ పడతాను. కాని నాకంత ఆత్మశక్తి లేదు. కనుక తుపాకులుపట్టి యుద్ధం చేయటమే నాకు తేలిక. కాంగ్రెసుమాత్రం కోరేదేమిటి? జాతీయప్రభుత్వం (సంకుచిత రాజకీయాధికారంతో నైనా సరే) ఏర్పడితే తాను తుపాకిపట్టి జపాన్‌తో యుద్ధం చేస్తానని మౌలానా ఆజాద్ అనలేదూ? జపానీయులు మానవులుకాదా? బ్రిటిష్‌వారే మానవులేం? వారిమీద ఆయుధాలు ఉపయోగిస్తే అహింసాసిద్ధాంతాన్ని వ్యతిరేకించినట్టా?

1942 తరువాత అహింసాసిద్ధాంతానికి వ్యతిరేకంగా నడుచుటకు రెండుసార్లు కాంగ్రెసు ఉత్సహించింది. నా ఉద్దేశంలో ఈ అహింస అన బడేది పార్టీ ప్రాబల్యంకోసం ఉపయోగించుకో గడుచున్నది.

యువకులు కాంగ్రెసులోకి తీసుకోబడతారు-అని ఒకప్పుడు డాక్టరు రాజేంద్రప్రసాదు చేసిన ప్రకటనచూచి నేను చాల అనందించాను. ఆ వాగ్దానం ఎంతవరకు పాటించబడుతుందో నాకు తెలియదు. యువకులను నిర్లక్ష్యంచేసే ఏ సంస్థా బ్రతుకజాలదు. యువకులను బహిష్కరించే విధా నాన్ని అనుసరించేట్టయితే కాంగ్రెసు ఒక మృతసంస్థ అయిపోక తప్పదు"

కాంగ్రెసులోని వివిధ వర్గాలమధ్య ఐక్యత ఉండాలని విశ్వసించిన సోషలిస్టు పార్టీకి చెందినవాడనని శ్రీ జయప్రకాష్ చెప్పాడు. అలా విశ్వసించటంవల్ల తాను చాలనష్టపడ్డాడు. తన అనుచరులు చాలమంది తనతో ఏకీభవించలేదు; తీవ్రంగా విమర్శించారుకూడా. కాంగ్రెసులో ఐక్యత అశించి, అయాదర్శంకోసంగా తనపార్టీ చాలాకష్టాలే సహించింది. అవసరమైనప్పుడల్లా ఆ యాదర్శంకోసం తన పార్టీచాల త్యాగాలుచేసింది. ఎంతమంది విమర్శించినా - కాంగ్రెసులోనించి సోషలిస్టులను బహిష్క రించేందుకు ఎన్నిప్రయత్నాలు జరిగినా - తాను ఆదేశయుంకోసం కృషి చేశాడు.

మరొకసారి జయప్రకాష్ అగస్టు వీరుల ఘనకార్యాలను స్మరిం చాడు. వారిచర్యలే చాలవరకు ఇండియా పరిస్థితులను మార్పుగలిగినాయని కూడా చెప్పాడు.

1942 లో కాంగ్రెసు నాయకులు బ్రిటిష్ వారిని వెడలగొట్టామను న్నారు. కాని వారు వెడలగొట్టలేదు. ఇప్పుడే వారు స్వరాజ్యం వచ్చేస్తున్న దనిచెబుతున్నారు కాంగ్రెసునాయకులు. అదెలాంటి స్వరాజ్యమో తనకు తెలియదు. సంప్రదింపులతో మాత్రమే స్వరాజ్యం వస్తుందా- అనికొందరు మిత్రులు అడుగుతున్నారు. ఢిల్లీ సంప్రదింపులు రౌండుటేబిల్ సమావేశం లాంటివి కావని వారు గుర్తించాలి. 1942 ఉద్యమం ఫలితమే ఈ సంప్రదిం పులు. అంతర్జాతీయ పరిస్థితులలోని కొన్ని కొత్తమార్పులుకూడా ఈ సంప్ర దింపులకు దారితీశాయని చెప్పవచ్చు. అజాద్‌హింద్ ఫౌజ్, వారి విజయాలు కూడా ఈ సంప్రదింపులకు కారణభూతమైనాయి. బ్రిటిష్ సామ్రాజ్య

వాదాన్ని సమూలంగా ఊగులాడించినది; సైనికుల్లో నావిక వైమానిక దళాల్లోనూ కూడా కొత్త చైతన్యాన్ని కొనితెచ్చినది ఈ ఆజాద్ హింద్ ఫౌజే. మన స్వాతంత్ర్య సమర ఝంఝామారుతం, మన విప్లవాగ్ని జ్వాలలు ముగ్గురు బ్రిటిష్ మంత్రులను బలవంతాన మన దేశానికి లాగితెచ్చినవి.

సంపూర్ణస్వాతంత్ర్యం సాధించలేక పోయాం. ఇండియా అంత సామర్థ్యం కూర్చుకోలేక పోయింది. బీహార్ లోని 40 ముస్లిం సీట్లలో 30 సీట్లు కాంగ్రెస్ సంపాదించ గలిగినట్టయితే స్వాతంత్ర్య సంపాదనకు కలసినంత బలం పొందియుండెడిదే. ఐర్లండు నాయకుడు డివెలరా వలె రాజకీయ చతురతతోనే సంపూర్ణస్వాతంత్ర్యం సాధించగలమని కాంగ్రెస్ వారు బహుశః ఆశిస్తున్నారేమో! అల్ స్టర్ ను ఐర్లండులో కలిపేయకుండా డివెలరా సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించ గలిగినాడని చెప్పలేము కదా!

జయప్రకాష్ న్యూఢిల్లీలో ఉన్నప్పుడు సంప్రదింపుల కాండల్లో ఎక్కువ జోక్యం కలుగ జేసుకోలేదు. అందుచేత ఆ సంప్రదింపులు ఎలా పర్యవసిస్తాయో ఫలవంతము లౌతాయో లేదో తాను చెప్పలేకున్నాడు. కాంగ్రెస్ నాయకులు మాత్రం ఆశాపూరితులైయే ఉన్నారు. కాని పరస్పరం అంగీకారయోగ్యమైన ఒడంబడిక జరుగుతుందని ఖండితంగా అనుకోనటం పొరపాటు. అట్టి సంప్రదింపులు ఇదివరకు జరుగలేదా? విఫలం కాలేదా?

కనుక అంతిమపోరాటానికి మనం సిద్ధపడవలసిన అవసరం ఉంది. సంప్రదింపులు ఎలాగైనా పర్యవసించనీయండి. బ్రిటిష్ అధికారం మాత్రం ఇంతవరకూ ప్రబలంగానే ఉన్నమాట వాస్తవం. ఇంకా ఇక్కడ యూనియన్ జాక్ ఎగురుతూనే ఉంది. దాన్ని చించిపారెయ్యాలి. స్వతంత్ర భారత పతాకం దాని స్థానే ఎగురవేయాలి.

1942 ఉద్యమం దేశంలో విప్లవాత్మకమైన మార్పు తెచ్చింది. పట్టుదల, ధైర్యం, స్వాతంత్ర్యం కావాలన్న ఉత్కంఠ ప్రజల్లో అపరిమితంగా ఉన్నాయి. అంత మాత్రంతో చాలదు. ప్రజల్లో చక్కని

నిర్మాణం (organis ation) ఉండాలి. నిర్మాణావశ్యకతను సూచించేందుకు 1942 లో జులైలో బాలియా జిల్లాను ఉదాహరణంగా పేర్కొన్నాడు. ఆ జిల్లాలో కొన్నాళ్ళపాటు బ్రిటిష్ అధికారం అదృశ్యమై పోయింది. ప్రజలు నిజంగా స్వతంత్రులై పోయారు. జిల్లాఅధికారులు ప్రజల చేతుల్లో ఒక విధంగా ఖైదీలైనా రన్నమాట. తరువాత కొన్నాళ్ళకు మూడు వందల మంది సైనికులువచ్చి మళ్ళీ బ్రిటిష్ అధికారాన్ని స్థాపించారు. అవినీతికరములైన అత్యాచారాలుకూడా చాలా చేశారు. నాయకులు ఆజిల్లాలో పర్యటించి ప్రజలు సాధించిన వీరకృత్యాలను ప్రశంసించారు. బాలియా జిల్లావలెనే బీహార్ రాష్ట్రం యావత్తూ వీరోచితరీతిని ప్రవర్తించింది. కాని ఎక్కడాకూడా హస్తగతం చేసుకున్న అధికారాన్ని ప్రజలు నిలువబెట్టుకోలేకపోయారు. కనుక తాను బీహారువెళ్ళి... ఒక చిన్న సైనికదళం చేతుల్లో ప్రజలు ఓడిపోవటానికి కారణాలేమిటో తెలుసుకుంటానని జయప్రకాష్ చెప్పాడు. ఎక్కడెక్కడ పొరపాట్లు జరిగినాయో తెలుసుకుంటే మళ్ళీ ఆపొరపాట్లను చేయకుండా జాగ్రత్తగా ఉంటాం.

కనుక ప్రజలు చక్కగా తమ్ముతాము సమీకరించుకోవాలి. మీటింగులు ప్రదర్శనలు ఇప్పుడక్కర్లేదు. వాటి కాలం అయిపోయింది. అట్టిపెద్దపెద్ద సమావేశాలవల్ల వెదజల్లబడిన సందేశాలు ఇప్పుడు ప్రజల హృదయాల్లో నాటుకుని ఉన్నాయి. ప్రజలంతా తమ్ము తాము చక్కగా సమీకరించుకోవాలి. సమర్థతతో సమరం సాగింపగలుగుటకు స్త్రీలు, పురుషులు, చిన్నలు, పెద్దలు 'క్విట్ ఇండియా' అని పలుకుతూంటే ప్రచారం కోసమని మీటింగులు ఏర్పాటుచేయుటం అర్థంలేని పని. "మనం శాంతంగా ప్రజలను సమీకరించుకోవాలి. ఈ విషయంలో కాంగ్రెస్ మీద నాకొక కోపం ఉంది, కాంగ్రెస్‌మీద నిషేధం తొలగించిన నాటినించీ కాంగ్రెస్ నాయకులు ఎన్నికల ప్రచారంలోనే కాలక్షేపం చేశారుగాని ప్రజల్ని సమీకరించుకోవలసిన బాధ్యత పట్టించుకోనేలేదు."

అట్టి కాంగ్రెస్‌వారి ఏమరుపాటును గర్హిస్తూ కాంగ్రెస్‌వారు ఇకనైనా ప్రజలను సమీకరించుకోవలెనని గట్టిగా చెప్పాడు శ్రీ జయ

ప్రకాష్. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఒక కార్యక్రమాన్ని నిర్ణయించాలి. ఇంతవరకూకూడా ఒక్క వాలంటీరుదళం నయినా సమీకరించలేక పోయింది. ఎన్నికల్లో ప్రచారం చెయ్యటానికి కొలదిమంది చాలు. మిగతా వారంతా అంతిమ సమరానికి ప్రజల్ని సిద్ధం చేయవలసి వున్నది.

ప్రస్తుతం తానేమీ ఒక నిర్దిష్ట కార్యక్రమం సూచించలే నన్నాడు శ్రీ జయప్రకాష్ నారాయణ్. మొదట తాను ప్రస్తుత పరిస్థితులను అవగాహన చేసుకోవాలి. కాని త్వరలోనే ప్రజల్ని కలుసుకుని తన కార్య క్రమాన్ని వారిముందు ఉంచగలనన్నాడు.

# 2

## బొంబాయి ఏ ఐ. సి. సి. మీటింగులో ఉపన్యాసం

## (1946)

కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకుడు శ్రీజయప్రకాష్ నారాయణ్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నిర్ణయాన్ని ప్రతిఘటించాడు. "కాంగ్రెస్ ఇన్నాళ్ళనించీ ఎట్టి స్వరాజ్యం కోసమై సమరం సాగిస్తూ ఉన్నదో అట్టి స్వరాజ్యాన్ని ఈ నెలకొనబోయే ప్రజాపరిషత్తు మనకు ఆర్జించి పెట్టలేదు. ఆ ప్రజాపరిషత్తు బ్రిటిష్ అధికారాన స్థాపితం కాబోతున్నది" అన్నాడు శ్రీ జయప్రకాష్.

బ్రిటిష్ సామ్రాజ్యాధికారపు పీడ వొదిలించుకోటానికే 1942 క్విట్ ఇండియా ఉద్యమాన్ని లేవదీశాం. కాని ఆ యుద్యమంవల్ల మన ఆశయం నెరవేరలేదు. అయినా కొత్తశక్తులు దేశంలో ఉత్పన్నమైనాయి. అవి మనల్ని చాలవరకు గమ్యానికి సమీపంగా తీసుకు పోగలిగినవి. ప్రస్తుతం బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రతిపాదించిన ప్రజాపరిషత్తు ప్రణాళికను అంగీకరించుటమన్నది కాదు మనం ఆలోచించవలసిన విషయం. ఉత్పన్న మైన నూతన శక్తులను బ్రిటిష్‌వారిని తరిమి వేయటానికి ఏవిధంగా

ఉపయోగించు కోవాలి? అన్నదే ఇప్పుడు మనం అవశ్యం ఆలోచించవలసిన విషయం.

బ్రిటిష్ మంత్రిత్రయం మనకు స్వాతంత్ర్యం వొప్పజెప్పి పోయేందుకు రాలేదు. కాంగ్రెస్‌కూ ముస్లింలీగుకూ మధ్య మధ్యవర్తిత్వం నెరపటానికి వచ్చారు. అసలీ రెండు పార్టీలమధ్య విభేదాలను సృష్టించింది బ్రిటిష్‌వారే. ఆ విభేదాలను తమ లాభంకోసం ఉపయోగించుకునేందుకే ఇప్పటికీ వారు ప్రయత్నిస్తున్నారు. ముస్లిం లీగుకు ఈనాడు ఇండియాలో చాలమంది ముస్లింల తోడ్పాటు ఉండవచ్చు. కాని ఈ ముస్లింలీగు ఈ నాడుకూడా బ్రిటిష్‌వారికి మిత్రుడులాగే ఉంది. కాంగ్రెస్‌ను తన సిద్ధాంతాలు త్యజించి ముస్లింలీగు నాయకునితో రాజీపడమని బ్రిటిష్ మంత్రులు సలహా యిస్తున్నారు. ఆ ముస్లింలీగు నాయకుడు 1942 లో «క్విట్ ఇండియా» ఉద్యమాన్ని బ్రిటిష్‌వారిపై కాదు, ముస్లింలపై హిందువుల అధికారం శాశ్వతంగా సుస్థిరంచేయాటానికే అరంభిస్తున్నారని రవంతైనాసిగ్గుపడకండా అన్నాడు. అటువంటి మనిషితో కాంగ్రెస్ ఎలా రాజీపడుతుంది?" కాంగ్రెస్ ముస్లిం ప్రజల అభిమానం చూరగొని లీగ్ ప్రాబల్యాన్ని ధ్వంసంచేయగలదన్న విశ్వాసం నాకు ఉన్నది. ముస్లిం ప్రజాబాహుళ్యంతో సంబంధం ఏర్పాటు చేసుకోకండా మనం లీగ్ నాయకునితో సంప్రదింపులకు పోతున్నాం. కాని అతడు మన శత్రువుల మిత్రరత్నం. తాత్కాలిక ప్రభుత్వస్థాపనకోసమైన ప్రతిపాదనలను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ త్రోసి పుచ్చినందుకు నాకు సంతోషమైంది.

"ప్రజాపరిషత్తు స్థాపనకోసమైన సూచనలను అంగీకరించటంవల్ల కూడా అపాయం ఉన్నదని నాకు తోస్తున్నది. ఇప్పుడీ బ్రిటిష్‌వారు ప్రతిపాదిస్తోన్న రాజ్యాంగపరిషత్తు స్థాపన విధానం అసలు మన రాష్ట్రపతి పండిట్ నెహ్రూ ఏనాడో సూచించిన విధానానికి చాల విరుద్ధంగా ఉంది. ఇప్పుడీ రాజ్యాంగ పరిషత్తు బ్రిటిష్‌వారు సృష్టిస్తున్నారు. అది మనం కాంక్షిస్తున్న స్వరాజ్యాన్ని తెచ్చిపెట్ట జాలదు. ప్రజాపరిషత్తు రచించే రాజ్యాంగాన్ని అంగీకరిస్తామని బ్రిటిష్ ప్రభుత్వం వాగ్దానం [illegible]

కాని పరిస్థితులు తారుమారుచేసి మాయలుపన్ని స్వతంత్ర భారతదేశానికి మనం వాంఛించే రాజ్యాంగాన్ని మనల్ని రచించనీయక పోవచ్చు. ప్రజా పరిషత్తులో కాంగ్రెసుకూ లీగుకూ అభిప్రాయభేదం వచ్చినప్పుడల్లా– అభిప్రాయ భేదాలు తప్పకుండా వస్తాయి కూడాను– మనం పరిష్కారం కోసం బ్రిటిష్ ప్రభుత్వాన్ని యాచించ వలసివస్తుంది. అటువంటి సందర్భంలో బ్రిటిష్‌వారు న్యాయంగా ప్రవర్తిస్తారని మనం విశ్వసించ వచ్చునా? అలా కాకండా ఈ ప్రజాపరిషత్తు ప్రజాబలంతోనే స్థాపిత మయ్యేట్టయితే – అప్పుడు మనం ప్రజల అభిప్రాయాల కనుగుణ్యంగానే అడ్డంకులను దాటిపోగలం.

"కనుక వర్కింగ్ కమిటీ ఒక అంతిమ నిర్ణయానికి వచ్చేముందు ఇప్పుడు నేను సూచించిన లోటుపాట్లను ఇంకా ఇతరములైన ఇబ్బందులను ముందుగా సమాలోచించు కోవాలి. కాని ఇన్నిలోటుపాట్లు ఉన్నాయని ఎరిగివుండి కూడా, పోయి బొందలో పడనున్నామని తెలిసివుండీ కూడా, మనశక్తి మనం ఎరిగివుండికూడా ఈ ప్రతిపాదనలను మనం ఎందుకు అంగీకరించాలో నాకు అర్థం కావటంలేదు.

"ఇటువంటి సంకుచి తాధికారాలుగల ఈ ప్రజాపరిషత్తు మాకక్కర్లేదని బ్రిటిష్ ప్రభుత్వంతో నిక్కచ్చిగా చెప్పి వెయ్యటమే మనం చేయవలసినపని. బ్రిటిష్ ప్రభుత్వ ప్రతిపాదనలు అంగీకరించామంటే మనం దుర్బలులమై పోయామన్నమాటే. రాష్ట్రాల్లో పదవీ స్వీకరణం చేయటం వల్లనే కొంత దౌర్బల్యం ఏర్పడివుంది. ఈ ప్రతిపాదనలను స్వీకరిస్తే ఇంకా దుర్బలులమై పోతాం. వర్కింగ్‌కమిటీ సాగిస్తూన్న ఈ సంప్రదింపులు మనల్ని మన గమ్యం దగ్గరకు తీసుకుపోలేవు. అటువంటి నిస్సారమైన సంప్రదింపులను కట్టిపెట్టి మరొక పోరాటానికి మనం ఎందుకు సిద్ధం కాకూడదు? మనకు ఒక్కటే మార్గం ఉంది. కాంగ్రెస్ సంస్థను బలవత్తరం చేసుకోవాలి. మనశక్తి సామర్థ్యాలమీద మనకు విశ్వాసం చిక్కిన వెంటనే బ్రిటిష్ ప్రభుత్వంతో యుద్ధం ఆరంభిద్దాం. బలవంతాన వారిని ఇండియానించి వెడలనడుపుదాం: తప్పనిసరిగా మన అధికారాన్ని మనకు ఒప్పచెప్పటం

తంటే మార్గాంతరం లేదనీ. అలా అధికారం ఒప్పగింప పెట్టేందుకు ఒక్క కాంగ్రెస్ తోనే సంప్రదించవలసి యుంటుందనీ బ్రిటిష్‌వారు గుర్తించేట్టు చేద్దాం.

“వర్కింగ్ కమిటీ నిర్ణయాన్ని నేను ప్రతిఘటిస్తున్నానంటే వర్కింగ్ కమిటీని అపకీర్తిపాలు చేద్దామని కాదు నా ఉద్దేశం. వర్కింగ్ కమిటీనిర్ణయం తప్పుఅని నేను గట్టిగా నమ్ముతున్నాను. కనుక దాన్ని మనం అంగీకరించ కూడదు. అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ఆ తప్పును సరిదిద్దుకోటానికి అవకాశం ఉంది. ఆ యవకాశాన్ని జారవిడుచుకోకుండు గాక !

---